# జీవన్ముక్తివివేకః

## శ్రీమద్విద్యారణ్యముని విరచితః

ఆంధ్రభాషావ్యాఖ్యా

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు




సురభారతీ సమితి
ఉస్మానియాయూనివర్సిటీ కాంపస్
హైదరాబాదు - 500 007

జీవన్ముక్తి వివేకః

తెలుగువ్యాఖ్యతో

ప్రతులు : 1000

మూల్యము : 40-00

1992

ప్రతులకు :
కార్యదర్శి,
సురభారతీ సమితి
ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్
హైదరాబాదు - 500 007

ముద్రణ :
ఆర్. కె. ప్రింటర్స్
నాంపల్లి
హైదరాబాదు - 500 001

Jivanmukti Viveka

With Telugu Commentary

Copies : 1000

Price Rs. 40-00

1992

For Copies :
The Secretary,
Surabharati Samiti
Osmania University Campus
Hyderabad - 500 007

Printed at:
R. K. Printers
Nampally
Hyderabad - 500 001

శ్రీః

# తొలి పలుకు

మహాపండితుడుగా, వివిధ శాస్త్ర గ్రంథ రచయితగా, తత్త్వవేత్తగా, విజయనగర సామ్రాజ్యసంస్థాపనా కార్యధురంధరుడుగా, సనాతన ధర్మోద్ధారకుడుగా శ్రీ విద్యారణ్యులకున్న స్థానం అనన్యసామాన్యమైనది. ఈయన నాలుగు వేదాలకి భాష్యాలు రచింప చేశారు. వ్యాకరణ-పూర్వమీమాంసా - ఉత్తరమీమాంసా - ధర్మశాస్త్రాదులలో ప్రామాణిక గ్రంథాలు రచించారు. వేదాంతశాస్త్రంలో ఈయన రచించిన పంచదశి, జీవన్ముక్తి వివేకం మొదలైన గ్రంథాలు సిద్ధాంతమాత్ర ప్రతిపాదనా ప్రధానాలైన ప్రకరణ గ్రంథాలు వీటిలో ఇతర మతాల ఖండన మండనాదులు ఉండవు అందుచేతనే వీటిని ప్రకరణ గ్రంథాలు అంటారు.

అభ్యాసవైరాగ్యాదులచేత మనస్సును ఏకాగ్రంచేసికొని ఆత్మసాక్షాత్కారం పొందగలిగిన సాధకుడు ఈజన్మలోనే ఈ శరీరంతో ఉండగానే ముక్తిని పొందవచ్చునని అద్వైత వేదాంతులు అంగీకరిస్తారు. దీనికే "జీవన్ముక్తి''అని పేరు. బౌద్ధుల "నిర్వాణము" జైనుల "అర్హత్త్వము"దీనికి చాలదగ్గరగా ఉంటాయి సాంఖ్యులు కూడా దీనిని అంగీకరిస్తారు ప్రొ. హిరియణ్ణ చెప్పినట్లు న్యాయవైశేషికాలలోను, విశిష్టాద్వైతాది సంప్రదాయాలలోను ఈ జీవన్ముక్తుని ఒక లక్ష్యంగా అంగీకరించకపోయినా వారి దర్శనాలలో చెప్పిన విధంగా జ్ఞానం సంపాదించి ఉత్తమస్థితిని పొందిన సాధకుని ప్రవృత్తి పూర్తిగా మారిపోయి ఒక జీవన్ముక్తిని స్థితివలెనే ఉంటుందనడంలో సందేహంలేదు. ("Out line of Indian Philosophy''P.19) ఐతే ఇది కేవలము ముముక్షువులైన సంన్యాసులు మాత్రమే చదవవలసిన గ్రంథం అని భ్రాంతిచెందవలసిన పనిలేదు. ఇంద్రియాలను, మనస్సును జయించడం, దైవసంపదను అభివృద్ధి చేసుకోవడం, పరిశుద్ధమైన

జీవితాన్ని గడపడం ఇలాంటి విషయాలు మానసిక శాంతిని కోరే ప్రతి ఒక్కరికీ అవసరమైనవే. భగవద్గీత, ఇరవైనాలుగువేల శ్లోకాల యోగ వాసిష్ఠం, లఘుయోగవాసిష్ఠం, యోగసూత్రాలు, మొదలైన ఎన్నో గ్రంథాలనుండి ప్రామాణికములైన విషయాలు సేకరించి, ఆ గ్రంథాలచాయలకి కూడా వెళ్లడానికి శక్తిలేనివారికి చక్కనిరూపంలో శ్రీవిద్యారణ్యులు అందించిన మహత్తరోపాయనం ఈ గ్రంథం దీనిని దాదాపు ఇరవై సంవత్సరాలు సురభారతీ సమితి కార్యదర్శిగాను, ప్రస్తుతం ఉపాధ్యక్షులలో ఒకరుగాను ఉన్న డా. పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన వివరణాత్మ కాంధ్రానువాదంతో సమితి ఆంధ్రపాఠకలోకానికి అందజేస్తూన్నది. సమితి ప్రచురించిన ఇతర గ్రంథాలనువలెనే దీనిని కూడా పాఠకులు ఆదరించ గలరని ఆశిస్తున్నాను.

హైదరాబాదు.
22-1-1992

అలాడి కుప్పుస్వామి
Chief Justice of A.P.(Rtd.)
అధ్యక్షులు, సురభారతీసమితి-

## విషయ సూచిక

శ్రీః

శ్రీమహాగణాధిపతయే నమః

శ్రీమద్విద్యారణ్యమునివిరచితః

# జీవన్ముక్తి వివేకః

## ప్రమాణప్రకరణమ్

మూ. యస్య నిఃశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్
నిర్మమే తమహం వన్దే విద్యాతీర్థమహేశ్వరమ్.

వ్యా. నత్వా శ్రీతాతపాదాద్యాన్విద్యామన్త్రాదిసద్గురూన్
జీవన్ముక్తివివేకస్య కుర్వే వ్యాఖ్యాం యథామతి.

శ్రీవిద్యాతీర్థమహేశ్వరుల నిఃశ్వాసములే వేదములు ఆ వేదముల సాహాయ్యముతోనే ఆయన ఈ జగత్తు నంతనూ సృజించెను. అట్టి విద్యాతీర్థమహేశ్వరులకు నమస్కరించుచున్నాను.

శ్రీవిద్యారణ్యులు జీవన్ముక్తివివేక మనే వేదాంతగ్రంథమును రచించుటకు ప్రారంభించి నిర్విఘ్నపరిసమాప్తిని, తమకు పఠితలకు కూడ నిరంతరశ్రేయోభివృద్ధిని కోరుచు తమ ఆచార్యులైన శ్రీవిద్యాతీర్థమహేశ్వరులను పరమాత్మాభిన్నులనుగా భావించుచు ప్రణమిల్లుచున్నారు. వేదములు అపౌరుషేయములు; పురుషులు నిర్మించినవి కావు. కల్పాంతములో నిఖిల ప్రపంచముతో పాటు వేదములు కూడ అంతర్హితము లైపోవుచుండును మరల సృష్టిప్రారంభము చేయవలసివచ్చి నపుడు పరమేశ్వరుడు ముందుగా చతుర్ముఖబ్రహ్మను సృజించి అతనికి మరల వేదములను అందజేయు చుండును. ఇవి క్రొత్తగా రచింపబడినవి కావు గాన నిఃశ్వాసమును విడచి నట్లు పరమేశ్వరుడు తనలో నిలీనములై ఉన్న ఆ వేదములను పైకి వ్యక్తము చేయును. వాటి సాహాయ్యముతో చతుర్ముఖుడు మరల సృష్టి చేయుచుండును. ఇది వేదాంతసంప్రదాయము. "గురుర్బ్రహ్మ" ఇత్యాది

ప్రసిద్ధశ్లోకములో చెప్పినట్లు గురువు త్రిమూర్తిస్వరూపుడే కాదు; త్రిమూర్తి స్వరూపాతీతపరబ్రహ్మస్వరూపుడు. అందుచే విద్యాతీర్థమహేశ్వరులే వేద ప్రవర్తకులని, జగత్సృష్ట్యాదికర్త లని ఈ శ్లోకములో స్తుతింపబడినారు

మూ. వక్ష్యే వివిదిషాన్యాసం విద్వన్న్యాసం చ భేదతః
హేతూ విదేహముక్తేశ్చ జీవన్ముక్తేశ్చ తౌ క్రమాత్. **2**

వ్యా. వివిదిషాసంన్యాసము, విద్వత్సంన్యాసము అను రెండు విధము లైన సంన్యాసమును గూర్చి చెప్పెదను వీటిలో మొదటిది విదేహముక్తికి హేతువు, రెండవది జీవన్ముక్తికి హేతువు.

ఆత్మస్వరూపమును తెలిసికొనవలె ననే కోరికతో స్వీకరించిన సంన్యాసము "వివిదిషాసంన్యాసము". ఈ సన్యాసము స్వీకరించినవానికి ఈ దేహము విడచిన తరువాత ముక్తి (విదేహముక్తి) లభించును. ఆత్మ జ్ఞానము ఉన్నవాడు స్వీకరించిన సంన్యాసము "విద్వత్సంన్యాసము" ఈ సంన్యాసము స్వీకరించినవానికి ఈ దేహము ఉండగానే ముక్తి (జీవన్ముక్తి) లభించును 2

మూ. సంన్యాసహేతుర్వైరాగ్యం యదహర్విరజేత్తదా
ప్రవ్రజేదితి వేదోక్తేస్తద్భేదస్తు పురాణగః. **3**

"యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్'' (ఏ రోజున వైరాగ్యము కలుగునో ఆ రోజే వెంటనే సంన్యాసము తీసికొనవలెను) అను శ్రుతి వాక్యానుసారము సంన్యాసమునకు వైరాగ్యము హేతువు. ఆవైరాగ్యమునకు సంబంధించిన భేదములు పురాణములలో చెప్పబడినవి 3.

మూ. విరక్తిర్ద్వివిధా ప్రోక్తా తీవ్రా తీవ్రతరేతి చ
సత్యామేవ తు తీవ్రాయాం న్యసేద్యోగీ కుటీచకే. **4**

శక్తో బహూదకే తీవ్రతరాయాం హంససంజ్ఞితే
ముముక్షుః పరమే హంసే సాక్షాద్విజ్ఞానసాధనే. **5**

వ్యా. తీవ్రము, తీవ్రతరము అని వైరాగ్యము రెండు విధములు. తీవ్రవైరాగ్యము ఉన్నప్పుడే యోగి "కుటీచకసంన్యాసము" అనే సంన్యాసమును స్వీకరించవలెను. శక్తి ఉన్నవాడు "బహూదకసంన్యాసము" అనే సంన్యాసమును స్వీకరించవలెను. వైరాగ్యము తీవ్రతరముగా ఉన్నచో 'హంస' అను సంన్యాసమును స్వీకరించవలెను. మోక్షమును పొందగోరువాడు సాక్షాత్తు బ్రహ్మజ్ఞానమునకు సాధనమైన "పరమహంస" అను సంన్యాసమును స్వీకరించవలెను. ఈ నాల్గు విధములైన సంన్యాసముల స్వరూపము 9, 10 శ్లోకాలలో స్పష్టము కాగలదు 4, 5.

మూ. పుత్రదారధనాదీనాం నాశే తాత్కాలికీ మతిః

ధిక్ సంసారమితీదృక్ స్యాత్ విరక్తేర్మన్దతా హి సా. 6

వ్యా. పుత్రులు, భార్య, ధనము మొదలైనవి నశించినప్పుడు "ఛీ! ఈ పాడు సంసారము!" అని తాత్కాలికముగా ఆలోచన కలుగును. అది మందవైరాగ్యము 6.

మూ. అస్మిన్ జన్మని మా భూవన్ పుత్రదారాదయో మమ

ఇతి యా సుస్థిరా బుద్ధిః సా వైరాగ్యస్య తీవ్రతా. 7

వ్యా "నా కీ జన్మలో ఎన్నటికీ భార్యాపుత్రాదులు వద్దు'' అని సుస్థిరమైన బుద్ధి కలిగినచో అది తీవ్రవైరాగ్యము 7.

మూ. పునరావృత్తిసహితో లోకో మే మాస్తు కశ్చన

ఇతి తీవ్రతరత్వం స్యాన్మన్దే న్యాసో న కోఽపి హి. 8

వ్యా. ''మళ్లీ మళ్లీ పుట్టుక కలిగే లోకము ఏదీ నాకు ఉండకపోవుగాక" అను బుద్ధి కలిగినచో అది తీవ్రతరవైరాగ్యము. మందవైరాగ్యము మాత్రమే ఉన్నవాడు ఏ సంన్యాసమూ కూడ తీసికొనగూడదు 8.

మూ. యాత్రాద్యశక్తిశక్తిభ్యాం తీవ్రే న్యాసద్వయం భవేత్

కుటీచకో బహూదకశ్చేత్యుభావేతౌ త్రిదణ్డినౌ. 9

వ్యా తీవ్రవైరాగ్యము కలవాడు సంచారము చేయుటకు శక్తి లేనిచో "కుటీచకసంన్యాసము" స్వీకరించి, ఏకాంత ప్రదేశమునందు పర్ణశాలలో నివసించవలెను; సంచారాదులు చేయు శక్తి ఉన్నచో "బహూదక సంన్యాసము" స్వీకరించి దేశసంచారాదులు చేయవలెను. వీరిద్దరూ త్రిదండులే, అనగా కలిపి కట్టిన మూడు వెదురు కఱ్ఱలను చేతిలో ధరింతురు. మనోవాక్కాయములకు సంబంధించిన అన్నింటినీ పరిత్యజించి ఆ మూడింటికీ అతీతమైన బ్రహ్మయందే ఏకాగ్రతతో ఉండుటకు త్రిదండము సూచకము 9.

మూ. ద్వయం తీవ్రతరే బ్రహ్మలోకమోక్షవిభేదతః
తల్లోకే తత్త్వవిద్ధంసో లోకేఽస్మిన్ పరహంసకః. **10**

వ్యా. వైరాగ్యము తీవ్రతరముగా ఉన్నవారు 'హంస' 'పరమహంస' సంన్యాసములను స్వీకరించవచ్చును. బ్రహ్మలోకమును పొందుట, మోక్షమును పొందుట అనేది వీటిలో బేధము హంససంన్యాసి మరణానంతరము బ్రహ్మలోకము చేరి అక్కడ ఆత్మసాక్షాత్కారమును పొంది మోక్షమును పొందును. పరమహంససంన్యాసి ఈ లోకమునందే బ్రహ్మసాక్షాత్కారమును పొంది మోక్షమును (జీవన్ముక్తిని, దేహపాతానంతరము విదేహముక్తిని) పొందును 10.

మూ. ఏతేషాం తు సమాచారాః ప్రోక్తాః పారాశరస్మృతౌ
వ్యాఖ్యానేఽస్మాభిరత్రాయం పరహంసో వివిచ్యతే. **11**

వ్యా. ఈ చతుర్విధసంన్యాసుల ఆచారములు పారాశరస్మృతిలో విస్తృతముగా చెప్పబడినవి. ఈ వ్యాఖ్యానములో మేము పరమహంస సంన్యాసమును గూర్చి మాత్రమే వివరించుచున్నాము 11

మూ. జిజ్ఞాసుర్జ్ఞానవాంశ్చేతి పరహంసో ద్విధా మతః
ప్రాహుర్జ్ఞానాయ జిజ్ఞాసోర్న్యాసం వాజసనేయినః. **12**

"ప్రవ్రాజినో లోకమేతమిచ్ఛన్తః ప్రవ్రజన్తి హి"
ఏతస్యార్థస్తు గద్యేన వక్ష్యతే మన్దబుద్ధయే. 13

వ్యా. తెలిసికొనగోరువాడు, (జ్ఞానమును సంపాదించకోరువాడు), జ్ఞానముకలవాడు అని పరమహంస రెండు విధములు. వాజసనేయిశాఖకు చెందినవారు (బృహదారణ్యకోపనిషత్తులో) "సంన్యాసులు 'ఈలోకమును' పొందవలె నను కోరికచేత సంన్యాసమును స్వీకరింతురు'' అని చెప్ప బడినది. దీని అర్థమును, మందబుద్ధులకు స్పష్ట మగుటకు, గద్యములో చెప్పుచున్నాము 12, 13

## 1. వివిదిషాసంన్యాసము

మూ. లోకో హి ద్వివిధః ఆత్మలోకోఽనాత్మలోకశ్చేతి. తత్రానాత్మ లోకస్య త్రైవిధ్యం బృహదారణ్యకే తృతీయాధ్యాయే శ్రూయతే-

"అథ త్రయో వావ లోకా మనుష్యలోకః పితృలోకో దేవలోక ఇతి. సోఽయం మనుష్యలోకః పుత్రేణైవ జయ్యో నాన్యేన కర్మణా, కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః" (బృ. ఉ. 15-16) ఇతి. ఆత్మలోకశ్చ తత్రైవ శ్రూయతే "యో హ వా అస్మాల్లోకాత్ స్వం లోక మదృష్ట్వా ప్రైతి స ఏనమవిదితో న భునక్తి," (బృ. ఉ. 1-4-15) ఇతి. "ఆత్మానమేవ లోకముపాసీత స య ఆత్మానమేవ లోకముపాస్తే న హాస్య కర్మ క్షీయతే" (బృ. ఉ. 1-4-15)

వ్యా. ఆత్మలోకము, అనాత్మలోకము అని లోకము రెండు విధ ములు. వాటిలో అనాత్మలోకము మూడు విధము లని బృహదారణ్యకో పనిషత్తులో తృతీయాధ్యాయమునందు చెప్పబడినది :— "మనుష్య లోకము, పితృలోకము, దేవలోకము అని లోకములు మూడు మాత్రమే ఉన్నవి. మనుష్యలోకమును పుత్రునిచేతనే జయించ శక్య మగును; పితృలోకమును కర్మచేతనే జయించ శక్య మగును. దేవలోకమును

విద్యచేతనే జయించ శక్య మగును''. ఆత్మలోకమును గూర్చి కూడ అక్కడనే చెప్పబడినది. "ఆత్మరూప మైన తన లోకమును చూడ కుండగనే ఈ లోకమునుండి వెళ్లిపోవువాడు (మరణించువాడు) ఈ ఆత్మ లోకమును తెలిసికొనలేడు గాన దానిని అనుభవింపజాలడు" (ఆత్మలోకమును, అనగా ఆత్మస్వరూపమును తెలిసికొనగలిగినవాడు మాత్రమే శోకమోహాది భయములు తొలగి ఆత్మను అనుభవించగలడు, అనగా ఆత్మసాక్షాత్కారము చేత ముక్తిని పొందగలడు. అట్లు కానివాని జన్మ వ్యర్థము అని భావము) "ఆత్మలోకమును ఉపాసన చేయువాని, అనగా ఆత్మ అనే తన లోకమును ఉపాసనచేయువాని కర్మ క్షీణి చదు''. అతనికి కర్మయే లేదు గాని అజ్ఞానులు సుఖదుఃఖముల భోగము ద్వారా తాము చేసిన పుణ్యాపుణ్య కర్మలను క్షీణింపచేసికొని నట్లు, ఆత్మసాక్షాత్కారము సంపాదించినవాడు కర్మలను క్షీణింపచేసికొను ప్రసక్తియే లేదు అని భావము (ఇది శాంకరభా ష్యానుసారి **వ్యాఖ్యానము**. విద్యారణ్యులు చేసిన వివరణము వేరుగా ఉన్నది).

మూ. యో మాంసాదికపిణ్డలక్షణాత్ స్వం లోకం పరమాత్మాఖ్యమ్ "అహం బ్రహ్మాస్మి" ఇత్యవిదిత్వా మ్రియతే స స్వో లోకః పర మాత్మావిదితోఽవిద్యయా వ్యవహితః సన్నేనమవేదితారం ప్రేతం మృతం,న భునక్తి. శోకమోహాది దోషాపనయనేన న పాలయతి. ఉపాసకస్య హ నిశ్చితం కర్మ న క్షీయతే, ఏకఫలదానేనోపక్షీణం న భవతి,కామితసర్వఫలం మోక్షం చ దదాతీత్యర్థః

వ్యా పరమాత్మ అనే స్వలోకమును ''అహం బ్రహ్మ అస్మి''- "నేనే బ్రహ్మను" అని తెలిసికొనకుండగా మాంసాదిపిండరూపమైన ఈ దేహమును విడచి మరణించువానిని, ఆ స్వలోకమైన పరమాత్మ, అవిద్య చేత వ్యవహిత మగుటచే, శోకమోహాదిదోషములను తొలగించుట ద్వారా పరిపాలించదు; కాని ఉపాసన చేయువాని, అనగా స్వలోకమును తెలిసికొన్న వాని కర్మ (ఉపాసనారూపకర్మ) తానీయవలసిన ఫలమును ఇచ్చుట ద్వారా

క్షీణించదు; కోరదగిన అత్యుత్తమఫలమైన మోక్షమును ఇచ్చును. (ఈ వాక్యమునకు ఈ విధముగ కొందరు అర్థము చెప్పినారనీ అది అయుక్తమనీ శంకరభగవత్పాదులు వ్రాసినారు).

మూ. షష్ఠాధ్యాయేఽపి-"కిమర్థా వయమధ్యేష్యామహే కిమర్థా వయం యక్ష్యామహే" "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాయం లోకః" (బృ. ఉ. 4-4-22) ఇతి. యే ప్రజా మీషిరే తే శ్మశానాని భేజిరే. యే ప్రజాం నేషిరే తేఽమృతత్వం హి భేజిరే. ఏవం చ"ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (బృ. ఉ. 4-4-22) ఇత్యత్రాత్మలోకో వివక్షిత ఇతి గమ్యతే-"స వా ఏష మహానజ ఆత్మా" (బృ.ఉ. 4-4-22) ఇతి ప్రక్రాన్తస్యాత్మనః ఏతచ్ఛబ్దేన పరామృష్టత్వాత్. లోక్యతే అనుభూయతే ఇతి లోకః. తథా చాత్మానుభవ మిచ్ఛన్తః ప్రవ్రజన్తీతి శ్రుతేస్తాత్పర్యార్థః సంపద్యతే. స్మృతిశ్చ-

"బ్రహ్మ విజ్ఞానలాభాయ పరహంససమాహ్వయః
శాన్తిదాన్త్యాదిభిః సర్వైః సాధనైః సహితో భవేత్". ఇతి.

వ్యా. బృహదారణ్యకోపనిషత్తులో షష్ఠాధ్యాయములో కూడ ఇట్లు చెప్పబడినది. "కిమర్థాః" మొ :-" ''మనము ఏమి ప్రయోజనమును ఉద్దేశించి అధ్యయనము చేయవలెను ! ఏమి ప్రయోజనము నుద్దేశించి యజ్ఞములు చేయవలెను!'' (ఈ వాక్యములు బృ ఉ. లో కనబడలేదు, బ్రహ్మ సూత్ర భాష్యములో కూడ(3.4 9)ఇది ఉదాహరించబడినవి. "కింప్రజయా"మొ. "ఈ ఆత్మయే లోకముగా గల మనము సంతానముతో ఏమి చేయుదుము ?" అనగా ఆత్మసాక్షాత్కారమును కోరుకొనుచున్న మనకు వేదాధ్యయన యజ్ఞ సంతానాదులవలన ప్రయోజనము ఏమీ లేదని అర్థము. సంతానము కావాలని కోరుకొన్నవారు శ్మశానాలకు వెళ్లిరి. సంతానము అక్కర లేదను కొన్నవారు మోక్షమును పొందిరి.

ఇది ఆపస్తంబధర్మ సూత్రములోని రెండు శ్లోకాల భావార్థము.

"అష్టాశీతిసహస్రాణి యే ప్రజామీషిర ఋషయః
దక్షిణేనార్యమ్ణః పన్థానం తే శ్మశానాని భేజిరే
అష్టాశీతిసహస్రాణి యే ప్రజాం నేషిర ఋషయః
ఉత్తమేణార్యమ్ణః పన్థానం తేఽమృతత్వం హి భేజిరే"
(ఆ ధ సూ. ప్ర.2,ఖ 22)

"సంతానమును కోరిన ఎనభై ఎనిమిదివేలమంది ఋషులు దక్షిణాయనమార్గమున శ్మశానాలకు పోయిరి. ఆత్మజ్ఞానరహితులగుటచే పునర్జన్మ నెత్తుటకు మరణించిరి అని భావము. సంతానమునందు అపేక్షలేని ఎనభై వేలమంది ఋషులు ఉత్తరాయణమార్గమున పయనించి మోక్షమును పొందిరి" అని ఈ శ్లోకముల అర్థము.

"సంన్యాసులు ఈ లోకమునే కోరుచు సంన్యసించుచుందురు" అను వాక్యములో "లోకము" అనగా ఆత్మలోకమనియే వివక్షితము (చెప్ప నిచ్ఛయింప బడినది) అని తెలియు చున్నది ఎందుచేత ననగా "సర్వవ్యాప్తము జన్మరహితము అయిన ఆ ఈ ఆత్మ'' అని ప్రారంభములో చెప్పబడిన ఆత్మనే ఈ వాక్యములోని "ఏతమ్" అను ఏతచ్ఛబ్దము పరామర్శించు చున్నది. లోక్యతే అనుభవింపబడును గాన "లోకః" అని దీని అర్థము. అందుచేత "ఆత్మలోకమును కోరుచున్నవారై అనగా" "ఆత్మానుభవమును కోరుచున్నవారై" అని శ్రుతికి తాత్పర్యార్థము ఏర్పడుచున్నది. స్మృతి కూడ ఉన్నది.

"పరమహంస అను పేరు గల సంన్యాసి బ్రహ్మవిజ్ఞానమును పొందుటకై శాంతి, దాంతి మొదలైన సకలసాధనములను సంపాదించు కొనవలెను" అని స్మృతి వాక్యమునకు అర్థము.

మూ. ఇహ జన్మని జన్మాన్తరే వా సమ్యగనుష్ఠితైర్వేదానువచనాదిభిరుత్పన్నయా వివిదిషయా సంపాదితత్వాదయం వివిదిషాసంన్యాస ఇత్యభిధీయతే:అయం చ వేదనహేతుః సంన్యాసః ద్వివిధః-జన్మాపాదకకామ్యకర్మాదిత్యాగమాత్రాత్మకః, ప్రైషోచ్చరణపూర్వకదణ్డధారణాద్యాశ్రమరూపశ్చేతి.

"పుంజన్మ లభతే మాతా పత్నీ చ ప్రైషమాత్రతః
బ్రహ్మనిష్ఠః సుశీలశ్చ జ్ఞానీ చైతత్ప్రభావతః".

వ్యా ఈ జన్మలో కాని, పూర్వ జన్మలలో కాని వేదానువచనాదులు చక్కగా చేసి ఉండుటచేత వివిదిష-తెలిసికొనవలె నను ఇచ్ఛ-కలిగి ఈ సంన్యాసమును స్వీకరించుటచే ఇది "వివిదిషా సంన్యాసము". ఆత్మను తెలిసికొనుటకు హేతువైన ఈ సంన్యాసము రెండు విధములు-పునర్జన్మకు హేతు వైన కామ్యకర్మాదులను త్యజించుట మాత్రము మొదటిది; "ప్రైషను" ఉచ్చరించుచు దండధారణాది పూర్వకముగా సంన్యాసాశ్రమ మును స్వీకరించుట రెండవది. (ఈ భూర్లోకమును, భువర్లోకమును, సువ ర్లోకమును త్యజించుచున్నాను అని చెప్పు మంత్రము ప్రైషమంత్రము).

''ప్రైషమంత్రమును చెప్పినంతమాత్రమునవే సంన్యసించినవాని తల్లికి భార్యకు పురుషజన్మలభించును దీని ప్రభావమువలన ఆ సంన్యాసి బ్రహ్మనిష్ఠుడై, మంచి శీలము కలవాడై జ్ఞానవంతుడు అగును", అని చెప్ప బడినది.

మూ. త్యాగశ్చ తైత్తిరీయాదౌ శ్రూయతే-"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః (తై.ఉ. 4-12-13)ఇతి. అస్మింశ్చ త్యాగే స్త్రియోఽప్యధిక్రియన్తే ["భిక్షుకీ" ఇత్యనేన స్త్రీణా మపి ప్రాగ్వివాహాద్వా, వైధవ్యాదూర్ధ్వం వా సంన్యాసేఽధికారోఽస్తీతి దర్శితమ్.తేన భిక్షచర్యం, మోక్షశాస్త్రశ్రవణమ్,ఏకాన్త ఆత్మధ్యానం చ తాభిః కర్తవ్యమ్. త్రిదణ్డాదికం చ ధార్యమ్;ఇతి మోక్షధర్మే చతుర్ధరీటీకాయాం సులభాజనకసంవాదే]

వ్యా తైత్తిరీయోపనిషదాదులలో త్యాగము చెప్పబడినది-"కర్మ చేత గాని, సంతానముచేత గాని, ధనముచేత గాని ఎవరూ మోక్షమును పొందలేదు- త్యాగము (సంన్యాసము) చేతనే కొందరు మోక్షమును పొంద గలిగినారు". ఈ సంన్యాసమునందు స్త్రీలకు కూడ అధికార మున్నది,

మోక్షధర్మములో, చతుర్ధరీటీకలో సులభాజనకసంవాదఘట్టమునందు ఇట్లు చెప్పబడినది-"భిక్షుకీ" అనుటచేత వివాహమునకు పూర్వము గాని వైధవ్యము వచ్చినచో అప్పుడు గాని స్త్రీలకు కూడ సంన్యాసమునందు అధికారము ఉన్నదని చూపబడినది. అందుచేత సంన్యాసము స్వీకరించిన స్త్రీలు భిక్షాచరణమును, మోక్షశాస్త్రశ్రవణమును, ఏకాంతప్రదేశము నందు ఆత్మధ్యానమును చేయవలెను. త్రిదండాదికమును ధరించవలెను.

మూ. శారీరకభాష్యే "వాచక్నవీ"ఇత్యాది శ్రూయతే దేవతాధికరణ న్యాయేన విధురస్యాధికారప్రసఙ్గేన తృతీయాధ్యాయే చతుర్థపాదే.అతఏవ మైత్రేయీవాక్యమామ్నాయతే—"యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యామ్; యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహి" (బృ.ఉ. **4-5-8**) ఇతి.

వ్యా. శారీరకభాష్యములోని తృతీయాధ్యాయచతుర్థపాదములో భార్య చనిపోవుటచేత ఏ ఆశ్రమమూ లేని విధురునకు బ్రహ్మవిద్యాధికార మున్నదా లేదా అని శంకించుకొని సమాధానము చెప్పునప్పుడు దేవతలకు కర్మలలో అధికారము లేకపోయినను బ్రహ్మవిద్యయందు అధికార మున్నది అని దేవతాధికరణములో ప్రతిపాదించినట్లు విధురునకు కూడ అధికార మున్నది అని ప్రతిపాదించే సందర్భమునందు శంకర భగవత్పాదులు "ఏ ఆశ్రమము లేకపోయినను రైక్వ-వాచక్నవీ (స్త్రీ) ప్రభృతులకు బ్రహ్మవిద్యయందు అధికార మున్నట్లు శ్రుతులలో కనబడుచున్నది గాన విధురునకు కూడ అధికార మున్నది" అని ప్రతిపాదించిరి. అట్లే బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయి తన భర్తయైన యాజ్ఞవల్క్యునితో-"నా కీ ధన మెంత ఉన్నా మోక్షము లభించని పక్షమున ఈ ధన మంతా నా కెందుకు ? నీకు తెలిసినదానినే (ఆత్మవిద్యను) నాకు బోధింపుము ' అని అన్నట్లు ఉన్నది. వీటిని అన్నింటిని పట్టి స్త్రీలకు కూడ సంన్యాసమునందు అధికార మున్నట్లు స్పష్ట మగుచున్నది.

మూ॥ బ్రహ్మ-రిగృహస్థవానప్రస్థానాం కేన చిన్నిమిత్తేన సంన్యాసా
శ్రమస్వీకారే ప్రతిబద్ధే సతి,స్వాశ్రమధర్మేష్వనుష్ఠీయమానేష్వపి వేద
నార్థో మానసః కర్మాదిత్యాగో న విరుధ్యతే శ్రుతిస్మృతీతిహాసపురాణేషు,
లోకే చ తాదృశాం తత్త్వవిదాం బహూనాముపలమ్భాత్. యస్తు దణ్డ
ధారణాదిరూపో వేదనహేతుః పరమహంసాశ్రమః స పూర్వాచార్యైర్బ
హుధా ప్రపఞ్చిత ఇత్యస్మాభిరుపరమ్యతే.

ఇతి వివిదిషాసంన్యాసః 1

వా॥ బ్రహ్మచర్య-గార్హస్థ్య-వానప్రస్థములలో ఉన్నవారి కెవరికైన సంన్యాసము గ్రహింపవలె నని అభిలాష ఉన్నను దాని కేమైన ప్రతిబంధము ఏర్పడినప్పుడు అట్టి వ్యక్తి స్వాశ్రమధర్మములు నిర్వర్తించుచునే ఆత్మజ్ఞానార్థమై మానససంన్యాసమును స్వీకరించినను దోషములేదు. ఎందుచేత ననగా వేదములలోను, స్మృతులలోను, ఇతిహాసములలోను పురాణములలోను అట్టి ఉదాహరణములు ఉన్నవి; లోకములో కూడ అట్టివారు చాలమంది కనబడుచున్నారు.

ఆత్మజ్ఞానమునకు హేతువైన దండధారణాదిరూపమైన పరమహంసాశ్రమమును గూర్చి పూర్వాచార్యులు అనేకవిధముల విశదీకరించి ఉన్నారు. అందుచే ఇక్కడ మేము ఆ విషయమును సవిస్తరముగా వర్ణింపక విరమించుచున్నాము

ఇది వివిదిషాసంన్యాసము. 1

## 2. విద్వత్సంన్యాసము

మూ. అథ విద్వత్సంన్యాసం నిరూపయామః: సమ్యగనుష్ఠితైః శ్రవణమనననిదిధ్యాసనైః పరం తత్త్వం విదితవద్భిః సంపాద్యమానో విద్వత్సంన్యాసః.తం చ యాజ్ఞవల్క్యః సంపాదయామాస. తథాహి-
విద్వచ్ఛిరోమణిర్భగవాన్ యాజ్ఞవల్క్యో విజిగీషుకథాయాం బహువిధేన తత్త్వనిరూపణేనాశ్వలప్రభృతీన్ మునీన్ విజిత్య,వీతరాగకథాయాం

సంక్షేపవిస్తరాభ్యామనేకధా జనకం బోధయిత్వా, మైత్రేయీం బుబోధ యిషుస్తస్యాస్త్వరయా తత్త్వాభిముఖ్యాయ స్వకర్తవ్యం సంన్యాసం ప్రతిజజ్ఞే. తతస్తాం బోధయిత్వా సంన్యాసం చకార. తదుభయం మైత్రేయీబ్రాహ్మణస్యాద్యన్తయోరామ్నాయతే—“అథ హ యాజ్ఞవల్క్యోఽన్యద్ వృత్తముపాకరిష్యన్ మైత్రేయీతిహోవాచ యాజ్ఞవల్క్యః ప్రవ్రజిష్యన్వా అరే అహమస్మాత్ స్థానాదస్మి” (బృ. ఉ. **4-5-1-2**) ఇతి: “ఏతావదరే ఖల్వమృతత్వమితిహోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార” (బృ.ఉ. **4.5.15**) ఇతి చ.

వ్యా. ఇక విద్వత్సంన్యాసమును నిరూపించుచున్నాము. శ్రవణ-మనన-నిదిధ్యాసనములను బాగుగా చేసి పరతత్త్వమును గ్రహించినవారు తీసికొను సంన్యాసము విద్వత్సంన్యాసము. అద్వితీయాత్మతత్త్వప్రతిపాదకములైన ఉపనిషత్తులను ఆచార్యముఖతః వినుట “శ్రవణము''. ఆ ఉపనిషత్తులు బోధించు అర్థమును సంశయము కాని, విప్రతిపత్తి (విపరీతార్థమును గ్రహించుట లేదా నమ్మకము లేకపోవుట) గాని, భ్రాంతి కాని లేకుండగా, తగిన యుక్తుల సహకారముతో నిశ్చితముగ తెలిసికొనుట “మననము''. దానిని తదేకాగ్రదృష్టితో ధ్యానించుట ''నిదిధ్యాసనము''. ఈ విద్వత్సంన్యాసమును యాజ్ఞవల్క్యుడు సంపాదించెను. విద్వాంసులలో శిరోమణివంటివాడైన భగవంతుడైన యాజ్ఞవల్క్యుడు విజిగీషుకథలో అనేకవిధములుగ తత్త్వనిరూపణము చేసి ఆశ్వలుడు మొదలైన మునులను జయించెను. వీతరాగకథను అవలంబించి జనకునకు సంక్షేపముగాను, విస్తారముగాను ఆత్మతత్త్వమును ఉపదేశించెను. (ఒకరినొకరు జయించవలెనను ఉద్దేశ్యముతో చేయు శాస్త్రవాదమునకు “విజిగీషుకథ'' అని పేరు. ఇట్టి కోరిక ఏదీ లేనివారు చేయు శాస్త్రచర్చ “వీతరాగకథ"). పిమ్మట మైత్రేయికి తత్త్వమును ఉపదేశించవలెనని నిశ్చయించుకొని ఆమెకు ఆ విషయమున తొందర కలుగుటకై ''నేను సంన్యాసమును చేయనున్నాను'' అని చెప్పెను. పిమ్మట ఆమెకు తత్త్వోపదేశము చేసి సంన్యాసము చేసెను. ఈ రెండు విషయములు

మైత్రేయీ బ్రాహ్మణము ప్రారంభమునందు, అంతమునందు చెప్పబడినవి :- "పిమ్మట యాజ్ఞవల్క్యుడు తా నున్న ఆశ్రమముకంటె భిన్నమైన సంన్యాసాశ్రమమును పొంద నున్నవాడై "మైత్రేయీ!" అని పిలచి "నేను ఈ స్థానమునుండి వెళ్ళిపోవలె నని (సంన్యాసము స్వీకరించవలె నని) అనుకొనుచున్నాను" (4.5.1 2), "ఓయీ! ఇంతవరకు చెప్పిన ఈ ఆత్మతత్త్వజ్ఞానమే మోక్షసాధనము అని పలికి యాజ్ఞవల్క్యుడు సంన్యాసియై వెళ్లిపోయెను" (4.5.15).

మూ. కహోలబ్రాహ్మణేఽపి విద్వత్సంన్యాస ఆమ్నాయతే— "ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయ భిక్షాచర్యం చరన్తి" **(3-4-1)** ఇతి. న చైతద్వాక్యం వివిదిషాసంన్యాసపరమితి శఙ్కనీయమ్: పూర్వకాలవాచినః 'విదిత్వా' ఇతి క్త్వాప్రత్యయస్య బ్రహ్మవిద్వాచినో బ్రాహ్మణశబ్దస్య చ బాధప్రసఙ్గాత్. న చాత్ర బ్రాహ్మణశబ్దో జాతివాచకః. వాక్యశేషే పాణ్డిత్య-బాల్య-మౌనశబ్దాభిధేయైః శ్రవణమనన దిధ్యాసనైః సాధ్యం బ్రహ్మసాక్షాత్కారమభిప్రేత్య "అథ బ్రాహ్మణః" **(3-1-5)** ఇత్యభిహితత్వాత్.

వ్యా. విద్వత్సంన్యాసము కహోలబ్రాహ్మణములో కూడ చెప్పబడినది :- "ఈ ఆత్మను తెలిసికొని బ్రాహ్మణులు (బ్రహ్మవేత్తలు) పుత్రులయందున్న కోరికనుండి, ధనమునందున్న కోరికనుండి, లోకమునందున్న కోరికనుండి దూరులై భిక్షాచర్యమును చరింతురు, అనగా సంన్యాసులగుదురు" (3.4.1). ఈ వాక్యములో వివిదిషాసంన్యాసమే చెప్పబడిన దని శంకింపగూడదు. అట్లయినచో "విదిత్వా" అన్నప్పుడు పూర్వకాలమును బోధించు "క్త్వా" ప్రత్యయప్రయోగము, ('విదిత్వా' అనుదానికి "ముందుగా తెలిసికొని" అని అర్థము) "బ్రహ్మవేత్త" అను అర్థమును బోధించు బ్రాహ్మణశబ్దము ప్రయోగము కుదరవు. ఇక్కడ 'బ్రాహ్మణ' శబ్దమునకు బ్రాహ్మణజాతికి చెందినవాడు అనియే అర్థము;

బ్రహ్మవేత్త అని కాదు అని చెప్పుటకు వీలులేదు. ఎందుచేత ననగా. వాక్యము చివర వరసగా శ్రవణము, మననము. నిదిధ్యాసనము ఉను. అర్థములు గల పాణ్డిత్య - బాల్య - మౌనములచే సాధింపదగిన బ్రహ్మ సాక్షాత్కారమును దృష్టిలో ఉంచుకొని "అధ బ్రాహ్మణః" (3-1-5) అని చెప్పబడినది

మూ. నను తత్ర వివిదిషాసంన్యాసోపేతః పాణ్డిత్యాదౌ ప్రవర్త మానోఽపి బ్రాహ్మణశబ్దేన పరామృష్టః-"తస్మాద్ బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" (3-5-1) ఇతీతి చేత్ నైష దోషః భావినీం వృత్తిమాశ్రిత్య తత్ర బ్రాహ్మణశబ్దస్య ప్రయుక్తత్వాత్. అన్యథా కథమి "అధ బ్రాహ్మణః" (3-5-1)ఇతి సాధనానుష్ఠానోత్తరకాలవాచినమథ శబ్దం ప్రయుఞ్జీత?

వ్యా. (ఆశంక) అక్కడ - "ఆ కారణముపలన బ్రాహ్మణుడు పాండిత్యమును పొంది,పిమ్మట బాల్యమును అవలంబించి ఉండ నిచ్ఛయించ వలెను" అను వాక్యమునందు పాండిత్యాదులు సంపాదించుకొనుటకు ప్రయత్నించుచున్న వివిదిషాసంన్యాసవంతుడు కూడ 'బ్రాహ్మణ' శబ్దము చేత నిర్దేశించబడినాడు కదా ? (సమాధానము) అట్లనరాదు, రాబోవు స్థితిని దృష్టిలో ఉంచుకొని, అనగా పాండిత్యాదిసంపాదనముచే కలుగబోవు బ్రహ్మవేత్తృత్వమును పురస్కరించుకొని, అక్కడ 'బ్రాహ్మణ' శబ్దము ప్రయోగింపబడినది అందుచే దానికి బ్రహ్మవేత్త అనియే అర్థము. అట్లు కానిచో "అధ బ్రాహ్మణః" (3-5-1) ఇత్యాదివాక్యములో "సాధనాను ష్ఠానము తరువాత" అను అర్థమును బోధించు "అథ" శబ్దమును ప్రయో గించుట కుదరదు.

మూ. శారీరబ్రాహ్మణేఽపి విద్వత్సంన్యాసవివిదిషాసంన్యాసౌ స్పష్టం నిర్దిష్టౌ—ఏతమేవ విదిత్వా మునిర్భవతి,ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (4-4-22)ఇతి. మునిత్వం మనన శీలత్వమ్ తచ్చ అసతి కర్తవ్యాన్తరే సంభవతీత్యర్థాత్ సంన్యాస ఏవాభి

ధీయతే. ఏతచ్చ వాక్యశేషే స్పష్టీకృతమ్—"ఏతద్ధ స్మ వై తత్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాయం లోక ఇతి, తే హ స్మ పుత్త్రైషణాయాశ్చ, విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" (4-4-22)ఇతి. "అయం లోకః" ఇత్యపరోక్షేణానుభూయమాన ఇత్యర్థః,

**వ్యా.** శారీరబ్రాహ్మణములో కూడ విద్వత్సంన్యాసవివిదిషాసంన్యాసములు స్పష్టముగా నిర్దేశింపబడినవి–"దీనినే తెలిసికొని ముని అగును. సంన్యాసులు ఈ లోకమునే కోరుచు సంన్యాసము గ్రహించుచున్నారు" (4 4.22). మననము చేయు స్వభావము కలిగి ఉండుట మునిత్వము, ఇతరములైన కర్తవ్యము లున్నవానికి అట్టి మునిత్వము కుదరదు గాన దీనికి సంన్యాస మనియే అర్థము. ఈ విషయము వాక్యశేషమునందు స్పష్టీకరింపబడినది – "అందువలననే ప్రాచీనులైన విద్వాంసులు సంతానమును కోరలేదు. ఈ ఆత్మ అనే లోకము గల మనము సంతానము కని ఏమి చేయుదుము? వారు పుత్త్రైషణా - విత్తైషణా - లోకైషణలనుండి దూరముగా ఉండి (ఆ ఏషణాత్రయమును విడచి) భిక్షాచరణమును చేయుచున్నారు", (4.4.22). "అయం లోకః" అనగా ప్రత్యక్షముగా అనుభవించబడుచున్నది అని అర్థము.

మూ. నన్వత్ర మునిత్వేన ఫలేన ప్రలోభ్య వివిదిషాసంన్యాసం విధాయ వాక్యశేషే స ఏవ ప్రపఞ్చితః. అతో న సంన్యాసాన్తరం కల్పనీయమ్. మైవమ్, వేదనస్యైవ వివిదిషాసంన్యాసఫలత్వాత్. న చ. వేదనమునిత్వయోరేకత్వం శఙ్కనీయమ్: "విదిత్వా మునిర్భవతి" ఇతి పూర్వోత్తరకాలీనయోస్తయోః సాధ్యసాధనభావప్రతీతేః.

**వ్యా.** (ఆశంక) ఇక్కడ మునిత్వ మను ఫలమును చూపి ఆశ కలిగించి వివిదిషాసంన్యాసమును విధించి వాక్యశేషములో దానినే వివరించుట

జరిగినది. అందుచేత మరొకసంన్యాసమును కల్పించకూడదు. (సమా ధానము) అట్లు కాదు వివిదిషాసంన్యాసమునకు ఫలము వేదనమే (జ్ఞానమే. వేదనము, మునిత్వమూ ఒక్కటే కదా అని అనుటకు వీలులేదు. "తెలిసికొని ముని అగుచున్నాడు" అనుటచే ముందు వేదనము తరవాత మునిత్వము గాన వేదనము సాధన మనీ, మునిత్వము సాధింపదగిన దనీ తెలియుచున్నది గాన ఆ రెండూ ఒకటీ కాదు.

మూ. నను వేదనస్యైవ పరిపాకాతిశయరూపమవస్థాన్తరం మునిత్వమ్, అతో వేదనద్వారా పూర్వసంన్యాసస్యైవ ఫలత్వమితి చేత్, బాఢమ్: అత ఏవ సాధనరూపాత్ సంన్యాసాద్భిన్నం ఫలరూపమేతం సంన్యాసం బ్రూమః. యథా వివిదిషాసంన్యాసినా తత్త్వజ్ఞానాయ శ్రవణాదీని సంపాదనీయాని, తథా విద్వత్సంన్యాసినాపి జీవన్ముక్తయే మనోనాశవాసనాక్షయౌ సంపాదనీయౌ. ఏతచ్చోపరిష్టాత్ ప్రపఞ్చయిష్యామః. సత్యప్యనయోః సంన్యాసయోరవాన్తరభేదే పరమహంసత్వాకారేణైకీకృత్య "చతుర్విధా భిక్షవః" ఇతి స్మృతిషు చతుఃసంఖ్యోక్తా.

వ్యా (ఆశంక). వేదనము (జ్ఞానము) ఎక్కువ పరిణతి చెందగా ఏర్పడిన దాని మరి యొక అవస్థయే మునిత్వము. అందుచేత ఇది (మునిత్వము, అనగా విద్వత్సంన్యాసము) పూర్వసంన్యాసమువలన (వివిదిషాసంన్యాసమువలన) వేదనము ద్వారా లభించిన ఫలమే కదా? (సమాధానము): నిజమే. అందుచేతనే సాధనరూప మైన (వివిదిషా) సంన్యాసముకంటె భిన్నమైన ఫలరూపసంన్యాసము ఇది (విద్వత్సంన్యాసము) అని చెప్పుచున్నాము. వివిదిషాసంన్యాసి తత్త్వజ్ఞానము కొరకై శ్రవణాదులు సంపాదించవలసి ఉన్నట్లే విద్వత్సంన్యాసి కూడ జీవన్ముక్తి కొరకై మనోనాశమును, వాసనాక్షయమును సంపాదించుకొనవలెను. ఈ విషయమును ముందు విపులీకరించెదము. ఈ సంన్యాసములు రెండింటికి అవాంతరభేద మున్నను "పరమహంససంన్యాసము" అను ఒకే పేరు పెట్టి ఒకటిగా భావించి స్మృతులలో "సంన్యాసులు నాలుగువిధము లైనవారు" అని చతుఃసంఖ్య చెప్పబడినది.

మూ. పూర్వోత్తరయోః సంన్యాసయోః పరమహంసత్వం జాబాలశ్రుతావవగమ్యతే. తత్ర హి జనకేన సంన్యాసే పృష్టే సతి యాజ్ఞవల్క్యః అధికారవిశేషవిధానేన ఉత్తరకాలానుష్ఠేయేన చ సహితం వివిదిషాసంన్యాసమభిధాయ, పశ్చాత్ అత్రిణా యజ్ఞోపవీత రహితస్య ఆక్షిప్తే బ్రాహ్మణ్యే సతి, పశ్చాత్ ఆత్మజ్ఞానమేవ యజ్ఞోప వీతమితి సమాదధౌ. అతో బాహ్యయజ్ఞోపవీతాభావాత్ పరమహంసత్వం నిశ్చీయతే. తథా అన్యస్యాం కణ్డికాయాం "తత్ర పరమహంసో నామ" (6) ఇత్యుపక్రమ్య సంవర్తకారుణిప్రభృతీన్ బ్రహ్మవిదో జీవన్ముక్తాను దాహృత్య "అవ్యక్తలిఙ్గా అవ్యక్తాచారా అనున్మత్తా ఉన్మత్తవదా చరన్తః (6) ఇతి విద్వత్సంన్యాసినో దర్శితాః. తథా "త్రిదణ్డం కమణ్డలుం శిక్యం పాత్రం జలపవిత్రం శిఖాం యజ్ఞోపవీతం చేతత్సర్వం భూః స్వాహా ఇత్యప్సు పరిత్యజ్య ఆత్మానమన్విచ్ఛేత్" (6) ఇతి త్రిదణ్డినః సతః ఏకదణ్డలక్షణం వివిదిషా సంన్యాసం విధాయ తత్ఫల రూపం విద్వత్సంన్యాసమేవముదాజహార — యథాజాతరూపధరో నిర్ద్వన్ద్వో నిష్పరిగ్రహః తత్త్వ బ్రహ్మమార్గే సమ్యక్సంపన్నః శుద్ధ మానసః ప్రాణసంధారణార్థం యథోక్తకాలే విముక్తో భైక్షమాచరన్ ఉదరపాత్రేణ లాభాలాభయోః సమో భూత్వా శూన్యాగార-దేవగృహ- తృణకూట - వల్మీక-వృక్షమూల - కులాలశాలాగ్నిహోత్రగృహ- నదీపులిన - గిరికుహర-కన్దర-కోటర-నిర్ఝర - స్థణ్డిలేష్వనికేతవాసీ అప్రయత్నః నిర్మమః శుక్లధ్యానపరాయణః అధ్యాత్మనిష్ఠః శుభాశుభ కర్మనిర్మూలనపరః సంన్యాసేన దేహత్యాగం కరోతి, స పరమహంసో నామ" (6) ఇతి. తస్మాదనయోః ఉభయోః పరమహంసత్వం సిద్ధమ్.

వ్యా. ఈ పూర్వోత్తరసంన్యాసములు (వివిదిషాసంన్యాసవిద్వత్సం న్యాసములు) రెండూ పరమహంససంన్యాసములే అని జాబాలశ్రుతిలో

తెలియుచున్నది. అక్కడ. జనకుడు సంన్యాసమును గూర్చి ప్రశ్నించినపుడు యాజ్ఞవల్క్యుడు వివిదిషాసంన్యాసమును, దానికి సంబంధించిన అధికారవిశేషమును (దానికి ఎవరు అధికారి అను విషయమును) దాని తరువాత చేయవలసిన కర్తవ్యములను చెప్పెను. అప్పుడు "యజ్ఞోపవీతము లేనివాడు బ్రాహ్మణు డెట్లగును?" అని అత్రి ఆక్షేపించగా "ఆత్మజ్ఞానమే యజ్ఞోపవీతము'' అని సమాధానము చెప్పెను. అందుచే బాహ్యమైన యజ్ఞోపవీతము లేకపోవుటచే అతడు పరమహంస అని నిశ్చయింపబడుచున్నది

అట్లే మరొక కండికలో "వారిలో పరమహంస లనగా" అని ప్రారంభించి సంవర్తకుడు మొదలైన చాలమంది జీవన్ముక్తులైన బ్రహ్మవేత్తలను ఉదాహరించి, "అవ్యక్తములైన లింగములు (చిహ్నములు) కలవారు, అవ్యక్తమైన ఆచారము కలవారు, ఉన్మత్తులు కాకపోయినను ఉన్మత్తుల వలె ప్రవర్తించువారు" అని విద్వత్సంన్యాసులు చూపబడినారు మరియు ''త్రిదండమును, కమండలమును, పాత్రపెట్టుకొను ఉట్టిని, జలముతో పవిత్రమైన పాత్రను, శిఖాయజ్ఞోపవీతములను ''భూః స్వాహా'' అను మంత్రము ఉచ్చరించుచు జలములో పరిత్యజించి ఆత్మను అన్వేషించవలెను" ఇత్యాదివాక్యముచేత అంతవరకు త్రిదండిగా ఉన్నవానికి ఏకదండలక్షణమైన (ఒక దండమును ధరించుట లక్షణముగా గల) వివిదిషాసంన్యాసమును విధించి దానికి ఫలముగా విద్వత్సంన్యాసమును ఈ విధముగా చెప్పెను : — "పుట్టినప్పుడు ఎట్లుండెనో అట్టిరూపము ధరించి (నగ్నుడై), శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములు లేనివాడై, వస్తువులను కూడబెట్టుకొననివాడై, ఆ బ్రహ్మమార్గమునందు చక్కగా పయనించుచు, పరిశుద్ధమైన మనస్సుతో, చెప్పబడిన కాలమునందు బైటకు వచ్చి తన ఉదరమే పాత్రగా చేసికొని భిక్షకొరకై సంచరించుచు (అనగాలభించినది వెంటనే తినుచు), భైక్షము లభించినను లభించకపోయినను సముడై (సమముగానే ఉంటూ). పాడుపడిన ఇల్లు, దేవాలయము, గడ్డికుప్ప, పుట్ట, చెట్టుమొదలు, కుమ్మరి ఇల్లు, అగ్నిహోత్రగృహము, నది ఇసుకతిన్నె, పర్వతరంధ్రము, పెద్దగుహ, చెట్టుతొఱ్ఱ, సెలయేరు, మెట్ట,ప్రదేశము

వంటిస్థానములలో నివసించుచు, ఒక గృహములో నివసించక, ఎట్టి ప్రయత్నము చేయక, మమకారము లేనివాడై, పరిశుద్ధమైన ధ్యానమునందు ఆసక్తుడై, ఆత్మయందు స్థిరుడై, పుణ్యపాపములను నిర్మూలించుకొనుట యందు ఆసక్తి గలవాడై, సంన్యాసము చేసి దేహత్యాగము చేయువాడు పరమహంస" అందుచేత వీరు (వివిదిషాసంన్యాసివిద్వత్సంన్యాసులు) ఇద్దరూ కూడ పరమహంసలే అని సిద్ధించుచున్నది.

మూ. సమానేఽపి పరమహంసత్వే సిద్ధే విరుద్ధధర్మాక్రాన్తత్వా దవాన్తరభేదోఽప్యభ్యుపగన్తవ్యః. విరుద్ధధర్మత్వం చారుణికోపనిషత్ప రమహంసోపనిషదోః పర్యాలోచనాయామవగమ్యతే—"కేన భగవన్ కర్మాణ్యశేషతో విసృజామి"(1)ఇతి శిఖాయజ్ఞోపవీతస్వాధ్యాయ గాయత్రీజపాద్యశేషకర్మత్యాగరూపే వివిదిషాసంన్యాసే శిష్యేణారుణినా పృష్టే సతి గురుః ప్రజాపతిః—"శిఖాం యజ్ఞోపవీతమ్"ఇత్యాదినా సర్వత్యాగమభిధాయ "దణ్డమాచ్ఛాదనం కౌపీనం చ పరిగ్రహేత్" (1)ఇతి దణ్డాదిస్వీకారం విధాయ"త్రిసంధ్యాదౌ స్నానమాచరేత్, సంధిం సమాధావాత్మన్యాచరేత్. సర్వేషు వేదేష్వారణ్యకమావర్తయేత్" (2) ఇతి వేదనహేతూనాశ్రమధర్మాననుష్ఠేయతయా విధత్తే.

మూ. ఈ రెండు సంన్యాసముల ధర్మములు విరుద్ధములు (వేరు వేరుగా ఉన్నవి) అను విషయము ఆరుణికోపనిషత్ - పరమహంసోపనిషత్తు లను పరిశీలించగా తెలియుచున్నది. శిష్యుడైన ఆరుణి—"ఓ పూజ్యుడా! నేనా కర్మలను పూర్తిగా ఎట్లు విసర్జించవలెను ?" అని శిఖాయజ్ఞోపవీత స్వాధ్యాయ - గాయత్రీ జపాదిసకలకర్మత్యాగరూపమైన వివిదిషా సంన్యాసమును గూర్చి ప్రశ్నింపగా, గురువైన ప్రజాపతి—"శిఖను యజ్ఞోపవీతమును" ఇత్యాదివాక్యముచేత సర్వత్యాగమును గూర్చి చెప్పి, "దండమును, ఆచ్ఛాదనమును (కంబళి), కౌపీనమును స్వీకరించ వలెను" అని దండాదుల స్వీకారమును విధించి, "త్రిసంధ్యా సమయాదు లలో స్నానము చేయవలెను. సమాధియందు ఆత్మమీద చిత్తమును నిలుప

వలెను వేదాలు అన్నింటిలోను ఆరణ్యకములను పఠించుచుండవలెను, ఉప నిషత్తును పఠించుచుండవలెను" అని జ్ఞానమునకు హేతువులైన ఆశ్రమ ధర్మములను అనుష్ఠించవలె నని విధించును

మూ. అథ "యోగినాం పరమహంసానాం కో మార్గః?" ఇతి నారదేన పృష్టే సతి, గురుర్భగవాన్ ప్రజాపతిః "స్వపుత్రమిత్ర ఇత్యాదినా పూర్వవత్ సర్వత్యాగమభిధాయ, "కౌపీనం దణ్డమాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకస్యోపకారార్థాయ చ పరిగ్రహేత్" ఇతి దణ్డాదిస్వీకారస్య లౌకికత్వమభిధాయ, "తచ్చ న ముఖ్యోఽస్తి" ఇతి శాస్త్రీయత్వం ప్రతిషిధ్య, "కోఽయం ముఖ్య ఇతి చేదయం ముఖ్యో న దణ్డం న శిఖాం న యజ్ఞోపవీతం న చాచ్ఛాదనం చరతి పరమహంసః" ఇతి దణ్డాదిలిఙ్గరాహిత్యస్య శాస్త్రీయతాముక్త్వా "న శీతం న చోష్ణమ్" ఇత్యాదివాక్యేన "ఆశామ్బరో న నమస్కారః" ఇత్యాదివాక్యేన చ లోక వ్యవహారాతీతత్వమభిధాయ, అన్తే, యత్పూర్ణానన్దైకబోధస్తద్బ్రహ్మాహ మస్మీతి కృతకృత్యో భవతి" ఇత్యన్తేన గ్రన్థేన బ్రహానుభవమాత్ర మత్యవసానమాచష్టే. అతో విరుద్ధధర్మోపేతత్వాదస్త్యేవానయోర్మహాన్ భేదః

వ్యా పిమ్మట "పరమహంస లైన యోగులు అనుసరించు మార్గ మేది?'' అని నారదుడు ప్రశ్నించగా భగవంతుడైన గురువు, ప్రజాపతి- 'స్వపుత్రమిత్ర'' ఇత్యాది వాక్యముచేత వెనుకటివలెనే సర్వత్యాగమును బోధించెను ''తన శరీరమునకు ఉపయోగపడుటకు, లోకోపకారము కొరకూ, కౌపీనమును దండమును, ఆచ్ఛాదనమును స్వీకరించవలెను'' అని దండాది స్వీకారము లౌకికము (లోకోపయోగము కొరకు మాత్రమే) అని చెప్పెను. "ఇది ముఖ్యము కాదు'' అని దీనికి శాస్త్రీయత్వమును నిషేధించి అనగా ఈ కౌపీనదండాదిధారణము శాస్త్రీయము కా దని చెప్పి, "అయితే ముఖ్యమైనది ఏదనగా-పరమహంససంన్యాసి దండమును

గాని, శిఖను గాని, యజ్ఞోపవీతమును గాని అచ్ఛాదనమును కాని ధరించక సంచరించును'' అను వాక్యముచే దండాదిలింగము లేవీ లేకుండటయే శాస్త్రీయము అను విషయమును తెలిపెను. "శీతము కాని, వేడికాని (వానిని బాధించదు)'' ఇత్యాది వాక్యము చేతను, "దిగంబరుడై నమస్కారము లేనివాడై (నమస్కారము చేయుట గాని అందుకొనుట గాని లేనివాడై)'' ఇత్యాది వాక్యముచేత అతడు లోకవ్యవహారములకు అతీతుడు అని చెప్పెను చివర ''పూర్ణానందస్వరూపము జ్ఞానస్వరూపము అయిన ఏ బ్రహ్మ కలదో ఆ బ్రహ్మయే నేను అను భావనచేత ఆత్మసాక్షాత్కారమును పొంది పరమహంస కృత కృత్యు డగును'' అను వాక్యము చేత పరమ హంస చేయు సాధన కంతకీ ఫలము, బ్రహ్మానుభవమే అని ముగించెను. ఈ విధముగా ఈ రెండు సంన్యాసముల ధర్మములు పరస్పర విరుద్ధము లగుటచే (వేరు వేరుగా ఉండుటచే) ఈ రెండింటికి చాల భేద మున్నది.

మూ. స్మృతిష్వప్యయం భేద ఉక్తదిశా ద్రష్టవ్యః.

"సంసారమేవ నిఃసారం దృష్ట్వా సారదిదృక్షయా
ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః
ప్రవృత్తిలక్షణో యోగో జ్ఞానం సంన్యాసలక్షణమ్
తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహ బుద్ధిమాన్''

(బృ.స్మృ.)

ఇత్యాదివివిదిషాసంన్యాసః

"యదా తు విదితం తత్స్యాత్ పరం బ్రహ్మ సనాతనమ్
తదైకదణ్డం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్
జ్ఞాత్వా సమ్యక్ పరం బ్రహ్మ సర్వం త్యక్త్వా పరివ్రజేత్''
ఇత్యాది విద్వత్సంన్యాసః.

వ్యా. స్మృతులలో కూడ ఈ భేదమును వెనుక చెప్పిన విధముగ చూచుకొనవలెను. ఈ రెండు సంన్యాసములకు ఉన్న భేదమును స్మృతులు కూడ చెప్పినవి అని అర్థము.

"సంసారము సారము లేని దని గ్రహించి, సారమైన పరమార్థ తత్త్వమును చూడవలె నను కోరికతో గొప్ప వైరాగ్యమును పొంది, వివాహమును చేసికొనక సంన్యాసమును స్వీకరింతురు''.

"యోగము అనగా కర్మయోగము, ప్రవృత్తిలక్షణమైనది. జ్ఞానము సంన్యాసమునకు లక్షణము. అందుచేత, బుద్ధిమంతుడు జ్ఞానమును పురస్కరించుకొని (జ్ఞానమునకు ప్రాధాన్య మిచ్చుచు) సంన్యసించ వలెను.'' (బృ.స్మృ)

ఇత్యాదిస్మృతివాక్యములలో చెప్పబడినది వివిదిషాసంన్యాసము. "శాశ్వతమైన ఆ పరబ్రహ్మ తెలియబడిన పిమ్మట ఏకదండమును స్వీకరించి శిఖాయజ్ఞోపవీతములను పరిత్యజింపవలెను. పరబ్రహ్మతత్త్వ మును సాక్షాత్కరించుకొని పిమ్మట అంతను పరిత్యజించి సంన్యాసము స్వీకరించ వలెను."

ఇత్యాదిస్మృతివాక్యములలో చెప్పబడినది విద్వత్సంన్యాసము

మూ. నను కలావిద్యాస్వివ కదాచిదౌత్సుక్యమాత్రేణాపి వేదితుమిచ్ఛా సంభవతి. ఏవం విద్వత్తాఖ్యాపాతదర్శినః పణ్డితం మన్యాన్యాత్రావలోక్యతే; న చ తౌ ప్రజితౌ దృష్టౌ.అతో వివిదిషావిద్వత్తే కీదృశీ వివక్షితే ఇతి చేత్ ఉచ్యతే-యథా తీవ్రాయాం బుభుక్షా యాముత్పన్నాయాం భోజనాదన్యో న రోచతే వ్యాపారః, భోజనే చ విలమ్బోఽపి సోఢుం న శక్యతే, తథా జన్మహేతుషు కర్మ స్వత్యన్తమరుచిర్వేదనసాధనేషు చ శ్రవణాదిషు త్వరా మహతీ సంపద్యతే; తాదృశీ వివిదిషా సంన్యాసహేతుః

వ్యా. (ఆశంక) చిత్రకళాదికళలయందు, ఇతరవిద్యలయందు వలెనే కేవలము ఔత్సుక్యముచేత (వేడుకచేత) బ్రహ్మను గూర్చి తెలిసి కొనవలె నని ఇచ్ఛ కలుగవచ్చును కదా ? అట్లే బ్రహ్మస్వరూపమును గూర్చి స్థూలముగా తెలిసికొనిన పండితంమన్యులకు (మేమే పండితుల మని

భావించేవారికి) కూడ ఈ రోజులలో విద్వత్త్వము కనబడుచున్నది కదా ? వాళ్లెవరూ సంన్యాసమును (మొదటి తెగకు చెందిన వాళ్లు వివిదిషాసంన్యాసమును, రెండవ తెగకు చెందినవాళ్ళు విద్వత్సంన్యాసమును) స్వీకరించుచున్నట్లు కనబడుట లేదు కదా? అందుచేత మీరుచెప్పు చున్న వివిదిషా-విద్వత్తలు ఎటువంటివి? (సమాధానము) చెప్పెదము; వినుము. తీవ్రమైన ఆకలి కలిగినప్పుడుభోజనము తప్ప మరొక పని ఏదీ ఇష్టము కాదు· భోజనానికి అలస్యము కూడ సహించ శక్యము కాకుండా ఉండును. అట్లే జన్మకు హేతువులైన కర్మల విషయమున చాల అరుచి, తెలిసికొనుటకు సాధనములైన శ్రవణాదులయందు చాల తొందర కలిగినచో అట్టి వివిదిష సంన్యాసమునకు హేతువు.

మూ. విద్వత్తాయా అవధిరుపదేశసాహస్ర్యామభిహితః—
దేహాత్మజ్ఞానవద్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే" (4.5) ఇతి
శ్రుతావపి :-"భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"
(ము.ఉ.2.2.8) ఇతి.

వ్యా. విద్వత్తకు అవధి ఉపదేశసాహస్రిలో (శంకర భగవత్పాద విరచితము) చెప్పబడినది.

దేహమే ఆత్మ అనెడు జ్ఞానము ఇంతవరకు ఎంత దృఢముగా ఉన్నదో అంత దృఢముగా దేహాత్మజ్ఞానమును బాధించే జ్ఞానము ఆత్మ విషయములో కలిగినవాడు వద్దన్నను ముక్తిని పొందును"

శ్రుతిలో కూడ చెప్పబడినది :- "పరావర మైన ఆ ఆత్మ సాక్షాత్కారము కలగగానే అట్లు కలిగినవాని హృదయగ్రంథిభిన్న మై పోవును. సర్వసంశయములు పటాపంచ లైపోవును కర్మలు క్షీణించును''.

మూ. పరమపి హైరణ్యగర్భాదికం పదమపరం యస్మాదసౌ పరావరః. హృదయే బుద్ధౌ సాక్షిణస్తాదాత్మ్యాధ్యాసః అనాద్యవిద్యా

నిర్మితత్వేన గ్రన్థివత్ దృఢసంశ్లేషరూపత్వాత్ గ్రన్థిరిత్యుచ్యతే. ఆత్మా సాక్షీ వా కర్తా వా ? సాక్షిత్వేఽప్యస్య బ్రహ్మత్వమస్తి వా న వా ? బ్రహ్మత్వేఽపి తద్బుద్ధ్యా వేదితుం శక్యం వా న వా? శక్యత్వేఽపి తద్వేదనమాత్రేణ ముక్తిరస్తి వా న వా ఇత్యాదయః సంశయాః. కర్మాణ్యనారబ్ధాన్యాగామి జన్మకారణాని. తదేతద్ గ్రన్థ్యాదిత్రయమవిద్యానిర్మితత్వాదాత్మదర్శనేన నివర్తతే.

వ్యా. ''పరమపి అవరం యస్మాత్ అసౌ పరావరః'' అని విగ్రహము. అత్యుత్తమ మని చెప్పబడే హిరణ్యగర్భాదిస్థానము కూడ దేనికంటె చాల చిన్నదో అది అని అర్థము''. సాక్షి యైన ఆత్మకు హృదయమునకు తాదాత్మ్యమును ఆరోపించుట అనగా అవి రెండు వేరైనను ఒకటే అని భావించుట హృదయగ్రంథి. ఇది అనాది యైన అవిద్యచేత ఏర్పడినది. ముడి వలె గట్టిగా బిగిసిపోయి ఉన్నది గాన దీనికి గ్రంథి అని పేరు ఆత్మ సాక్షిమాత్రమేనా లేక కర్తయా ? సాక్షియే అయినను ఇది బ్రహ్మయేనా కాదా ? బ్రహ్మయే అయినను ఆ బ్రహ్మను బుద్ధిచేత తెలిసికొనుటకు శక్య మగునా కాదా ? శక్యమైనను అట్లు తెలిసికొనుటచేత ముక్తి లభించునా లభించదా ఇత్యాదులు సంశయములు. ఇంకను ఫలము నిచ్చుటకు ప్రారంభించనివి, రాబోవు జన్మకు కారణ మైనవి కర్మలు. ఈ మూడును, అనగా హృదయగ్రంథి-సంశయ-కర్మలు అవిద్యచేత వచ్చినవే గాన ఆత్మజ్ఞానము కలగగానే అవి నివర్తించును అని పై శ్రుతి వాక్యమునకు అర్థము.

మూ. స్మృతావప్యయమర్థ ఉపలభ్యతే-

> ''యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
> హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి న నిబధ్యతే''
>
> (భ.గీ. 18.17) ఇతి,

వ్యా. స్మృతిలో కూడ ఈ విషయము కనబడుచున్నది :-

"ఎవని స్వరూపము అహంకారముచేత కప్పబడదో, ఎవని బుద్ధి లిప్తము (పూయబడినది) కాదో అతడు ఈ లోకముల నన్నింటినీ చంపినా కూడ చంపిన పాపమునుకాని బంధమును కాని పొందడు."

ము. యస్య బ్రహ్మవిదో భావః సత్తా, స్వభావః, ఆత్మా' నాహంకృతః అహంకారేణ తాదాత్మ్యాధ్యాసాత్ నాచ్ఛాదితః, బుద్ధి లేపః సంశయః తదభావే త్రైలోక్యవధేనాపి న బధ్యతే, కిముత అన్యేన కర్మణేత్యర్థః.

నన్వేవం సతి వివిదిషాసంన్యాసఫలేన తత్త్వజ్ఞానేనైవాగామి జన్మనో వారితత్వాత్, వర్తమానజన్మశేషస్య భోగమన్తరేణ వినా శయితుమశక్యత్వాత్ కిమనేన విద్వత్సంన్యాసప్రయాసేనేతి చేత్, నైవమ్; విద్వత్సంన్యాసస్య జీవన్ముక్తిహేతుత్వాత్. తస్మాద్వేదనాయ యథా వివిదిషాసంన్యాస ఏవం జీవన్ముక్తయే విద్వత్సంన్యాసః సంపాదనీయః. ఇతి విద్వత్సంన్యాసః. 2

వ్యా. యస్య ఏ బ్రహ్మవేత్తయొక్క, భావః=సత్త (స్థితి)= స్వభావము=ఆత్మ, నాహంకృతః=అహంకారముచేత తాదాత్మ్యాధ్యాస ద్వారా అనగా అంతఃకరణమే ఆత్మ, ఆత్మయే అంతఃకరణ మను ఆరోపము చేత, లోపల ఆచ్ఛాదింప బడనేదో బుద్ధికి లేప మనగా సంశయము. ఈ రెండును లేనివాడు మూడులోకాలను వధించినను బద్ధుడు కాడు ఇంక ఇతరకర్మలచేత బద్ధుడు కాడని వేరే చెప్పవలెనా అని అర్థము.

(ఆశంక) వివిదిషాసంన్యాసమునకు ఫలమైన (అనగా దానివలన కలుగు) తత్త్వజ్ఞానమే రాబోవు జన్మలను నివారించును; నడచుచున్న జన్మకు సంబంధించిన కర్మశేషము అనుభవించకుండా నశింపచేయ శక్యము కాదు. ఇక ఈ విద్వత్సంన్యాసమును గ్రహించే ప్రయాస ఎందుకు? (సమాధానము) అట్లనుటకు వీలు లేదు. ఎందుచేత ననగా-విద్వత్సంన్యాసము జీవన్ముక్తిని కలిగించును. అందుచే జ్ఞానము కొరకు వివిదిషాసంన్యాసమును

సంపాదించి నట్లు జీవన్ముక్తికొరకు విద్వత్సంన్యాసమును సంపాదించవలెను ఇది విద్వత్సంన్యాసము 2

## 3. జీవన్ముక్తిః

మూ. అథ కేయం జీవన్ముక్తిః ? కిం వా తత్ర ప్రమాణమ్? కథం వా తత్సిద్ధిః? సిద్ధౌ వా కిం ప్రయోజనమ్? ఇతి చేత్, ఉచ్యతే-జీవతః పురుషస్య కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖాదిలక్షణశ్చిత్తధర్మః క్లేశరూపత్వాద్బన్ధో భవతి, తస్య నివారణం జీవన్ముక్తిః.

నన్వయం బన్ధః సాక్షిణో నివార్యతే, కిం వా చిత్తాత్? నాద్యః, తత్త్వజ్ఞానేనైవ నివారితత్వాత్, న ద్వితీయః, అసంభవాత్. యదా తు జలాత్ ద్రవత్వం నివార్యేత వహ్నేర్వా ఉష్ణత్వం తదా చిత్తాత్ కర్తృత్వాదినివారణసంభవః, స్వాభావికత్వం తు సమానం సర్వత్ర. మైవమ్, అత్యన్తికనివారణాసంభవేఽపి అభిభవస్య సంభవాత్. యథా జలగతం ద్రవత్వం మృత్తికామేలనేనాభిభూయతే, వహ్నేరౌష్ణ్యం మణిమన్త్రాదినా తథా సర్వాశ్చిత్తవృత్తయః యోగాభ్యాసేనాభిభవితుం శక్యన్తే.

వ్యా. జీవన్ముక్తి అనగా ఏమి ? జీవన్ముక్తి అనేది ఉన్న దని చెప్పుటకు ప్రమాణ మేమి ? అది ఎట్లు సిద్ధించును ? అది సిద్ధించినా ప్రయోజన మేమి ? చెప్పుచున్నాము వినుము. జీవించి ఉన్న పురుషునకు "నేను కర్తను, నేను భోక్తను, నాకు సుఖము వచ్చినది; దుఃఖము వచ్చినది" ఇత్యాదివిధమున చిత్తధర్మము కలుగుచుండును. అది క్లేశరూపము గాన దానివలన బంధము కలుగుచున్నది. దానిని నివారించుకొనుటయే జీవన్ముక్తి. (ఆశంక). ఈ బంధము సాక్షినుండి (ఆత్మనుండి) నివారింపబడుచున్నదా లేక చిత్తమునుండియా? మొదటి పక్షము కుదరదు; తత్త్వజ్ఞానము చేతనే సాక్షినుండి ఈ బంధము నివారింప బడినది కదా? రెండవ పక్షము కూడ కూదరదు; ఎందుచేత ననగా అది అసంభవము. జలములో

నుండి ద్రవత్వమును, అగ్నినుండి ఉష్ణత్వమును వేరు చేయగలిగిననాడు చిత్తమునుండి కర్తృత్వాదులను తొలగింపవచ్చును ! స్వాభావికత్వము అన్నింటికీ సమానమే. అనగా ద్రవత్వోష్ణత్వములు జలవహ్నులకు ఎట్లు స్వాభావికములో కర్తృత్వాదికములు చిత్తమునకు కూడ స్వాభావికములు అందుచేత ద్రవత్వాదులు జలాదులకు స్వాభావికములు గాన వాటిని తొలగించుటకు శక్యము కాకపోయినను చిత్తమునకు కర్తృత్వాదులు స్వాభావికములు కావు గాన వాటిని తొలగించవచ్చును అని సమాధానము చెప్పుట కుదరదు అని అర్థము (సమాధానము) అట్లన కూడదు కర్తృత్వాదులను పూర్తిగా తొలగించుట శక్యముకాకపోయినను వాటిని అణచి వేయవచ్చును జలములో ఉన్న ద్రవత్వమును జలములో మట్టి కలపుటచే నిరోధించి నట్లు, అగ్నిలోని ఉష్ణత్వమును మణిమంత్రాదులచేత అణచి నట్లు యోగాభ్యాసముచేత చిత్తవృత్తులను అన్నింటిని అణచివేయవచ్చును.

మూ. నను ప్రారబ్ధం కర్మ కృత్స్నావిద్యాతత్కార్యనాశనే ప్రవృత్తస్య తత్త్వజ్ఞానస్య ప్రతిబన్ధం కృత్వా స్వఫలదానాయ దేహేన్ద్రియాదికమవస్థాపయతి. న చ సుఖదుఃఖాదిభోగశ్చిత్తవృత్తిం వినా సంపాదయితుం శక్యతే, తతః కథమభిభవః? మైవమ్; అభిభవసాధ్యాయా జీవన్ముక్తేరపి సుఖాతిశయరూపత్వేన ప్రారబ్ధఫల ఏవాన్తర్భావాత్. తర్హి కర్మైవ జీవన్ముక్తిం సంపాదయిష్యతి, మా భూత్పురుషప్రయత్న ఇతి చేత్; కృషివాణిజ్యాదావపి సమానః పర్యనుయోగః. కర్మణః స్వయమదృష్టరూపస్య దృష్టసాధనసంపత్తిమన్తరేణ ఫలజననాసమర్థత్వాదపేక్షితః కృష్యాదౌ పురుషప్రయత్న ఇతి చేత్, జీవన్ముక్తావపి సమం సమాధానమ్.

వ్యా. (ఆశంక) సమస్తమైన అవిద్యను, అవిద్యాకార్యములను నశింపచేయుటకై ప్రవర్తించుచున్న తత్త్వజ్ఞానమునకు ప్రతిబంధమును కల్పించి, ప్రారబ్ధకర్మ తన ఫలమును ఇచ్చుటకై దేహేంద్రియాదులను నిలబెట్టుచున్నది. చిత్తవృత్తి లేనిచో సుఖదుఃఖాదిభోగమును సంపాదించుట

కుదురదు కదా ? అటువంటప్పుడు చిత్తవృత్తులను అణచుట ఎట్లు కుదురును ? (సమా) అట్లనుటసరి కాదు. చిత్తవృత్తులను అణగద్రొక్కుట ద్వారా సాధించవలసి ఉన్న జీవన్ముక్తి కూడ ఒకవిధమైన సుఖాతిశయమే గాన అది కూడ ప్రారబ్ధఫలమునందే అంతర్గతము అట్లైనచో- "కర్మయే జీవన్ముక్తిని సంపాదించిపెట్టును కదా; ఇంక పురుషప్రయత్న మెందుకు?" అని ప్రశ్నించరాదు. ఇట్టి ప్రశ్నను కృషి, వాణిజ్యము మొదలైనవాటి విషయములో కూడ వేయవచ్చునుకదా ? "పైకి కనబడని కర్మ కనబడే సాధనసంపత్తి లేకుండా ఫలమును పుట్టించజాలదు; అందుచేత కృష్యాదులలో పురుషప్రయత్నము అవశ్యక మగుచున్నది" అని సమాధానము చెప్పినచో అదే సమాధానము జీవన్ముక్తివిషయములో కూడ వర్తించును.

మూ. సత్యపి పురుషప్రయత్నే కృష్యాదేః ఫలపర్యవసానం యత్ర న దృశ్యతే తత్ర ప్రబలేన కర్మాన్తరేణ ప్రతిబన్ధః కల్పనీయః. తచ్చ ప్రబలం కర్మ స్వానుకూలవృష్ట్యభావాదిరూపాం దృష్టసామగ్రీం సంపాద్యైవ ప్రతిబధ్నాతి. స చ ప్రతిబన్ధో విరోధినా ప్రబలతరేణోత్తమ్భకేన కారీరీష్ట్యాదిరూపేణ కర్మణాపనీయతే. తచ్చ కర్మ స్వానుకూలాం వృష్టిలక్షణాం దృష్టసామగ్రీం సంపాద్యైవ ప్రతిబన్ధమపనయతి. కిం బహునా? ప్రారబ్ధకర్మణ్యేవాత్యన్తభక్తేన భవతా యోగాభ్యాసరూపస్య పురుషప్రయత్నస్య వైయర్థ్యం మనసాపి చిన్తయితుమశక్యమ్.

వ్యా. పురుషప్రయత్నమున్నను కృష్యాదులవలన ఫలము లభించనప్పుడు ప్రబలమైన కర్మాంతరముచే ప్రతిబంధ మేర్పడినది అని చెప్పవలసి ఉండును. ఆ ప్రబలమైన కర్మ తనకు (కర్మకు) అనుకూలమైన వర్షాభావమువంటి కనబడే సామగ్రిని సంపాదించి తద్వారా ప్రతిబంధము కలిగించును, ఆ కర్మకంటె కూడ ప్రబలమైన, దానికి విరోధి యైన, కృషికర్మకు సహాయక మైన కారీరీష్టి (వర్షములు కురిపించే యాగవిశేషము)

మొదలైన కర్మచే ఆ ప్రతిబంధమును తొలగించుకొనవచ్చును. ఈ కర్మ తనకు అనుకూలమైన వర్షము అనే కనబడే సామగ్రిని సమకూర్చియే ప్రతిబంధమును తొలగించును వేయేల? నీకు ప్రారబ్ధకర్మమీద ఎంత భక్తియున్నను యోగాభ్యాసరూప మైన పురుష ప్రయత్నము వ్యర్థమగు నని మనసా కూడ నీవు చింతింప శక్యము కాదు.

మూ. అథవా ప్రారబ్ధం కర్మ యథా తత్త్వజ్ఞానాత్ ప్రబలం తథా తస్మాదపి కర్మణో యోగాభ్యాసః ప్రబలోఽస్తు. తథా చ యోగినాముద్దాలకవీతహవ్యాదీనాం స్వేచ్ఛయా దేహత్యాగ ఉపపద్యతే. యద్యప్యల్పాయుషామస్మాకం తాదృశో యోగో న సంభవతి, తథాపి కామాదిచిత్తవృత్తినిరోధమాత్రే యోగే కో నామ ప్రయాసః? యది శాస్త్రీయస్య ప్రయత్నస్య ప్రాబల్యం నాఙ్గీక్రియతే తదా చికిత్సామారభ్య మోక్షశాస్త్రపర్యన్తానాం సర్వేషామానర్థక్యం ప్రసజ్యేత. న హి కదాచిత్ కర్మఫలవిసంవాదమాత్రేణ దౌర్బల్యమాపాదయితుం శక్యమ్. అన్యథా కాదాచిత్కం పరాజయం దృష్ట్వా సర్వైర్భూపాలైః గజాశ్వాదిసేనా ఉపేక్ష్యేత. అత ఏవానన్దబోధాచార్యా ఆహుః–"న హ్యజీర్ణభయా దాహారపరిత్యాగః, భిక్షుకభయాద్వా స్థాల్యనధిశ్రయణమ్; యూకాభయాద్వా ప్రావరణపరిత్యాగః" ఇతి.

వ్యా. లేదా - తత్త్వజ్ఞానముకంటె ప్రారబ్ధము ప్రబల మైనట్లే, ప్రారబ్ధకర్మకంటె యోగాభ్యాసము ప్రబల మని అంగీకరించెదము. అందుచేతనే ఉద్దాలకుడు-వీతహవ్యుడు మొదలైన యోగులు స్వేచ్ఛగా దేహమును పరిత్యజించగలిగిరి మనము అల్పాయుర్దాయవంతుల మగుటచే మనకు అట్టి యోగము శక్యము కాకపోయినను కామాదిరూప మగు చిత్తవృత్తిని నిరోధించుట అనే యోగమును అభ్యసించుటలో ప్రయాస ఏమున్నది? శాస్త్రవిహితమైన ప్రయత్నము (ప్రారబ్ధకర్మకంటె) ప్రబలము అని అంగీకరించనిచో చికిత్స మొదలు మోక్షశాస్త్రమువరకు ఉన్న అన్ని శాస్త్రములు

వ్యర్థము లని చెప్పవలసి వచ్చును. చేసినప్రయత్నము (కర్మ) ఎప్పుడో ఒకమారు విఫలమైనంతమాత్రాన పురుషప్రయత్నము దుర్బల మని చెప్పుట యుక్తము కాదు. అట్లైనచో ఒకమారు ఓడిపోయినాము కదా అని రాజులు అందరు గజాశ్వాదిసైన్యసంపాదనమును ఉపేక్షించవలసి ఉండును అందుచేతనే ఆనందబోధాచార్యులు-"అజీర్ణము కలుగుననే భయమువలన ఆహారమును త్యజించరు కదా? బిచ్చగాళ్లకు భయపడి అన్నముగిన్నె పొయ్యిపై ఎక్కించుట మానివేయరు కదా? పేలకు భయపడి కంబళిని త్యజించరు కదా?" అని చెప్పినారు.

మూ. శాస్త్రీయప్రయత్నస్య ప్రాబల్యం వసిష్ఠరామసంవాదే విస్పష్టమవగమ్యతే "సర్వమేవేహ హి సదా" ఇత్యారభ్య "తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ" ఇత్యన్తేన గ్రన్థేన.

వసిష్ఠః- "సర్వమేవేహ హి సదా సంసారే రఘునన్దన
సమ్యక్ప్రయుక్తాత్సర్వేణ పౌరుషాత్సమవాప్యతే" 1

సర్వం పుత్రవిత్తస్వర్గలోకబ్రహ్మలోకాది ఫలమ్. పౌరుషం పుత్రకామేష్టికృషివాణిజ్యజ్యోతిష్టోమబ్రహ్మోపాసనాలక్షణః ప్రయత్నః

వ్యా శాస్త్రీయప్రయత్నము ప్రబల మను విషయము వసిష్ఠరామ సంవాదములో(లఘుయోగవాసిష్ఠములోని ముముక్షువ్యవహారప్రకరణము అనే చతుర్థసర్గలో) "సర్వమేవేహ హి సదా" మొదలు "తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ" వరకు ఉన్న గ్రంథములో స్పష్టముగా చెప్పబడినది.

వసిష్ఠుడు :- "రామా! ఈ లోకములో ప్రతిఒక్కడూ పురుష ప్రయత్నమును బాగుగా నిర్వర్తించినచో ఎల్లప్పుడూ, అన్నింటినీ పొంద గలుగును" 1

సర్వమ్ = పుత్రులు, ధనము, స్వర్గలోకము, బ్రహ్మలోకము మొదలైన ఫలమును, పౌరుషమ్ = పుత్రకామేష్టి, కృషి-వాణిజ్యములు,

జ్యోతిష్టోమము, బ్రహ్మోపాసనము అను పురుషప్రయత్నము. ఇది వరుసగా పుత్ర-ధన-స్వర్గ-బ్రహ్మలోకములను ఇచ్చును.

మూ. "ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్
తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్. 2

ఉచ్ఛాస్త్రం పర ద్రవ్యాపహారపరస్త్రీగమనాది. శాస్త్రితం నిత్యనైమిత్తికానుష్ఠానాది. అనర్థః నరకః అర్థేషు స్వర్గాదిషు పరమో మోక్షః పరమార్థః.

వ్యా. "పౌరుషము (పురుషప్రయత్నము) శాస్త్రవిరుద్ధము, శాస్త్ర సంమతము అని రెండు విధములు. శాస్త్రవిరుద్ధ మైనది అనర్థహేతువు. శాస్త్రసంమత మైనది పరమార్థమునకు ఉపకరించును".

ఉచ్ఛాస్త్రమ్ :- పరద్రవ్యాపహారము, పరస్త్రీగమనము మొదలైనది. శాస్త్రితమ్=నిత్యనైమిత్తికానుష్ఠానాదికము. అనర్థ మనగా నరకము, స్వర్గము మొదలైన ప్రయోజనములలో (అర్థములలో) పరమము (శ్రేష్ఠము) మోక్షము; అదే పరమార్థము.

మూ. "ఆ బాల్యాదలమభ్యస్తైః శాస్త్రసత్సఙ్గమాదిభిః
గుణైః పురుషయత్నేన సోఽర్థః సంపాద్యతే హితః" 3

వ్యా."బాల్యము మొదలుకొని బాగుగా అభ్యసించబడిన శాస్త్రము, సత్సంగము మొదలైన గుణములతో కూడినవానిచేత పురుషయత్నము ద్వారా హితమైన ఆ అర్థము (ప్రయోజనము) సంపాదించబడును".

అలమ్=సంపూర్ణముగా, బాగుగా అని అర్థము. గుణైః=గుణములతో, "యుక్తేన" అని అధ్యాహారము. హితః=శ్రేయోరూప మైనది.

మూ. శ్రీరామః- "ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా
మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్" 4 ఇతి

వాసనా ధర్మాధర్మరూపా జీవగతాః సంస్కారాః.

వ్యా. శ్రీరాముడు :- "ఓ! మహాముని! పూర్వమునుంచి ఉన్న వాసనాసముదాయము నన్ను ఎట్లు నియమించునో అట్లే నేను ఉంటున్నాను. దీనుడ నైన నా చేతిలో ఏ మున్నది ?

వాసనాః = జీవునిలో ఉన్న ధర్మాధర్మరూపము లైన సంస్కారములు.

మూ. వసిష్ఠః—"అత ఏవ హి హే రామ శ్రేయః ప్రాప్నోషి శాశ్వతమ్
స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా" 5

యతో వాసనాపరతన్త్రో భవానత ఏవ హి పారతన్త్ర్యనివారణాయ స్వోత్సాహసంపాదితో మనోవాక్కాయజన్యః పురుషవ్యాపారోఽపేక్షితః

వ్యా. వసిష్ఠుడు : "ఓ! రామా అందువలననే నీవు నీ ప్రయత్నము చేత చేయబడిన పౌరుషముచేత (పురుషకర్మచేత) నే శాశ్వతమైన శ్రేయస్సును పొందుదువు, మరొక విధముగా పొందజాలవు".

నీవు వాసనలకు అధీనుడవై ఉన్నావు. అందువలననే నీవు ఆ విధముగా వాటికి లొంగి పోకుండా ఉండవలె నన్నచో నీవు ఉత్సాహవంతుడవై మనోవాక్కాయములతో పురుషవ్యాపారముచేయుట అవసరము

మూ. "ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవాశుభశ్చ తే
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోఽథవా" 6

కిం ధర్మాధర్మావుభావపి త్వాం నియోజయతః ఉతైకతర ఇతి వికల్పః. ఏకతరపక్షేఽపి శుభః అశుభో వా ఇత్యర్థాత్సిద్ధో వికల్పః.

వ్యా. "రామా! నీలో శుభము, అశుభము అని రెండు విధము లైన పురాతన మైన వాసనాసముదాయ మున్నది. లేదా ఆ రెండింటిలో ఒకటే ఉన్నది''.

ధర్మాధర్మములు రెండూ నిన్ను ప్రేరేపించుచున్నవా లేదా వాటిలో ఒక్కటే ప్రేరేపించుచున్నదా అని వికల్పము. ఒకటే అనే పక్షములో

కూడ అది శుభవాసన యైన ధర్మమో, అశుభవాసన యైన అధర్మమో అను వికల్పము అర్థతః (అర్థమును బట్టి) సిద్ధించుచున్నది.

మూ. "వాసనౌఘేన శుద్ధేన తత్ర చేదపనీయసే
తత్క్రమేణాశు తేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్" 7

తత్ర తేషు పక్షేషు. తత్త్వర్హి. తేనైవ క్రమేణ శుభవాసనాప్రాపితే నైవాచరణేన ప్రయత్నాన్తరనిరపేక్షేణ. శాశ్వతం పదం మోక్షమ్.

వ్యా. "పైన చెప్పిన నాలుగు పక్షములలో శుద్ధమైన వాసనా సముదాయమే నిన్ను ప్రేరేపించుచున్నచో ఆ శుభవాసన ద్వారానే నీవు శీఘ్రముగా శాశ్వతమైన పదమును (మోక్షమును) పొందగలవు".

తత్ర = ఆపక్షాలలో, తత్ = అట్లయితే, తేనైవ క్రమేణ = ఇతర ప్రయత్నముల అపేక్ష లేని శుభవాసనల ద్వారా లభించిన ఆచరణము చేతనే, శాశ్వతం పదమ్ = మోక్షమును.

మూ. "అథ చేదశుభో భావస్త్వాం యోజయతి సంకటే
ప్రాక్తనస్తదసౌ యత్నాజ్జేతవ్యో భవతా స్వయమ్" 8

భావో వాసనా. తత్త్వర్హి. యత్నః అశుభవిరోధిశాస్త్రీయధర్మానుష్ఠానమ్. తేన స్వయం జేతవ్యః, న తు యుద్ధే మృత్యుముఖేనేవ పురుషాన్తరముఖేన జేతుం శక్యః.

వ్యా "అట్లుకాక ప్రాచీనమైన అశుభసంస్కారము నిన్ను చెడ్డ కార్యము చేయుటకు ప్రేరేపించుచున్నచో అప్పుడు దానిని నీవే స్వయముగా ప్రయత్నపూర్వకముగ జయించవలసి ఉండును"

భావః = వాసన, తత్ = అట్లయితే, యత్నః = అశుభమునకు విరోధియైన శాస్త్రీయధర్మముల అనుష్ఠానము దానిచేత స్వయముగానే జయించవలెను కాని యుద్ధములో శత్రువును మృత్యుముఖమున (చంపుటద్వారా) జయించినట్లు ఇతరపురుషుల సాహాయ్యము ద్వారా జయింప శక్యము కాదు.

ఇక్కడ "మృత్యుముఖేనేవ"కు బదులు "భృత్యముఖేనేవ" అను పాఠము ఉండి ఉండును అనగా భృత్యులైన సైనికుల ద్వారా శత్రువులను జయించి నట్లు అని అర్థము

మూ. "శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి" 9

ఉభయపక్షే తు శుభభాగస్య ప్రయత్నైరపేక్ష్యేఽపి అశుభ భాగం శాస్త్రీయప్రయత్నేన నివార్య శుభమేవ తస్య స్థానే సమాచరేత్.

వ్యా. "శుభాశుభమార్గములలో ప్రవహించుచున్న వాసనానదిని పురుష ప్రయత్నముచేత శుభమార్గములో ప్రవహించునట్లు చేయవలెను".

ఉభయపక్షములో అనగా శుభసంస్కారములు, అశుభసంస్కారములూ కూడ ప్రేరేపించుచున్న పక్షములో, శుభభాగమును గూర్చి ప్రయత్నమేమీ చేయ పని లేకపోయినను అశుభభాగమును మాత్రము శాస్త్రీయమైన ప్రయత్నముచేత నివారించి దాని స్థానమునందు శుభమునే ఆచరించవలెను.

మూ. "అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయ
స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర" 10

అశుభేషు పరస్త్రీద్రవ్యాదిషు. శుభేషు శాస్త్రార్థదేవతాధ్యానాదిషు. పురుషార్థేన పురుషప్రయత్నేన. బలేన ప్రబలేన.

వ్యా. "బలవంతులలో శ్రేష్ఠుడా! అశుభములయందు ప్రవర్తించుచున్న నీ మనస్సును ప్రబలమైన పురుషప్రయత్నము చేసి శుభకార్యములందు ప్రవర్తింపచేయుము".

అశుభేషు = పరస్త్రీపరధనాదులందు, శుభేషు = శాస్త్రార్థచింతనము, దేవతాధ్యానము మొదలైనవాటియందు, పురుషార్థేన = పురుషప్రయత్నముచేత, బలేన = ప్రబలమైన.

మూ. "అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్
జన్తోశ్చిత్తం తు శిశువత్ తస్మాత్తచ్చాలయేద్బలాత్". 11

యథా శిశుర్మృద్భక్షణాన్నివార్య ఫలభక్షణే యోజ్యతే, మణి ముక్తాద్యాకర్షణాన్నివార్య కన్దుకాద్యాకర్షణే యోజ్యతే తథా చిత్తమపి సత్సఙ్గేన దుఃసఙ్గాద్విపరీతవిషయాత్ నివారయితుం శక్యమ్.

వ్యా. "మానవుని చిత్తము, చిన్న శిశువు వలె, అశుభమునుండి దూరము చేయబడినపుడు దానినుండి మరలి రెండవదైన శుభము వైపు వెళ్లును అందుచేత దానిని బలాత్కారముగా అశుభమునుండి నివారించ వలెను".

మట్టి తినబోతూన్న శిశువును దానినుండి నివారించి ఫలము భక్షించు నట్లు ఎట్లు చేయవచ్చునో, మెడలోని మణులను ముత్యాలహారము మొదలైన వాటిని లాగ ప్రయత్నించుచున్నపుడు నివారించి బంతి మొదలైన ఆట వస్తువులను లాగు నట్లు ఎట్లు చేయవచ్చునో అట్లే చిత్తమునుకూడ సత్సంగమునందు ప్రవర్తింపచేసి, చెడ్డ ఫలముల నిచ్చే దుష్టసహవాసము నుండి మరల్చ వచ్చును.

మూ. "సహసా న్యసేనాశు న ద్రాగితి శనైః శనైః
పౌరుషేణ ప్రయత్నేన లాలయేచ్చిత్తబాలకమ్" 12

చపలస్య పశోర్బన్ధస్థానే ప్రవేశనాయ ద్వావుపాయౌ భవతః–హరితతృణప్రదర్శనం, కణ్డూయనాదికమ్, వాక్పారుష్యం, దణ్డాది భర్త్సనం చేతి, తత్రాద్యేన సహసా ప్రవేశ్యతే, ద్వితీయేనేతస్తతో ధావన్ శనైః శనైః ప్రవేశ్యతే. తథా శత్రుమిత్రాదిసమత్వబోధనం ప్రాణాయామప్రత్యాహారాదిపురుషప్రయత్నశ్చేత్యేతౌ ద్వౌ చిత్తశాన్త్యుపాయౌ. తత్రాద్యేన మృదుయోగేన శీఘ్రం లాలయేత్. ద్వితీయేన హఠయోగేన ద్రాగితి న లాలయేత్, కిం తు శనైః శనైః.

వ్యా. "చిత్త మనే పసిపిల్లవానిని సమతను బోధించుట అనే బుజ్జగింపు ద్వారా శీఘ్రముగా లాలన చేయవలెను. హఠయోగాది పురుష ప్రయత్నముచేత మాత్రము శీఘ్రముగా (బలవంతముగా) కాక మెల్ల మెల్లగా లాలనచేయవలెను".

లొంగని పశువును పశుశాలలోనికి ప్రవేశ పెట్టుటకు రెండు ఉపాయములు ఉన్నవి - లేతపచ్చగడ్డి చూపుట, దాని శరీరమును గోకుట మొదలైనవి ఒక ఉపాయము. పరుషముగా అరచుచు దండాదులచేత భయపెట్టుట మరొక ఉపాయము. మొదటి ఉపాయముచేత దానిని శీఘ్రముగా ప్రవేశ పెట్టవచ్చును. ఇటూ అటూ పరుగెత్తుచున్న దానిని రెండవ ఉపాయముచేత మెల్లమెల్లగా ప్రవేశ పెట్టుటకు వీలగును. అట్లే చిత్తశాంతికి శత్రుమిత్రాదుల విషయమున సమత్వమును బోధించుట, ప్రాణాయామప్రత్యాహారాదిపురుషప్రయత్నము అను రెండు ఉపాయములు ఉన్నవి. వాటిలో మొదటిదైన మృదుయోగముచేత శీఘ్రముగా లాలన చేయవచ్చును. రెండవ ఉపాయ మైన హఠయోగముచేత తొందరగా కాక మెల్లమెల్లగా లాలన చేయవలెను

మూ. "ద్రాగభ్యాసవశాద్యాతి యదా తే వాసనోదయమ్
తదాభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వమరిమర్దన" **13**

మృదుయోగాభ్యాసాత్ శీఘ్రమేవ సద్వాసనోదయే సతి సాఫల్యమభ్యాసస్య మన్తవ్యమ్, న త్వల్పకకాలత్వేనాసంభావనా శఙ్కనీయా.

వ్యా. "శత్రుసంహారకుడ వైన రామా! అభ్యాసవశముచేత శీఘ్రముగా మంచి వాసన ఉదయించినపుడు నీ అభ్యాసము సఫలమైన దని తెలిసి కొనుము".

మృదుయోగమును అభ్యసించగా శీఘ్రముగానే సద్వాసన ఉదయించి నపుడు అభ్యాసము సఫల మైన దని తెలిసికొనవలెను. అంతే కాని ఇంత అల్పకాలములో సద్వాసన ఎట్లు కలుగును అని శంకించకూడదు.

మూ. "సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర
శుభాయాం వాసనావృద్ధౌ తాత దోషో న కశ్చన" **14**

శుభవాసనా అభ్యస్యమానా సంపూర్ణా న వేతి యదా సందేహః తదాపి శుభామభ్యస్యేదేవ. తద్యథా సహస్రజపే ప్రవృత్తస్య దశమీ శతసంఖ్యా యదా సందిగ్ధా తదా పునరపి శతం జపేత్. అసంపూర్తౌ సంపూర్తిః ఫలిష్యతి. సంపూర్తౌ తు తద్వృద్ధ్యా న సహస్రజపో దుష్యతి తద్వత్.

వ్యా, "శుభవాసన పూర్తిగా కలిగినదా లేదా అని సందేహ మున్నను శుభవాసననే అభ్యసించుము, నాయనా ! శుభవాసనవృద్ధి పొందినచో దోష మేమీ లేదు".

శుభవాసనను అభ్యసించు నపుడు అది సంపూర్ణమా కాదా అని సందేహము కలుగవచ్చును. అయినను శుభవాసనను అభ్యసించుచునే ఉండవలెను. ఎట్లనగా సహస్రజపము చేయవలెనని సంకల్పించి కూర్చున్న వానికి పదవ శతసంఖ్యను పూర్తి చేసితినా లేదా అని సందేహము కలిగి నప్పుడు అతడు మరల శతజపము చేయవలెను పదవ శతసంఖ్య చేయక పోవుటచే సహస్రజపము అసంపూర్తిగా ఉన్న పక్షమున అది సంపూర్ణ మయి ఆ ము సిద్ధించును. అది పూర్తియైనచో అధికముగా చేయుట వలన సహస్ర జపానికి లోప మేమీ రాదు; అట్లే ఇది కూడ.

మూ. "అవ్యుత్పన్నమనా యావద్భవానజ్ఞాత తత్పదః
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర. 15
తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా
శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యో వాసనౌఘో నిరోధినా." 16

వ్యా. "నీ మనస్సుకు పూర్తి యైన విషయావబోధనశక్తి లేక ఆ పరమపదమును ఎంత వరకు తెలిసికొనజాలవో అంతవరకు గురువు చేసిన ఉపదేశముచేతను, శాస్త్రముచేతను, ఇతర ప్రమాణములచేతను నిర్ణయింపబడిన విధముగ చేయుచుండుము".

"పిమ్మట మనస్సులోనికషాయము లన్నీ (మలములన్నీ) పక్వములై నశించిన తరువాత నీకు పరమార్థము తెలియును. అప్పుడు అన్ని వృత్తులను నిరోధించిన నీవు ఈ శుభవాసనాసముదాయమును కూడ పరిత్యజింపవలెను.

మూ "యదతిసుభగమార్యసేవితం త
చ్ఛుభమనుసృత్య మనోజ్ఞభావశుద్ధ్యా,
అధిగమయ పదం సదా విశోకం
తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ". 17 ఇతి.

స్పష్టోఽర్థః. తస్మాద్యోగాభ్యాసేన కామాద్యభిభవసంభవాత్ జీవన్ముక్తౌ న వివదితవ్యమ్. ఇతి జీవన్ముక్తిస్వరూపమ్. 3

వ్యా. "మనోహర మైన పరిశుద్ధ మైన భావముతో నీవు చాల అంద మైనది. ఆర్యులు అనుసరించేదీ అయిన శుభమును (శుభవాసనాజాలమును) అనుసరించి ఎప్పుడూ ఏ శోకము లేని ఉత్తమ పదమును సంపాదించు కొనుము. పిమ్మట ఆ శుభవాసనాజాలమును కూడ విడచి సుఖముగా (చక్కగా ఉండుము." పై శ్లోకాల అర్థముస్పష్టము. అందువలన యోగాదులను అభ్యసించుటచేత కామాదులను అణగద్రొక్కుటకు శక్య మగును గాన జీవన్ముక్తి అనేది ఉన్నదా అని సందేహించ పని లేదు. ఇది జీవన్ముక్తి స్వరూపము. ౩

## 4. జీవన్ముక్తివిషయమున ప్రమాణములు

మూ. శ్రుతిస్మృతివాక్యాని జీవన్ముక్తిసద్భావే ప్రమాణాని. తాని చ కఠవల్ల్యాదిషు పర్యన్తే. తత్ర "విముక్తశ్చ విముచ్యతే" (5.1.) ఇతి కఠవల్ల్యామ్. జీవన్నేవ దృష్టబన్ధనాత్ కామాదేః విశేషేణ ముక్తఃసన్ దేహపాతే భావిబన్ధాత్ విశేషేణ ముచ్యతే. వేదనాత్ ప్రాగపి శమదమాదిసంపాదనేన కామాదిభ్యో ముచ్యత ఏవ; తథా వ్యుత్పన్నానాం కామాదీనాం తత్ర ప్రయత్నేన నిరోధః. అత్ర తు ధీవృత్త్యభావాదనుత్ప త్తిరేవ. తతో విశేషేణేత్యుచ్యతే. తథా ప్రలయే దేహపాతే చ సతి కంచిత్కాలం భావిదేహబన్ధాను చ్యతే;అత్ర త్వాత్యన్తికో మోక్ష ఇత్యభిప్రేత్య విశేషేణేత్యుక్తమ్.

వ్యా. జీవన్ముక్తి అనేది ఉన్నదనుటకు శ్రుతిస్మృతి వాక్యములు ప్రమాణములు. అవి కఠవల్ల్యాదులలో ఉన్నవి. ''విముక్తశ్చ విముచ్యతే'' ''విముక్తుడై విముక్తుడగును'' అని కఠవల్లిలోని వాక్యము. ప్రత్యక్షముగా కనబడుచున్న కామాదిబంధమునుండి జీవించి ఉండగానే విశేషముగ ముక్తుడై దేహపాతానంతరము రాబోవు బంధమునుండి విశేషించి ముక్తుడగును. జ్ఞానము కలుగుటకు పూర్వమే శమదమాదులను సంపాదించుకొనుటచేత కామాదులనుండి విముక్తుడగుచునే ఉన్నాడు. ఐనను, అప్పుడు పుట్టుచున్న కామాదులను ప్రయత్నముచేత నిరోధించుకొనుచుండును. దీనిలో, అనగా జీవన్ముక్త్యవస్థలో అయితే మనః ప్రవృత్తి ఉండదు గాన కామాదులు పుట్టనే పుట్టవు. అందుచేతనే "విముక్తశ్చ'' అను పదములో విశేషముగా అని చెప్పబడినది ''విశేషేణ ముక్తః విముక్త'' అని దాని అర్థము. అట్లే ప్రలయమునందు, దేహపాతము జరిగిన పిమ్మట కూడ కొంత కాలము భావిదేహబంధమునుండి విముక్తుడగును. కాని దీనిలో, అనగా విదేహముక్తిలో, ఆత్యంతికమైన, నిత్యమైన మోక్షము కలుగును అందుచేతనే ''విముచ్యతే'' అనునపుడు ''విశేషేణ ముచ్యతే'' అని ''విశేషముగా'' అని చెప్పబడినది.

మూ. బృహదారణ్యకే పఠ్యతే–
"యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే"
(4.4.7) ఇతి

వ్యా. "వీని మనస్సులో ఉన్న కామములన్నీ ఎప్పుడు పోవునో అప్పుడా మర్త్యుడు అమృతుడు (మరణము లేనివాడు) అగును. ఈ శరీరమునందే, ఈ లోకమునందే బ్రహ్మను పొందును'' అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడినది.

మూ. స్మృత్యన్తరేఽపి:– "సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణ ఇవ" ఇతి. ఏవమన్యత్రాప్యుదాహార్యమ్.

స్మృతిషు జీవన్ముక్తః స్థితప్రజ్ఞభగవద్భక్తగుణాతీతబ్రాహ్మణాతివర్ణాశ్రమ్యాదినామభిస్తత్ర తత్ర వ్యవహ్రియతే. వసిష్ఠరామ సంవాదే-"నృణాం జ్ఞానైకనిష్ఠానామ్" ఇత్యారభ్య "సత్కించిదవశిష్యతే" ఇత్యన్తేన గ్రన్థేన జీవన్ముక్తః పఠ్యతే.

**వ్యా.** "నేత్రము లున్నను నేత్రములు లేనివాడు వలె, చెవు లున్నను చెవులు లేనివాడు వలె, మనస్సు ఉన్నను మనస్సు లేనివాడు వలె, ప్రాణము లున్నను ప్రాణములు లేనివాడు వలె (జీవన్ముక్తుడు ప్రవర్తించును)'' అని మరొక శ్రుతిలో కూడ చెప్పబడినది. ఇట్లే ఇతర శ్రుతి వాక్యములను కూడ ఉదాహరించవలెను. స్మృతులలో జీవన్ముక్తుడు- "స్థితప్రజ్ఞుడు'' "భగవద్భక్తుడు'' "గుణాతీతుడు'' "బ్రాహ్మణుడు'' "అతివర్ణాశ్రమి" ఇత్యాది నామములచే వ్యవహరింపబడుచున్నాడు. (లఘు యోగ వాసిష్ఠములోని అర్థదర్శనము అను ఐదవసర్గలోని) వసిష్ఠరామ సంవాదములో "నృణాం జ్ఞానైక నిష్ఠానామ్" అని మొదలు, "సత్కించిదవశిష్యతే" అను నంతవరకు ఉన్న గ్రంథములో జీవన్ముక్తుడు పఠింపబడినాడు (జీవన్ముక్తుని గూర్చి చెప్పబడినది).

మూ. నృణాం జ్ఞానైకనిష్ఠానామాత్మజ్ఞానవిచారిణామ్.
సా జీవన్ముక్తతోదేతి విదేహోన్ముక్తతేవ యా". 88

జ్ఞానైకనిష్ఠత్వమ్ లౌకికవైదికకర్మత్యాగః. దేహేన్ద్రియసదసద్భావమాత్రేణ ముక్తిద్వయస్య విశేషో న త్వనుభవతః; ద్వైతప్రతీతేరుభయత్రాభావాత్.

**వ్యా.** "ఒక్క జ్ఞానమునందే నిష్ఠ కలిగి జ్ఞానమును గూర్చి విచారించు మానవులకు విదేహముక్తత్వముతో సమానమైన జీవన్ముక్తత్వము ఉదయించును. జ్ఞానైకనిష్ఠత్వమ్=లౌకిక వైదిక కర్మలను త్యజించుట. ఈ రెండు ముక్తులయందును ద్వైతప్రపంచభాన ముండదు. అందుచే దేహేంద్రియములు ఉండుట లేకపోవుట అనునదియే ఈ రెండు ముక్తులకు భేదము.

మూ. శ్రీరామః- "బ్రహ్మన్విదేహముక్తస్య జీవన్ముక్తస్య లక్షణమ్
బ్రూహి యేన తథైవాహం యతే శాస్త్రదృశా దృశా" 89

వ్యా. రాముడు :- "ఓ! పూజ్య బ్రాహ్మణుడా! విదేహముక్తునికీ జీవన్ముక్తునికీ ఉన్న లక్షణములను తెలుపుము. నేను శాస్త్రదృష్టిని అలవరచుకొని ఆ విధముగ ఉండుటకు ప్రయత్నించెదను"

మూ. వసిష్ఠః— "యథా స్థితమిదం యస్య వ్యవహారవతోఽపి చ
అస్తం గతం స్థితం వ్యోమ స జీవన్ముక్త ఉచ్యతే" 90

ఇదం ప్రతీయమానం గిరినదీసముద్రాదికం జగత్ ప్రతిపత్తుః దేహేన్ద్రియవ్యవహారేణ సహ మహాప్రలయే పరమేశ్వరేణోప సంహృతం సత్ స్వరూపోపమర్దేనాస్తం గతం భవతి. అత్ర తు న తథా. కిం తు విద్యత ఏవ దేహేన్ద్రియాదివ్యవహారః. గిరినద్యాదికం చ పరమేశ్వరేణ అనుపసంహృతత్వాత్ యథాపూర్వమవతిష్ఠ మానం సర్వైరన్యైః ప్రాణిభిః స్పష్టమవలోక్యతే జీవన్ముక్తస్య తత్ప్రత్యాయకధీవృత్త్యభావాత్ సుషుప్తావివ సర్వమస్తం గతం భవతి. స్వయంప్రకాశమానం చిద్వ్యోమ కేవలమవశిష్యతే. బద్ధస్య సుషుప్తౌ తాత్కాలికధీవృత్త్యభావసామ్యేఽపి భావిధీవృత్తిబీజసద్భావాత్ న జీవన్ముక్తత్వమ్.

వ్యా. వసిష్ఠుడు :- "పూర్వము వలెనే ఉన్న ఈ ప్రపంచము దేహేంద్రియాదివ్యవహార మున్నవాడైనను ఎవని దృష్టిలో అస్తమించునో, అతడు జీవన్ముక్తుడు".

కనబడుచున్న ఈ గిరినదీసముద్రాదిజగత్తు అంతా చూచుచున్న వాని దేహేంద్రియాదివ్యవహారముతో సహా మహాప్రలయమునందు పర మేశ్వరుని చేత ఉపసంహరింపబడినపుడు దానిస్వరూపమే ఉండదు గాన అదృశ్యమై పోవును. ఇక్కడ అట్లు కాదు. దేహేంద్రియాదివ్యవహారము

ఉండకుండా పోదు. గిరినద్యాదులను కూడ పరమేశ్వరుడు ఉపసంహరించ లేదు గాన పూర్వమునందు వలెనే నిలచి ఉండును; ఇతరప్రాణులు దానిని స్పష్టముగా చూచుచుందురు. అయితే జీవన్ముక్తునకు మాత్రము ఆ గిరినద్యాదికమును గ్రహించే చిత్తవృత్తి ఉండదు గాన, ఆ జగత్తుఅంతా సుషుప్తిలో వలె అస్తమించును (అదృశ్య మగును). స్వయంప్రకాశమాన మైన చిదాకాశముమాత్రమే మిగులును. బద్ధునికి కూడ సుషుప్తిలో తాత్కాలికముగా చిత్తవృత్తి ఉండదు. ఈ విధముగ 'సుషుప్తి-జీవన్ముక్తులలో చిత్త వృత్తి లేకపోవుట తుల్యమే అయినను కలుగబోవు చిత్తవృత్తులకు బీజములు ఉండుటచే అతడు జీవన్ముక్తుడు కాడు

మూ. "నోదేతి నాస్తమాయాతి సుఖే దుఃఖే ముఖప్రభా
యథాప్రాప్తే స్థితిర్యస్య స జీవన్ముక్త ఉచ్యతే." 91

ముఖప్రభా హర్షః. స్రక్చన్దనసత్కారాదిసుఖే ప్రాప్తేఽపి సంసారిణ ఇవ హర్షో నోదేతి. ముఖప్రభాస్తమయో దైన్యమ్. ధన హానిధిక్కారాదిదుఃఖే ప్రాప్తేఽపి న దీనో భవతి. ఇదానీంతనస్వ ప్రయత్నవిశేషమన్తరేణ ప్రారబ్ధకర్మాపాదితపూర్వప్రవాహాగతభిక్షా న్నాదికం యథాప్రాప్తమ్. తస్మిన్ స్థితిః దేహరక్షా. సమాధిదార్ఢ్యేన స్రక్చన్దనాదిప్రతీత్యభావాత్, కదాచిత్, వ్యుత్థానదశాయామాపాతతః ప్రతీతావపి వివేకదార్ఢ్యేనైవ హేయోపాదేయత్వబుద్ధ్యభావాత్ హర్షాది రాహిత్యమ్ ఉపపద్యతే.

వ్యా "సుఖము కలిగి నప్పుడు ఎవని ముఖకాంతి ఉదయించదో, దుఃఖము కలిగి నప్పుడు అస్తమించదో, లభించినదానితో ఎవడు జీవనమును నిలుపుకొనునో ఆతడు జీవన్ముక్తు డని చెప్పబడుచున్నాడు."

ముఖప్రభ=హర్షము. స్రక్చందనాదులు సత్కారములు మొదలైన సుఖము లభించినను అతనికి, సంసారికి వలె హర్షము కలుగదు. ముఖప్రభ అస్తమించుట అనగా దైన్యము ధనహాని, అవమానము మొదలైన దుఃఖము

కలిగినను దీనుడు కాడు యథాప్రాప్తము అనగా ఇప్పుడు ప్రయత్నవిశేష మేమీ చేయకపోయినను ప్రారబ్ధకర్మచే సమకూర్చబడిన, పూర్వప్రవాహముచే వచ్చిన భిక్షాన్నాదికము. అట్టి యథాప్రాప్తభిక్షాన్నమునందు, స్థితి, అనగా దేహరక్ష. అతడు దృఢ మైన సమాధిలో ఉండుటచేత అతనికి ప్రక్చందనాదుల జ్ఞానమే ఉండదు. వ్యుత్థానదశలో (సమాధినుండి బైటకు వచ్చినప్పుడు) ఆపాతతః (జ్ఞానము కలిగి నట్లు) వాటి జ్ఞానము కలిగినను ఆతనికి వివేకము దృఢముగా ఉండుటచే ఇది హేయము, ఇది ఉపాదేయము (స్వీకరించదగినది, స్వీకరించతగనిది) అను బుద్ధి ఉండదు గాన హర్షాదులు లేకపోవుట యుక్తమే

మూ. "యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే" 92

చక్షురాదీన్ద్రియాణాం స్వస్వగోలకేష్వవస్థానేన ఉపరత్యభావాజ్జాగర్తి. మనోవృత్త్యభావాత్ సుషుప్తిస్థః. అత ఏవ "ఇన్ద్రియైరర్థోపలబ్ధిః" ఇత్యేతస్య జాగరణలక్షణస్యాభావాత్ జాగ్రన్న విద్యతే. సత్యపి బోధే జాయమానో బ్రహ్మవిత్త్వాభిమానాదిభిర్భోగార్థాపాదితకామాదిభిశ్చ ధీదోషో వాసనా. వృత్తిరాహిత్యేన తద్దోషాభావాత్ నిర్వాసనత్వమ్.

వ్యా. ''ఎవడు మెళుకువగా ఉంటూనే సుషుప్తిలో ఉండునో, ఎవనికి జాగ్రదవస్థ ఉండదో, ఎవనికి వాసనారహిత మైన జ్ఞానము ఉండునో అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడుచున్నాడు''.

నేత్రాదీంద్రియములు తమ తమ గోళములలో ఉండి పనిచేయుటచేత అతడు మెలకువగా ఉన్నవాడే. కాని మనోవృత్తి లేదు గాన సుషుప్తిలో ఉన్నవాడు. అందుచేతనే ''ఇంద్రియములచేత విషయములను గ్రహించుట జాగరణము" అను జాగరణావస్థాలక్షణము లేకపోవుటచేత అతడు జాగ్రదస్థలో ఉండడు. జ్ఞానము కలిగినను అప్పుడప్పుడు ఉదయించు "నేను

బ్రహ్మవేత్తను"ఇత్యాద్యభిమానములచేతను, భోగములకై కలుగు కామాదికములచేతను కలుగు బుద్ధిదోషము వాసన. మనోవృత్తులు లేకపోవుటచే అట్టి దోషము లేవీ కూడ ఉండవు గాన వాసనలు ఉండవు.

మూ. "రాగద్వేషభయాదీనామనురూపం చరన్నపి
యోఽన్తర్వ్యోమవదత్యచ్ఛః స జీవన్ముక్త ఉచ్యతే". 93

రాగానురూపం భోజనాదిప్రవృత్తిః. ద్వేషానురూపం బౌద్ధకాపాలికాదిభ్యో విముఖత్వమ్. భయానురూపం సర్పవ్యాఘ్రాదిభ్యః అపసర్పణమ్. ఆదిశబ్దేన మాత్సర్యానురూపమితరయోగిభ్య ఆధిక్యేన సమాధ్యనుష్ఠానమ్. సత్యపి వ్యుత్థానదశాయామీదృశ ఆచరణే పూర్వాభ్యాసేన ప్రాపితే విశ్రాన్తచిత్తస్య కాలుష్యరహితత్వాదత్యచ్ఛత్వమ్. యథా వ్యోమ్ని ధూమధూలిమేఘాదియుక్తేఽపి నిర్లేపస్వభావత్వాదతిశయేన స్వచ్ఛత్వం తద్వత్.

వ్యా. "రాగద్వేషభయాదులకు అనుగుణముగా ప్రవర్తించుచున్నను ఎవడు చిత్తమునందు, ఆకాశము వలె చాల స్వచ్ఛముగా ఉండునో అతడు జీవన్ముక్తుడని చెప్పబడును."

రాగమునకు (కోరికకు) అనురూపముగా భోజనాదులందు ప్రవర్తించుట; ద్వేషమునకు అనురూపముగా బౌద్ధకాపాలికాదులనుండి విముఖత్వము; భయమునకు అనుగుణముగా సర్పవ్యాఘ్రాదులనుండి దూరముగా తొలగుట; 'ఆది'అనుటచే మాత్సర్యమునకు అనుగుణముగా ఇతరయోగులకంటె అధికముగా సమాధిని అనుష్ఠించుట; వ్యుత్థానదశలో పూర్వాభ్యాసముచేత ఈ విధమైన ఆచరణమునకు అవకాశ మున్నను విశ్రాంతి చెందిన ఆతని చిత్తములో కాలుష్య మేమీ లేకపోవుటచేత చాల స్వచ్ఛముగా ఉండును. ఆకాశము నిర్లేపస్వభావము (ఏదీ అంటుకొనని స్వభావము) గలది గాన దాని మీద ధూమము ధూళి, మేఘము మొదలైనవి వ్యాపించినను అది ఎట్లు పూర్తిగా స్వచ్ఛముగానే ఉండునో అట్లే

మూ. "యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
కుర్వతోఽకుర్వతో వాపి స జీవన్ముక్త ఉచ్యతే". 94

పూర్వార్ధం విద్వత్సంన్యాసప్రస్తావే వ్యాఖ్యాతమ్. లోకే బద్ధస్య పురుషస్య శాస్త్రీయం కర్మ కుర్వతః "అహం కర్తా" ఇతి చిదాత్మా అహంకృతో భవతి. "భావి స్వర్గం ప్రాప్స్యామి" ఇతి హర్షేణ బుద్ధిః లిప్యతే, అకుర్వతస్తు "త్యక్తవానస్మి" ఇత్యహంకృతత్వమ్, స్వర్గాలాభవిషాదో లేపః. ఏవం ప్రతిషిద్ధకర్మణి లౌకికకర్మణి చ యథాసంభవం యోజనీయమ్. జీవన్ముక్తస్య తు తాదాత్మ్యాధ్యాసాభావాత్ హర్షాద్యభావాచ్చ న దోషద్వయమ్.

వ్యా "ఆ యా కర్మలు చేయుచున్నను, చేయకపోయినను ఎవని భావము అహంకారయుక్తము కాదో. ఎవని బుద్ధి లిప్తము కాదో అతడు జీవన్ముక్తు డని చెప్పబడు చున్నాడు".

పూర్వార్ధమువిద్వత్సన్యాసప్రస్తావములో వ్యాఖ్యానించబడినది. లోకములో బద్ధుడైన పురుషుడు శాస్త్రీయ కర్మలు చేయుచున్నపుడు"నేను కర్తను" అని ఆతని చిదాత్మ అహంకారయుక్తమగును "నాకు మున్ముందు స్వర్గము లభించగలదు" అను సంతోషముచేత ఆతని బుద్ధి లిప్త మగును. శాస్త్రీయ కర్మలు చేయనినానికి "నేను కర్మలు త్యజించినాను" అని అహంకారము, స్వర్గము లభించదు కదా అను విషాదముచేత బుద్ధికి లిప్తత్వము కలుగును. ప్రతిషిద్ధ కర్మల విషయమునందు, లౌకిక కర్మల విషయములందు అహంకార బుద్ధి లేపములు ఈ విధముగనే కలుగు నని యథా సంభవముగా ఊహించుకొనవలెను. జీవన్ముక్తునకు బుద్ధ్యాదులతో తాదాత్మ్య [బుద్ధిని నేను అనుకొనుట] హర్షాదులు లేకపోవుటచేత ఈ రెండు దోషములును ఉండవు.

మూ. "యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయాన్ముక్తః స జీవన్ముక్తః ఉచ్యతే". 95

అధిక్షేపతాడనాదావప్రవృత్తత్వాత్ ఏతస్మాల్లోకో నోద్విజతే. అత ఏవ ఏతస్మిన్ లోకస్యాధిక్షేపాద్యప్రవృత్తేఃకస్యచిద్దుష్టస్య తత్ప్రవృత్తావప్యేతచ్చిత్తే తాదృశవికల్పానుదయాచ్ఛయమపి నోద్విజతే.

వ్యా. "ఎవనినుండి లోకము [ఇతరులు] భయము చెందరో, లోకము నుండి [ఇతరులనుండి] ఎవడు భయము చెందడో, హర్షము కాని కోపము కాని, భయము కాని లేని అట్టి వాడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు"

ఇతడు అధిక్షేపించుట, కొట్టుట మొదలైన పను లెన్నడు చేయడు గాన ఇతనిని చూచి ఇతరులు భయపడరు. ఇతడు ఇతరుల దూషణాదులు చేయడు కనుక ఇతరుల కూడ ఇతని విషయమున దూషణాదులు చేయరు. ఎవ్వడైన దుష్టుడు అట్టివి చేసినను ఇతని చిత్తములో అట్టి వికల్పములు ఉదయించవు; అనగా వాడు నన్ను దూషించినాడే అని మనస్సులో ఇతడు బాధపడడు. అందుచే ఇతడు భయపడడు.

మూ. "శాన్తసంసారకలనః కలావానపి నిష్కలః
యః సచిత్తోపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఉచ్యతే". 96

శత్రుమిత్రమానావమానాదివికల్పాః సంసారకలనాః శాన్తా యస్య సః, చతుఃషష్టిర్విద్యాః కలాః. తత్సద్భావేఽపి తదభిమానవ్యవహారయోరభావాన్నిష్కలత్వమ్. చిత్తస్య స్వరూపేణ సద్భావేఽపి వృత్త్యనుదయాత్ నిశ్చిత్తత్వమ్. సచిన్తోఽపి నిశ్చిన్తః" ఇతిపాఠే వాసనావశాదాత్మధ్యానవృత్తిసద్భావేఽపి లౌకికవృత్త్యభావాత్ నిశ్చిన్తత్వమ్.

వ్యా. "ఎవడు శాంతించిన సాంసారిక దృష్టి గలవాడో, కళలు కలవాడైనను కళలు లేనివాడో చిత్తము కలవాడైనను చిత్తము లేని వాడో అతడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు"

శత్రువు మిత్రుడు, మానము అవమానము మొదలైన వికల్పములు సంసారకలనలు. అట్టి సంసారకలనలు శాంతించినవాడు శాంతసంసారకలనుడు. కళ లనగా చతుఃషష్టి [64] కళలు. వాటిలో పాండితశి మున్నను తనకు పాండిత్య మున్న దను అభిమానము గాని, వ్యవహారము గాని [అనగా వాటిని ఉపయోగించుట గాని] లేకపోవుటచే నిష్కళుడు. చిత్తము ఉన్నను చిత్తవృత్తులు లేకపోవుట నిశ్చిత్తత్వము. "సచింతు డైనను చింత లేనివాడు'' అను పాఠములో వాసనావశముచేత ఆత్మను గూర్చి ధ్యానము చేయుట అను వృత్తి ఉన్నను ఇతరము లైన లౌకిక విషయములను గూర్చి ఆలోచించుట అను వృత్తులు లేక పోవుటచే నిశ్చింతుడు అని అర్థము.

మూ. ''యః సమస్తార్థజాతేషు వ్యవహార్యపి శీతలః
పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే''. 97

పరగృహే వివాహోత్సవాదౌ స్వయం గత్వా తత్ప్రీత్యై తదీయ కార్యేషు వ్యవహరన్నపి లాభాలాభయో ర్హర్షవిషాదరూపం బుద్ధిసంతాపం న ప్రాప్నోతి యథా, ఏవమయం ముక్తః స్వకార్యేఽపి శీతలః. న కేవలం సంతాపాభావాచ్ఛీతలత్వం కింతు పూర్ణస్వరూపానుసంధానా దపి. ఇతి జీవన్ముక్తలక్షణమ్.

వ్యా. "సమస్త కార్యములయందు వ్యవహరించుచున్నను, ఎవడు పరకార్యముల విషయము నందు వలె తాపము లేక చల్లగా ఉండునో, పూర్ణాత్మస్వరూపుడో అతడు జీవన్ముక్తు డని చెప్పబడు చున్నాడు''.

పరగృహములలో వివాహాద్యుత్సవములు జరుగుచున్నపుడు తాను వెళ్ళి వారికి ప్రీతి కలిగించుటకై, వాళ్ళ పనులు చేయుచున్నను, లాభాలాభములందు హర్షము విషాదము అను మనఃసంతాపమును ఎట్లు పొందడో అట్లే తన పనులు చేసికొనుచున్నపుడు కూడ జీవన్ముక్తుడు చల్లగా ఉండును. ఈ శీతలత్వము [చల్లగా ఉండుట] కేవలము సంతాపము లేక

పోవుట చేతనే కాదు, పూర్ణ స్వరూపానుసంధానమువలన కూడ కలుగును. ఇది జీవన్ముక్త లక్షణము.

మూ. అథ విదేహముక్తలక్షణమ్.

"జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే
విశత్యదేహముక్తత్వం పవనోఽస్పన్దతామివ". 98

యథా వాయుః కదాచిత్ చలనం త్యక్త్వా నిశ్చలరూపేణా వతిష్ఠతే, తథా ముక్తాత్మాప్యుపాధికృతం సంసారం త్యక్త్వా స్వరూపేణా వతిష్ఠతే.

వ్యా. ఇంక విదేహముక్తుని లక్షణము :-

''తన దేహము కాలమునకు అధీనము చేయబడిన పిమ్మట [మరణా నంతరము] జీవన్ముక్తస్థితిని విడచి విదేహముక్తిని పొందును. ఇది వాయువు చంచలత్వమును విడచి నిశ్చలత్వమును పొందుట వంటిది''

వాయువు ఎప్పుడైన చలనమును విడచి నిశ్చలముగా ఉన్నట్లు ముక్తాత్మ కూడ ఉపాధి కృత మైన సంసారమును విడచి స్వరూపముతో ఉండును.

మూ. "విదేహముక్తో నోదేతి నాస్తమేతి న శామ్యతి
న సన్నాసన్న దూరస్థో న చాహం న చ నేతరః". 99

ఉదయాస్తమయోర్హర్షవిషాదౌ, న శామ్యతి న చ తత్పరిత్యాగీ, లిఙ్గదేహస్య అత్రైవ లీనత్వాత్. సద్వాచ్యో జగద్ధేతుః అవిద్యామాయోపాధిః న ప్రాజ్ఞేశ్వరః. అసద్వాచ్యో నాపి భూతభౌతికః. న దూరస్థః ఇత్యుక్త్వా న మాయాతీతః. న చేత్యుక్త్వా స్థూలభుక్ష్మమీప స్తోఽపి నిషిధ్యతే. అహం న చేతి న సమష్టిశ్చ. నేతరః ఇతి న వ్యష్టిశ్చ, వ్యవహారయోగ్యో వికల్పః కోఽపి నాస్తీత్యర్థః.

వ్యా "విదేహముక్తుడు,న ఉదేతి=ఉదయించడు అనగా సంతోషించడు న అస్తమ్ ఏతి=అస్తమించడు అనగా విషాదమును పొందడు. న శామ్యతి= శమించడు; సత్=సత్పదముచే చెప్పదగినవాడు, న=కాడు. అసత్=అ సత్పదవాచ్యుడు కూడ, న=కాడు. దూరస్థః=దూరమునం దున్నవాడు న=కాడు. న చ=సమీపమునందున్నవాడు కూడ కాడు, అహమ్="నేను" న=కాడు, ఇతరః=నేను కానివాడు, న=కాడు"

ఉదయాస్తమయము లనగా హర్ష విషాదములు. న శామ్యతి=హర్ష విషాదములను విడచినవాడు కాదు. ఎందుచేతననగా లింగదేహము ఇక్కడనే లీనమై పోయినది కదా! సత్ = అవిద్య, మాయ ఉపాధిగా గలిగి జగత్తును సృష్టించు 'సత్' అని చెప్పబడే 'ప్రాజ్ఞుడు' అయిన ఈశ్వరుడు కాడు 'అసత్' అని చెప్పబడే పంచభూతరూపపదార్థము, పంచభూతజన్య పదార్థము కూడ కాడు. దూరస్థః న=మాయాతీతుడు కాడు న చ అని చెప్పుట చే సమీపమునందుండి స్థూలజగత్తును అనుభవించేవాడు కూడ కాడు. 'అహం న చ' అనగా సమష్టి స్వరూపము కాదు. "న ఇతరః"=వ్యష్టి రూపుడు కాదు లోకవ్యవహారమునకు సంబంధించి ఎట్టి వికల్పములు గూడ ఈ ముక్తుని విషయమున ప్రవర్తింపవు అని అర్థము.

ఒక ప్రదేశములో ఉన్న వృక్షములను అన్నింటిని ఒక గుంపుగా చూచినచో అది వనము అది ఆ వృక్షముల సమష్టిస్వరూపము. ఒక్కొక్క వృక్షముగా చూచినచో అది వాటి వ్యష్టి స్వరూపము. అట్లే జీవుల నందరినీ ఒక వృక్షముగా చూచినచో అది వాటి వ్యష్టి స్వరూపము అట్లే జీవుల నందరినీ ఒక సముదాయముగా చూచినచో అది సమష్టి. వేరు వేరుగా చూచినచో అది వ్యష్టి

మూ. "తతః స్తిమితగమ్భీరం న తేజో న తమస్తతమ్
అనాఖ్యమనభివ్యక్తం సత్కించిదవశిష్యతే". 100

ఏవంవిధయా విదేహముక్త్యా సాదృశ్యో క్తేర్జీవన్ముక్తావపి యావద్యావత్ నిర్వికల్పాతిశయః తావత్తావదుత్తమత్వం ద్రష్టవ్యమ్.

వ్యా. 'అటు పమ్మట వర్ణింప శక్యము కాని ఒకానొక సత్తత్త్వము మాత్రము మిగులును. అది నిశ్చలము గంభీరము అది తేజస్సు కాదు-తమస్సు చేత కప్పబడినది కాదు. దానికి పేరు లేదు. అది వ్యక్తము కాదు.'

ఇట్టి విదేహముక్తి వంటిదే జీవన్ముక్తి కూడ అని చెప్పుటచే దానిలో కూడ నిర్వికల్పస్థితి అతిశయించిన కొలది ఉత్తమత్వమును గ్రహించవలెను.

మూ. భగవద్గీతాసు ద్వితీయాధ్యాయే స్థితప్రజ్ఞః పఠ్యతే. అర్జున ఉవాచ:-

"స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్". **54**

ప్రజ్ఞా తత్త్వజ్ఞానమ్. తత్ ద్వివిధమ్-స్థితమ్ అస్థితం చేతి. యథా జారేఽనురక్తాయాః నార్యాః సర్వేష్వపి వ్యవహారేషు బుద్ధిః జారమేవ ధ్యాయతి, ప్రమాణప్రమితాని క్రియమాణాన్యపి గృహకర్మాణి సద్య ఏవ విస్మర్యన్తే, తథా పరవైరాగ్యోపేతస్య యోగాభ్యాసపాటవేనాత్యన్తవశీకృతచిత్తస్యోత్పన్నే తత్త్వజ్ఞానే బుద్ధిః నైరన్తర్యేణ తత్త్వం ధ్యాయతి; తదిదం స్థితం ప్రజ్ఞానమ్. ఉక్తగుణరహితస్య కేనాపి పుణ్యవిశేషేణ కదాచిదుత్పన్నేఽపి తత్త్వజ్ఞానే గృహకర్మవత్తత్రైవ తత్త్వం విస్మర్యతే; తదిదమస్థితం ప్రజ్ఞానమ్.

వ్యా. భగవద్గీతలోని ద్వితీయాధ్యాయములో స్థితప్రజ్ఞుని గూర్చి చెప్పబడినది.

అర్జునుడు పలికెను :- "శ్రీకృష్ణా ! సమాధిలో ఉన్న స్థితప్రజ్ఞుని వర్ణించ గలిగిన భాష ఏది ? అతడు ఏమి మాటలాడును ? ఎట్లు కూర్చుండును ? ఎట్లు వెళ్లును ?"

ప్రజ్ఞ అనగా తత్త్వ జ్ఞానము. అది నిలచి ఉన్నది, నిలకడ లేనిది అని రెండు విధములు. జారునియందు అనురాగము గల స్త్రీ బుద్ధి ఇతర

వ్యాపారము లన్నీ జరుగుచున్నను జారుని గూర్చియే ఆలోచించుచుండును. ఇంద్రియాదులచే గ్రహింపబడిన గృహకర్మలు ఆమె వెంటనే మరచి పోవు చుండును అట్లే పరవైరాగ్యవంతుడై యోగాభ్యాసమునందు పాటవముచేత చిత్తమును పూర్తిగా వశముచేసికొన్నవానికి తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట అతని బుద్ధి అవిచ్ఛిన్నముగా తత్త్వమును గూర్చియే ఆలోచించుచుండును. అట్టి ప్రజ్ఞానము స్థిరము. పైన చెప్పిన గుణములు లేనివానికి ఏదో పూర్వ పుణ్యముచే ఒక మారు తత్త్వజ్ఞానము కలిగినను అతడు ఆ స్త్రీ గృహ కర్మలను మరచిపోయి నట్లు ఆ తత్త్వజ్ఞానమును అక్కడనే మరచిపోవును. ఇది స్థైర్యము లేని ప్రజ్ఞానము

మూ. ఏతదేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ—

"పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి
తదేవాస్వాదయత్యన్తః పరసంగరసాయనమ్. (27.58)
ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాన్తిమాగతః
తదేవాస్వాదయత్యన్తర్బహిర్వ్యవహరన్నపి". (28.59) ఇతి

వ్యా. ఈ విషయమును గూర్చియే వసిష్ఠుడు ఇట్లు చెప్పినాడు—

"పరపురుషసంగాసక్తి గల స్త్రీ ఇంటి పనులలో మునిగి ఉన్నను మనస్సులో ఆ పరపురుషసంగసుఖమునే ఆస్వాదించుచుండును. అట్లే శుద్ధమైన పరతత్త్వమునందు విశ్రాంతి పొందుచున్న ధీరుడు బయట వ్యవహారము లన్నీ చేయుచున్నను మనస్సులో మాత్రము ఆ పరతత్త్వమునే ఆస్వాదించుచుండును."

మూ. తత్ర స్థితప్రజ్ఞః [illegible]భేదాత్ ద్వివిధః-సమాహితః వ్యుత్థితశ్చ. తయోరుభయో ర్లక్షణం పూర్వోత్తరాభ్యామర్ధాభ్యాం పృచ్ఛతి-సమాధిస్థస్య స్థితప్రజ్ఞస్య కా భాషా? కేన్వైర్లక్షణవాచకైః శబ్దైః సపరైరయం భాష్యతే? వ్యుత్థితః స్థితప్రజ్ఞః కిం ప్రభాషేత వాగ్వ్యవహారం కరోతి? తస్య ఉపవేశనగమనే మన్దేభ్యో విలక్షణే కిం స్యాతే?

ప్రవర్తన ద్వారా వారు అల్పులు అనే అభిప్రాయాన్ని వెల్లడిస్తారని విష యాన్ని గుర్తించాలి' అని రాశాడు. ఈ స్త్రీవిద్యా సాధన విషయంలో కూడా చందుమీనన్ ఆకారాన్ని బట్టి చూస్తే ఒక విప్లవకారుడు, విద్యావంతు రాండ్రై, పిఠనసుంచి బయటపడిన భవిష్యద్ మలబారు స్త్రీని, భారతీయ స్త్రీని ఆయన దర్శించాడు. పరాయి అధికార శృంఖలాలనుండి స్వేచ్ఛ పొందిన భారతజాతిని ఆయన దర్శించాడు.

ఇందులేఖ పొందుతున్న అనన్య ప్రజాదరణ మూలంగా దాన్ని గొప్ప నవలారాజంగా పేర్కొనవచ్చు. అది ఇక ముందుగూడ ప్రచారంలో ఉండటం రచయితకు మరింత కీర్తిదాయకం. పాత్రచిత్రణ, హాస్యం వ్యవహా రిక కథనంలాంటి సముచిత కారణాలవల్ల మాత్రమే నవల ప్రజానురంజకం కావడం రచయిత కీర్తిప్రతిష్ఠలను పెంచాయి. ఒక చిత్రకారుడు తన రంగుల పెట్టెలో అనేక రకాల రంగులు ఉన్నా కూడా రెండు మూడు రంగుల్నే ఉపయోగించి అత్యద్భుతమైన చిత్రాన్ని, తయారు చేసినట్లుగా ఉంది. వాస్త వానికి అతను అన్ని రంగుల్ని ఉపయోగించకపోవడం చిత్రంలో లోపం గాదు పైగా చిత్రకారుడి ప్రతిభను ఎత్తి చూపుతుంది. నవలారచనకు వస్తువు, పాత్రలు, భాష, నేరము, సస్పెన్స్, హాస్యం విజ్ఞానశాస్త్రం లాంటి అనేక విషయాలున్నప్పటికీ ఏవో కొన్నిమాత్రం ఉపయోగించి గొప్ప నవల్ని నిర్మిం చడం, అత్యద్భుతమైన రచన చేయడం అసాధారణ ప్రతిభావంతుడైన రచయితకే సాధ్యమవుతుంది. చందుమీనన్ అటువంటి రచయిత.

బాహ్యములు, ఆంతరములు, వాసనామాత్రరూపములు అని కామములు మూడు విధములు. సంపాదించుకొన్న మోదకములు (మధురభక్ష్యములు) బాహ్యములు ఆశామోదకాదులు [ఊహించుకొన్న మోదకాదులు] ఆంతరములు. నడచి వెళ్లేటప్పుడు మార్గములో పడి ఉన్న తృణాదికము కనబడి నట్లు యాదృచ్ఛికముగా కనబడునవి వాసనారూపములు. సమాధిలో ఉన్నవాడు తన సమస్త చిత్తవృత్తులూ నశించిపోవుటవలన వాసనలను అన్నింటిని పరిత్యజించును. అతని ముఖము నిర్మలముగా ఉండును గాన అతడు సంతుష్టుడని ఊహించ వచ్చును. అతనిలో కనబడు ఆ సంతోషము కామములవలన కలిగినది కాదు; ఆత్మయందే కలిగిన సంతోషము; ఎందుచేత ననగా అతడు కామములను పరిత్యజించినాడు; అతని బుద్ధి పరమానందరూపముతో ఆత్మతత్త్వమునకు అభిముఖమై ఉన్నది. సంప్రజ్ఞాత సమాధిలో ఆత్మానందమును మనోవృత్తి ద్వారా ఆస్వాదించి నట్లు ఈ స్థితిలో మనోవృత్తితో ఆస్వాదించుట ఉండదు. దాని ఆస్వాదము స్వప్రకాశము, చిద్రూపము అయిన ఆత్మస్వరూపముతో ఉండుట ద్వారా చేయబడును. సంతోషము కూడ చిత్తవృత్తి రూపము కాదు; దాని సంస్కారము మాత్రమే. సమాధిలో ఉన్న స్థితప్రజ్ఞుని లక్షణములను బోధించు ఇట్టి మాటలతో అతనిని గూర్చి చెప్పవలసి ఉండును. [ఇది "స్థితప్రజ్ఞస్య కా భాషా'' అనుదానికి సమాధానము]

మూ. "దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే". 56

దుఃఖం రాగాదినిమిత్తజన్యా రజోగుణవికారరూపా సంతాపాత్మికా ప్రతికూలా చిత్తవృత్తిః. తాదృశే దుఃఖే ప్రాప్తే సతి "అహం పాపః, ధిక్ మాం దురాత్మానమ్" ఇత్యనుతాపాత్మికా తమోగుణవికారత్వేన భ్రాన్తిరూపా చిత్తవృత్తిః ఉద్వేగః. యద్యప్యయం వివేక ఇవాభాతి తథాపి పూర్వస్మిన్ జన్మని చేత్ తత్ పాపప్రవృత్తి ప్రతిబన్ధకత్వాత్ సప్రయోజనో భవతి; ఇదానీం తు నిష్ప్రయోజనః

ఇతి భ్రాన్తిత్వం ద్రష్టవ్యమ్. సుఖం రాజ్యపుత్రలాభాదినిమిత్తజన్యా సాత్త్వికీ ప్రీతిరూపా అనుకూలా చిత్తవృత్తిః. తస్మిన్ సుఖే సతి ఆగామినః తాదృశస్య సుఖస్య కారణం పుణ్యమననుష్ఠాయ వృథైవ తదపేక్షా తామసీ చిత్తవృత్తిః స్పృహా. తత్ర చ సుఖదుఃఖయోః ప్రారబ్ధకర్మప్రాపితత్వాత్, వ్యుత్థితచిత్తస్య వృత్తిసంభవాచ్చ తదుభయముపపద్యతే. ఉద్వేగస్పృహే తు న వివేకినః సంభవతః. తథా రాగభయక్రోధాశ్చ తామసత్వేన కర్మణా ప్రాపితత్వాభావాత్ న అస్య విద్యన్తే. ఏవంలక్షణలక్షితః స్థితధీఃస్వానుభవప్రకటనేన శిష్యశిక్షార్థమ్ అనుద్వేగనిఃస్పృహత్వాదిగమకం వచో భాషతే ఇత్యర్థః.

వ్యా. "దుఃఖములు వచ్చినప్పుడు మనస్సులో ఉద్వేగము చెందని వాడు, సుఖములలో స్పృహ లేనివాడు, రాగము, భయము, క్రోధము లేని వాడు అయిన ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు."

రాగము మొదలైన నిమిత్తములవలన కలుగునది, రజోగుణ వికార రూపమూ అయిన ప్రతికూలమైన చిత్తవృత్తి దుఃఖము. అది సంతాపరూపమైనది. అట్టి దుఃఖము వచ్చినప్పుడు "నేను పాపాత్ముడను. ఛీ! నే నెంత దురాత్ముడను!" అను అనుతాపము కలుగును. అది తమోగుణ వికారమగుటచే భ్రాంతిరూపమైన చిత్తవృత్తి. పైకి ఇది వివేకము వలె కనబడినను, ఇట్టి చిత్తవృత్తి పూర్వజన్మలో కలిగి ఉన్నట్లయితే దుఃఖహేతువైన అట్టి పాపము చేయుటకు ప్రవృత్తి కలుగకుండా చేసి ఉండేది గాన దానికి ప్రయోజనము ఉండెడిది. కాని అది ఇప్పుడు, కలిగినందువలన ప్రయోజన మేమీ లేదు గాన అది భ్రాంతియే అని గ్రహించవలెను. ప్రీతి [సంతోష] రూపమైన అనుకూలచిత్తవృత్తి సుఖము. సాత్త్వికమైన (సత్త్వగుణవికారమైన) ఈ చిత్తవృత్తి రాజ్య-పుత్రాది లాభమువలన కలుగును. అట్టి సుఖము కలిగినప్పుడు భవిష్యత్తులో కూడ అట్టి సుఖము కలుగుటకు కారణమైన పుణ్యకార్యములేవీ చేయకుండగా ఊరకనే దానికై ఆశించుట అనే చిత్తవృత్తియే స్పృహ. ఇది తమోగుణవికారము. ఈ సుఖదుఃఖములు

ప్రారబ్ధముచే వచ్చుచుండును. సమాధినుండి చిత్తము బైటకు వచ్చినవుడు చిత్తవృత్తు లుండును గాన ఈ సుఖదుఃఖములు రెండూ కలుగుటకు అవకాశ మున్నది. కాని వివేకవంతునకు దుఃఖము వచ్చినప్పుడు ఉద్వేగము గాని, సుఖము వచ్చినప్పుడు స్పృహ కాని కలుగవు తామసము లైన రాగ-భయ-క్రోధములు కూడ కర్మవలన వచ్చేవి కాన అవి కూడ ఇతనికి ఉండవు. ఇట్టి లక్షణములు గల స్థితప్రజ్ఞుడు శిష్యులకు బోధించుటకై తన అనుభ మును ప్రకటించుచు అనుద్వేగము, నిస్పృహత్వము మొదలైనవాటిని సూచించు మాటలు మాటలాడును అని అర్థము.

మూ. "యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా". 57

యస్మిన్ సత్యన్యదీయే హానివృద్ధీ స్వస్మిన్నారోప్యేతే తాదృశ అన్యవిషయః తామసవృత్తివిశేషః స్నేహః. సుఖహేతుః స్వకలత్రాదిః శుభో విషయః. తద్గుణకథనాదిప్రవర్తికా ధీవృత్తిః అభినన్దః. అత్ర గుణకథనస్య పరప్రరోచనార్థత్వాభావేన వ్యర్థత్వాత్ తద్ధేతుః అభినన్దః తామసః. అసూయోత్పాదనేన దుఃఖహేతుః పరకీయ విద్యాదిః ఏనం ప్రత్యశుభో విషయః. తన్నిన్దాప్రవర్తికా ధీవృత్తిః ద్వేషః. సోఽపి తామసః; తన్నిన్దాయాః నివారణార్థత్వాభావేన వ్యర్థత్వాత్. త ఏతే తామసా ధర్మాః కథం వివేకిని సంభవేయుః ?

వ్యా. "ఎవ్వడు దేనియందూ స్నేహము లేనివాడో, ఎవ్వడు ఆ యా శుభాశుభములు కలిగినప్పుడు ఆనందమును కాని, ద్వేషమును కాని పొందడో ఆతని ప్రజ్ఞ స్థిర మైనది".

ఏది (ఏభావము) ఉండుటచేత ఇతరులకు చెందిన హానివృద్ధులను తనపై ఆరోపించుకొనునో అట్టి, ఇతరుల విషయమునందు ఉండే వృత్తి విశేషము స్నేహము ఇది తమోగుణజన్యము. సుఖమునకు హేతువైన స్వభార్యాదివిషయము శుభము. ఆ భార్యాదుల గుణములను వర్ణించు నట్లు

ప్రేరేపించు బుద్ధివృత్తి అభినందము. ఈ గుణకథనము ఇతరుల ప్రరోచనమునకై (ఆనందము కలిగించుటకై) చేయబడునది కాదు గాన వ్యర్థము. అందుచేత ఆ గుణకథనమునకు హేతువైన అభినందము తామసము అసూయను కలిగించుట ద్వారా దుఃఖమునకు హేతువైన ఇతరుల విద్యాదికము ఇతనికి సంబంధించినంతవరకు అశుభవిషయము. నిందయందు ప్రవర్తింప చేయు చిత్తవృత్తి ద్వేషము. ఆ నిందకు నివారణరూపమైన ప్రయోజనము లేదుగాన అది వ్యర్థము. అనగా ఎవరైన దుష్కార్యము చేయుచున్నప్పుడు ఆతనిని నిందించినచో ఆతడు ఆ దుష్కార్యమునుండి నివర్తించును. ఆ నిందకు దుష్కార్యనివర్తనము ప్రయోజనము. కాని విద్యాదులచే అధికుడైన వానిని చూచి అసూయచే అతనిని నిందించుటకు నివారణమువంటి ప్రయోజనము లేదు అని అర్థము. అందుచేత ఆ నింద తామసము. తామసములైన ఇట్టి ధర్మములు వివేకవంతునకు ఎట్లు ఉండును ?

మూ. "యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా". 58

వ్యుత్థితస్య పమస్తతామసవృత్త్యభావః పూర్వశ్లోకాభ్యామభిహితః; సమాహితస్య తు వృత్తయ ఏవ న సన్తి; కుతస్తామసత్వ శఙ్కా ఇత్యభిప్రాయః.

వ్యా. "కూర్మము తన అవయవములను ముణుచుకొన్నట్లు ఇతడు ఎప్పుడు తన ఇంద్రియములను సమస్తములైన ఇంద్రియార్థములనుండి ఉపసంహరించుకొనునో అప్పుడు ఆతని ప్రజ్ఞ స్థిరముగా ఉండును.

సమాధినుండి బైటకు వచ్చినవానికి (వ్యుత్థితునకు) తామసవృత్తులేవీ ఉండవని వెనుకటి రెండు శ్లోకములలో చెప్పబడినది. సమాధిలో ఉన్నవానికి చిత్తవృత్తులే ఉండవు. తామసవృత్తు లుండు ననే శంకకు కూడ అవకాశము ఎట్లుండును అని అభిప్రాయము

మూ. "విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే". 59

ప్రారబ్ధం కర్మ కాంశ్చిద్విషయాంశ్చన్ద్రోదయాన్ధకారాదిరూపాన్ స్వయమేవ సంపాదయతి, అన్యాంస్తు గృహక్షేత్రాదీన్ పురుషోద్యోగ ద్వారేణ. తత్ర చన్ద్రోదయాదయః పూర్ణేనేన్ద్రియాదిసంహారలక్షణేన సమాధినైవ నివర్తన్తే, నాన్యథా. గృహాదయస్తు సమాధిమన్తరేణాపి నివర్తన్తే. ఆహరణమ్ ఆహారః, ఉద్యోగః. నిరుద్యోగస్య గృహాది విషయా నివర్తన్తే; రసస్తు న నివర్తతే, రసో మానసీ తృష్ణా. సాపి పరమానన్దరూపస్య బ్రహ్మణః దర్శనే సతి స్వల్పానన్దహేతుభ్యో నివర్తతే "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాయం లోకః" (బృ.ఉ. 4.4.22) ఇతి శ్రుతేః.

వ్యా. "ప్రయత్నము చేయని మానవునకు ఆశ తప్ప మిగిలిన విషయము లన్నీ దూరమగును. పరమాత్మను చూచిన పిమ్మట ఆ తృష్ణ కూడ తొలగును".

సుఖదుఃఖాదిహేతువు లైన చంద్రోదయాంధకారాదివిషయములను కొన్నింటిని ప్రారబ్ధమే స్వయముగ సంపాదించి అందించును. గృహములు, పొలములు మొదలైన ఇతర విషయములను ప్రారబ్ధము పురుషప్రయత్న సహకారముతో సంపాదించి పెట్టును సమాధియందు ఇంద్రియాదులను పూర్తిగా ఉపసంహరించు కొన్నప్పుడే ఆ చంద్రోదయాదులు నివర్తించును (దూరమగును) గాని మరొక విధముగా కావు. గృహాదులు మాత్రము సమాది లేకపోయినను నివర్తించును. ఆహరణ మనగా సంపాదించుట? అనగా ప్రయత్నము ప్రయత్నము చేయని వానికి గృహాదివిషయములు నివర్తించును, రసము మాత్రము నివృత్తము కాదు రస మనగా మనస్సులో ఉన్న ఆశ పరమానందరూప మైన పరబ్రహ్మసాక్షాత్కారము కలగగానే స్వల్పానంద హేతువు లైన విషయములనుండి ఆ తృష్ణ కూడ తొలగి

పోవును. "ఆత్మరూప మైన లోకము గల మనము సంతానముతో ఏమి చేయుదుము ?" అని బృహదారణ్యకోపనిషత్తులో చెప్పబడినది కదా; అందుచేత ఆత్మసాక్షాత్కారము పొందినవానికి ఇతరవిషయములతో పనిలేదు

మూ. "యతతోహ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః. **60**

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా". **61**

ఉద్యోగత్యాగబ్రహ్మదర్శనప్రయత్నం కుర్వతోఽపి కాదాచిత్క-ప్రమాదపరిహారాయ సమాధ్యభ్యాసః. తదేతత్కిమాసీతేతి ప్రశ్నస్య ఉత్తరమ్

**వ్యా.** అర్జునా! విద్వాంసుడైన పురుషుడు ఎంత ప్రయత్నము చేయుచున్నను కష్టజనకములైన ఇంద్రియములు మనస్సును బలాత్కారముగా హరించుచుండును. వాటిని అన్నింటిని నియమించుకొని, నాయందే మనస్సు నిలిపి. సమాధియుక్తుడై ఉండవలెను ఎవడు ఇంద్రియములను వశములో ఉంచుకొనునో ఆతని ప్రజ్ఞ స్థిరముగా ఉండును ఇతరయత్నములను త్యజించుటకు. బ్రహ్మదర్శనమునకు ప్రయత్నము చేయుచున్నను ఎప్పుడైన ప్రమాదము కలుగవచ్చును. అట్టి ప్రమాదమును పరిహరించుకొనుటకై సమాధ్యభ్యాసము చేయవలెను. ఇది "కిమాసీత" అను ప్రశ్నకు సమాధానము.

మూ. "ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే, **62**

క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి". **63**

అసతి సమాధ్యభ్యాసే ప్రమాదప్రకార ఉపన్యస్తః. సంగో ధ్యేయవిషయసంనిధిః. సంమోహః వివేకపరాఙ్ముఖత్వమ్. స్మృతి విభ్రమస్తత్త్వానుసంధానాభావః. బుద్ధినాశో విపరీతభావనోపచయదోషప్రతిబద్ధస్య జ్ఞానస్య మోక్షప్రదత్వసామర్థ్యాభావః.

వ్యా "విషయములను గూర్చి ఆలోచించుచున్న పురుషునకు వాటి యందు సంగము కలుగును సంగమువలన కామము కలుగును. కామము వలన క్రోధము కలుగును క్రోధమువలన సంమోహము కలుగును. సంమోహము వలన స్మృతివిభ్రమము కలుగును. స్మృతివిభ్రమము వలన బుద్ధి నశించును. బుద్ధి నాశము వలవ తానే నశించును" సమాధ్యభ్యాసము చేయనిచో ప్రమాదము కలుగు విధము చెప్పబడినది. సంగః=ఆలోచించు చున్న విషయముల సంనిధి సంమోహః = వివేకమునందు శ్రద్ధ లేక పోవుట. స్మృతివిభ్రమః=తత్త్వానుసంధానము చేయకుండుట. బుద్ధినాశః= విపరీత భావన పెరిగిపోవుట అను దోషముచేత జ్ఞానమునకు ప్రతిబంధ మేర్పడగా అది మోక్షము నీయ గలిగిన సామర్థ్యమును కోల్పోవుట.

మూ. "రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి". **64**

విధేయాత్మత్వం వశీకృతమనస్త్వమ్. ప్రసాదః నైర్మల్యమ్. బన్ధరాహిత్యమ్, సమాధ్యభ్యాసయుక్తః తద్వాసనాబలాత్ వ్యుత్థాన దశాయామ్ ఇన్ద్రియైః వ్యవహరన్నపి ప్రసాదం సమ్యక్ ప్రాప్నోతి, తదేతత్ కిం వ్రజేతేతి ప్రశ్నోత్తరమ్. ఉపరితనేనాపి బహునా గ్రన్థేన స్థితప్రజ్ఞః ప్రపఞ్చితః.

వ్యా. "రాగద్వేషములు లేనివి, తన వశములో ఉన్నవి అయిన ఇంద్రియములతో విషయములను అనుభవించుచున్నను, వశములో ఉన్న మనస్సు కలవాడు ప్రసాదమును పొందును".

విధేయాత్మత్వమ్=మనస్సును, వశములో ఉంచుకొనుట. ప్రసాదః= నిర్మలత్వము=బంధము లేకపోవుట. సమాధ్యభ్యాసములో ఉన్నవాడు వ్యుత్థాన దశలో ఇంద్రియములతో వ్యవహరించుచున్నను, సమాధ్యభ్యాస వాసనాబలముచేత ప్రసాదమును పొందును. ఇది "కిం వ్రజేత" అనుదానికి సమాధానము. పైనున్న గ్రంథముచేత కూడ విస్తృతముగా స్థితప్రజ్ఞుని లక్షణము వివరింపబడినది.

మూ. నను ప్రజ్ఞాయాః స్థిత్యుత్పత్తిభ్యాం ప్రాగపి సాధనత్వేన రాగద్వేషాదిరాహిత్యమపేక్షితమ్. బాఢమ్ తథాప్యస్తి విశేషః స చ శ్రేయోమార్గకారైః దర్శితః—

"విద్యాస్థితయే ప్రాగ్యే సాధనభూతాః ప్రయత్ననిష్పాద్యాః
లక్షణభూతాస్తు పునః స్వాభావత స్తే స్థితాః స్థితప్రజ్ఞే"
"జీవన్ముక్తిరితీమాం వద న్త్యవస్థాం స్థితాత్మసంబోధామ్
బాధితభేదప్రతిభామబాధితాత్మావబోధసామర్థ్యాత్". ఇతి.

వ్యా. (ఆశంక) ప్రజ్ఞ ఉత్పన్న మగుటకు నిలచుటకు పూర్వము కూడ ప్రజ్ఞాసాధనముగా రాగద్వేషాదులు లేకుండుట ఆవశ్యకమే కదా ? (సమాధానము) నిజమే ! కాని ఒక విశేష మున్నది. దానిని "శ్రేయోమార్గ" కారులు చూపినారు :-

"విద్యా (ప్రజ్ఞా)స్థితికి పూర్వము తత్సాధనముగా వేటిని ప్రయత్నముచేత సంపాదింపవలసి ఉన్నదో అవే స్థితప్రజ్ఞునిలో అతని సహజలక్షణములై నిలచి ఉన్నవి." "ఆత్మజ్ఞానము స్థిరముగా ఉండే ఈ అవస్థను "జీవన్ముక్తి" అని అందురు. ఈ స్థితిలో ఆత్మజ్ఞానము బాధింపబడకుండుట చేత అభేద జ్ఞానము ఏ మాత్రము చలించదు".

మూ. భగవద్భక్తో ద్వాదశాధ్యాయే భగవతా వర్ణితః-

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః". 14

ఈశ్వరార్పితమనస్త్వేన సమాహితస్యాన్యాన్యానుసంధానాభావాత్, వ్యుత్థితస్యాప్యుదాసీనానుసంధానేన హర్షవిషాదాభావాచ్చ సుఖదుఃఖసామ్యమ్. ఏవం వక్ష్యమాణేష్వపి ద్వన్ద్వేషు ద్రష్టవ్యమ్.

వ్యా. "ఏ ప్రాణులను ద్వేషించనివాడు, మైత్రి, కరుణా కలవాడు, మమకారము గాని అహంకారముకాని లేనివాడు, సుఖమును దుఃఖమును సమముగా చూచువాడు, ఓర్పు కలవాడు, నిత్యము సంతృప్తి కలవాడు, యోగి, మనస్సు అదుపులో ఉన్నవాడు, దృఢమైన నిశ్చయము కలవాడు, నా భక్తుడై నాయందే మనోబుద్ధులను నిలిపినవాడు అయిన పురుషుడు నాకు ఇష్టుడు".

మనస్సును ఈశ్వరుని యందు నిలుపుటచే ఏకాగ్ర చిత్తము గల ఆ భక్తునకు ఇతరవస్తువులపై దృష్టి ఉండదు. అతడు వ్యుత్థానదశలో కూడ వివిధ విషయములపై ఔదాసీన్యమునే అవలంబించును. అందుచే ఆతనికి హర్షము గాని విషాదము గాని ఉండవు గాన సుఖమైనను దుఃఖమైనను ఆతనికి సమమే. చెప్పబోవు ద్వంద్వముల విషయమునందు కూడ ఇట్లే చూచుకొనవలెను.

మూ. "యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః". 15

వ్యా. "ఎవనికి లోకము భయపడదో, ఎవడు లోకమునకు భయపడడో, ఎవడు సంతోషమును, కోపమును, భయమును, ఏవగింపును విడచి, నాడో ఆతడు నాకు ఇష్టుడు."

మూ. "అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః". 16

వ్యా, "కోరికలు లేనివాడు పరిశుద్ధుడు, నేర్పు గలవాడు, ఉదాసీనుడు, వ్యథలన్నీ పోయినవాడు, అన్ని ప్రయత్నములను విడచువాడు అయిన నా భక్తుడు నాకు ఇష్టుడు"

మూ. "యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః". **17**

వ్యా. "శుభాశుభములను పరిత్యజించి, నాయందు భక్తి కలవాడై ఎవడు హర్షించడో, ద్వేషించడో, దుఃఖించడో, దేనినీ కోరడో అతడు నాకు ఇష్టుడు."

మూ. "సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సఙ్గవివర్జితః." **18**
"తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః". **19** ఇతి

వ్యా. "శత్రుమిత్రులను, మానావమానములను సమముగా చూచువాడు, శీతోష్ణములయందు, సుఖదుఃఖములయందు సమముగా ఉండువాడు, దేనియందు ఆసక్తి లేనివాడు, నిందాస్తుతులను తుల్యముగా గ్రహించువాడు, మౌనవంతుడు, లభించిన దానితో తృప్తి చెందువాడు స్థిరనివాస స్థానము లేనివాడు, స్థిరమైన బుద్ధి కలవాడు అయిన భక్తుడైన నరుడు నాకు ఇష్టుడు."

మూ. అత్రాపి పూర్వవద్విశేషో వార్త్తికకారైర్దర్శితః—

"ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః
అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః". –

(నైష్కర్మ్యసిద్ధి. 4.69) ఇతి.

వ్యా. ఇందులో కూడ విశేషమును పూర్వమునందు వలెనే వార్తికకారులైన సురేశ్వరాచార్యులు చూపినారు—

"ఆత్మజ్ఞానము కలిగిన ఈ యోగికి ద్వేషించకపోవుట మొదలైన గుణములు అప్రయత్నముగానే సిద్ధించును. సాధనములుగా ఉండవు"

మూ. గుణాతీతశ్చతుర్దశాధ్యాయే, వర్ణితః-

అర్జున ఉవాచ-

"కైర్లిఙ్గైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే". 21

త్రయో గుణాః సత్త్వరజస్తమాంసి. తేషాం పరిణామవిశేషాత్ సర్వః సంసారః ప్రవర్తతే. అతో గుణాతీతత్వమ్ అసంసారిత్వమ్. జీవన్ముక్తత్వమితి యావత్. లిఙ్గాని పరేషామేతదీయగుణాతీతత్వబోధకాని. ఆచారః ఆచరణమ్, తదీయమనఃసంచారప్రకారః. కథమితి సాధనప్రకారప్రశ్నః.

వ్యా. గుణాతీతుడు పదునాల్గవ అధ్యాయములో వర్ణింపబడినాడు-

అర్జునుడు పలికెను "ఓ! ప్రభూ! ఏ గుర్తులచేత ఇతడు త్రిగుణములను అతిక్రమించినాడని చెప్పవచ్చును? అతని ఆచరణము ఎట్లుండును? ఈ మూడు గుణములను ఎట్లు అతిక్రమించును?"

మూడు గుణము లనగా సత్త్వరజస్తమస్సులు. వాటి పరిణామ విశేషము చేతనే ఈ సంసార మంతా నడచుచున్నది. అందుచేత గుణాతీతత్వము (గుణములను అతిక్రమించుట) అనగా సంసారము లేకుండుట; అనగా జీవన్ముక్తత్వము. "ఇతడు గుణాతీతుడు' అని ఇతరులు గుర్తించుటకు ఉపకరించు చిహ్నములు లింగములు. ఆచారము అనగా ఆచరణము అతని మనస్సు ప్రవర్తించే పద్ధతి. "ఎట్లు అతిక్రమించును?" అనేది అతనికి గుణములను దాటుటకు సాధనము లేవి అని ప్రశ్న.

మూ. శ్రీభగవానువాచ-

"ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి". 22

వ్యా. శ్రీకృష్ణుడు పలికెను :—

"అర్జునా ! (గుణాతీతుడు) సత్త్వధర్మమైన ప్రకాశము, రజోగుణ ధర్మమైన ప్రవృత్తి, తమోగుణ ధర్మమైన మోహము ప్రవర్తించుచున్నపుడు వాటిని ద్వేషించడు; అవి ప్రవర్తించవలెనని కోరుకొనడు".

మూ. "ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే. 23
సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః. 24
మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే." 25

వ్యా. ఎవడు ఉదాసీనుడు వలె (దేనితోను ఏ సంబంధమూలేనివాడు వలె) కూర్చుండి గుణములచేత చలింప చేయబడడో, గుణములు వాటి పని అవి చేయుచున్నవి అని భావన చేయుచు తాను ఏ మాత్రము చలించడో, ఎవడు సుఖదుఃఖములను సమముగా చూచుచు స్వస్థుడై ఉండునో, మట్టి బెడ్డను, ఱాతిముక్కను, బంగారమును సమముగా చూచునో, ప్రియము కలిగినను అప్రియము కలిగినను తుల్యుడుగా ఉండునో తనను ఎవరైన నిందించినను స్తుతించినను తుల్యముగానే ఉండునో, ధీరుడైన ఎవడు మానావమానములను సమముగా చూచునో, మిత్రపక్షము నందు శత్రు పక్షమునందు సమముగా ప్రవర్తించునో, సర్వకార్యములను త్యజించునో అతడు గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

మూ. "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే." 26

వ్యా. "ఎవడు నన్ను వ్యభిచరించని (మార్పు లేని) భక్తియోగముతో సేవించునో అతడు ఈ గుణములను అతిక్రమించి బ్రహ్మత్వమును సంపాదించుటకు సమర్థుడగును."

మూ. ప్రకాశప్రవృత్తిమోహాః సత్త్వరజస్తమోగుణాః. తే చ జాగ్రత్స్వప్నయోః ప్రవర్తన్తే. సుషుప్తిసమాధిశూన్యచిత్తవృత్త్యవస్థాసు నివర్తన్తే. ప్రవృత్తిశ్చ ద్వివిధా-అనుకూలా ప్రతికూలా చేతి తత్ర మూఢో జాగరణే ప్రతికూలప్రవృత్తిం ద్వేష్టి; అనుకూలప్రవృత్తిమ్ ఆకాఙ్క్షతి. గుణాతీతస్య తు అనుకూలప్రతికూలాధ్యాసాభావాత్ ద్వేషాకాఙ్క్షే న స్తః. యథా ద్వయోః కలహం కుర్వాణయోః అవలోకయితా కశ్చిత్ తటస్థః స్వయం కేవలముదాస్తే, న తు జయపరాజయాభ్యామితస్తతశ్చాల్యతే, తథా గుణాతీతః వివేకీ స్వయముదాస్తే. "గుణా గుణేషు వర్తన్తే, న త్వహమ్" ఇతి వివేకాత్ ఔదాసీన్యమ్. "అహమేవ కరోమి" ఇత్యధ్యాసః విచలనమ్; న చాస్య తదస్తి. తదిదం కిమాచార ఇత్యస్య ప్రశ్నస్య ఉత్తరమ్. సమదుఃఖసుఖాదీని లిఙ్గాని, అవ్యభిచారిభక్తిసహితజ్ఞానధ్యానాభ్యాసేన పరమాత్మసేవా చేతి గుణాత్యయసాధనప్రశ్నస్య ఉత్తరమ్.

వ్యా. ప్రకాశప్రవృత్తి మోహాః=సత్త్వ రజస్తమోగుణములు అవి జాగ్రత్స్వప్నావస్థలలో ప్రవర్తించును. సుషుప్తియందు సమాధియందు, చిత్తవృత్తి శూన్యముగా ఉండు అవస్థయందు అవి నివర్తించును. అనుకూలము, ప్రతికూలము అని ప్రవృత్తి రెండు విధములు, జాగ్రదవస్థలో మూఢుడు, ప్రతికూలప్రవృత్తిని ద్వేషించును; అనుకూలప్రవృత్తిని కోరుకొనును. కాని గుణాతీతునకు "ఇది అనుకూలము, ఇది ప్రతికూలము" అను అధ్యాస లేకపోవుటచేత ద్వేషము కాని కోరిక గాని ఉండదు. ఇద్దరు కలహించుచున్నప్పుడు తటస్థుడై చూచుచున్నవాడు కేవలము ఉదాసీనుడుగా ఉండును. కలహించుచున్నవారికి కలిగే జయపరాజయములచేత అతడు

ఇటు అటు చలించడు అట్లే గుణాతీతుడైన వివేకవంతుడు తాను ఉదాసీనుడుగానే ఉండును. అతనికి ఆ ఔదాసీన్యము - "గుణములు గుణముల యందు ప్రవర్తించుచున్నవి; నేను ప్రవర్తించుటలేదు" అను వివేకమువలన కలిగినది. విచలనము అనగా "నేనే చేయుచున్నాను'' అను అధ్యాసము. వీనికి ఆ విచలనము లేదు ఇది "కిమాచారః?'' అను ప్రశ్నకు సమాధానము, సమదుఃఖసుఖాదులు గుర్తులు, ''గుణాతీతు డగుటకు సాధన మేమి?'' అను ప్రశ్నకు స్థిరమైన భక్తితో కూడిన జ్ఞానధ్యానాభ్యాసము, పరమాత్మసేవ సాధనములు అని సమాధానము.

మూ. బ్రహ్మణో వ్యాసాదిభిర్వర్ణితః-

"అనుత్తరీయవసనమనుపస్తీర్ణశాయినమ్
బాహూపధాయినం శాన్తం తం దేవా బ్రాహ్మణం విదుః."
– మహాభా. అను. పర్వ 251

బ్రాహ్మణశబ్దో బ్రహ్మవిద్వాచీతి "అథ బ్రాహ్మణః" ఇతి శ్రుత్యా వర్ణితమ్. బ్రహ్మవిదశ్చ విద్వత్సంన్యాసాధికారాత్. "యథాజాత రూపధరో నాచ్ఛాదనం చరతి పరమహంసః" ఇత్యాదిశ్రుత్యా పరిగ్రహ రాహిత్యస్య ముఖ్యత్వాభిధానాత్ అనుత్తరీయత్వాదికం తస్య యుక్తమ్.

**వ్యా.** బ్రాహ్మణుడు వ్యాసాదులచేత వర్ణింపబడినాడు-

"ఎవడు ఉత్తరీయము, కట్టుకునే వస్త్రము లేనివాడో, పక్క పరచుకొనకుండా పండుకొనునో, బాహువును తలగడగా ఉపయోగించునో, శాంతుడైన అట్టివాడు బ్రాహ్మణుడు అని దేవతలు చెప్పుదురు.''

"బ్రాహ్మణ'' శబ్దమునకు బ్రహ్మవేత్త అని అర్థము" అని "అథ బ్రాహ్మణః'' ఇత్యాది శ్రుతివాక్యమునందు వర్ణింపబడినది అట్టి బ్రహ్మవేత్తకే, విద్వత్సంన్యాసమునందు అధికారము కదా ? "పరమహంస పుట్టినప్పుడు ఎట్లుండునో అట్టి రూపమును ధరించి (దిగంబరుడై) అచ్ఛాదన మేమీ లేకుండా సంచరించును" ఇత్యాదిశ్రుతివాక్యము పరిగ్రహము (వస్తుసంచ

యము) లేకుండుట ముఖ్య మని చెప్పుటచే ఆ పరమహంస ఉత్తరీయాదులను ధరించకుండుట యుక్తమే.

మూ. "యేన కేన చిదాచ్ఛన్నో యేన కేన చిదాశితః
యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః."
-మ.భా.అను. 251

దేహనిర్వాహాయ అశనాచ్ఛాదనశయనస్థానాపేక్షాయామపి అశనాదిగతౌ గుణదోషౌ నాన్విష్యేతే, ఉదరపూరణపుష్ట్యాదిరూపస్య నిర్వాహస్య సమత్వాత్ నిష్ప్రయోజనస్య గుణదోషవిచారస్య చిత్తదోషత్వాత్. అత ఏవ భాగవతే పఠ్యతే-

"కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః
గుణదోషదృశిర్దోషో గుణస్తూభయవర్జితః." ఇతి.

వ్యా. "ఏదో ఒకటి ఆచ్ఛాదించుకొని, ఏదో ఒకటి తినుచు ఎక్కడనో అక్కడ శయనించు వాడు "బ్రాహ్మణుడు" అని దేవతలు చెప్పుదురు."

దేహమును నిర్వహించుకొనుటకు ఆహారము, ఆచ్ఛాదనము, పండుకొనుటకు స్థానము ఆవశ్యకములే అయినను ఆ భోజనాదులలోని గుణదోషములను అన్వేషించకూడదు. ఆహారము రుచిగా ఉన్నను లేకపోయినను పొట్ట నిండుట పుష్టి కలుగుట మొదలైన శరీరనిర్వాహము సమమేగాన గుణదోషవిచారము నిష్ప్రయోజనము అట్టి విచారము చిత్తదోషము. అందుచేతనే భాగవతములో ఇట్లు చెప్పబడినది-"గుణదోషముల లక్షణములను గూర్చి ఎక్కువగా వర్ణించి ఏమి ప్రయోజనము? (ఒక్క వాక్యములో చెప్పవలె నంటే) గుణదోషములను అన్వేషించుట ' దోషము"; వాటిని అన్వేషించకుండుట "గుణము"

మూ. "కన్థాకౌపీనవాసాస్తు దణ్డధృగ్ ధ్యానతత్పరః
ఏకాకీ రమతే నిత్యం తం దేవా బ్రాహ్మణం విదుః."
(మ.భా. అను 251)

బ్రహ్మోపదేశాదినా ప్రాణ్యనుజిఘృక్షయా ముత్తమత్వజ్ఞాపనేన శ్రద్ధాముత్పాదయితుం దణ్డకౌపీనాదిలిఙ్గం ధారయేత్. "కౌపీనం దణ్డమాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకోపకారార్థాయ చ పరిగ్రహేత్" (పరమ. ఉప. 1) ఇతి శ్రుతేః, అనుజిఘృక్షయాపి స్వయం తదీయాం గృహకృత్యాదివార్తాం న కుర్యాత్, కిం తు ధ్యానపరో భవేత్. "తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథ" (ము.ఉ. 2.2.5) ఇతి శ్రుతేః.

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః.
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచోవిగ్లాపనం హి తత్."
(బృ.ఉ. 4.4.21)

ఇతి శ్రుతేశ్చ. బ్రహ్మోపదేశస్త్వన్యా వాఙ్నభవతీతి స ధ్యానవిరోధీ, తచ్చ ధ్యానమేకాకిత్వే నిర్విఘ్నం భవతి. అత ఏవ స్మృత్యన్తరే ఽభిహితమ్.

"ఏకో భిక్షుర్యథోక్తః స్యాద్ ద్వావేవ మిథునం స్మృతమ్
త్రయో గ్రామః సమాఖ్యాత ఊర్ధ్వం తు నగరాయతే
నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిథునం తథా
రాజాదివార్తా తేషాం స్యాద్ వార్తా పరస్పరమ్." ఇతి.

వ్యా "ఎవడు బొంతలను, కౌపీనమును, దండమును ధరించి, ధ్యానతత్పరుడై ఒంటరిగా ఆనందముతో ఉండునో అతడే బ్రాహ్మణుడు అని దేవతలు చెప్పుదురు."

బ్రహ్మోపదేశాదులచేత ఇతరులను అనుగ్రహించవలె నను ఇచ్ఛ ఉన్నచో తన ఉత్తమత్వమును (బ్రహ్మోపదేశాదిసమర్థత్వమును) ఇతరులకు సూచించి వారిలో శ్రద్ధను కలిగించుటకై దండకౌపీనాదిలింగములను ధరించవలెను. "తన శరీరమునకు భోగముకొరకు, లోకోపకారముకొరకు కౌపీనమును, దండమును, కప్పుకొనే వస్త్రమును స్వీకరించవలెను" అని శ్రుతి

చెప్పుచున్నది. అనుగ్రహించవలె నను ఇచ్ఛ ఉన్నను తనంత తానుగా ఇతరుల గృహకృత్యాదివిషయములను ముచ్చటించకూడదు. కేవలము ధ్యానపరుడై ఉండవలెను "ఒక్క ఆ ఆత్మనే తెలిసికొనుడు ఇతరములైన మాటలు విడిచిపెట్టుడు" అని శ్రుతి చెప్పుచున్నది "ధీరుడైన బ్రాహ్మణుడు ఆ పరమాత్మనే తెలిసికొని జ్ఞానమును సంపాదించవలెను. చాలా శబ్దములను ఆలోచించకూడదు (పలకకూడదు) అది వ్యర్థముగా వాక్కునకు అలసట కలిగించుట అగును" అని కూడ శ్రుతి చెప్పుచున్నది. అయితే ఇతరులకు బ్రహ్మోపదేశము చేయుట ఇతరవాక్కు కాదు; ఆత్మకు సంబంధించినదే; అందుచేత అది ధ్యానమునకు విరోధి కాదు.

ఆ ధ్యానము కూడ ఏకాకిగా ఉన్నప్పుడే నిర్విఘ్నముగా సాగును. అందుచేతనే మరొకస్మృతిలో ఇట్లు చెప్పబడినది-"పూర్వమునందు చెప్ప బడిన సంన్యాసి ఒంటరిగానే ఉండవలెను. ఇద్దరు సంన్యాసులు ఒక్కచోట చేరినచో అది మిథున మగును. ముగ్గురు చేరినచో అది గ్రామము. అంతకు మించిన సంఖ్యలో చేరినచో నగర మగును. నగరమును గాని, గ్రామమును గాని, మిథునమును గాని చేయకూడదు. మిధునాదిరూపమున కలిసిన సంన్యాసుల మధ్య రాజాదులను గూర్చిన కబుర్లు, భిక్షను గూర్చిన కబుర్లు వచ్చును.

మూ. "నిరాశిషమనారమ్భం నిర్నమస్కారమస్తుతిమ్
అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః
(మ.భా. అను. **251**)

విశిష్టైః సంసారిభిః ప్రణమతాం పురుషాణామాశీర్వాద ప్రయుజ్యతే. యస్య యదపేక్షితం తం ప్రతి తదభివృద్ధిప్రార్థనమాశీః. తథా చ పురుషాణాం భిన్నరుచిత్వాత్ తదభిమతాన్వేషణే వ్యగ్రచిత్తస్య లోకవాసనా వర్ధతే. సా చ జ్ఞానవిరోధినీ. తథా చ స్మృత్యన్తరమ్–

"లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయా పి చ
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే."

వ్యా. ''ఆశీర్వాదము చేయనివాడు, కార్యారంభమును, నమస్కారమును, స్తుతిని చేయనివాడు, క్షీణుడు కానివాడు, కర్మలను క్షీణింపచేసి కొనినవాడు బ్రాహ్మణుడు అని దేవతలు చెప్పుదురు "

విశిష్టులైన సంసారములో ఉన్నవారు (గృహస్థాదులు) నమస్కరించు వారికి ఆశీర్వాధము చేయుచుందురు. ఎవరెవరికి ఏధి ఏది ఇష్టమో వారి వారికి ఆ యా అభివృద్ధికలుగవలె ననికోరుట ఆశీర్వాదము. పురుషుల రుచులు వేరువేరుగా ఉండును. అందుచేత ఎవరికి ఏది ఇష్టమో తెలిసి కొనుటలో చిత్తము వ్యగ్రమైనచో వానికి లోకవాసన వృద్ధి పొందును. అది జ్ఞానమునకు ప్రతిబంధకము. ఈ విషయమునే మరి యొక స్మృతి ఇట్లు చెప్పుచున్నది.

"మానవునకు లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన ఉన్నంతవరకు యథార్థజ్ఞానము కలుగదు

మూ. ఏదచ్చారమ్భనమస్కారాదిష్వపి ద్రష్టవ్యమ్. ఆరమ్భః స్వార్థం పరోపకారార్థం వా గృహక్షేత్రాదిసంపాదనప్రయత్నః. తావేతావాశీర్వాదారమ్భౌ ముక్తేన త్యాజ్యౌ. న చాశీర్వాదాభావే ప్రణమతాం నృణాం ఖేదః శఙ్కనీయః; లోకవాసనాఖేదయోరుభయోః పరిహారాయ నిఖిలాశీర్వాదప్రతినిధిత్వేన నారాయణశబ్దప్రయోగాత్ ; ఆరమ్భస్తు సర్వోఽపి దుష్ట ఏవ. తథా చ స్మృతిః—
"సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః" (భ.గీ. 18.48)

వ్యా. అరంభ-నమస్కారాదుల విషయములో కూడ ఇట్లే చూచు కొనవలెను. అరంభ మనగా తనకొరకు గాని, ఇతరులకొరకు గాని గృహములు, పొలములు మొదలైనవాటిని సంపాదించుటకై చేయు ప్రయత్నము. ఈ ఆశీర్వాద-అరంభములను రెండింటిని ముక్తుడు త్యజించవలెను. ఆశీర్వా

దము చేయకపోయినచో నమస్కరించినవారిమనస్సుకు ఖేదము కలుగును కదా అని శంకించ పని లేదు. ఎందుచేతననగా సంన్యాసికి లోక వాసన కలుగకుండుటకును, నమస్కరించువారి మనస్సుకు ఖేదము కలుగ కుండుటకును అన్ని ఆశీర్వాదములకు బదులు "నారాయణ" శబ్దము ఉచ్చ రించబడును. అయితే ఆరంభము మాత్రము ఏ విధమైన దైనను చెడ్డదే. "సమస్తములైన ఆరంభములను కూడ, ధూమము అగ్నిని ఆవరించి నట్లు దోషము ఆవరించి ఉండును" అని భగవద్గీతలో చెప్పబడినది.

మూ. నమస్కారోఽపి వివిదిషాసంన్యాసినోఽభిహితః—

"యో భవేత్ పూర్వసంన్యాసీ తుల్యో వై ధర్మతో యది
తస్మై ప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన." ఇతి.

తత్ర పూర్వత్వధర్మతుల్యత్వవిచారే చిత్తం విక్షిప్యతే. అత ఏవ నమస్కారమాత్ర ఏవ బహవః కలహాయమానా ఉపలభ్యన్తే, తత్ర నిమిత్తం వార్తికకారైః దర్శితమ్—

"ప్రమాదినో బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః
సంన్యాసినోఽపి దృశ్యన్తే దైవసందూషితాశయాః."

(1.1584) ఇతి.

వ్యా. అయితే వివిదిషాసంన్యాసికి మాత్రము నమస్కారము కూడ చెప్పబడినది :– "తనకంటె ముందు సంన్యాసము తీసికొన్నవాడు ధర్మము చేత తనతో తుల్యుడైనచో అతనికి నమస్కారము చేయవలెను. ఇతరులకు ఎన్నడును చేయగూడదు."

"ఇతడు నాకంటె ముందు సంన్యాసము స్వీకరించినాడా; ధర్మము చేత నాతో సమానుడా కాడా" అని విచారణ చేయుటలో చిత్తవిక్షేపము కలుగును. అందుచేతనే కేవలము నమస్కారమును గూర్చి చాలామంది సంన్యాసులు కలహించుకొనుచుండుట కనబడుచున్నది. ఇందుకు కారణ మును సురేశ్వరాచార్యులు చూపి ఉన్నారు :-

"ఏమరిపాటుతో ఉన్నవారు, బహిర్ముఖమైన చిత్తము గలవారు, చాడీలు చెప్పువారు; కలహమునందు ఆసక్తి గలవారు, దైవముచేత చెడిపోయిన మనస్సులు గలవారు సంన్యాసులలో కూడ చాలమంది ఉన్నారు."

మూ. ముక్తస్య నమస్కారాభావో భగవత్పాదైర్దర్శితః-

"నామాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యే చేత్ స్థితోఽద్వయే
ప్రణమేత్ కం తదాత్మజ్ఞో న కార్యం కర్మణా తదా."
(ఉప. 17.64) ఇతి

వ్యా. ముక్తుడు నమస్కరించే ప్రసక్తి లేదని భగవత్పాదులు ఉపదేశసాహస్రిలో చెప్పినారు :- "నామాదులకు అతీతమైన భూమిక యైన భేదరహితమైన స్వారాజ్యములో ఉన్న ఆత్మజ్ఞానవంతుడు ఎవరికి నమస్కరించును ? అట్టివానికి ఆ స్థితిలో ఏ కర్మతోను పని లేదు."

మూ. చిత్తకాలుష్యహేతోః నమస్కారస్య ప్రతిషేధేఽపి సర్వసామ్యబుద్ధ్యా ప్రసాదహేతుర్నమస్కారః అభ్యుపేయతే. తథా చ స్మృతిః-

"ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి
ప్రణమేద్దణ్డవద్ భూమావాశ్వచణ్డాలగోఖరమ్." (భాగ.)ఇతి.

వ్యా. చిత్తకాలుష్యమునకు హేతువైన నమస్కారము నిషిద్ధమైనను అన్నింటియందు సమబుద్ధి వహించుటచే చిత్తప్రసాదమును కలిగించు నమస్కారము అంగీకరింపబడును. అందుచేతనే స్మృతి ఇట్లు చెప్పుచున్నది.

"పరమేశ్వరుడే జీవస్వరూపముతో అన్ని ప్రాణులలోను ప్రవేశించి ఉన్నాడు అను నిశ్చయముతో కుక్క, చండాలుడు, గోవు, గాడిద వరకు అన్ని ప్రాణులకు దండప్రణామము చేయవలెను."

మూ. స్తుతిర్మనుష్యవిషయా ప్రతిషిధ్యతే, న త్వీశ్వరవిషయా. తథా చ బృహస్పతిస్మృతిః–

"ఆదరేణ యథా స్తౌతి ధనవన్తం ధనేచ్ఛయా
తథా చేద్విశ్వకర్తారం కో న ముచ్యేత బన్ధనాత్." ఇతి.

వ్యా. మనుష్యులను స్తుతించుట నిషేధింపబడినది గాని ఈశ్వరుని స్తుతి నిషేధింపబడలేదు. అందుచేతనే బృహస్పతి స్మృతి ఇట్లు చెప్పుచున్నది :- ''ధనముమీద ఉన్న కోరికచేత ధనవంతుని ఎంత ఆదరముతో ఎట్లు స్తోత్రముచేయుచున్నాడో ఆ విధముగా ప్రపంచమును సృజించిన పరమేశ్వరుని స్తుతించినచో బంధమునుండి ముక్తిచెందనివాడు ఎవడు ?'

మూ. అక్షీణత్వమ్ అదీనత్వమ్ అత ఏవ స్మృతిః–

"అలబ్ధ్వా న విషాదీ స్యాత్ కాలే యద్యశనం క్వచిత్
లబ్ధ్వా న హృష్యేద్ధృతిమాన్ ఉభయం దైవతన్త్రితమ్." ఇతి

వ్యా అక్షీణత్వము అనగా దీనుడు కాకుండుట. అందుచేతనే స్మృతి ఇట్లు చెప్పుచున్నది :-

''చిత్తస్థైర్యము గల సంన్యాసి ఎక్కడనైనా భోజనసమయమునకు ఆహారము లభించనిచో దిగులుచెందగూడదు. లభించినచో సంతోషించగూడదు. లభించుట, లభించకపోవుట రెండూ దైవాధీనములే.''

మూ. క్షీణకర్మత్వం విధినిషేధానధీనత్వమ్. "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః." ఇతి స్మరణాత్. ఏతదేవాభిప్రేత్య భగవతాప్యుక్తమ్–

"త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్."
(2.45) ఇతి.

నారదః- "స్మర్తవ్యః సతతం విష్ణుర్విస్మర్తవ్యో న జాతుచిత్
సర్వే విధినిషేధాః స్యురేతయోరేవ కింకరాః." (వి.పు.) ఇతి.

వ్యా. క్షీణకర్మత్వము అనగా విధినిషేధములకు అధీనుడు కాకుండుట. "త్రిగుణములకు అతీత మైన మార్గములో సంచరించువానికి విధి ఏమిటి, నిషేధ మేమిటి?" అని స్మృతివాక్యము చెప్పుచున్నది ఈ విషయమునే భగవంతుడు కూడ చెప్పి ఉన్నాడు :-

"అర్జునా! వేదములు మూడు గుణముల పరిధిలోనివి నీవు త్రిగుణాతీతుడవు అగుము. ద్వంద్వములను అతిక్రమించి ఎల్లప్పుడు జ్ఞానమునందు స్థిరుడవై, యోగక్షేమములు లేనివాడవై స్థిర మైన మనస్సు కలవాడవై ఉండుము." నారదుడు కూడ విష్ణుపురాణములో ఇట్లు చెప్పినాడు :-

"ఎల్లవేళలా విష్ణువును స్మరించవలెను, ఎన్నడూ మరువకూడదు. విష్ణువును స్మరించుట, విష్ణువును మరువకుండుట అను ఈ రెండింటికే సమస్తమైన విధినిషేధములు కింకరులు" (స్మరించవలెను అనునది విధి; విస్మరించకూడదు అనునది నిషేధము. ప్రధానముగా పాటించవలసిన విధి నిషేధములు ఇవే. ఇతరములు అప్రధానములు అని భావము)

మూ. అహేరివ గణాద్భీతః సంమానాన్మరణాదివ
కుణపాదివ యః స్త్రీభ్యస్తం దేవా బ్రాహ్మణం విదుః."
(మ.భా. అను 251)

"రాజాదివార్తా తేషాం స్యాత్" ఇత్యుక్తత్వాత్ సర్పవత్ గణాత్ భీతిః ఉపపద్యతే. సంమానస్యాసక్తికారణతయా పురుషార్థవిరోధిత్వాత్ మరణవత్ హేయత్వమ్. "నరకాదివ" ఇతి వా పాఠః. అత ఏవ స్మృతిః-

"అసంమానాత్ తపోవృద్ధిః సంమానాత్తు తపఃక్షయః
అర్చితః పూజితో విప్రోఽదుగ్ధా గౌరివ సీదతి."

పితదేవాభిప్రేత్య అపమానః ఉపాదేయతయా స్మర్యతే-

"తథా చరేత వై యోగీ సతాం ధర్మమనుస్మరన్
జనా యథావమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతిమ్." ఇతి.

స్త్రీషు ద్వివిధో దోషః-ప్రతిషిద్ధత్వమ్, జుగుప్సితత్వం చేతి. తత్ర ప్రతిషిద్ధత్వమాత్రం కదా చిద్రాగాత్ ప్రారబ్ధబలాదుల్లఙ్ఘ్యతే. తదేతదభిప్రేత్యాహ స్మృతిః-

"మాత్రా స్వస్రా దుహిత్రా వా నైకశయ్యాసనో భవేత్
బలవానిన్ద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి." (మను. 2.295)

తథా చ స్మృతిభిః జుగుప్సా వర్ణితా-
"స్త్రీణామవాచ్యదేశస్య క్లిన్ననాడీవ్రణస్య చ
అభేదేఽపి మనోభేదాజ్జనః ప్రాయేణ వఞ్చ్యతే.
చర్మఖణ్డం ద్విధా భిన్నమపానోద్గారధూపితమ్
యత్రరమన్తే నరాస్తత్ర సాహసం కిమతఃపరమ్."

"యే రమన్తే నరాస్తత్ర క్రిమితుల్యాః కథం న తే" ఇతి వా పాఠః. అతః ప్రతిషేధ జుగుప్సయోరుభయోర్వివక్షయా కుణపదృష్టాన్తోఽత్ర అభిహితః.

**వ్యా.** "ఎవడు జనసముదాయమును చూచి సర్పమును చూచి భయపడినట్లు భయపడునో, సంమానము వలన మరణము వలన భయపడి నట్లు భయపడునో, స్త్రీలను చూచి శవము వలన భయపడి నట్లు భయపడునో అతడు బ్రాహ్మణుడు అని దేవతలు చెప్పుదురు."

"రాజాదివార్తా తేషాం స్యాత్" అని వెనుక చెప్పబడినది గాన జనసముదాయమును చూచి సర్పమును చూచి భయపడినట్లు భయపడుట యుక్తమే. ప్రతివానికీ సంమానము పొందుట ఆసక్తికరముగా ఉండును కాని

అది పురుషార్థమునకు విరోధి. అందుచేత అది మరణము వలె హేయము. "నరకాదివ" అని పాఠము కూడ యుక్తము. నరకమువల్ల భయపడినట్లు భయపడవలెను అని దాని అర్థము. అందుచేతనే స్మృతి ఇట్లు చెప్పుచున్నది

"సంమానములు పొందకుండుట వలన తపస్సు (పుణ్యము) వృద్ధి పొందును. సంమానమును పొందుటవలన తపస్సు క్షీణించును సంమానములు, పూజలు అందుకొను చుండే బ్రాహ్మణుడు చివరికి పాలు లేని అవు వలె క్షీణించును."

ఈ అభిప్రాయముతోనే అవమానము గ్రాహ్యము అని స్మృతి చెప్పుచున్నది-

"సత్పురుషు లాచరించిన ధర్మమును స్మరించుచు యోగి, జను లందరూ తనను అవమానించేటట్లు, తన దగ్గరకు రాకుండే టట్లు ప్రవర్తించ వలెను."

స్త్రీలతో నిషేధింపబడుట, జుగుప్సాకరముగా ఉండుట అను రెండు దోషము లున్నవి. వీటిలో ప్రతిషిద్ధత్వము అనేదానిని కొందరు ప్రారబ్ధ బలముచేత రాగమునకు వశంవదులై ఉల్లంఘించుదుందురు. ఈ అభిప్రాయముతోనే స్మృతి ఇట్లు చెప్పుచున్నది—

"తల్లితో గాని సోదరితో గాని, కుమార్తెతో గాని ఒకే శయ్యమీద లేదా ఒకే ఆసనము మీద కూర్చుండ గూడదు ఎందుచేత ననగా చాల బలముగల ఇంద్రియములు ఎంతటి విద్వాంసుని అయినను ఆకర్షించి వేయును" అట్లే స్త్రీల జుగుప్సితత్వమును కూడ స్మృతులు "స్త్రీణామ్" ఇత్యాది శ్లోకములలో వర్ణించినవి. అందుచేత ఇక్కడ (ఆహేరివ ఇత్యాది శ్లోకములో) శవము దృష్టాంతముగా చూపబడినది.

మూ. "యేన పూర్ణమివాకాశం భవత్యేకేన సర్వదా
శూన్యం యస్య జనాకీర్ణం తం దేవా బ్రాహ్మణం విదుః"

(మ.భా. అను. **251**) సంసారిణామేకాకిత్వేనావస్థానం భయాలస్యాది హేతుత్వాద్వర్జ్యమ్. జనసమూహశ్చాతథావిధత్వాదభ్యుపేయః. యోగి

సన్తు తద్విపరీతత్వమ్. ఏకాకిత్వే సతి అవిఘ్నేన ధ్యానానువృత్త్యా పరిపూర్ణేన పరమానన్దాత్మనా సర్వమాకాశం పూర్ణమివావభాసతే. అతో భయాలస్యశోకమోహాదయో న భవన్తి;

"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః." (ఈ.ఉ.7)

ఇతి శ్రుతేః. జనాకీర్ణం స్థానం రాజవార్తాదినా ధ్యానవిరోధిత్వాత్ ఆనన్దాత్మప్రతీతిరహితం తచ్ఛూన్యమివ చిత్తం క్లేశయతి; జగతో మిథ్యాత్వాదాత్మనః పూర్ణత్వాచ్చేత్యర్థః.

వ్యా. "ఎల్లప్పుడు ఒంటరిగానే ఉన్న ఎవనిచేత ఆకాశము నిండి నట్లు ఉండునో, జనులతో నిండిన ప్రదేశము ఎవనికి శూన్యము వలె ఉండునో అతనిని దేవతలు బ్రాహ్మణుడు అని చెప్పుదురు.''

సంసారులు ఒంటరిగా ఉన్నచో అది భయమునకు సోమరితనమునకు హేతువు గాన అది వర్జింపదగినది. జనసమూహము ఉన్న చోట భయము, సోమరితనము ఉండవు గాన అతడు జనసమూహముతో కలిసి ఉండవలెను. కాని యోగి వ్యవహారము దీనికి విపరీతముగా ఉండును. అతడు ఏకాకిగా ఉన్నప్పుడు ఏ విఘ్నములూ లేకుండగ ధ్యానము నడచును గాన ఆకాశ మంతా పరిపూర్ణమైన పరమానంద రూపమైన ఆత్మచేత నింపబడి నట్లు అతనికి భాసించును. అందుచే ఆతనికి భయము, ఆలస్యము శోకము, మోహము మొదలైనవి కలుగవు "జ్ఞానవంతునకు ఏ స్థితిలో సకలభూతములూ కూడ ఆత్మగానే అయిపోయినవో అట్టి స్థితిలో ఉన్న వానికి, ఏకత్వమునే చూచుచున్న వానికి మోహ మెక్కడ, శోక మెక్కడ?" అని శ్రుతి చెప్పుచున్నది. జనులతో నిండిన స్థానములో రాజవార్తాదులు నడచుచుండుటచేత అది ధ్యానమునకు విరోధి గాన ఆనందరూపమైన ఆత్మ సాక్షాత్కారము లేక అది ఆత్మశూన్యమువలె చిత్తమునకు క్లేశమును కలిగించును. జగత్తు మిథ్య అగుట, ఆత్మ పూర్ణమగుట దీనినంతకు కారణము.

మూ. అతివర్ణాశ్రమీ సూతసంహితాయాం ముక్తిఖణ్డే పఞ్చమాధ్యాయే విష్ణుం ప్రతి పరమేశ్వరేణ వర్ణితః-

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోఽథ భిక్షుకః
అతివర్ణాశ్రమీ తేఽపి క్రమాచ్ఛ్రేష్ఠా విచక్షణాః. 9

వ్యా. సూతసంహితలోని ముక్తిఖండములో పంచమాధ్యాయములో పరమేశ్వరుడు అతివర్ణాశ్రమిని (వర్ణభేదమును ఆశ్రమభేదమును అధిగమించిన జీవన్ముక్తుని) గూర్చి విష్ణువునకు ఇట్లు చెప్పినాడు—

"బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సంన్యాసి, అతివర్ణాశ్రమి అని నాలుగు విధములు. వారిలో వెనుకటివారికంటె తరువాతివారు (అనగా బ్రహ్మచారికంటె గృహస్థుడు ఇత్యాది విధమున) శ్రేష్ఠులు; నేర్పుగలవారు."

మూ. అతివర్ణాశ్రమీ ప్రోక్తో గురుః సర్వాధికారిణామ్
న కస్యాపి భవేచ్ఛిష్యో యథాహం పురుషోత్తమ. 14

వ్యా. "ఓ ! పురుషోత్తమా ! అతివర్ణాశ్రమి అందరు అధికారులకు ఆశ్రమములవారికి గురువుగా చెప్పబడినాడు. నావలెనే అతడు కూడ ఎవరికీ శిష్యుడు కాడు"

మూ. అతివర్ణాశ్రమీ సాక్షాద్ గురూణాం గురురుచ్యతే
తత్సమో నాధికశ్చాస్మిన్ లోకేఽస్త్యేవ న సంశయః. 15

వ్యా. "అతివర్ణాశ్రమి గురువులకు కూడ గురువు అని చెప్పబడినాడు. ఈ లోకములో అతనికంటె గొప్పవాడు గాని, అతనితో సమానుడు గాని లేడు; సందేహము లేదు."

మూ. యః శరీరేన్ద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణమ్
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం స్వయంప్రభమ్. 16

పరం తత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్.

వ్యా॥ శరీరేంద్రియాదులకంటె భిన్నము, అన్నింటికి సాక్షి, పరమార్థ జ్ఞానస్వరూపము సుఖస్వరూపము, స్వయముగా ప్రకాశించేది అయిన పరతత్త్వమును ఎవడు తెలిసికొనుచున్నాడో అతడు "అతివర్ణాశ్రమి" అగును.

మూ. యో వేదాన్తమహావాక్యశ్రవణేనైవ కేశవ. 17
ఆత్మానమీశ్వరం వేద సోఽతివర్ణాశ్రమీ భవేత్

వ్యా॥ కేశవా! వేదాంత మహావాక్యములను వినిన వెంటనే ఎవడు తానే పరమేశ్వరు డని తెలిసికొనునో అతడు "అతివర్ణాశ్రమి."

మూ. యో వర్ణాశ్రమనిర్ముక్తమవస్థాత్రయసాక్షిణమ్ 18
మహాదేవం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్

వ్యా॥ వర్ణాశ్రమములచే విడవబడిన (వర్ణాశ్రమాది భేదరహితుడైన), అవస్థాత్రయమునకు (జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు) సాక్షియైన మహాదేవుని (పరమాత్మను) ఎవడు తెలిసికొనుచున్నాడో అతడు "అతివర్ణాశ్రమి".

మూ. "వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః. 19
నాత్మనో బోధరూపస్య మమ తే సన్తి సర్వదా
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్. 20

వ్యా. "మాయచేత దేహమునందు కల్పింపబడిన వర్ణాశ్రమాదులు జ్ఞానస్వరూపమైన ఆత్మనైన నాకు ఎన్నడూ లేవు" అని వేదాంతముల ద్వారా ఎవడు తెలుసుకొనునో అతడు "అతివర్ణాశ్రమి"

మూ. ఆదిత్యసంనిధౌ లోకశ్చేష్టతే స్వయమేవ తు
తథా మత్సంనిధానేన సమస్తం చేష్టతే జగత్. 21
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్.

వ్యా సూర్యుని సంనిధిలో (సూర్యు డున్నంతవరకు) లోకము తనంతట తానే వ్యవహారములు చేయుచున్నది. అట్లే (పరమాత్మ నైన) నా సంనిధానము చేత సకల జగత్తు వ్యవహరించుచున్నది'' అని వేదాంతముల ద్వారా ఎవడు తెలిసికొనునో ఆతడు ''అతివర్ణాశ్రమి''

మూ. సువర్ణే హారకేయూరకటకస్వస్తికాదయః. 22

కల్పితా మాయయా తద్వజ్జగన్మయ్యేవ సర్వదా
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్. 23

వ్యా. ''హారము, బాహుపురులు, కంకణములు, స్వస్తికము మొదలైన ఆభరణములు ఎట్లు బంగారమునందు మాయచేత కల్పింపబడినవో అట్లే ఈ జగత్తు కూడ ఎల్లప్పుడు పరమాత్మ స్వరూపుడ నైన నాయందు కల్పించబడినది'' అని వేదాంతముల ద్వారా తెలిసికొనువాడు ''అతివర్ణాశ్రమి''

మూ. శుక్తికాయాం యథా తారం కల్పితం మాయయా తథా
మహదాది జగన్మాయామయం మయ్యేవ కల్పితమ్. 24

ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్

వ్యా. మాయచేత ముత్యపు గిప్పయందు వెండి కల్పించబడి నట్లు మహత్తత్త్వము మొదలైన ఈ మాయామయమైన జగత్తు అంతా నా యందు కేవలము కల్పితము'' అని వేదాంతముల ద్వారా తెలిసి కొన్నవాడు ''అతివర్ణాశ్రమి''

మూ. చణ్డాలదేహే పశ్వాదిశరీరే బ్రహ్మవిగ్రహే. 25
అన్యేషు తారతమ్యేన స్థితేషు పురుషోత్తమ
వ్యోమవత్సర్వదా వ్యాప్తః సర్వసంబన్ధవర్జితః 26
ఏకరూపో మహాదేవః స్థితః సోఽహం పరామృతః
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్. 27

వ్యా. పురుషోత్తమా! "చండాలదేహమునందు, పశ్వాదుల శరీరము నందు, బ్రాహ్మణుని శరీరమునందు అట్లే తారతమ్యతతో ఉన్న ఇతర శరీరములందు ఎల్లప్పుడు ఆకాశము వలె వ్యాపించి ఉన్న, సకల సంబంధ శూన్యుడైన, అద్వితీయ స్వరూపము గల వినాశరహితుడైన మహాదేవుడు (పరమాత్మ) నేనే" అని వేదాంతములనుండి తెలిసి కొన్నవాడు "అతివర్ణాశ్రమి."

మూ. వినష్టదిగ్భ్రమస్యాపి యథాపూర్వం విభాతి దిక్
తథా విజ్ఞానవిధ్వస్తం జగన్మే భాతి తన్న హి. 28
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్

వ్యా. "నశించిన దిగ్భ్రమ కలవానికైనను దిక్కు పూర్వమునందు వలెనే ఎట్లు భాసించుచుండునో అట్లే ఈ జగత్తు ఆత్మజ్ఞానముచేత నశించినను నాకు కనబడుచున్నది. వాస్తవమున అది లేదు" అని వేదాంతముల ద్వారా ఎవడు తెలుసుకొనునో అతడు "అతివర్ణాశ్రమి".

తన ఎదుట ఉన్నది తూర్పా, ఉత్తరమా అని తెలియక పోవుట దిగ్భ్రమ. ఎవరో చెప్పగానో లేదా సూర్యాదుల స్థితిని పరీక్షించుటచేతనో దిగ్భ్రమ తొలగి పోయినను ఎదుట ఉన్న దిక్కు కనబడుచునే ఉండును. అట్లే ఆత్మసాక్షాత్కారముచేత జగత్తు నశించినను (అసత్యమని తెలిసినను) అది కనబడుచునే ఉండవచ్చును; కాని వాస్తవము కాదని జ్ఞాని గ్రహించును అని భావము,

మూ. యథా స్వప్నప్రపఞ్చోఽయం మయి మాయావిజృమ్భితః. 29
తథా జాగ్రత్ప్రపఞ్చోఽపి మయి మాయావిజృమ్భితః
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్. 30

వ్యా. "ఈ స్వప్నములో కనబడు ప్రపంచమంతా ఏ విధముగ నాయందు మాయచేత కల్పింపబడినదో అట్లే ఈ జాగ్రదవస్థలో కనబడే

ప్రపంచము కూడ నాయందు కల్పింపబడినది" అని వేదాంతములవల్ల తెలిసి కొన్నవాడు "అతివర్ణాశ్రమి."

మూ. యస్య వర్ణాశ్రమాచారో గలితః స్వాత్మదర్శనాత్
సవర్ణానాశ్రమాన్ సర్వానతీత్య స్వాత్మని స్థితః. 31

వ్యా. స్వాత్మసాక్షాత్కారమువలన ఎవని వర్ణాచారములు, ఆశ్రమాచారములు తొలగిపోయినవో అతడు వర్ణములకు, ఆశ్రమములకు అతీతుడై స్వాత్మయందే స్థిరముగా ఉండును.

మూ. యస్త్యక్త్వా స్వాశ్రమాన్ వర్ణానాత్మన్యేవ స్థితః పుమాన్
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తః సర్వవేదార్థవేదిభిః. 32

వ్యా. ఏ పురుషుడు తన ఆశ్రమములను వర్ణములను విడచి తన ఆత్మస్వరూపమునందే స్థిరుడై ఉండునో అతడే "అతివర్ణాశ్రమి" అని సకల వేదముల అర్థములు తెలిసినవారు చెప్పుదురు.

మూ. న దేహో నేన్ద్రియం ప్రాణో న మనో బుద్ధ్యహంకృతీ
న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమాదికం జగత్. 33

న కర్తా నైవ భోక్తా చ న చ భోజయితా తథా
కేవలం సచ్చిదానన్దో బ్రహ్మైవాత్మా యథార్థతః. 34

వ్యా. ఆత్మ దేహము కాదు; ఇంద్రియములు కాదు; ప్రాణము కాదు; మనస్సుకాదు; బుద్ధ్యహంకారములు కాదు; చిత్తము కాదు; మాయ కాదు; ఆకాశాదిజగత్తు కాదు; కర్త కాదు; భోక్త కాదు; భోగము కల్పించునది కాదు వాస్తవమున ఆత్మ కేవలము సచ్చిదానంద రూప మైన బ్రహ్మయే.

మూ. జలస్య చలనాదేవ చఞ్చలత్వం యథా రవేః
తథాహంకారసంసర్గాదేవ సంసార ఆత్మనః. 35

వ్యా. జలము కదలుటవలననే ప్రతిబింబించిన సూర్యుడు ఎట్లు చలించునో అట్లే ఆత్మకు సంసారము అహంకారముతో సంబధము వలననే కలుగుచున్నది.

మూ. తస్మాదన్యగతా వర్ణా ఆశ్రమా అపి కేశవ
ఆత్మన్యారోపితా ఏవ భ్రాన్త్యా తే నాత్మవేదినః. 36

వ్యా. అందువలన, ఓ కేశవా! దేహాదులకే సంబంధించిన వర్ణములు ఆశ్రమములు భ్రాంతిచేత ఆత్మయందు ఆరోపించబడుచున్నవి. అవి ఆత్మ వేత్తకు ఉండవు.

మూ. న విధిర్న నిషేధశ్చ న వర్జ్యావర్జ్యకల్పనా
ఆత్మవిజ్ఞానినామస్తి తథా నాన్యజ్జనార్దన. 37

వ్యా. జనార్దనా! ఆత్మజ్ఞానము కలవారికి విధి కాని, నిషేధము కాని, ఇది విడువదగినది; ఇది విడువదగనిది అను కల్పన కాని, మరి ఏ నియమము కాని ఉండదు.

మూ. స్వాత్మవిజ్ఞానినాం నిష్ఠామీదృశీమమ్బుజేక్షణ
మాయయా మోహితా మర్త్యా నైవ జానన్తి సర్వదా 38

వ్యా. పద్మముల వంటి నేత్రములు గల ఓ! విష్ణూ! ఎల్లప్పుడూ మాయామోహితులై ఉన్న జనులు ఆత్మజ్ఞానుల ఇట్టి స్థితిని అర్థము చేసి కొన జాలరు.

మూ. న మాంసచక్షుషా నిష్ఠా బ్రహ్మవిజ్ఞానినామియమ్
ద్రష్టుం శక్యా స్వతఃసిద్ధా విదుషాం నైవ కేశవ. 39

వ్యా. కేశవా! బ్రహ్మసాక్షాత్కారము పొందినవారి ఈ నిష్ఠ చర్మ చక్షుస్సుతో చూడ శక్యము కాదు. ఈ స్థితి ఆత్మజ్ఞానవంతులైన పండితులకు సహజము.

మూ. యత్ర సుప్తా జనా నిత్యం ప్రబుద్ధస్తత్ర సంయమీ
ప్రబుద్ధా యత్ర తే విద్వాన్ సుషుప్తస్తత్ర కేశవ. 40

వ్యా కేశవా! దేనియందు జనులు నిత్యము నిద్రపోవుచుందురో దాని యందు యోగి మేల్కొని యుండును. దేనియందు జనులు మేల్కొని ఉన్నారో దానియందు పండితుడు నిద్రించును.

సామాన్య జనులకు ఆత్మతత్త్వము తెలియదు గాన వారు దాని యందు నిద్రించు చున్నట్లు, తెలిసికొనిన జ్ఞాని మేల్కొన్నట్లును భావించ వలెను. అట్లే బాహ్యప్రపంచదృష్టి గల సామాన్యజనులు దానియందు మేల్కొని ఉండగా, ఆ దృష్టిలేని జ్ఞాని నిద్రించినట్లు ఉండును అని భావము.

మూ. ఏవమాత్మానమద్వన్ద్వం నిరాకారం నిరఞ్జనమ్
నిత్యశుద్ధం నిరాభాసం సచ్చిన్మాత్రం పరామృతమ్. 41

యో విజానాతి వేదాన్తైః స్వానుభూత్యా వినిశ్చితమ్
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తః స ఏవ గురురుత్తమః. 42

వ్యా. రెండవ వస్తువు లేనిది, ఆకారశూన్యము, నిర్లిప్తము, నిత్య శుద్ధము, జ్ఞానగోచరము కానిది, సత్ చిత్ స్వరూపము, అత్యుత్తమము, నాశరహితము అయిన ఆత్మను స్వానుభవపూర్వకముగా, నిశ్చితముగా వేదాంతముల ద్వారా తెలిసికొన్నవాడు "అతివర్ణాశ్రమి".

మూ. తదేవం "విముక్తశ్చ విముచ్యతే" ఇత్యాదిశ్రుతయః, జీవన్ముక్త

స్థితప్రజ్ఞ భగవద్భక్తగుణాతీతబ్రాహ్మణాతివర్ణాశ్రమిప్రతిపాదక స్మృతివాక్యాని చ జీవన్ముక్తిసద్భావే ప్రమాణానీతి స్థితమ్. ఇతి జీవన్ముక్తిప్రమాణాని.

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే ప్రథమం జీవన్ముక్తిప్రమాణప్రకరణమ్.

వ్యా ఈ విధముగ "విముక్తశ్చ విముచ్యతే" (జీవన్ముక్తుడు దేహ పాతానంతరము విదేహముక్తి పొందును) ఇత్యాదిశ్రుతులు జీవన్ముక్త స్థితప్రజ్ఞ భగవద్భక్త గుణాతీత బ్రాహ్మణ-అతివర్ణాశ్రములను ప్రతిపాదించు స్మృతివాక్యములు జీవన్ముక్తి ఉన్నదని చెప్పుటకు ప్రమాణములు అని నిర్ధారణ చేయబడినది. ఇవి జీవన్ముక్తి ప్రమాణములు

శ్రీమద్విద్యారణ్యులు రచించిన జీవన్ముక్తి వివేకములో మొదటి
దైన జీవన్ముక్తిప్రమాణప్రకరణము సమాప్తము.

## అథ ద్వితీయం వాసనాక్షయప్రకరణమ్

మూ. అథ జీవన్ముక్తిసాధనం నిరూపయామః. తత్త్వజ్ఞాన మనోనాశవాసనాక్షయా స్తత్సాధనమ్. అత ఏవ వాసిష్ఠరామాయణే ఉప శమప్రకరణస్యావసానే "జీవన్ముక్తశరీరాణామ్" (ఉ.వా.28.1) ఇత్యే తస్మిన్ ప్రస్తావే వసిష్ఠ ఆహ-

"వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే
సమకాలం చిరాభ్యస్తా భవన్తి ఫలదాయినః". **116** ఇతి.

**వ్యా.** ఇప్పుడు జీవన్ముక్తికి సాధనమును నిరూపించెదము. తత్త్వ జ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము జీవన్ముక్తికి సాధనము. అందు చేతనే వాసిష్ఠరామాయణములో ఉపశమప్రకరణము చివర "జీవన్ముక్త శరీరాణామ్" అనే ప్రస్తావమునందు వసిష్ఠుడు ఇట్లు చెప్పెను—

"మహాబుద్ధి గల రామా! ఒకే సమయమునందు చాల కాలము పాటు వాసనా క్షయమును. విజ్ఞానమును, మనోనాశమును అభ్యసించి నట్లయితే అవి ఫలప్రదము లగును."

మూ. అన్వయముక్త్వా వ్యతిరేకమాహ–

> "త్రయ ఏతే సమం యావన్న స్వభ్యస్తా ముహుర్ముహుః
> తావన్న పదసంప్రాప్తిర్భవత్యపి సమాశతైః" **115** ఇతి.

వ్యా. అన్వయమును చెప్పి వ్యతిరేకమును చెప్పుచున్నాడు—

"ఈ మూడింటిని, సమముగా మాటిమాటికి చక్కగా అభ్యసించనంతవరకు వందలాది సంవత్సరములకు కూడ ఆ ఉత్తమ పదము (మోక్షము) లభించదు" "అది ఉన్నచో ఇది ఉండును' అని చెప్పుట అన్వయము. "అది లేనిచో ఇది ఉండదు" అని చెప్పుట "వ్యతిరేకము"

మూ. సమకాలాభ్యాసాభావే బాధకమాహ:–

> "ఏకైకశో నిషేవ్యన్తే యద్యేతే చిరయత్నతః
> తన్న సిద్ధిం ప్రయచ్ఛన్తి మన్త్రాః సంకలితా ఇవ" **117** ఇతి.

యథా సన్ధ్యావన్దనమార్జనే సహవినియుక్తానామ్ "ఆపోహిష్ఠా" ఇత్యాదీనాం తిసృణామ్ ఋచాం మధ్యే ప్రతిదినమేకైకస్యా ఋచః పాఠే శాస్త్రీయమనుష్ఠానం న సిధ్యతి, యథా వా షడఙ్గమన్త్రాణామేకైకమన్త్రేణ న సిద్ధిః, యథా వా లోకే శాకసూపౌదనాదీనామేకైకేన న భోజనసిద్ధిః తద్వత్.

వ్యా. ఈ మూడింటిని ఒకే సమయమునందు అభ్యసించనిచో బాధకమును (నష్టమును) చెప్పుచున్నాడు—

"ఈ మూడింటిని ఒక్కొక్కటి చొప్పున ఎంతకాలము ప్రయత్నపూర్వకముగా అభ్యసించినను కలిపి చెప్పవలసిన మంత్రములను వేరుచేసి చెప్పినప్పుడు అవి ఎట్లు సిద్ధిని ఇవ్వవో అట్లే ఇవి సిద్ధిని ఇవ్వవు"

సంధ్యావందన సమయమునందు చేసే మార్జనము (జలము శరీరము మీద చల్లుకొనుట)లో "ఆపోహిష్ఠా" ఇత్యాది ఋక్కులను మూడింటిని కలిపి చదువుటకు బదులు వాటిలో ఒకదానిని ఒక రోజున, మరొకదానిని

మరొక రోజున ఇత్యాది విధముగా పఠించినవో శాస్త్రీయానుష్ఠానము ఎట్లు సిద్ధించదో షడంగ మంత్రములలో (ఆరు మంత్రములను కలిపి చదవ వలసి ఉన్నప్పుడు) ఒక్కొక్క మంత్రమును పఠించుట చేత ఎట్లు సిద్ధి లభించదో లోకములో శాకము, సూపము, అన్నము మొదలైన వాటిలో ఏ ఒక్కదాని చేతనో భోజనము ఎట్లు పూర్తి కాదో అట్లే ఇది కూడ.

మూ. చిరాభ్యాసస్య ప్రయోజనమాహ—

"త్రిభిరేతైశ్చిరాభ్యస్తైర్హృదయగ్రన్థయో దృఢాః
నిఃశఙ్కమేవ త్రుట్యన్తి బిసచ్ఛేదాద్గుణా ఇవ." 118 ఇతి.

వ్యా. చిరకాలాభ్యాసమునకు ఫలమును చెప్పుచున్నాడు-

"ఈ మూడింటిని చిరకాలము అభ్యసించినవో దృఢముగా ఉన్న హృదయగ్రంథులు, తామరతూడును విరచివేయగా దానిలోని దారాలు తెగిపోయినట్లు, నిఃసంశయముగా తెగిపోవును"

మూ. తస్యైవ వ్యతిరేకమాహ—

"జన్మాన్తరశతాభ్యస్తా రామ సంసారసంస్థితిః
సాచిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్." 119. ఇతి

వ్యా. దానికే వ్యతిరేకమును చెప్పుచున్నాడు -

"రామా! కొన్ని వందల జన్మలనుండి (అభ్యసించబడిన) అల వాటు పడిన సంసార సంబంధము చిరకాలము (వీటిని) అభ్యసించిన గాని ఎన్నటికీ క్షీణించదు"

మూ. న కేవలమేకైకాభ్యాసే ఫలాభావః,కింతు తత్స్వరూప మపి న సిధ్యతీత్యాహ—

"తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవ చ
మిథః కారణతాం గత్వా దుఃసాధాని స్థితాని హి." 113. ఇతి.

వ్యా. ఒక్కొక్కదానిని అభ్యసించుటచేత ఫలము లేకపోవుటయే కాక వాటి స్వరూపము కూడ (తత్త్వజ్ఞానాదులే) సిద్ధించవు అని చెప్పు

చున్నాడు - "తత్త్వజ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము అను ఈ మూడూ పరస్పరము (ఒకదానికొకటి) కారణములుగా ఉన్నవి. వీటిని సాధించుట చాలకష్టము''

మూ. త్రయాణామేతేషాం మధ్యే ద్వయోర్ద్వయోర్మేలనే త్రీణి ద్వన్ద్వాని భవన్తి. తత్ర మనోనాశవాసనాక్షయద్వన్ద్వస్యాన్యోన్యస్య కారణత్వం వ్యతిరేకముఖేనాహ—

"యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః
న క్షీణా వాసనా యావత్తావచ్చిత్తం న శామ్యతి." **110**

**వ్యా.** ఈ మూడింటిలోను రెండేసి తీసికొని కలపగా మూడు జతలు ఏర్పడును. అనగా ''తత్త్వజ్ఞాన మనోనాశములు'' ''మనోనాశవాసనాక్షయములు'' ''తత్త్వజ్ఞానవాసనాక్షయములు'' అను జతలు ఏర్పడును. అందులో ''మనోనాశవాసనాక్షయములు'' అను ద్వంద్వములోని మనోనాశవాసనాక్షయములు ఒకదాని కొకటి కారణము లను విషయమును వ్యతిరేక ముఖముగా చెప్పుచున్నాడు

''మనస్సు లీన మయేవరకు వాసనాక్షయము కలుగదు. వాసనాక్షయము కలుగు వరకు చిత్తము శాంతించదు (మనోనాశము కలుగదు)''

మూ. ప్రదీపజ్వాలాసంతానవత్ వృత్తిసంతానరూపేణ పరిణమమానమన్తఃకరణద్రవ్యం మననాత్మకత్వాన్మన ఇత్యుచ్యతే. తస్య నాశో నామ వృత్తిరూపం పరిణామం పరిత్యజ్య నిరుద్ధత్వాకారేణ పరిణామః. తథా చ పతఞ్జలిర్యోగశాస్త్రే సూత్రయామాస - "వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః" (3.9) ఇతి. వ్యుత్థానసంస్కారాః అభిభూయన్తే, నిరోధయుక్తః క్షణశ్చిత్తేనాన్వీయతే. సోఽయం మనోనాశ ఇత్యవగన్తవ్యమ్.

**వ్యా.** దీపజ్వాలా సంతానము వలె, వృత్తి సంతానము రూపమున పరిణమించు అంతఃకరణమను ద్రవ్యమునకే మననము చేయుటచే మనస్సు అని పేరు. ఆ మనస్సు నశించుట అనగా అది వృత్తి రూపమైన పరిణామ

మును విడచి నిరుద్ధరూపములో పరిణమించుట అని అర్థము ఈ విషయ మునే పతంజలి యోగాశాస్త్రములో ఒక సూత్రముచే చెప్పినాడు. "వ్యుత్థాన నిరోధసంస్కారములలో మొదటి వ్యుత్థాన సంస్కారము, అనగా మనస్సు బైటకు వచ్చి విషయములను గ్రహించు నట్లు చేయు సంస్కారము, అభి భూతమై (అణగద్రొక్కబడి నిరోధసంస్కారము (చిత్తము కదలకుండా ఉండేటట్లు చేయు సంస్కారము) ఆవిర్భవించుట, అప్పుడు నిరోధము ఉన్న క్షణములు అవిచ్ఛిన్నముగా ఉండుట నిరోధపరిణామ మని చెప్పబడును.' వ్యుత్థానసంస్కారములు తిరస్కృతము లగును. అందుచేత మనస్సు వ్యుత్థానము చెంది (పైకి లేచి) బైటకు పోవుట, బాహ్యవిషయములను గ్రహించుట ఉండదు. నిరోధసంస్కారములు పుట్టును. అప్పుడు నిరోధ ముతో కూడిన క్షణము చిత్తముతో సంబంధించును, అనగా చిత్తము నిరుద్ధమై కదలకుండ ఉండును ఇదే మనోనాశము అని గ్రహించవలెను.

వ్యా. ఒక ప్రమిదలో తైలము వత్తి వేసి దీపము వెలిగించి నప్పుడు దీపజ్వాల వచ్చును. దీపము వెలిగించినది మొదలు ఆరిపోయే వరకు ఒకే జ్వాల ఉన్న దని మనము అనుకొందుము. కాని అది ఒకే జ్వాల కాదు. అవిచ్ఛిన్న మైన జ్వాలల పంక్తి (సంతానము). జ్వాల క్షణ క్షణమునకు మారిపోవును వెనుకటి క్షణమునం దున్న జ్వాల వేరు, ఈ క్షణమునం దున్నది వేరు, రాబోవు క్షణములోనిది వేరు. ఎందుచేత ననగా ఈ క్షణములో ఉన్న జ్వాల ఒక తైలాంశమును, వత్తి అంశమును కాల్చుచు ఏర్పడినది రాబోవు క్షణములోని తైలాంశవర్త్యంశములు వేరు. అట్లే క్షణక్షణమునందు ఆ అంశములు మారిపోవుచున్నవి గాన జ్వాల కూడ మారిపోవుచునే ఉన్నది. మనము భ్రాంతిచేత ఒకే జ్వాల అని అను కొనుచున్నాము. అట్లే అంతఃకరణము ఆ యా వస్తువులతో సంబంధ మేర్పడి నప్పుడు ఆ యా వస్తువుల ఆకారములో పరిణామమును (మార్పును) చెందుచున్నది. చెట్టు చూచినపుడు చెట్టు ఆకారములోను, గుట్ట చూచినపుడు గుట్ట అకారములోను మారిపోవుచున్నది. ఆ పరిణామమునకే 'వృత్తి' అని పేరు పైన చెప్పిన దీపజ్వాలాసంతానము వలె వృత్తిసంతానము అవిచ్ఛిన్న

ముగా ఉండును. ఈ వృత్తులు వ్యుత్థానసంస్కారములచేత కలుగును. ఆ వ్యుత్థానసంస్కారములను అణచివేసి ప్రయత్నపూర్వకముగా నిరోధసంస్కారములను పుట్టించుకొన్నచో అప్పుడు వృత్తు - ండవు. మనస్సు నిరోధింపబడును. అదియే మనోనాశము అని భావము.

మూ. పూర్వాపరపరామర్శమన్తరేణ సహసోత్పద్యమానస్య క్రోధాదివృత్తివిశేషస్య హేతుశ్చిత్తగతః సంస్కారో వాసనా;పూర్వపూర్వాభ్యాసేన చిత్తే వాస్యమానత్వాత్. తస్యాశ్చ వాసనాయాః క్షయో నామ వివేకజన్యాయాం శాన్త్యాదిశుద్ధవాసనాయాం దృఢాయాం సత్యపి బాహ్యనిమిత్తే క్రోధాద్యనుత్పత్తిః. తత్ర మనోనాశాభావే వృత్తిషూత్పద్యమానాసు కదాచిత్ బాహ్యనిమిత్తేన క్రోధాద్యుత్పత్తేర్న వాసనాక్షయః. అక్షీణాయాం తు వాసనాయాం తథైవ వృత్త్యుత్పాదనాన్నాస్తి మనోనాశః.

వ్యా. చిత్తములో ఉన్న వాసనకు సంస్కార మని పేరు ముందు వెనుకల ఆలోచన లేకుండగా హఠాత్తుగా మనస్సులో జనించు క్రోధాది వృత్తులకు ఈ సంస్కారమే కారణము. (పాత్రలకు నెయ్యి మొదలైనవాటి వాసన పట్టుకొన్నట్లు) ఈ సంస్కారము వెనుకటనుండీ వచ్చుచున్న అభ్యాసముచేత మనస్సులో ఏర్పడుచున్నది గాన దానికి వాసన అని పేరు వివేకమువలన శాంతి దాంతి మొదలైన శుద్ధములైన వాసనలను దృఢముగా ఏర్పరచుకొన్న చిత్తమునందు బాహ్యమైన నిమిత్తము లున్నను క్రోధాదులు పుట్టవు దానికే "వాసనాక్షయము'' అని పేరు, అయితే, మనోనాశము లేని పక్షమున వృత్తులు పుట్టుచునే ఉండును గాన, బాహ్యమైన నిమిత్తమేదైన ఏర్పడి నప్పుడు క్రోధాదులు కలుగవచ్చును గాన వాసనాక్షయము కలుగదు. ఈ విధముగా వాసనాక్షయము లేనిచో వృత్తులు పుట్టుచునే ఉండును గాన మనోనాశము కలుగదు. (అందుచే వాసనాక్షయము మనోనాశముమీదా, మనోనాశము వాసనాక్షయముమీదా ఆధారపడి ఉండునని భావము.)

శాసనాన్ని రికమెండు చేస్తూ భారత ప్రభుత్వానికి వ్రాసిన లేఖతో మలబారులోని వివాహాచారాలనుగూర్చి మద్రాసు ప్రభుత్వం ఇలా రాసింది:—

"ఈ విషయం సంక్షిప్తంగా ప్రభుత్వానికి ఈ విధంగా కనిపిస్తున్నది – మరుమక్కత్థాయం చట్టానికి బద్ధంగా ఉన్న తెగల్లో లైంగిక సంబంధాలు, అవి ప్రారంభమైన నాటినుండి ఉభయపక్షాలూ ఆమరణాంతం కట్టుబడి ఉండేవిగా ఉద్దేశింపబడ్డాయి. ఈ సంబంధాలు అందరికీ తెలిసేట్టుగా బాహాటంగా జరుగుతాయి. సామాజికంగా గుర్తింపబడి మతసంబంధమైన అంశం ఏమీలేని ఒక ప్రత్యేక పద్ధతికి చెందిన ఉత్సవాలతోకూడి ఉంటాయి. ఇతర ప్రాంతాలలో వివాహాలకు ఏ విధమైన గౌరవం ఉంటుందో అటువంటి గౌరవమే వీటికి ఉన్నది."

(హిస్టరీ ఆఫ్ కేరళ సం. 3. పుటలు 291-292)

## ఉపయుక్త గ్రంథాలు


| మలయాళ గ్రంథాలు | రచయిత |
|---|---|
| ఒయ్యారథ్ చందుమీనన్ | మూర్కోల్ కుమారన్ |
| నావెల్ సాహిత్యమ్ | పాల్ ఎం. పి. |
| మలయాళ సాహిత్య చరిత్రమ్ | పరమేశ్వరన్ నాయర్ |
| నావెల్ స్వరూపమ్ | సురేంద్రన్ కె. |
| చందుమీనన్ - ఒరు పఠనమ్ | బాలకృష్ణన్ పి. కె. |
| ఇందులేఖ | చందుమీనన్ ఓ. |
| శారద | చందుమీనన్ ఓ. |

ఆంగ్ల గ్రంథాలు

| | |
|---|---|
| ఇందులేఖ | దూమెర్గ్ డబ్ల్యు. |
| హిస్టరీ ఆఫ్ కేరళ | పద్మనాభ మీనన్ కె. పి. |

క్రోధాదివాసనలు నశించనంతవరకు శమదమాది సాధనములు లేక పోవుటచేత తత్త్వజ్ఞానము కలుగదు. అద్వితీయతత్త్వజ్ఞానము కలగనంత వరకు క్రోధాదుల కారణములు సత్యములనే భ్రమచేత వాసనలు క్షీణించవు. ఈ మూడు ద్వంద్వములు ఎట్లు ఒకదానికి ఒకటి కారణమో అన్వయ ముఖమున మేము విశదీకరించెదము. మనస్సు నష్టమైనప్పుడు సంస్కారోద్బోధకములైన బాహ్యనిమిత్తము లేవి కనబడవు; అప్పుడు వాసన క్షీణించును. వాసనలు క్షీణించినప్పుడు క్రోధాది చిత్తవృత్తులు ఉదయించుటకు కారణము లేకపోవుటచే అవి ఉదయించవు; అందుచేత మనస్సు నశించును. ఇది మనోనాశ-వాసనాక్షయముల ద్వంద్వము. "ఏకాగ్రమైన బుద్ధిచేతనే (ఆత్మ) చూడబడును'' అను శ్రుతి వాక్యము ననుసరించి ఆత్మైక్యమునకు అభిముఖమైన చిత్తవృత్తి ఆత్మదర్శనమునకు హేతువుగాన ఇతరమైన సమస్త వృత్తుల నాశము తత్త్వజ్ఞానమునకు హేతువు అను విషయము తెలియుచున్నది. తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట, నరుని కొమ్మును గూర్చి ఎట్లు చిత్తవృత్తి కలుగదో అట్లే మిధ్యయైన జగత్తును గూర్చిన చిత్తవృత్తి కలుగదు. ఆత్మసాక్షాత్కారము జరిగినది గాన ఇంక అవసరము లేకపోవుటచే ఆత్మను గూర్చిన చిత్తవృత్తికూడ కలుగదు అప్పుడు కట్టెలు లేని అగ్నివలె మనస్సు దానంతట అదే నశించును ఇది మనోనాశ-తత్త్వజ్ఞానముల ద్వంద్వము.

మూ. తత్త్వజ్ఞానస్య క్రోధాదివాసనాక్షయహేతుతాం వార్తికకార ఆహ—

"రిపౌ బద్ధౌ స్వదేహే చ సమైకాత్మ్యం ప్రపశ్యతః
వివేకినః కుతః కోపః స్వదేహావయవేష్వివ.

(నై. సి. 2.18) ఇతి.

క్రోధాదివాసనాక్షయరూపస్య శమాదేః జ్ఞానహేతుత్వం ప్రసిద్ధమ్. వసిష్ఠోఽపి—

"గుణాః శమాదయో జ్ఞానాచ్ఛమాదిభ్యస్తథా జ్ఞతా
పరస్పరం వివర్ధేతే ద్వే పద్మసరసీ ఇవ." (4.107 ఇతి.

తదిదం వాసనాక్షయతత్త్వజ్ఞానయోర్ద్వంద్వమ్.

వ్యా. క్రోధాదివాసనలు క్షీణించుటకు తత్త్వజ్ఞానము హేతువు అను విషయమును వార్తికకారులు చెప్పినారు.

"శత్రువులోను, బంధువులోను, తన దేహములోను ఒకే అత్మ సమముగా ఉన్నది అని తెలిసికొన్న వివేకవంతునను, తన దేహమునందున్న వేరు వేరు అవయవములపై కోపము ఎట్లు ఉండదో అట్లే కోపము ఉండదు "

క్రోధాదివాసనలు క్షీణించుటయే శమాదులు అట్టి శమాదులు జ్ఞానమునకు హేతు వను విషయము ప్రసిద్ధము. వసిష్ఠుడు కూడ చెప్పినాడు -

"జ్ఞానమువలన శమాదిగుణములు కలుగును. శమాదుల వలన జ్ఞానము కలుగును. ఈ విధముగా శమాదికము జ్ఞానము కూడ ఒకదాని సాహాయ్యము తో మరొకటి పద్మము, సరస్సు వలె వృద్ధి పొందును." సరస్సు లేనిది పద్మము లుండవు; పద్మాలు లేనిచో సరస్సుకు శోభ లేదు. అట్లే శమాదికము లేనిచో జ్ఞానము లేదు. జ్ఞానము లేనిచో శమాదికము ఉండదు అని భావము. ఇది వాసనాక్షయ-తత్త్వజ్ఞానముల ద్వంద్వము.

మూ. తత్త్వజ్ఞానాదీనాం త్రయాణాం సంపాదనే సాధనమాహ-

"తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణ వివేకినా
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేతత్సమాశ్రయేత్."
114 ఇతి.

పౌరుషో యత్నః కేనాప్యుపాయేన అవశ్యం సంపాదయిష్యామీత్యేవంవిధోత్సాహరూపో నిర్బన్ధః. వివేకో నామ విభజ్య నిశ్చయః- తత్త్వజ్ఞానస్య శ్రవణాదికం సాధనమ్; మనోనాశస్య యోగః; వాసనా

క్షయస్య ప్రతికూల వాసనోత్పాదనమితి. భోగేచ్ఛాయాః స్వల్పాయా అప్యభ్యుపగమే "హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" (మను. **2.94**) ఇతి న్యాయేన అతిప్రసఙ్గస్య దుర్వారత్వాత్ దూరతః ఇత్యుక్తమ్.

వ్యా. తత్త్వ జ్ఞానాదులను మూడింటిని సంపాదించుటకు సాధనమును చెప్పుచున్నాడు-

**"రామా! అందువలన వివేకముతో కూడిన పురుషప్రయత్నముచేత** భోగములయందలి ఇచ్ఛను దూరముగా విడచి తత్త్వజ్ఞాన-మనోనాశ-వాసనాక్షయము లను ఈ మూడింటిని సంపాదించవలెను."

ఏదో ఒక ఉపాయముచేత తప్పక సంపాదించెదను అను ఉత్సాహ రూపమైన పట్టుదల పౌరుషయత్నము. "తత్త్వజ్ఞానమునకు శ్రవణమనన-నిదిధ్యాసనములు సాధనము; మనో నాశమునకు యోగము సాధనము; వాసనాక్షయమునకు అశుభవాసనలకు విరుద్ధమైన శుభవాసనలు అలవరచుకొనుట సాధనము" అని ఆ యా కార్యకారణములను విభజించి నిశ్చయించుట వివేకము. భోగేచ్ఛను ఏ మాత్రము అనుమతించినను "హవిస్సు పోసిన కొలదీ అగ్ని పెరిగి నట్లు భోగములు అనుభవించిన కొలదీ కామము పెరుగుచునే ఉండును" అని మనుస్మృతిలో చెప్పి నట్లు అది (భోగేచ్ఛ) అధిక మగుట తప్పదు గాన దూరతః (దూరముగా విడచి) అని చెప్పబడినది.

మూ. నను పూర్వత్ర, వివిదిషాసంన్యాసస్య తత్త్వజ్ఞానం ఫలమ్, విద్వత్సంన్యాసస్య జీవన్ముక్తిరితి వ్యవస్థా వర్ణితా; తథా చ సతి ప్రథమతస్తత్త్వజ్ఞానం సంపాద్య, పశ్చాద్విద్వత్సంన్యాసం కృత్వా జీవతః స్వస్య బన్ధరూపయోర్వాసనామనోవృత్త్యోర్వినాశః సంపాదనీయ ఇతి ప్రతిభాతి; అత్ర తు తత్త్వజ్ఞానాదీనాం సహైవాభ్యాసో నియమ్యతే; అతః పూర్వోత్తరవిరోధ ఇతి చేత్; నాయం దోషః; ప్రధానోపసర్జనభావేన వ్యవస్థోపపత్తేః. వివిదిషాసంన్యాసిన స్తత్త్వజ్ఞానం

ప్రధానమ్, మనోనాశవాసనాక్షయౌ ఉపసర్జనీభూతౌ; విద్వత్సంన్యాసి నస్తు తద్వైపరీత్యమ్; అతః సహాభ్యాస ఉభయత్రాప్యవిరుద్ధః. న చ తత్త్వజ్ఞానోత్పత్తిమాత్రేణ కృతార్థస్య కిముత్తరకాలీనేనాభ్యాసేనేతి శఙ్కనీయమ్; జీవన్ముక్తిప్రయోజననిరూపణేన పరిహరిష్యమాణత్వాత్.

వ్యా. (ఆశంక) "వివిదిషాసంన్యాసమునకు ఫలము తత్త్వజ్ఞానము, విద్వత్సంన్యాసమునకు ఫలము జీవన్ముక్తి" అని పూర్వము వ్యవస్థ చూపబడినది దానిని పట్టి మొదట తత్త్వజ్ఞానమును సంపాదించి, తరువాత విద్వత్సంన్యాసము చేసి జీవించి ఉన్నవాడు తనకు బంధరూపమున ఉన్న వాసనామనోవృత్తులను నశింపచేసికొనుటకు ప్రయత్నించవలెను అన్నట్లు కనబడు చున్నది. తత్త్వజ్ఞానాదులను మూడింటినీ ఒకే సమయమునందు అభ్యసించవలె నని ఇక్కడ నియమము చెప్పబడుచున్నది. అందుచేత ఇక్కడ పూర్వోత్తర విరోధము లేదా ? (సమాధానము) ఈ దోషము లేదు; ప్రధానత్వమును అప్రధానత్వమును అంగీకరించినచో వ్యవస్థ కుదురును. వివిదిషాసంన్యాసికి తత్త్వజ్ఞానము ప్రధానము, మనోనాశవాసనాక్షయములు అప్రధానములు. విద్వత్సంన్యాసివిషయమున ఇది విపరీతము; అనగా మనోనాశవాసనాక్షయములు ప్రధానములు, తత్త్వజ్ఞానము సిద్ధించి ఉన్నది గాన దాని అభ్యాసము అప్రధానము. అందువలన వివిదిషాసంన్యాస. విద్వత్సంన్యాసములు రెండింటి యందును ఈ మూడింటిని కలిపిఅభ్యసించు టలో విరోధ మేమీ లేదు. తత్త్వజ్ఞానము జనించిన పిమ్మట తావతా కృతార్థుడైనవాడు (విద్వత్సంన్యాసి) తరువాతకూడ ఈ మూడింటినీ అభ్యసించే ప్రయాస చేయుట ఎందుకు అని ఆశంకించరాదు. ఈ ఆశంక జీవన్ముక్తి ప్రయోజనమును నిరూపించునప్పుడు పరిహరింపబడగలదు.

మూ. నను విద్వత్సంన్యాసినో వేదనసాధనశ్రవణాద్యనుష్ఠాన వైఫల్యాత్, వేదనస్య చ స్వరూపేణ కర్తుమకర్తుమన్యథా వా కర్తుమ శక్యస్య అననుష్ఠేయత్వాత్ ఉపసర్జనత్వేఽప్యుత్తరకాలీనోఽభ్యాసః

కీదృశః ఇతి కేనాపి ద్వారేణ పునః పునస్తత్త్వానుస్మరణమితి బ్రూమః. తాదృశశ్చాభ్యాసో లీలోపాఖ్యానే (ల.వా.6) దర్శితః–

మూ. "తచ్చిన్తనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్
ఏతదేకపరత్వం చ జ్ఞానాభ్యాసం విదుర్బుధాః." **108**
"సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ తత్సదా
ఇదం జగదహం చేతి బోధాభ్యాసం విదుర్బుధాః." **111**

వ్యా. (ఆశంక) విద్వత్సంన్యాసి వేదనమునకు సాధనములైన శ్రవణాదులను అనుష్ఠించుట వ్యర్థము. ఎందుచేత ననగా వేదనము (జ్ఞానము) స్వరూపముచేత చేయుటకు గాని, చేయకుండుటకు గాని, మరొక విధముగా చేయుటకు గాని శక్యము. కాదు గాన, అది విద్వత్సంన్యాసికి అప్రధానమే. అయినను ఉత్తరకాలమునందు (జ్ఞానము కలిగిన తరువాత) దాని అభ్యాసము చేయుట అనగా ఏమి ? (వస్తువును పట్టి జ్ఞానము కలుగును అంతే కాని నాకు ఈ జ్ఞానముకలుగవలె నని సంకల్పించి జ్ఞానము చేయుటగాని, నేను ఈ జ్ఞానము చేయను అనుకొనుటచే జ్ఞానము కలగకుండుట గాని, మరొక విధముగా జ్ఞానము చేసెదను అని సంకల్పించి అట్లు చేయుట గాని కుదరదు. ఉదాహరణకు - ఎదుట నున్న వృక్షమును చూడగానే ఇది వృక్షము అను జ్ఞానము నాకు కలుగవద్దన్నను కలుగును. నాకు వృక్షజ్ఞానము కాదు; గృహజ్ఞానము కావలెను అనుకొన్నను ఆ జ్ఞానము మారదు. అట్లే ఆత్మ యథార్థజ్ఞానము ఒకసారి కలిగిన పిమ్మట దాని అభ్యాసముచేయుట అనగా ఏమి? అని ఆశంకకు అర్థము, (సమాధానము). అభ్యాస మనగా ఏదో విధముగా మాటి మాటికి తత్త్వానుసంధానము చేయుటయే అని చెప్పెదము. అట్టి, అభ్యాసము, లఘుయోగవాసిష్ఠములో, లీలోపాఖ్యానములో చెప్పబడినది. "తత్త్వమును గూర్చియే ఆలోచించుట, దానిని గూర్చియే మాటలాడుట, పరస్పరము దానినే బోధించుట, దాని ఒక్కదానియందే మనస్సును లగ్నము చేయుట 'జ్ఞానాభ్యాసము' అని పండితులు చెప్పుచున్నారు."

"ఈ దృశ్యప్రపంచము సృష్టిప్రారంభమునందు పుట్టనే లేదు. (అనగా సృష్టి అనేదే లేదు ) అది ఎప్పుడూ లేనే లేదు. ఈజగత్తు 'నేను' అనునదీ కూడ ఎన్నడూ లేవు అని భావించుటను జ్ఞానాభ్యాస మని కొందరు చెప్పుదురు.''

మూ. మనోనాశవాసనాక్షయాభ్యాసావపి తత్రైవ దర్శితౌ-

"అత్యన్తాభావసంపత్తౌ జ్ఞాతుర్జ్ఞేయస్య వస్తునః
యుక్త్యా శాస్త్రైర్యతన్తే యే తే ఽత్రాభ్యాసినః స్థితాః".

110. ఇతి.

జ్ఞాతృజ్ఞేయయోర్మిథ్యాత్వధీః అభావసంపత్తిః. స్వరూపేణాప్య ప్రతీతిః అత్యన్తాభావసంపత్తిః. యుక్తిః యోగః. సోఽయం మనోనాశాభ్యాసః.

వ్యా. మనోనాశవాసనాక్షయాభ్యాసములు కూడ అక్కడనే చూపబడినవి-

''జ్ఞాతకు, జ్ఞేయమైన వస్తువునకు అత్యంతాభావమును సంపాదించుటకై ఎవరు యోగముచేత, శాస్త్రములచేత ప్రయత్నింతురో అట్టివారు దానియందు (మనోనాశమునందు) అభ్యసించువారుగా ఉన్నారు. (అట్టివారు మనోనాశాభ్యాసము చేయువారు)".

జ్ఞాత, జ్ఞేయమూ కూడ మిథ్యా అను బుద్ధి అభావసంపత్తి జ్ఞాతృ' జ్ఞేయముల స్వరూపమే కనబడకుండుట అత్యంతాభావసంపత్తి 'యుక్తి' అనగా యోగము. ఇది మనోనాశాభ్యాసము

మూ. "దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే
రతిర్నవోదితా యాసౌ బ్రహ్మాభ్యాసః స ఉచ్యతే". 112 ఇతి.
సోఽయం వాసనాక్షయాభ్యాసః.

వ్యా. "దృశ్యప్రపంచము ఉండుటయే కుదరదు" అను జ్ఞానముచేత రాగద్వేషాదులు క్షీణించగా నూతనముగా ఆవిర్భవించిన ఏ ఆనందమయస్థితి ఉండునో అది బ్రహ్మభ్యాన మని చెప్పబడుచున్నది."

ఇదే వాసనాక్షయాభ్యాసము.

మూ. తేష్వేతేషు త్రిష్వభ్యాసేషు సామాన్యేన ప్రతీయమానేషు ప్రధానోపసర్జనభావో న వివేక్తుం శక్యత ఇతి చేత్; మైవమ్– ప్రయోజనానుసారేణ వివేక్తుం శక్యత్వాత్. ముముక్షోః పురుషస్య జీవన్ముక్తిః విదేహముక్తిశ్చేతి ప్రయోజనద్వయమ్. అత ఏవ "విముక్తశ్చ విముచ్యతే" (కఠ. 2.1.1.) ఇతి శ్రూయతే. తత్ర జీవతః పురుషస్య దైవసంపదా మోక్షః, ఆసురసంపదా బన్ధః. ఏతచ్చ షోడశాధ్యాయే భగవతాభిహితమ్—

"దైవీసంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా" (5) ఇతి.

వ్యా. "సమముగానే కనబడుచున్న ఈ మూడు అభ్యాసాలలో ఏది ప్రధానము, ఏది అప్రధానము అని నిర్ణయించుట శక్యముకాదు కదా" అని శంకింపరాదు, ప్రయోజనమును పట్టి నిర్ణయించవచ్చును కదా ? మోక్షేచ్ఛ గల పురుషునకు జీవన్ముక్తి, విదేహముక్తి అను రెండు ప్రయోజనము లున్నవి. అందుచేతచే "ముక్తుడై ముక్తి పొందును" అని చెప్పబడినది. అందు జీవించి ఉన్న పురుషునకు దైవసంపదచేత మోక్షము, ఆసురసంపద చేత బంధము కలుగును. ఇది భగవద్గీత షోడశాధ్యాయములో భగవంతుడు చెప్పినాడు-"దైవసంపద మోక్షహేతువు. అసురసంపద బంధహేతువు అని చెప్పబడినది."

మూ. తే చ సంపదౌ తత్రైవాభిహితే–

"అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్. 1.

అహింసా సత్యమక్రోధస్త్యాగః శాన్తిరపైశునమ్
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్. 2

తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా
భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత. 3.

దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్. 4. ఇతి.

పునరప్యాధ్యాయపరిసమాప్తేరాసురసంపత్ ప్రపఞ్చితా. తత్రా శాస్త్రీయాయాః స్వభావసిద్ధాయాః ఆసురసంపదో దుర్వాసనాయాః శాస్త్రీయయా పురుషప్రయత్నసాధ్యయా దైవసంపదా సద్వాసనయా క్షయే సతి జీవన్ముక్తిః భవతి.

వ్యా. ఆ దైవాసురసంపత్తులు కూడ అక్కడనే చెప్పబడినవి-

"అర్జునా అభయము, మనఃశుద్ధి, జ్ఞానయోగమునందు స్థిరత్వము, దానము, ఇంద్రియనిగ్రహము, యజ్ఞము, స్వాధ్యాయము, తపస్సు, ఋజుత్వము, అహింస, సత్యము, కోపము లేకుండుట, త్యాగము, శాంతి, చాడీలు చెప్పకుండుట, భూతదయ, ఆశ లేకుండుట, మృదుత్వము సిగ్గు, చాపలము లేకుండుట, తేజస్సు, ఓర్పు, ధైర్యము, శుచిత్వము, ద్రోహము చేయకుండుట, అహంకారము లేకుండుట అను ఈ గుణము దైవసంపత్తుతో పుట్టినవానికి ఉండును. పార్థా! దంభము, గర్వము, అహంకారము, క్రోధము, పరుషత్వము, అజ్ఞానము ఇవి ఆసురసంపత్తుతో పుట్టినవానికి ఉండును."

మరల అధ్యాయము చివరి వరకు ఆసురసంపత్తి వివరించబడినది. అందు, శాస్త్రవిరుద్ధము, స్వభావసిద్ధము అయిన ఆసురసంపత్తు అనే దుర్వాసన, శాస్త్రీయము పురుషప్రయత్న సాధ్యము అయిన దైవసంపద్రూప మైన సద్వాసనచేత క్షీణించగా జీవన్ముక్తి కలుగును.

మూ. వాసనాక్షయవన్మనోనాశస్యాపి జీవన్ముక్తిహేతుత్వం శ్రూయతే—

"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్." 2.

వ్యా. వాసనాక్షయము వలెనే మనోనాశము కూడ జీవన్ముక్తికి హేతువని (అమృత బిందూపనిషత్తులో) చెప్పబడినది-

"మానవుల బంధమోక్షములకు మనస్సే కారణము. విషయాసక్తమైన మనస్సు బంధహేతు వనీ, విషయ రహితమైన మనస్సు ముక్తికి హేతువనీ చెప్పబడినది"

మూ. "యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా." 3.

వ్యా. "ఈ మనస్సు విషయశూన్యమైనప్పుడు ముక్తి కలుగునని చెప్పబడినది గాన, మోక్షేచ్ఛ కలవాడు ఎల్లప్పుడూ మనస్సును విషయ శూన్యమునుగా చేయవలెను."

మూ. "నిరస్తవిషయాసఙ్గం సంనిరుద్ధం మనో హృది
యదా యాత్యున్మనీభావం తదా తత్పరమం పదమ్." 4.

వ్యా. "విషయసంగము లేని మనస్సు హృదయమునందు నిరుద్ధమై ఎప్పుడు ఉన్మనీభావమును పొందునో (లోకోత్తరానుభూతిని పొందునో) అదే పరమపదము."

మూ. "తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృది గతం క్షయమ్
ఏతద్ జ్ఞానం చ మోక్షశ్చ శేషో గ్రన్థస్య విస్తరః". 15. ఇతి.

"మనస్సు హృదయములో లీనమయే వరకునే దానిని నిరోధించవలెను. అదే జ్ఞానము. అదే మోక్షము, మిగిలిన దంతా [illegible] గ్రంథవిస్తరమే".

మూ. బన్ధో ద్వివిధః-తీవ్రో మృదుశ్చ. తత్రాసురసంపత్సాక్షా దేవ క్లేశహేతుత్వాత్ తీవ్రో బన్ధః. ద్వైతమాత్రప్రతీతిస్తు స్వయమ క్లేశరూపత్వాత్, ఆసురసంపదుత్పాదకత్వాచ్చ మృదుర్బన్ధః. తత్ర వాస నాక్షయేణ తీవ్రబన్ధ ఏవ నివర్తతే, మనోనాశేన తూభయమ్. తర్హి మనోనాశేనైవాలమ్; వాసనాక్షయస్తు నిరర్థక ఇతి చేత్; న; భోగహే తునా ప్రబలేన ప్రారబ్ధేన వ్యుత్థాపితే మనసి వాసనాక్షయస్య తీవ్రబన్ధ నివారణార్థత్వాత్. భోగస్య మృదుబన్ధేనాప్యుపపత్తేః. తామసవృత్తయ స్తీవ్రబన్ధః. సాత్త్వికరాజసవృత్తిద్వయం మృదుబన్ధః. ఏతచ్చ—

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః."

ఇత్యత్ర స్పష్టీకృతమ్.

వ్యా. తీవ్రము, మృదువు అని బంధము రెండు విధములు. సాక్షాత్తు క్లేశమునకు హేతు వగుటవలన అసురసంపత్తు తీవ్రబంధము ద్వైత ప్రపంచము మాత్రము భాసించినచో అది తాను క్లేశరూపము కాక-పోయినను ఆసురసంపదను పుట్టించును గాన అది మృదుబంధము. వాస నాక్షయము చేత తీవ్రబంధము మాత్రము నివర్తించును. మనోనాశముచేత రెండు విధముల బంధము కూడ నివర్తించును (అశంక) అట్లయినచో మనో నాశమే చాలును; వాసనాక్షయము అనవసరము కదా? (సమాధానము) కాదు భోగమునకు హేతువైన ప్రబలమైన ప్రారబ్ధము మనస్సును మరల లేపి నప్పుడు వాసనాక్షయము తీవ్రబంధమును నివారించుటకు ఉపయోగించును. భోగము మృదుబంధముచేత కూడ సాధ్య మగును తామసవృత్తులు తీవ్ర బంధము సాత్త్వికరాజస వృత్తులు మృదుబంధము. ఈ విషయము "దుఃఖే ష్వనుద్విగ్నమనాః" ఇత్యాది శ్లోకమును వ్యాఖ్యానించునపుడు వెనుక స్పష్టము చేయబడినది (పేజి ٤३)

మూ. ఏవం చ సతి మృదుబన్ధస్యాభ్యుపేయత్వాత్, తీవ్రబన్ధస్య వాసనాక్షయేణైవ నివృత్తేః అనర్థకో మనోనాశ ఇతి చేత్-న; దుర్బల

ప్రారబ్ధాపాదితానామ్ అవశ్యంభావిభోగానాం ప్రతీకారార్థత్వాత్. తాదృగ్భోగస్య ప్రతీకారనివర్త్యత్వమ్ అభిప్రేత్య ఇదమాహుః-
"అవశ్యంభావిభోగానాం ప్రతీకారో భవేద్యది

తదా దుఃఖైర్న లిప్యేరన్ నలరామయుధిష్ఠిరాః".(పఞ్చ. 7.156)ఇతి. తదేవం జీవన్ముక్తిం ప్రతి వాసనాక్షయమనోనాశయోః సాక్షాత్సాధనత్వాత్ ప్రాధాన్యమ్. తత్త్వజ్ఞానం తు ఉభయోత్పాదనేన వ్యవహితత్వాత్ ఉపసర్జనమ్.

వ్యా. (ఆశంక అట్లయినచో మృదుబంధమును అంగీకరించవలసియే ఉన్నది కావునను, తీవ్రబంధము వాసనాక్షయము చేతనే నివృత్తమగును కావునను మనోనాశము వ్యర్థము కదా ? (సమాధానము) కాదు. దుర్బలమైన ప్రారబ్ధముచేత కలుగు, తప్పక అనుభవించవలసినవి కాని భోగములకు ప్రతీకారము చేయుటకై మనోనాశము ఆవశ్యకము. అట్టి భోగమును, అనగా దుర్బల ప్రారబ్ధముచేత కలుగుదానిని, ప్రతీకారముచేత నివర్తింప చేయవచ్చును అను అభిప్రాయముతోనే ఇట్లు చెప్పుదురు.

"తప్పక జరగవలసిన భోగములకు ప్రతీకారము ఉండి ఉన్నట్లయితే నలరామయుధిష్ఠిరులు దుఃఖములను పొందకుండెడివారు."

ఈ విధముగ వాసనాక్షయ-మనోనాశములు జీవన్ముక్తికి సాక్షాత్సాధనములు గాన అవి ప్రధానములు. ఆ రెండింటిని పుట్టించుట ద్వారా జీవన్ముక్తిహేతువైన తత్త్వజ్ఞానము వ్యవహితము గాన (ఒక అడుగు దూరములో ఉన్నది గాన) అది ఉపసర్జనము

మూ. తత్త్వజ్ఞానస్య వాసనాక్షయహేతుత్వం బహుశః శ్రుతౌ శ్రూయతే-"జ్ఞాత్వా దేవం సర్వపాపాపహానిః" (శ్వే. ఉ. 1.1.11) "అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" (కఠ. ఉ. 1.1.12) "తరతి శోకమాత్మవిత్" (ఛా. ఉ. 7.1.3)

"తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః" (ఈశ. ఉ. 7)
"జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" (శ్వే. ఉ. 1.18).

వ్యా. తత్త్వజ్ఞానము వాసనాక్షయమునకు హేతు వను విషయము శ్రుతులలో అనేక విధములుగ చెప్పబడినది. "ఆత్మను తెలిసికొన్న పిమ్మట సర్వపాపములు నశించును.'' "అధ్యాత్మయోగమును సంపాదించుట ద్వారా పరమాత్మను గ్రహించిన ధీమంతుడు హర్షశోకములను విడచును." "ఆత్మను తెలిసికొన్నవాడు శోకమును దాటును." "ఏకత్వమునే చూచువానికి మోహము కాని శోకము గాని ఎట్లుండును ?"; "పరమాత్మను తెలిసి కొన్న పిమ్మట సర్వపాపములనుండి విముక్తు డగును" ఇత్యాదులు.

మూ. మనోనాశహేతుత్వం చ తత్త్వజ్ఞానస్య శ్రుతిసిద్ధమ్. విద్యావ-శామభిప్రేత్యేదం శ్రూయతే—"యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్, కేన కం జిఘ్రేత్". (బృ. ఉ 2.4.14) ఇత్యాది. గౌడపాదాచార్యాశ్చాహుః—

"ఆత్మతత్త్వానుబోధేన న సంకల్పయతే యదా
అమనస్తాం తదా యాతి గ్రాహ్యాభావే తదగ్రహః"

(3.32) ఇతి.

వ్యా. తత్త్వజ్ఞానము మనోనాశమునకు హేతు వను విషయము శ్రుతులలో ప్రసిద్ధము. జ్ఞానవంతుని స్థితిని దృష్టిలో ఉంచుకొని ఇట్లు చెప్పబడుచున్నది-"అంతా ఇతనికి ఆత్మయే అయిన స్థితిలో అతడు దేనిని దేనితో చూచును; దేనిని దేనితో వాసన చూచును ?" ఇత్యాదులు. గౌడపాదా చార్యులు కూడ (మాండూక్యకారికలలో) ఇట్లు చెప్పినారు-"ఆత్మతత్త్వమును తెలిసికొన్న పిమ్మట సంకల్పము లేవీ చేయని వానికి అప్పుడు మనోరాహిత్యము లభించును. గ్రాహ్యములైన దృశ్యపదార్థము లేవీ లేనప్పుడు వాటి గ్రహణము (జ్ఞానము) ఉండదు."

మూ. జీవన్ముక్తేర్వాసనాక్షయమనోనాశావివ విదేహముక్తేః సాక్షాత్సాధనత్వాత్ జ్ఞానం ప్రధానమ్ "జ్ఞానాదేవ తు కైవల్యం ప్రాప్యతే యేన ముచ్యతే" ఇతి స్మృతేః. "కేవలస్యాత్మనో భావః కైవల్యం దేహాదిరాహిత్యమ్, తచ్చ జ్ఞానాదేవ ప్రాప్యతే; సదేహత్వస్యాజ్ఞాన కల్పితత్వేన జ్ఞానైకనివర్త్యత్వాత్. జ్ఞానాదేవేత్యేవకారేణ కర్మవ్యావృత్తిః. "న కర్మణా న ప్రజయా ధనేన" (కై.ఉ.4.12.3) ఇతి శ్రుతేః. యస్తు జ్ఞానశాస్త్ర మనభ్యస్య యథాసం-వాసనాక్షయమనోనాశౌ ...స్య సగుణం బ్రహ్మోపాస్తే న తస్య కైవల్యమస్తి; లిఙ్గ దేహస్యానపాయాత్. అతః "ఏవకారేణ తావపి వ్యావర్త్యేతే. "యేన ముచ్యతే" ఇత్యస్య అయమర్థః-యేన జ్ఞానప్రాపితకేవలత్వేన కృత్స్నా బన్ధాద్విముచ్యతే ఇతి.

వ్యా. జీవన్ముక్తికి వాసనాక్షయ మనోనాశములు ఎట్లు ప్రధానములో విదేహముక్తికి సాక్షాత్సాధన మగుటచేత దానికి, జ్ఞానము అంత ప్రధానము. "కైవల్యము జ్ఞానము వలననే లభించును. దానిచేత ముక్తు డగును" అని స్మృతివాక్యము. కేవలస్య=అద్వితీయ మైన ఆత్మయొక్క, భావః= ధర్మము=కైవల్యము: అనగా దేహాదుల లేకుండుట. సదేహత్వము (దేహముతో ఉండుట) మాయాకల్పితము గాన దానిని (సదేహత్వమును) ఒక్క-జ్ఞానము చేతనే నివారించుకొనుటకు శక్య మగును. అందుచే కైవల్యము జ్ఞానము వలననే లభించును "జ్ఞానాదేవ'' అన్నప్పుడు ఏవ కారముచేత జ్ఞానము వలననే అని చెప్పుటచే కర్మ నివారింప బడుచున్నది, అనగా కర్మవలన కాదు అని చెప్పబడుచున్నది. "కర్మ చేత కాదు; సంతానముచేత కాదు; ధనముచేత కాదు'' ఇత్యాది శ్రుతి వాక్యము జ్ఞానమువలననే మోక్ష మని చెప్పుచున్నది కదా ? జ్ఞానశాస్త్రమును అభ్యసించక యథాసంభవముగ (వీలైనంతవరకు) వాసనాక్షయమనో నాశములను అభ్యసించి, సగుణబ్రహ్మను ఉపాసించువానికి కైవల్యములేదు. ఆతని లింగశరీరము నశించలేదు కదా ? అందుచేత ''ఏవ'' కారము ఆ

రెండింటిని ( వాసనాక్షయమనోనాశములను ) కూడ నివారించుచున్నది. అనగా జ్ఞానము లేని వాసనాక్షయమనోనాశములవలన ముక్తి కలగదు అని సూచించుచున్నది. "యేన ముచ్యతే" అనుదానికి జ్ఞానమువలన లభించిన ఏ కేవలత్వము చేత సకలబంధములనుండి విముక్తుడగునో అని అర్థము.

మూ. బన్ధశ్చానేకవిధః-అవిద్యాగ్రన్థిః, అబ్రహ్మత్వమ్, హృదయగ్రన్థిః, సంశయః, కర్మాణి, అసర్వకామత్వమ్. మృత్యుః, పునర్జన్మ ఇత్యాదిశబ్దైః తత్ర తత్ర వ్యవహారాత్. త ఏతే బన్ధాః సర్వేఽపి జ్ఞాననివర్త్యాః. తథా చ శ్రుతయః-

(1) "ఏతద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య" (ముండకోపనిషత్తు 2.2.10)

(2) "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ము.ఉ.3.2.9)

(3) "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" (ముం. ఉ. 2.2.8)

(4) "యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ" (తై.ఉ.2.2.1) (5) "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి" (శ్వే.ఉ.3.8)

(6) "యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః
స తు తత్పదమాప్నోతి యస్మాద్ భూయో న జాయతే"

(కఠ. ఉ. 1.3.8)

(7) "య ఏవ వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" (బృ. ఉ. 1.4.10) ఇత్యాదీన్యసర్వజ్ఞత్వాదిబన్ధనివృత్తిపరాణి వాక్యాన్యత్రోదాహరణీయాని.

వ్యా. బంధము అనేక విధములు - అవిద్యాగ్రంథి, అబ్రహ్మత్వము, హృదయగ్రంధి, సంశయము, కర్మలు, అసర్వకామత్వము, మృత్యువు, పునర్జన్మ ఇత్యాది శబ్దములచేత అక్కడక్కడ వ్యవహరింపబడుచున్నది. ఈ బంధము లన్నీ జ్ఞానముచేత తొలగింప శక్య మైనవే అని శ్రుతులు చెప్పుచున్నవి. (1) "సౌమ్యుడా రహస్యమైన స్థానమునందు ఉంచబడిన ఈ బ్రహ్మను తెలిసికొన్నవాడు ఇక్కడనే అవిద్యాగ్రంథిని విడచివేయును." (2) "బ్రహ్మను తెలిసికొన్నవాడు బ్రహ్మ అగును" 3 "సర్వశ్రేష్ఠ మైన ఆ ఆత్మను చూడగానే హృదయగ్రంథి బిన్న మగును. సర్వసంశయ ములు ఛిన్నము లగును వీని కర్మ లన్నీ క్షీణించును" (4) "రహస్య మైన ఆ పరమాకాశమునందు ఉన్న ఆ ఆత్మతత్త్వమును తెలిసికొన్నవాడు అన్ని కామములను ఒక్కమారుగా పొందగలడు'' [5] "ఆ ఆత్మను తెలిసికొన్న పిమ్మటనే మృత్యువును అతిక్రమించును'' [6] "ఎవడు విజ్ఞానవంతుడై, ఏకాగ్రచిత్తుడై, సర్వదా పరిశుద్ధుడై ఉండునో' అతడు ఏ స్థానమునుండి తిరిగి రాడో ఆ స్థానమును [ముక్తిని] పొందును'' [7] "నేను బ్రహ్మను" అని ఎవడు తెలిసికొనునో అతడు సర్వస్వరూపు డగును''- ఈ విధముగ అసర్వజ్ఞత్వము మొదలైన బంధముల నివృత్తిని బోధించు వాక్యములను ఇక్కడ ఉదాహరించవలెను.

మూ. సేయం విదేహముక్తిః జ్ఞానోత్పత్తిసమకాలీనా జ్ఞేయా· బ్రహ్మణ్యవిద్యారోపితానామేతేషాం బన్ధానాం విద్యయా వినాశే సతి పునరుత్పత్త్యసంభవాత్. అననుభవాచ్చ, తదేతద్విద్యాసమకాలీనత్వం భాష్యకారః సమన్వయసూత్రే (బ్ర.సూ. 1.1.4) ప్రపఞ్చయామాస· "తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్'' (బ్ర.సూ. 4.1.13) ఇత్యత్ర చ.

వ్యా. ఈ విదేహముక్తి జ్ఞానోత్పత్తికాలమునందే కలుగును. అవిద్యచేత బ్రహ్మయందు ఆరోపింపబడిన ఈ బంధము లన్నీ విద్యచే నశించగా అవి మరల పుట్టవు కదా? వీటి అనుభవము కూడ ఉండదు.

విదేహముక్తి జ్ఞానము కలిగిన సమయమునందే వెంటనే కలుగును అను విష యమును భాష్యకారు లైన శంకరభగవత్పాదులు సమన్వయ సూత్రము నందు చెప్పిఉన్నారు. "తదధిగమః— "ఇత్యాదిసూత్రభాష్యమునందు చెప్పిఉన్నారు.

మూ. నను వర్తమానదేహపాతాదనన్తరభావినీ విదేహముక్తిరితి బహవో వర్ణయన్తి. తథా చ శ్రుతిః—"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే"(ఛా.ఉ. 6.14.2.) ఇతి. వాక్య వృత్తావప్యుక్తమ్—

వ్యా [ఆశంక] విదేహముక్తి ప్రస్తుతము ఉన్న దేహము విడచిన తరువాత వచ్చునని చాల మంది చెప్పుదురు కదా ? శ్రుతి కూడ అట్లే ఉన్నది- "ఈ శరీరము విడచుట ఆలస్యము; శరీరము విడచిన వెంటనే మోక్షము" "వాక్యవృత్తి" లో కూడ చెప్పబడినది:-

మూ. "ప్రారబ్ధకర్మవేగేన జీవన్ముక్తో యదా భవేత్
కంచిత్కాలమథారబ్ధకర్మబన్ధస్య సంక్షయే. 52.
నిరస్తాతిశయానన్దం వైష్ణవం పరమం పదమ్
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే." 53. ఇతి.

సూత్రకారోఽప్యాహ - భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే "(బ్ర.సూ.4.1.19)ఇతి". ఇతరే ప్రారబ్ధపుణ్యపాపే. వసిష్ఠోఽప్యాహ-

"జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్ కృతే
విశత్యదేహముక్తత్వం పవనోఽస్పన్దతామివ."
(ల.వా.5. 95) ఇతి.

"ప్రారబ్ధకర్మ వేగముచేత జీవన్ముక్తుడుగా కొంత కాలము ఉన్న తరువాత ఆ ప్రారబ్ధకర్మ క్షీణము కాగానే అత్యుత్తమానందరూప మైనది, పరమాత్మ రూపము, పునరావృత్తిశూన్యము అయిన కైవల్యమును పొందును."

బ్రహ్మసూత్రకారు డైన బాదరాయణుడు కూడ-"ప్రారబ్ధము చేత ప్రాప్తములైన పుణ్యపాపములను అనుభవించుట ద్వారా తొలగించుకొని మోక్షము పొందును" అని చెప్పినాడు. వసిష్ఠుడు కూడ [లఘువాసిష్ఠములో]

ఇట్లు చెప్పినాడు-"తన దేహము కాలమునకు అధీన మై పోయిన పిమ్మట జీవన్ముక్తస్థితిని విడచి, వాయువు నిశ్చలత్వమును పొందినట్లు విదేహ ముక్తిని పొందును."

మూ. నాయం దోషః; వివక్షావిశేషేణ మతద్వయస్యావిరోధాత్. విదేహముక్తిరిత్యత్రత్యేన దేహశబ్దేన కృత్స్నం దేహజాతం వివక్షిత్వా బ ఖీర్వర్ణితమ్. అస్మాభిస్తు భావిదేహమాత్రవివక్షయా ఉచ్యతే; తదనారమ్భాయైవ జ్ఞానసంపాదనాత్. అయం తు దేహః పూర్వమే వారబ్ధః; అతః జ్ఞానేనాపి నాస్యారమ్భో వారయితుం శక్యతే. ఏత ద్దేహనివృత్తిరపి న జ్ఞానఫలమ్; అజ్ఞానినామప్యారబ్ధకర్మక్షయే తన్ని వృత్తేః. తర్హి వర్తమానలిఙ్గదేహనివృత్తిః జ్ఞానఫలమస్తు; జ్ఞానమన్త రేణ తదనివృత్తేః ఇతి చేత్ న; సత్యపి జ్ఞానే జీవన్ముక్తేః తన్ని వృత్త్యభావాత్.

వ్యా. [సమాధానము] వివక్షా విశేషముచే [చెప్పే అభిప్రాయములో భేదము చేత] రెండు మతములకు విరోధము లేదు గాన ఈ దోషములేదు. "విదేహముక్తి" అను పదములోని 'దేహ' శబ్దమునకు "సకలదేహములు" అను అర్థమును గ్రహించి చాలమంది అట్లు చెప్పినారు "రాబోవు దేహము" అను అర్థమునే గ్రహించి మేము చెప్పుచున్నాము మరల దేహము రాకుండుటకే కదా జ్ఞానము సంపాదించబడుచున్నది? ఈ దేహ మైతే పూర్వమే (జ్ఞానము కలుగుటకు ముందే) పుట్టినది అందుచేత జ్ఞానము చేత కూడ దీని పుట్టుక నివారింప శక్యము కాదు. ఈ దేహమును నివర్తింప చేయుట జ్ఞానమునకు ఫల మని కూడ చెప్పుటకు వీలులేదు- ప్రారబ్ధ కర్మ క్షీణ మైనప్పుడు జ్ఞానము లేనివారి దేహము కూడ పోవుచున్నది కదా? పోనీ- జ్ఞానము లేకుండ వర్తమాన లింగశరీరము నివర్తించదు గాన అది నివర్తిం చుట జ్ఞానఫల మని చెప్పవచ్చును కదా ? అట్లు కూడ కుదరదు; ఎందు చేత ననగా జ్ఞానము కలిగి జీవన్ముక్తి లభించిన పిమ్మట కూడ ఆ లింగ శరీరము నివర్తించుటలేదు.

మూ. నను జ్ఞానస్య కథం చిత్కాలం ప్రారబ్ధేన కర్మణా ప్రతిబన్ధేనానివర్తకత్వేఽపి ప్రతిబన్ధక్షయే లిఙ్గదేహనివర్తకత్వం భవిష్యతీతి చేత్-న; పఞ్చపాదికాచార్యేణ-“యతో జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్” ఇత్యుపపాదితత్వాత్. తర్హి లిఙ్గదేహనివృత్తేః కిం సాధనమితి చేత్-సామగ్రీనివృత్తిరితి బ్రూమః. ద్వివిధం హి కార్యనివర్తకమ్-విరోధిసద్భావః, సామగ్రీనివృత్తిశ్చేతి. తద్యథా విరోధినా వాయునా, తైలవర్తిసామగ్రీనివృత్త్యా వా దీపో నివర్తతే. లిఙ్గదేహస్య సాక్షాద్విరోధినం న పశ్యామః. సామగ్రీ హి ద్వివిధా - ప్రారబ్ధమనారబ్ధం చేతి. తాభ్యాముభాభ్యామజ్ఞానినాం లిఙ్గదేహ ఇహాముత్ర చ అవతిష్ఠతే. జ్ఞానినాం త్వనారబ్ధస్య జ్ఞానేన నివృత్తేః ప్రారబ్ధస్య చ భోగేన నివృత్తేః, తైలవర్తిరహితదీపవత్సామగ్రీనివృత్త్యా లిఙ్గదేహో నివర్తతే. అతో న తన్నివృత్తిః జ్ఞానఫలమ్.

వ్యా. (ఆశంక) జ్ఞానము ప్రారబ్ధ కర్మచేత ప్రతిబంధింపబడి కొంత కాలము పాటు లింగశరీరమును తొలగించలేకపోయినను కాలాంతరమునందు ఆ ప్రతిబంధము క్షీణించిన పిమ్మట దానిని తొలగించగలదు అని చెప్పవచ్చును కదా ? సమాధానము) అట్లు కుదరదు. పంచపాదికాచార్యులు (బ్రహ్మసూత్ర శాంకరభాష్యమునకు పంచపాదిక అను వ్యాఖ్యానము రచించిన పద్మపాదాచార్యులు; భగవత్పాదుల ప్రధానశిష్యులు నలుగురిలో ఒకరు) “జ్ఞానము అజ్ఞానమును మాత్రమే నివర్తింప చేయును” అని చెప్పినారు అట్లయితే లింగదేహ నివృత్తికి సాధన మేది? సామగ్రి నివర్తించుటయే లింగదేహనివృత్తికి సాధనము అని చెప్పెదము. ఒక కార్యమును తొలగించునవి రెండు విధములు- ఏదైన విరోధి ఆవిర్భవించుట. సామగ్రి తొలగి పోవుట. దీపము విరోధి యైన వాయువు వీచుటచేత గాని, నూనె, వత్తి అను సామగ్రి తొలగిపోవుటచేత గాని నివర్తించును (ఆరిపోవును). లింగదేహమునకు సాక్షాద్విరోధి ఏది (దీపానికి గాలి వంటిది కనబడదు. ఈ లింగదేహానికి ప్రారబ్ధకర్మ అనారబ్ధ [ఫలమును

ప్రారంభించవలసిన] కర్మ అని సామగ్రి రెండు విధములు జ్ఞానము లేనివారి లింగశరీరము ఆ రెండింటి చేత ఈ జన్మయందు, రాబోవు జన్మ యందు నిలచి ఉండును. జ్ఞానుల అనారబ్ధ కర్మ జ్ఞానము చేత నివర్తించి నది, ప్రారబ్ధము భోగము చేత నివర్తించినది. ఈ విధముగ వారి లింగ దేహము, తైలము, వత్తి లేని దీపమువలె, సామగ్రి లేకపోవుటచేత నివర్తిం చును. అందుచేత లింగదేహనివృత్తి జ్ఞానఫలము కాదు.

మూ. నన్వనేన న్యాయేన భావిదేహానారమ్భోఽపి న జ్ఞాన ఫలమ్. తథాహి-కిమనారమ్భ ఏవ ఫలమ్, కిం వా తత్పరిపాలనమ్? నాద్యః, తస్య ప్రాగభావరూపత్వేన అనాదిసిద్ధత్వాత్. న ద్వితీయః, అనారబ్ధకర్మరూపసామగ్రీనివృత్త్యైవ భావిదేహారమ్భప్రాగభావపరి పాలనసిద్ధేః, న చ తన్నివృత్తిః ఫలమ్; అవిద్యానివృత్తేరేవ విద్యాఫల త్వాత్. నైష దోషః, భావిజన్మానారమ్భాదీనాం విద్యాఫలత్వస్య ప్రామాణి కత్వాత్. "యస్మాద్ భూయో న జాయతే"(కఠ.ఉ.1.3.8) ఇత్యాద్యు దాహృతాః శ్రుతయస్తత్ర ప్రమాణమ్. న చ జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమితి న్యాయేన విరోధః; అజ్ఞానసహభావనియతానామబ్రహ్మ త్వాదీనామజ్ఞానశబ్దేన పఞ్చపాదికాచార్యైః వివక్షితత్వాత్. అన్యథా అను భవవిరోధః. అనుభూయతే హ్యజ్ఞాననివృత్తివదబ్రహ్మత్వనివృత్తిరపి. తస్మాద్భావిదేహరాహిత్యలక్షణా విదేహముక్తిః జ్ఞానసమకాలీనా.

వ్యా. (ఆశంక) లింగదేహము విషయమునందు మీరు చెప్పిన న్యాయమునే భావిదేహము విషయమునందు కూడ ప్రవర్తింప చేసినచో భావి దేహానారంభము (రాబోవు దేహము రాకుండ చేయుట) కూడ జ్ఞానమునకు ఫల మని చెప్పుట కుదరదు. ఎందుచేత ననగా, అనారంభమే (రాబోవు దేహము పుట్టకుండు నట్లు చేయుటయే) ఫలమా, లేక అనారంభమును పరిరక్షించుటయా ? మొదటి పక్షము కుదరదు. అనారంభ మనేది ప్రాగభావ రూపము గాన అది అనాది; దానిని చేయుట కుదరదు. రెండవ పక్షము కూడ

కుదరదు. అనారబ్ధకర్మరూప మైన సామగ్రియే నివర్తించనది గాన దాని చేతనే రాబోవు దేహము యొక్క ప్రాగభావమును సంరక్షించుట సిద్ధించును గాన దానికొరకు జ్ఞానము ఉపయోగించదు.

(ఒక వస్తువు పుట్టుటకు పూర్వము అ వస్తువు లేదు అట్లు లేకపోవుటకు ప్రాగభావము అని పేరు. ఉదాహరణకు ఘటము పుట్టుటకు పూర్వమెన్నడూ ఈ ఘటము లేదు గాన అనాదికాలమునుండి ఈ ఘటము పుట్టిన క్షణమువరకు ఘట పాగిభావము ఉన్నది ఈ ఘటము పుట్టగానే దాని ప్రాగభావము నశించును ఘటమును' పుట్టించవచ్చును గాని అనాదిగా ఉన్న దాని ప్రాగభావమును పుట్టించే ప్రసక్తి లేదు. అందుచేత భావిదేహప్రాగ భావమును జ్ఞానము పుట్టించును అని చెప్పుట కుదరదు అని ప్రథమ పక్షము నందు పూర్వపక్షి అభిప్రాయము. ఘటము పుట్టకుండా చేసినపో ఘట ప్రాగభావమును సంరక్షించిన ట్లగును అట్లే జ్ఞానము భావిదేహప్రాగ భావమును సంరక్షించును అనే రెండవ పక్షము కుదరదు అనారబ్ధకర్మ అనే సామగ్రి లేక పోవుటయే భావిదేహప్రాగభావమును సంరక్షించుచున్నది కదా అని రెండవ పక్షమున పూర్వపక్షి అభిప్రాయము).

ఎన్నటికిని లేకుండా భావి దేహము నివర్తించుట జ్ఞానమునకు ఫలమని చెప్పుట కూడ కుదరదు "జ్ఞానము అజ్ఞానమును మాత్రమే నశింపచేయును" అను న్యాయము అంగీకరించినారు కదా? (సమాధానము) ఈ దోషము లేదు. భావిజన్మను అరంభించకుండుట (కలగజేయకుండుట) మొదలైనవి విద్యకు ఫలమను విషయము ప్రమాణ సిద్ధము. పైన ఉదాహరించిన "దేని వలన మరల పుట్టడో" ఇత్యాది శ్రుతి వాక్యములు ఈ విషయమున ప్రమాణము. "జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్" అను న్యాయము తో విరోధము లేదు అజ్ఞానముతో తప్పక కలిసి ఉండే అబ్రహ్మత్వాదులు కూడ అజ్ఞానమే అని పంచపాదికాచార్యుల అభిప్రాయము (అనగా జ్ఞానము అజ్ఞానమును, అజ్ఞానముతో నిత్య సంబద్ధములైన అబ్రహ్మత్వాదులను కూడ తొలగించు నని ఆ వాక్యమునకు అర్థము) అట్లు చెప్పకున్నచో అనుభవమునకు విరోధము. అజ్ఞాననివృత్తితోపాటు అబ్రహ్మత్వాదుల నివృత్తి

కూడ అనుభవములో ఉన్నది కదా ? అందుచేత భావిదేహరాహిత్య రూప మైన విదేహముక్తి జ్ఞానముతో పాటు అదే సమయమున లభించును.

మూ. తథా చ యాజ్ఞవల్క్యవచనం శ్రూయతే - "అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృ.ఉ. 4.2.4). "ఏతావదరే ఖల్వమృతమ్" (బృ ఉ. 4.5.15) ఇతి చ. శ్రుత్యన్తరేఽపి "తమేవం విద్వానమృత ఇహ భవతి" (పు.సూ) ఇతి. యద్యుత్పన్నేఽపి తత్త్వజ్ఞానే తత్ఫల భూతా విదేహముక్తిస్తదానీం స భవేత్, కాలాన్తరే చ భవేత్, తదా జ్యోతిష్టోమాదివ జ్ఞానజన్యమపూర్వం కించిత్ కల్ప్యేత; తథా చ కర్మ శాస్త్ర ఏవ జ్ఞానశాస్త్రమన్తర్భవేత్.

వ్యా దీనికి అనుగుణముగా - "జనకా! నీవు అభయమును పొంది నావు" అని "ఇదే ముక్తి అనగా" అని బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞ వల్క్యుని వచనము ఉన్నది మరి యొక శ్రుతిలో కూడ "ఆత్మను ఈ విధముగా తెలిసికొనినవాడు ఇక్కడనే ముక్తు డగును" అని ఉన్నది. తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట కూడ దాని ఫల మైన విదేహముక్తి ఆ సమయమునందు కాక కాలాంతరమునందు కలిగినచో అప్పుడు జ్యోతిష్టో మాదులవలన వలెనే జ్ఞానమునుండి కూడ ఒక అపూర్వము కలుగును అని చెప్పవలసి ఉండును, అప్పుడు జ్ఞానశాస్త్రము కూడ కర్మశాస్త్రమునందే అంతర్గత మై పోవును.

(ఆ యా కర్మలు చేసినచో ఆ యా ఫలములు కలుగునని వేదములో చెప్పబడినది. కర్మలు చేసిన వెంటనే నశించిపోవునవి. ఎప్పుడో రాబోవు ఫలమును అవి ఎట్లు పుట్టించ గలవు? అందుచే, కర్మలు చేసిన వెంటనే ఒక శక్తి పుట్టు ననియు, అవి కర్తను ఆశ్రయించుకొని ఉండు ననియు, కాలము వచ్చి నప్పుడు ఇహజన్మలో కాని పరజన్మలో కాని ఫలము నిచ్చు ననియు మీమాంసకులు చెప్పుదురు. ఈ శక్తికే 'అపూర్వము' అని పేరు. ఇది పుణ్య-పాపకార్యములు రెండింటివలన కలుగును.)

మూ. అథోచ్యతే మన్త్రాదిప్రతిబద్ధాగ్నివత్ ప్రారబ్ధప్రతిబద్ధం జ్ఞానం కాలాన్తరే విదేహముక్తిం దాస్యతీతి-మైవమ్; అవిరోధాత్, న హ్యస్మదభిమతా భావిదేహోత్పత్త్యభావలక్షణా విదేహముక్తిః వర్తమానదేహమాత్రస్థాపకేన ప్రారబ్ధేన విరుధ్యతే; యేన ప్రతిబధ్యేత. కించ క్షణికత్వేన కాలాన్తరే స్వయమవిద్యమానం జ్ఞానం కథం ముక్తిం దద్యాత్. జ్ఞానాన్తరం చరమసాక్షాత్కారలక్షణముత్పద్యతే ఇతి చేత్-న; సాధనాభావాత్. ప్రతిబన్ధకప్రారబ్ధనివృత్త్యైవ సహ గురుశాస్త్రదేహేన్ద్రియాద్యశేషజగత్ప్రతిభాసనివృత్తేః కిం తత్సాధనం స్యాత్ ?

వ్యా. మంత్రాదులచేత ప్రతిబద్ధమైన అగ్ని ప్రతిబంధ మున్నంత వరకు వేడిని ఎట్లు కలిగించదో అట్లే ప్రారబ్ధముచేత ప్రతిబద్ధ మైన జ్ఞానము వెంటనే కాకపోయినను కాలాంతరమునందు విదేహముక్తిని ఇవ్వ వచ్చును కదా అని చెప్పుటకు కూడ వీలులేదు. వాటికి విరోదము లేదు కదా ? ప్రారబ్ధము కేవలము వర్తమానదేహమును మాత్రమే నిలుపును. దీనికిని, మేము చెప్పే భావిదేహోత్పత్త్యభావలక్షణమైన (రాబోవు దేహ మనేదే కాకపోవుట అనే) విదేహముక్తికిని విరోధమే లేదు కదా ? విరోధ మున్నప్పుడే కదా ఇది (ప్రారబ్ధము) భావివిదేహత్వమును బాధించుట ? మరొక విషయ మేమనగా-జ్ఞానము క్షణికము గాన కాలాంతరములో ఉండదు. అట్టి జ్ఞానము కాలాంతరమునందు ముక్తిని ఎట్లు ఇవ్వగలదు. చరమసాక్షాత్కారరూపమైన(చివరిక్షణములో ఆత్మసాక్షాత్కార మనే,మరొక జ్ఞానము కలుగును; అది విదేహత్వమును ఇచ్చును అని కూడ చెప్ప వీలు లేదు. అట్టి సాక్షాత్కారము కలుగుటకు సాధన మేమీ లేదు. దేహపాత సమయమునందు ప్రతిబంధక మైన (విదేహముక్తికి ప్రతిబంధకము అని మీరు చెప్పే) ప్రారబ్ధము నివర్తించగానే గురువు, శాస్త్రము, దేహేంద్రియములు మొదలైన సకలజగత్తు భాసించుట కూడ నివర్తించును గాన దానికి (చరమసాక్షాత్కారానికి) సాధన మేమి ఉండును ?

మూ. తర్హి-"భూయశ్చాన్తే విశ్వమాయానివృత్తిః" (శ్వే. ఉ. 1.10) ఇత్యస్యాః శ్రుతేః కోఽర్థః ఇతి చేత్; ఆరబ్ధాన్తే నిమిత్తాభావాత్ దేహేన్ద్రియాద్యశేషనైమిత్తికనివృత్తిరిత్యేవార్థః, తతో భవదభిమతా వర్తమానదేహరాహిత్యలక్షణా విదేహముక్తిః పశ్చాదస్తు దేహపాతానన్తరమ్; అస్మదభిమతా తు జ్ఞానసమకాలీనైవ. ఏతదేవాభిప్రేత్య భగవాన్ శేష ఆహ-

"తీర్థే శ్వపచగృహే వా నష్టస్మృతిరపి పరిత్యజన్ దేహమ్.
జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతి హతశోకః" 81. ఇతి.

తస్మాద్విదేహముక్తౌ సాక్షాత్సాధనస్య తత్త్వజ్ఞానస్య ప్రధానత్వముపపన్నమ్. వాసనాక్షయమనోనాశయోః జ్ఞానసాధనత్వేన వ్యవహితత్వాదుపసర్జనత్వమ్.

వ్యా. అట్లయితే "అంతమునందు సకలమాయలు నివర్తించును" అను శ్రుతికి ఏమి అర్థము?

"ప్రారబ్ధకర్మ అంతమునందు నిమిత్తము లేకపోవుటచేత దేహేంద్రియాదులైన సకలనైమిత్తికములు (ప్రారబ్ధమువలన పుట్టిన సకలకార్యములు) నివర్తించును అని మాత్రమే అర్థము అందువలన మీరు అంగీకరించే "వర్తమానదేహము పోవుట" అనే విదేహముక్తి దేహపాతానంతరము కలుగు ననుకొనుడు; మేము అంగీకరించే విదేహముక్తి మాత్రము జ్ఞానముతో బాటు ఒకే సమయమునందు కలుగును. ఈ అభిప్రాయముచేతనే పూజ్యుడైన శేషుడు ఇట్లు చెప్పి ఉన్నాడు-

"జ్ఞాని నష్టమైన స్మృతికలవాడైనను, తీర్థమునందు కాని, శ్వపాకము చేయువాని గృహమునందు గాని, దేహమును విడచినను జ్ఞానము కలిగిన సమయమునందే ముక్తుడై కైవల్యమును పొందును." (పరమార్థసారము 81)

అందువ విదేహముక్తివిషయమునందు దానికి సాక్షాత్సాధన మైన తత్త్వజ్ఞానము ప్రధాన మని చెప్పుట యుక్తముగా ఉన్నది వాసనాక్షయ మనోనాశములు జ్ఞానమునకు సాధనము లగుటవలన విదేహముక్తికి వ్యవహితములు గాన అవి ఉపసర్జనములు.

మూ. ఆసురవాసనాక్షయకారిణ్యా దైవవాసనాయా జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృత్యోరుపలభ్యతే.-"శాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యేత్" (బృ.ఉ. 4.4.23) ఇతి శ్రుతిః. స్మృతిరపి-

"అమానిత్వమదమ్భిత్వమహింసా శాన్తిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః.
ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ.
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్.
అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు.
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు.
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ.
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది.
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్.
ఏతద్ జ్ఞానమితిప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా.

(భ.గీ. 13.8.12) ఇతి.

అన్యస్మిన్నహంబుద్ధిరభిష్వఙ్గః. జ్ఞాయతే అనేనేతి వ్యుత్పత్త్యా జ్ఞానసాధనమిత్యర్థః.

వ్యా. ఆసురవాసనాక్షయము చేయు దైవవాసన జ్ఞానసాధన మను విషయము శ్రుతిస్మృతులలో చెప్పబడినది. "మనోనిగ్రము కలవాడు, ఇంద్రియనిగ్రహము కలవాడు, (మనస్సును, బాహ్యవస్తువులయందు ప్రస

రింపనీయనివాడు లేదా సన్యసించినవాడు), సుఖదుఃఖాదులను సహించువాడు, ఏకాగ్రచిత్తుడు అయి తనను తనలోనే చూడవలెను—తన మనస్సుతో ఆత్మసాక్షాత్కారమును పొందవలెను'' అని శ్రుతి చెప్పుచున్నది ఈ విషయము స్మృతిలో (భగవద్గీతలో) కూడ చెప్పబడినది—

"గర్వము లేకపోవుట, డాంబికము లేకపోవుట, అహింస, ఓర్పు, ఋజుత్వము, ఆచార్యుని ఉపాసించుట, పరిశుద్ధత్వము, స్థిరత్వము, మనోనిగ్రహము, ఇంద్రియవిషయములయందు వైరాగ్యము, అహంకారము లేకపోవుట, జన్మ-మృత్యు-వార్ధక్యములలోను, వ్యాధిదుఃఖములలోను ఉండు దోషములను గుర్తించుట, పుత్ర-భార్యా-గృహాదులందు సంగము. (వాళ్లే నేను అన్నట్లు) అత్యాసక్తి లేకపోవుట, ఇష్టము గాని అనిష్టము గాని వచ్చినప్పుడు ఎల్లప్పుడు సమచిత్తముతో ఉండుట, ఇతరదృష్టి ఏదీ లేకుండ నాయందు మార్పు లేని భక్తి, నిర్జనప్రదేశమును సేవించుట, జనసముదాయముతో కలియుటకు ఆసక్తి లేకపోవుట, అధ్యాత్మజ్ఞానమును నిత్యము అభ్యసించుట, తత్త్వజ్ఞానముచేత పరమార్థమును తెలిసికొనుట—ఇది అంతా 'జ్ఞానము' అని చెప్పబడుచున్నది. దీనికి భిన్నమైనది అజ్ఞాన మని చెప్పబడినది.''

ఇతరవ్యక్తులయందు "అతడే లేదా ఆమెయే నేను" అను బుద్ధి అభిష్వంగము, 'జ్ఞానము' అనగా—"జ్ఞాయతే అనేన" అను వ్యుత్పత్తిచేత దేనిచేత తెలియబడునో అది. అనగా జ్ఞానసాధనము అని అర్థము.

మూ. మనోనాశస్యాపి జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృతిప్రసిద్ధమ్—"తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః" (ము.ఉ. 3.1.8) ఇతి శ్రుతిః. "అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" (కఠ.ఉ. 2.12) ఇతి చ ప్రత్యగాత్మసమాధిప్రాప్త్యా దేవం జ్ఞాత్వేత్యర్థః.

"యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సంయతేన్ద్రియాః
జ్యోతిః పశ్యన్తి యుఞ్జానాస్తస్మై విద్యాత్మనే నమః."
(మ.భా.శా. 46.55) ఇతి స్మృతిః.

తదేవం తత్త్వజ్ఞానాదీనాం త్రయాణాం విదేహ ముక్తి జీవన్ముక్తివశాద్ గుణప్రధానభావవ్యవస్థా సిద్ధా.

**వ్యా.** మనోనాశము కూడ జ్ఞానసాధన మను విషయము శ్రుతుల లోను, స్మృతులలోను ప్రసిద్ధము, ''ఎట్టి మనోవృత్తులూ లేకుండా ధ్యానము చేయుచు పిమ్మట ఆ ఆత్మను సాక్షాత్కరించుకొనును'' ''అధ్యాత్మ యోగమును సాధించుట ద్వారా ధీరుడు -ఆ పరమాత్మను చూచి హర్షశోక ములను విడచును'' అని శ్రుతివాక్యములు చెప్పుచున్నవి. "అధ్యాత్మయో గాధిగమేన దేవం మత్వా'' అనగా ప్రత్యగాత్మవిషయక మైన సమాధిని పొందుట ద్వారా పరమేశ్వరుని తెలిసికొని అని అర్థము.

"నిద్ర లేనివారు, శ్వాసను జయించిన వారు, సంతుష్టులు, ఇంద్రి యములను నిగ్రహించుకొన్నవారు అయిన యోగాభ్యాసము చేయువారు, జ్యోతీరూప మైన ఏ ఆత్మను చూచుచుందురో జ్ఞానస్వరూప మైన ఆ ఆత్మకు నమస్కారము'' అని స్మృతి చెప్పుచున్నది. ఈ విధముగ తత్త్వజ్ఞానము మొదలైన మూడింటికి విదేహముక్తి, జీవన్ముక్తులను పట్టి ప్రధానత్వ-అప్ర ధానత్వనిర్ణయము సిద్ధించినది.

**మూ.** నను వివిదిషాసంన్యాసినా సంపాదితానామేతేషాం కిం విద్వత్సంన్యాసాదూర్ధ్వమనువృత్తిమాత్రం, కిం వా పునరపి సంపాదన ప్రయత్నః అపేక్షితః ? నాద్యః-తత్త్వజ్ఞానస్యేవాన్యయోరస్య యత్న సిద్ధత్వే ప్రాధాన్యప్రయుక్తాదరాభావప్రసఙ్గాత్. న ద్వితీయః; ఇతర యోరివ జ్ఞానస్యాపి ప్రయత్నసాపేక్షత్వే సత్యుపసర్జనత్వప్రయుక్తౌ- దాసీన్యాభావప్రసఙ్గాత్. నాయం దోషః. జ్ఞానస్యానువృత్తిమాత్రమితర యోర్యత్నసాధ్యత్వమిత్యఙ్గీకారాత్. తథా హి-విద్యాధికారీ ద్వివిధః

కృతోపాస్తిరకృతోపాస్తిశ్చేతి తత్రోపాస్యసాక్షాత్కారపర్యన్తముపాస్తిం కృత్వా యది జ్ఞానే ప్రవర్తేత తదా వాసనామనోనాశయోః దృఢతరత్వేన జ్ఞానామార్థ్వం విద్వత్సంన్యాసజీవన్ముక్తీ స్వత ఏవ సిధ్యతః. తాదృశ ఏవ శాస్త్రాభిమతో ముఖ్యో విద్యాధికారీ. తత స్తం ప్రతి శాస్త్రేషు సహోపన్యాసాత్. స్వరూపేణ వివిక్తావపి విద్వత్సంన్యాసవివిదిషా సంన్యాసౌ సంకీర్ణావివ ప్రతిభాసేతే.

వ్యా. (ఆశంక) వివిదిషాసంన్యాసి సంపాదింకొనిన ఈ తత్త్వ జ్ఞానాదులు విద్వత్సంన్యాసము తరవాత కూడ అనువర్తించుటమాత్రమే జరుగునా లెక వాటిని సంపాదించుటకొరకు మరల ప్రయత్నము చేయవలసి ఉండునా? మొదటి పక్షము కుదరదు. తత్త్వజ్ఞానము వలె వాసనాక్షయ మనోనాశములు కూడ అప్రయత్నముగా అనువర్తించినచో అవి చాలా ప్రధానమైనవి అను అభిప్రాయముతో వాటి విషయమున ఉండవలసిన ఆదరము లేకుండా పోవును ఆ రెండింటి వలె జ్ఞానము కూడ ప్రయత్న సాధ్యమే అయినచో పైన మీరు చెప్పిన విధముగ వాసనాక్షయమనోనాశ ములంకటె అది అప్రధానము కాదు గాన, వాటివలెనే అది కూడ ప్రధానమే గాన, దాని విషయమునందు ఔదాసీన్యము కుదరదు. (సమాధానము) ఈ దోషము లేదు. జ్ఞానము (విద్వత్సంన్యాసస్థితిలో కూఁడ) అనువర్తించును, మిగిలిన రెండింటినీ ప్రయత్నముచేత సాధించవలెను అని అంగీకరింప బడినది. ఎందుచేత ననగా—ఉపాసన చేసినవాడు, ఉపాసన చేయనివాడు అని విద్యాధికారి రెండు విధములు. ఉపాసించే దేవత సాక్షాత్కరించువరకు ఉపాసన చేసి పిమ్మట జ్ఞానమునందు ప్రవర్తించినట్లయితే వాసనాక్షయ మనోనాశములు చాల దృఢముగా ఉండును గాన జ్ఞానము కలిగిన పిమ్మట విద్వత్సంన్యాసజీవన్ముక్తులు వాటంతట అవే సిద్ధించును. ఇట్టివాడే శాస్త్ర సంమతుడైన ముఖ్యజ్ఞానాధికారి. విద్వత్సంన్యాసవివిదిషాసంన్యాసములు రెండూ వేరువేరు స్వభావము కలవే అయినను శాస్త్రములలో అవి కలిపి చెప్పబడుటచే అట్టి ముఖ్యాధికారి విషయమున అవి సంకీర్ణములు (భేదర హితములు వలె కనబడును.

మూ. ఇదానీంతనస్తు ప్రాయేణాకృతోపాస్తయ ఏవ ఔత్సుక్య మాత్రాత్సహసా విద్యాయాం ప్రవర్తన్తే. వాసనాక్షయమనోనాశౌ చ తాత్కాలికే సంపాదయన్తి, తావతా శ్రవణమనననిదిధ్యాసనాని నిష్పాద్యన్తే. తైశ్చ దృఢాభ్యస్తైరజ్ఞానసంశయవిపర్యయనిరాసాత్ తత్త్వజ్ఞానం సమ్యగుదేతి. ఉదితస్య జ్ఞానస్య బాధకప్రమాణాభావాత్ నివృత్తాయాః అవిద్యాయా పునరుత్పత్తికారణాభావాచ్చ నాస్తి తస్య శైథిల్యమ్. వాసనాక్షయమనోనాశౌ తు దృఢాభ్యాసాభావాత్ భోగప్రదేన ప్రారబ్ధేన తదా తదా తదా బాధ్యమానత్వాచ్చ సవాతప్రదేశదీపవత్సహసా నివర్తేతే. తథా చ వసిష్ఠః—

"పూర్వైర్భ్యస్తు ప్రయత్నైభ్యో విషమోఽయం హి సంమతః,
దుఃసాధో వాసనాత్యాగః సుమేరూన్మూలనాదపి (ల.వా. 28 109) ఇతి. అర్జునోఽపి—

"చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢమ్.
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్."

(భ.గీ. 6.34) ఇతి.

తస్మాదిదానీంతనానాం విద్వత్సంన్యాసినాం జ్ఞానస్యానువృత్తి మాత్రమ్. వాసనాక్షయమనోనాశౌ తు ప్రయత్నసంపాద్యావితి స్థితమ్.

వ్యా. ఇప్పటివారైతే సాధారణముగా ఉపాసన ఏమీ చేయకుండగానే కేవలము ఔత్సుక్యముతో హటాత్తుగా జ్ఞానమార్గములో ప్రవర్తించుచున్నారు. తాత్కాలికముగా వాసనాక్షయమనోనాశములను సంపాదించుకొనుచున్నారు, తావన్మాత్రముచేతనే శ్రవణమనన నిదిధ్యాసనములు కూడ సిద్ధించుచున్నవి. వాటిని దృఢముగా అభ్యసించుటచేత అజ్ఞానము, సంశయము, విపరీత జ్ఞానము తొలగిపోయి తత్త్వజ్ఞానము కలుగుచున్నది. ఉదయించిన ఆ తత్త్వజ్ఞానమును బాధించే ప్రమాణ మేదీ లేకపోవుటచేతను, నివర్తించిన

అవిద్య మరల పుట్టుటకు కారణ మేదీలేకపోవుటచేతను ఆ తత్త్వజ్ఞానమునకు శైథిల్యము కలుగదు. దృఢమైన అభ్యాసము లేకపోవుటచేతను, భోగము నిచ్చు ప్రారబ్ధము అప్పుడప్పుడు వాటిని బాధించుచుండుటచేతను వాసనాక్షయ-మనోనాశములు మాత్రము, గాలిలోని దీపము వలె హటాత్తుగా తొలగిపోవు చుండును. ఈ విషయమునే వసిష్ఠుడు చెప్పినాడు—

"వాసనాత్యాగమను నది పూర్వ ప్రయత్నము లన్నింటికంటె చాల విషమ మైనది. మీరు పర్వతమును పెకలించుటకంటె కూడ చాల కష్టసాధ్యము."

అర్జునుడు కూడ చెప్పినాడు—

"కృష్ణా ! మనస్సు చంచల మైనది; బాధించేది; చాల బలము గలది. వాయువును పట్టుట ఎట్లు కష్టమో దానిని నిగ్రహించుట అంత కష్ట మని తలచెదను "

అందువలన ఈ కాలానికి చెందిన విద్వత్సంన్యాసులకు జ్ఞానము అనువర్తించుచుండును. వాసనాక్షయమనోనాశములను మాత్రము వారు ప్రయత్నపూర్వకముగా సంపాదించుకొనవలెను అనునది నిశ్చితము.

మూ. నను కేయం వాసనా యస్యాః క్షయాయ ప్రయతితవ్యమ్ ఇతి చేత్-తత్స్వరూపమాహ వసిష్ఠః—

"దృఢభావనయా త్యక్తపూర్వాపరవిచారణమ్
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా
భావితం తీవ్రసంవేగాదాత్మనా యత్తదేవ సః
భవత్యాశు మహాబాహో విగతేతరసంస్మృతిః
తాదృగ్రూపో హి పురుషో వాసనావివశీకృతః
సంపశ్యతి యదేవైతత్ సద్వస్త్వితి విముహ్యతి.
వాసనావేగవైవశ్యాత్ స్వరూపం ప్రజహాతి తత్
భ్రాన్తం పశ్యతి దుర్దృష్టిః సర్వం మదవశాదివ."

(ఉ. వా. 28.48-51) ఇతి.

అత్ర చ స్వస్వదేశాచారకులధర్మభాషాభేతదద్గతాప శబ్దసుశబ్దాదిషు ప్రాణినామభినివేశః సామాన్యతః ఉదాహరణమ్. విశేషతస్తు భేదానుక్త్వా పశ్చాదుదాహరామః.

వ్యా. దేనిని క్షీణింపచేయుటకై ప్రయత్నించవలెనని చెప్పుచున్నారో ఆ "వాసన" అనునది ఏది? దాని స్వరూపమును వసిష్ఠుడు ఇట్లు చెప్పినాడు—

"ఒక విషయమును గూర్చి అత్యధికముగా భావన చేయుటచేత, పూర్వాపరవిచారణ (వెనుక ముందు ఆలోచన) ఏదీ లేకుండగా దానిని గ్రహించుట అనేది ఏది కలదో అదే వాసన."

"ఓ! మహాబాహూ! మానవుడు తీవ్రమైన సంవేగముతో దేనిని భావన చేయునో, తాను కూడ అదిగానే అయిపోయి ఇతరముల నన్నింటిని మరచిపోవును."

"వాసనకు లొంగిపోయిన పురుషుడు ఆవస్తువుతో ఏకమైపోయి తాను చూచినదే లేదా తాను భావించినదే మంచి దని మోహమును చెందును."

"వాసనావేగమునకు లొంగిపోవుటచేత ఆలోచనలు చెడి, స్వరూపమును విడచి, మదముచేత వలె అంతనూ, భ్రాంతితో విపరీతరూపములో చూచును."

ఈ విధమైన వాసనకు సామాన్యమైన ఉదాహరణము—ప్రతివారు తమ తమ దేశాచారములు, కులధర్మలు, తమ భాషలు మంచి వని, ఇతరుల ఆచారధర్మభాషాదులు మంచివి కావని, తాము ప్రయోగించే శబ్దాలు సుశబ్దాలని, ఇతరులు ప్రయోగించేవి అపశబ్దాలనీ చాల పట్టుదలతో వాదించుచుందురు వాసనాభేదములను చెప్పిన తరువాత విశేషరూపమున ఉదాహరణములను చూపెదము.

మూ. యథోక్తాం వాసనామభిప్రేత్య బృహదారణ్యకే శ్రూయతే-
"స యథాకామో భవతి తత్క్రతుర్భవతి; యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే తదభిసంపద్యతే" (బృ ఉ.4.4.5) ఇతి. వాసనాభేదో వాల్మీకినా దర్శితః-

"వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా
మలినా జన్మహేతుః స్యాచ్ఛుద్ధా జన్మవినాశినీ
అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ
పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః
పునర్జన్మాఙ్కురం త్యక్త్వా స్థితా సంభృష్టబీజవత్
దేహార్థం ధ్రియతే జ్ఞాతజ్ఞేయా శుద్ధేతి చోచ్యతే."
(ల.వా. 1.10-12) ఇతి.

దేహాదీనాం పఞ్చకోశానాం తత్సాక్షిణశ్చిదాత్మనశ్చ భేదావరకమజ్ఞానమ్. తేన సుష్ఠు ఘనీభూత ఆకారో యస్యాః సేయమజ్ఞానసుఘనాకారా. యథా క్షీరం తక్రమేలనేన ఘనీభవతి, యథా వా విలీనం ఘృతమత్యన్తశీతలప్రదేశే చిరమవస్థాపితం సుఘనీభవతి తథా వాసనా ద్రష్టవ్యా. ఘనీభావశ్చాత్ర భ్రాన్తిపరమ్పరా. తాం చాసురసంపద్వివరణే భగవానాహ—

వ్యా. ఈవిధమైన వాసనను గూర్చి బృహదారణ్యకోపనిషత్తులో కూడ చెప్పబడినది—

"వానికి ఎట్టి కోరిక లుండునో అట్టి సంకల్పము కలుగును ఎట్టి సంకల్ప ముండునో అట్టి పనులు చేయును. ఎట్టి పనులు చేయునో అట్టి వాడే అగును."

వాసనాభేదమును వాల్మీకి కూడ చూపినాడు:—

"శుద్ధము, మలినము అని వాసన రెండు విధములు మలినవాసన జన్మకు హేతువు, శుద్ధవాసన జన్మను నశింపచేయును"

"అజ్ఞానముచేత చాల దట్టముగా ఏర్పడినది, దట్టమైన అహంకారముతో కూడినదీ అయిన వాసన మలినవాసన; అది పునర్జన్మకు హేతు వని పండితులు చెప్పుదురు."

"ఏ వాసన తెలిసికొనదగిన పరమార్థతత్త్వమును తెలిపి, పునర్జన్మను కలిగించు అంకురము లేకుండగా, వేయించిన విత్తనము వలె, కేవలము దేహమును నిలుపుటకొరకు మాత్రమే మిగిలి ఉండునో అది శుద్ధవాసన అని చెప్పబడుచున్నది."

అజ్ఞానము దేహాదిపంచకోశములకు, వాటికి సాక్షియైన చిదాత్మకు మధ్య నున్న భేదమును కప్పివేయును. దాని చేత ఈ వాసన చాల ఘనమైన ఆకారము కలది అగుచున్నది. మజ్జిగ కలుపుటచే పాలు ఎట్లు ఘన మగునో, కరిగి యున్న నెయ్యి, చాల సేపు చాల చల్లగా ఉన్న ప్రదేశములో ఉంచుటచే ఎట్లు గడ్డకట్టునో అట్లే అజ్ఞానముచేత వాసన దట్ట మగునని గ్రహించవలెను. ఇక్కడ వాసన దట్ట మగుట అనగా ఒకదాని తరవాత ఒకటిగా భ్రాంతి కలుగుచుండుట. ఇట్టి భ్రాంతిపరంపరను గూర్చి భగవంతుడు ఆసురసంపద్వివరణసందర్భమున చెప్పినాడు—

మూ. "ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే."

(భ.గీ. 16.7)

వ్యా. ఆసురప్రకృతి గల జనులు ప్రవృత్తిని గాని నివృత్తిని గాని (ఏమి చేయవచ్చును, ఏమి చేయగూడదు అను విషయమును) ఎరుగరు. వారియందు శుచిత్వము గాని, సదాచారము గాని, సత్యము కాని ఉండదు.

మూ. "అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్."

వ్యా. ఈజగత్తులో సత్యపదార్థ మేదీ లే దని, దీనికి ఒక ప్రతిష్ఠ (ఆధారము) లేదని, దీనిని నియమించు పరమేశ్వరుడు లేడని, స్త్రీ పురుషుల అన్యోన్యసంపర్కముచేతనే సృష్టి జరుగుచున్న దని చెప్పుదురు. కామ మనే హేతువు తప్ప మరేమి ఉన్నది అని అనుచుందురు

మూ. "ఏతాం దృష్టిమవష్టభ్య న ష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః." 9

వ్యా. ఈ దృష్టిని అవలంబించి వివేకజ్ఞానము లేనివారై, అల్పబుద్ధులైన ఈ జనులు భయంకరములైన పాపకృత్యములు చేయుచు, జగత్తుకు హితములు కాని కార్యములు చేయుచు ఈ జగత్తును నశింపచేయుదురు.

మూ. "కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః
మోహాద్ గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః" 10

వ్యా. పూరింప శక్యము కాని కామముతో (కోరికలతో) సతమత మగుచు, డాంబికము, దురహంకారము మదము పెంచుకొనుచు, అజ్ఞానము వలన చెడ్డదైన మొండి పట్టుదల వహించి చెడ్డ నిర్ణయములు చేయుచు వ్యవహరించుచుందురు.

మూ. చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః. 11

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్. 12

వ్యా. వినాశమునకు దారి తీయు అంతము లేని చింతను పొందుచు, కామభోగమునందు అత్యాసక్తులై, ఇదే ప్రధానలక్ష్యము అని నిశ్చయించు కొని, వందలకొలది ఆశ లనే పాశములచేత బద్ధులై, కామక్రోదములకు వశులై, కామభోగములకొరకై అన్యాయముగా ధనమును కూడబెట్టుటకు ప్రయత్నించుచుందురు.

మూ. త ఆసురా జగదసత్యమాహుః. నాస్తి సత్యం వేదపురాణాదిప్రమాణం యస్మింస్తాదృశం జగదాహుః. వేదానాం ప్రామాణ్యం న మన్యన్తే ఇత్యర్థః. అత ఏవ నాస్తీశ్వరః కర్తా వ్యవస్థాపకశ్చ యస్మింస్తాదృశం జగదాహుః. తర్హి కుతోఽస్య జగత ఉత్పత్తిం వదన్తీత్యత్రాహ - అపరస్పరేతి. అపరశ్చ పరశ్చేత్యపరస్పరమ్.అపరస్పరతః అన్యోన్యతః స్త్రీపురుషమిథునాత్ సంభూతం జగత్. కిమన్యత్ కారణమస్య? నాస్త్యన్యత్కిఞ్చిత్.కింతు కామహైతుకమ్;స్త్రీపురుషయోః కామ ఏవ ప్రవాహరూపేణ హేతురస్యేత్యాహురిత్యర్థః.

వ్యా. అసురప్రకృతి కలవారు జగత్తు అసత్యము అని చెప్పుదురు "నాస్తి సత్యం యస్మిన్ తత్ అసత్యమ్" — వేదపురాణాదిసత్యము, అనగా ప్రమాణము, దేని యందు లేదో అది "అసత్యము" వారు వేదముల ప్రామాణ్యమును అంగీ కరించరు అని అర్థము. అందుచేతనే ఈ జగత్తును సృష్టించి వ్యవస్థలు చేసిన ఈశ్వరుడు లేడు అని వాళ్లు అందురు. అయితే ఈ జగత్తు ఎట్లు పుట్టుచున్నదని వారి అభిప్రాయము ? వాళ్లు ఇట్లు చెప్పుచుందురు—"అపరశ్చ పరశ్చ అపరస్పరమ్." అన్యోన్యము అని అర్థము అపరస్పరమునుండి పుట్టినది; అనగా స్త్రీపురుషుల సంబంధమువలన పుట్టినది. ఇంతకు మించిన కారణమేమి ఉన్నది? ఏదీ లేదు, ఇది కేవలము కామహైతుకము. అనగా స్త్రీపురుషుల కామమే దీనికి ప్రవాహరూపమున, అనగా ఒక తరమునకు చెందిన స్త్రీపురుషుల కామము తరువాతి తరమువారికి—ఈ విధముగా ప్రవాహము వలె నిరంతరము కారణముగా కొనసాగుచున్నది అని అందురు.

మూ. ఘనాహంకారశ్చ తత్రైవోదాహృతః—

"ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.
అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా.
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః
అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ"
(భ.గీ. 16,13-16)

వ్యా. దట్టమైన అహంకారమును గూర్చి కూడ అక్కడనే చెప్ప బడినది.-

"ఇప్పటికి ఇది సంపాదించినాను; ఈ మనోరథమును (కోరిన వస్తువును) సంపాదించెదను. ఇప్పుడు ఈ ధన మున్నది; ముందు ముందు ఈ ధనము లభించగలదు ఈ శత్రువును హతమార్చినాను; మిగిలిన వాళ్లను కూడా పరిమార్చెదను; నేను సమర్థుడను; నేను సకలభోగములు ఉన్నవాడను; నేను కార్యములు సాధించినాను; బలవంతుడను; సుఖ వంతుడను; ధనవంతుడను; మంచి బలగము ఉన్నవాడను; నన్ను బోలినవాడు ఎవడున్నాడు? పూజలు చేసెదను; దానాలు ఇచ్చెదను; సంతోషించెదను" అని అజ్ఞానముచేత మోహితులై, అనేకవిధముల చిత్త భ్రమణములతో అజ్ఞానముచేత ఆవరింపబడి వీరు కామభోగములందే నిరంత రము ఆసక్తి చూపుచుందురు చివరికి అపవిత్రమైన నరకములో పడెదరు.

మూ. ఏతేన పునర్జన్మకారణత్వముదాహృతం భవతి. తచ్చ పున రుక్తమ్:-

"ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధిపూర్వకమ్.
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః.
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు.

అసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్."
(భ.గీ. **16.17-20**) ఇతి.

వ్యా. దీనిచేత, ఆసురప్రకృతి (మలిని వాసన) పునర్జన్మకు కారణమని చెప్పినట్లు అయినది. ఆ విషయము కూడ మరల స్పష్టముగా చెప్పబడినది.

"గొప్పవార మని తమకు తామే భావించుచు, వినయము లేనివారై, ధన మున్నది కదా అను గర్వముతోను, మాన్యుల మనే భావముతోను కూడిన వారై ధర్మాత్ముల మని చెప్పకొనుటకై శాస్త్రవిహిత మైన పద్ధతిని అనుసరించక యజ్ఞములు (పూజాదులు) చేయుచుందురు. అవన్నీ పేరునకు మాత్రమే యజ్ఞములు. అహంకారము, బలము, గర్వము, కామము, క్రోధము మొదలైనవాటితో నిండినవారై, అసూయాపరులై, తమలోను, ఇతరుల దేహములలోను కూడ ఉన్న నన్ను ద్వేషించుచుందురు. (ఇతరులను ద్వేషించుట అనగా వారిలోను తనలోను కూడ ఉన్న నన్ను (పరమాత్మను) ద్వేషించుటయే.) ఈ విధముగా ద్వేషస్వభావము గల, క్రూరులైన ఆ నరాధములను నేను ఎల్లప్పుడు సంసారములందే (జన్మ మరణ ప్రవాహమునందే) పడవేయుచుందును. అర్జునా! ఈ మూఢులు ప్రతి జన్మయందు ఆసురప్రకృతితోనే ప్రవర్తించుచు, నన్ను చేరజాలక, అధమ గతికి పోవుచుందురు."

మూ. శుద్ధవాసనా తు జ్ఞాతజ్ఞేయా. జ్ఞేయస్వరూపం త్రయోదశాధ్యాయే భగవానాహ:—

"జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.
(భ. గీ. **13.12**)

వ్యా. తెలియదగిన సత్యమును తెలిసికొనిన వాసన శుద్ధవాసన. జ్ఞేయస్వరూపము త్రయోదశాధ్యాయములో భగవంతుడు చెప్పినాడు.—

"దేనిని తెలిసికొన్నవాడు ముక్తిని పొందునో ఆ జ్ఞేయమును గూర్చి చెప్పెదను. అది అనాది యైన పరబ్రహ్మస్వరూపము. అది సత్తు (ఉన్నది) అని గాని అసత్తు (లేనిది) అని గాని చెప్పుటకు వీలు లేదు."

మూ. "సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి". 13

"అది అన్ని వైపులా హస్తములు పాదములు కలది. అన్ని వైపులా నేత్రములు, శిరస్సు, ముఖము కలది. అన్ని వైపులా చెవులు కలది, అంతను ఆవరించి ఉన్నది"

మూ. "సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ." 14

వ్యా. "అది అన్ని ఇంద్రియముల గుణములను ప్రకాశింప చేయునది ఏ ఇంద్రియమూ లేనిది. సంగము లేనిది. కాని అంతకూ ఆధార మైనది గుణరహితము. గుణములను అనుభవించునది"

మూ. "బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్." 15

వ్యా. "అది భూతములకు బైటా లోపలా కూడ ఉన్నది. చలనము లేనిది కాని సంచరించునది. సూక్ష్మము అగుటచేత అది తెలియ శక్యము కానిది. దూరముగా ఉన్నది. సమీపమున ఉన్నది"

మూ. "అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్.
భూతభర్తృ చ తజ్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ." 16

వ్యా "ఎట్టి విభాగములు లేకపోయినను అది భూతములతో విభక్త మైనట్లు ఉన్నది. అది భూతములను పోషించునది. వాటిని మ్రింగివేయునది వాటి విషయమున అధికారము కలది అని తెలియవలెను"

మూ. "జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్." 17

వ్యా. "అది ప్రసిద్ధము లైన అన్ని తేజస్సులకు కూడ తేజస్సు తమస్సుకు అతీతము. అది జ్ఞాన స్వరూపము; జ్ఞేయ (తెలియదగినవస్తువు) స్వరూపము జ్ఞానముచేత పొందదగినది. అందరి హృదయములందు ఉన్నది."

మూ: అత్ర తటస్థలక్షణస్వరూపలక్షణాభ్యాముపగన్తుం సోపాధికనిరుపాధికస్వరూపద్వయముపన్యస్తమ్. కదాచిత్సంబన్ధి సత్ యల్లక్షయతి తత్తటస్థలక్షణమ్. యథా "కాకవత్ దేవదత్తగృహమ్" ఇతి. తథా కాలత్రయసంబన్ధి సత్ యల్లక్షయతి తత్ స్వరూపలక్షణమ్. యథా— "ప్రకృష్టప్రకాశశ్చన్ద్రః" ఇతి.

వ్యా. బ్రహ్మను తటస్థలక్షణము ద్వారాను, స్వరూపలక్షణము ద్వారాను తెలిసి కొనుటకై ఆ బ్రహ్మ యొక్క ఉపాధితో కూడిన స్వరూపము ఉపాధి లేని స్వరూపము కూడ చెప్పబడినవి ఏదో ఒక సమయము నందు మాత్రమే ఒకదానితో సంబంధించి ఉండి దానికి గుర్తుగా చెప్పబడినది తటస్థ లక్షణము ఉ.-"కాకి వాలి ఉన్నది దేవదత్తుని ఇల్లు" అని దేవదత్తుని ఇంటికి కాకిని గుర్తుగా చెప్పుచున్నాము ఆ కాకి మరు క్షణంలో ఎగిరిపోవచ్చును కావి గుర్తు చెప్పే సమయానికి అక్కడ అది ఉండుటచే దానిని పట్టి దేవదత్తుని ఇంటిని గుర్తించుచున్నాము. ఇది దేవదత్తుని ఇంటికి తటస్థలక్షణము. అట్లే సృష్ట్యాదులను చేయుట అనేది బ్రహ్మకు మాయా సంబంధముచేత కల్పింపబడినది కాని వాస్తవముకాదు. అందుచేత "సృష్ట్యాదులను చేయునది బ్రహ్మ" అని చెప్పిన బ్రహ్మలక్షణము తటస్థలక్షణము.

కాలత్రియమునందు (భూత-భవద్-భవిష్యత్కాలములందు) సంబంధించి ఉన్న దానిని గుర్తుగా చెప్పినచో అది స్వరూపలక్షణము. ఉదా- అధిక మైన ప్రకాశము కలది చంద్రబింబము" అనునది స్వరూపలక్షణము.

ప్రకృష్ట 'ప్రకాశ' అనునది ఎన్నడూ చంద్రుని వీడకుండ ఉన్నది కదా? అట్లే "బ్రహ్మ సత్యము, జ్ఞానము అనంతము" అని చెప్పిన బ్రహ్మ లక్షణము స్వరూపలక్షణము

మూ. నను త్యక్తపూర్వాపరవిచారత్వం వాసనాలక్షణముక్తమ్; జ్ఞేయజ్ఞానం చ విచారజన్యమ్. అతో న శుద్ధాయాం తల్లక్షణమస్తి- నైవమ్; లక్షణే దృఢభావనయేత్యుక్తత్వాత్. యథా బహుషు జన్మసు దృఢభావితత్వేనాస్మిన్ జన్మని వినైవ పరోపదేశమహంకారమమకార కామక్రోధాదయో మలినవాసనా ఉత్పద్యన్తే తథా ప్రాథమికస్య బోధస్య విచారజన్యత్వేఽపి దీర్ఘకాలనైరన్తర్యసత్కారైః భావితే తత్త్వే పశ్చాద్వాక్య యుక్తిపరావర్తనమన్తరేణైవ పురోవర్తిఘటాదివత్ సహసా తత్త్వం పరిస్ఫురతి. తాదృశ్యా బోధానువృత్త్యా సహిత ఇన్ద్రియవ్యవహారః శుద్ధా వాసనా. సా చ దేహజీవనయాత్రాయోపయుజ్యతే, న తు దమ్భదర్పాద్యాసురసంపదుత్పాదనాయ, నాపి జన్మాన్తరహేతుధర్మాధర్మోత్పాద నాయ; యథా భృష్టాని వ్రీహ్యాదిబీజాని కుసూలపూరణమాత్రోపయోయుక్తాని, న తు రుచిరాన్నాయ, నాపి సస్యనిష్పత్తయే తద్వత్.

వ్యా. (ఆశంక) పూర్వాపరవిచారములు లేకుండుటయే వాసనకు లక్షణము అని చెప్పబడినది కదా? జ్ఞేయమైన పరతత్త్వముయొక్క జ్ఞానము విచారము వలననే సిద్ధించును. అందుచే మీరు చెప్పిన వాసనా లక్షణము శుద్ధ వాసనకు వర్తించుటలేదు కదా? (సమాధానము) అట్లు అనరాదు వాసనా లక్షణములో "దృఢమైన భావనచేత" అను పదమును చేర్చినాము కదా? అనేక పూర్వ జన్మలలో దృఢముగా భావన చేయబడుటచేత, ఈ జన్మలో ఎవరూ ఉపదేశించవలసిన పని లేకుండగానే అహంకార - మమకార కామ-క్రోధాది మలినవాసనలు ఎట్లు పుట్టుచున్నవో అట్లే మొట్టమొదటి జ్ఞానము విచారమువలననే కలిగినను, ఆ తత్త్వమును గూర్చి చాలకాలము, నిరంతరము శ్రద్ధతో భావన చేయుటచే, పిమ్మట మహావాక్యములు వినుట గాని

యుక్తులు గాని, దానిని గూర్చిన మననము గాని చేయకుండగానే తత్త్వము, ఎదుట నున్న ఘటము వలె ఛట్టున స్ఫురించును. అట్టిజ్ఞానము అనువర్తించు చుండగా జరుగు ఇంద్రియవాసన శుద్ధవాసన. అది కేవలము దేహజీవన మునకు మాత్రమే ఉపయోగించును అంతే; అది దంభదర్పాద్యాసుర సంపదను పుట్టించుటకు కాని, జన్మాంతరమునకు హేతువు లైన ధర్మాధర్మములను పుట్టించుటకు గాని ఉపయోగించదు. వేయించిన ధాన్యపు విత్తనములు మొదలైనవి పొట్టకలు నింపుటకు మాత్రమే ఉపయోగించును; అంతేకాని మంచి అన్నము వండు కొనుటకు గాని, సస్యములను మొలిపించు టకు కాని ఉపయోగించవు. అట్లే ఈ శుద్ధవాసనలును.

తా. మలినా వాసనా త్రివిధా-లోకవాసనా, శాస్త్రవాసనా, దేహ వాసనా చేతి. సర్వే జనా యథా మాం న నిన్దన్తి, యథా వా స్తువన్తి తథైవ సర్వమాచరిష్యామి ఇత్యభినివేశో లోకవాసనా. తస్యాశ్చ సంపాదయితుమశక్యత్వాత్ మలినత్వమ్. తథా హి—

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్"

రా. 1.1.2

ఇత్యాదినా బహుధా వాల్మీకిః పప్రచ్ఛ;

"ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః"

(రా. 1.1)

ఇత్యాదినా ప్రత్యుత్తరం నారదో దదౌ. తాదృశస్యాపి రామస్య పతివ్రతాశిరోమణిభూతాయా జగన్మాతుః సీతాయాశ్చ శ్రోతుమశక్యో జనాపవాదః సంప్రవృత్తః; కిము వక్తవ్యమన్యేషామ్?

వ్యా. లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అని మలిన వాసన మూడు విధములు. "ఎవ్వరూ నన్ను నిందించకుండేటట్లు అందరూ నన్ను స్తుతించే టట్లు అన్నీ చేసెదను అను పట్టుదల లోకవాసన. ఎవ్వరూ కూడ ఆవిధముగ ప్రవర్తించజాలరు గాన ఆవాసన మలిన వాసన. అది యుక్తమే కదా? (ఎందుచేత ననగా)- "ఈనాడు ఈ లోకములో ఉత్తమమైన గుణములు

పరాక్రమము గలవాడు ఎవ్వడు"? అని వాల్మీకి నారదుని బహు విధముల ప్రశ్నించగా- "ఇక్ష్వాకువంశములో పుట్టినవాడు, రాము డను పేరుతో జనులలో ప్రసిద్ధుడు" ఇత్యాదివిధముగా నారదుడు ప్రత్యుత్తర మిచ్చెను. అట్టి రాముని విషయమునందు పతివ్రతాశిరోమణి, జగన్మాత అయిన సీతవిషయమునందు వినుటకు కూడ శక్యము కాని లోకాపవాద బయలు వెరిన దనగా ఇతరుల మాట ఏమి చెప్పవలెను?

మూ. తథాహి-దేశవిశేషేణ పరస్పరం నిన్దాబాహుల్యముప లభ్యతే దాక్షిణాత్యైర్విప్రైః ఔత్తరాహా వేదవిదో విప్రా మాంసభక్షిణో నిన్ద్యన్తే. ఔత్తరాహైశ్చ మాతులసుతోద్వాహినో యాత్రాసు మృద్భాణ్డ వాహినో దాక్షిణాత్యా నిన్ద్యన్తే. బహ్వృచా ఆశ్వలాయనశాఖాం కాణ్వ శాఖాయాః ప్రశస్తాం మన్యన్తే. వాజసనేయినస్తు వైపరీత్యేన. ఏవం స్వస్వకులగోత్రబన్ధువర్గేష్టదేవతాదిప్రశంసాపరకీయనిన్దా చ ఆవిద్వదఙ్గనా గోపాలం సర్వత్ర ప్రసిద్ధా.

వ్యా. ఎందుచేత ననగా దేశభేదమును పట్టి జనులు పరస్పరము అధికముగా నిందించుకొనుట కనబడుచున్నది. దక్షిణదేశీయులైన బ్రాహ్మణులు ఉత్తర దేశీయులైన వేదవేత్తలైన బ్రాహ్మణులను వీళ్లు మాంస భక్షకులని నిందించుచుందురు అట్లే ఉత్తరదేశీయులు దక్షిణదేశీయులను వీళ్లు మేనమామ కూతురును పెండ్లియాడుదురనీ, తీర్థయాత్రలో మట్టికుండలు మోసికొని పోవుచుందురనీ నిందించుచుందురు. బహ్వృచులు తమకు సంబంధించిన ఆశ్వలాయన శాఖ కాణ్వశాఖకంటె ప్రశస్తమైన దని భావించుచుందురు. వాజసనేయులు దీనికి విరుద్ధముగ తమ శాఖయైన ఆశ్వలాయన శాఖ ప్రశస్తమైన దని అనుకొను చుందురు. ఇట్లే తమ తమ కులములను, గోత్రములను, బంధువర్గమును, ఇష్టదేవతలను, తమకు సంబంధించిన ఇతర విషయములను ప్రశంసించుచు ఇతరుల కుల-గోత్ర -బంధువర్గ-ఇష్టదేవతాదులను నిందించుచుండుట పండితులు మొదలు స్త్రీలవరకు, పామరులైన గొల్లలవరకు అందరిలోనూ ప్రసిద్ధ మైనది.

మూ. ఏతదేవాభిప్రేత్యోక్తమ్——

"శుచిః పిశాచో విచలో విచక్షణః
క్షమోఽప్యశక్తో బలవాంశ్చ దుష్టః।
నిశ్చిత్తచోరః సుభగోఽపి కామీ
కో లోకమారాధయితుం సమర్థః" ఇతి.

"విద్యతే న ఖలు కశ్చిదుపాయః
సర్వలోకపరితోషకరో యః
సర్వథా స్వహితమాచరణీయం
కిం కరిష్యతి జనో బహుజల్పః" ఇతి చ

అతో లోకవాసనాయా మలినత్వమభిప్రేత్య యోగీశ్వరస తుల్యనిన్దాస్తుతిత్వం మోక్షశాస్త్రేషు వర్ణితమ్.

వ్యా. ఈ అభిప్రాయముతోనే ఇట్లు చెప్పబడినది--

"లోకుల దృష్టిలో శుచి యైనవాడు (ధనవ్యవహారాదులలో పరిశుద్ధుడు) పిశాచము; నేర్పు గలవాడు చపలుడు; ఓరిమి గలవాడు అసమర్థుడు; బలవంతుడు దుష్టుడు; ఏ ఆలోచనలూ లేని అమాయకుడు దొంగ; సౌందర్యవంతుడు కాముకుడు; ఈ లోకమును సంతోష పెట్టగలిగిన వాడు ఎవడు?"

"అందరికీ సంతోషము కలిగించే ఉపాయ మేదీ లేదు అందుచేత సర్వవిధాలా తనకు ఏది హితమో ఆ పని చేసుకోవలెను ఏదేదో పేలాపన పేలే ఈ లోకము ఏమి చేయును?"

ఈ విధముగ లోకవాసన మలిన మను అభిప్రాయము చేతనే యోగీశ్వరుడు నిందాస్తుతులయందు (ఎవరైనా తనను నిందించినను స్తుతించినను సమముగా ఉండవలె నని మోక్షశాస్త్రములో చెప్పబడినది.)

మూ. శాస్త్రవాసనా త్రివిధా–పాఠవ్యసనమ్, బహుశాస్త్రవ్యసనమ్, అనుష్ఠానవ్యసనం చేతి. పాఠవ్యసనం భరద్వాజే అవగమ్యతే. స హి పురుషాయుషత్రయేణ బహూన్వేదానధీత్య ఇన్ద్రేణ చతుర్థాయుషి ప్రలోభిత స్తత్రాపి పరిశిష్టవేదాధ్యయనాయోద్యమం చకార. తస్యాపి పాఠస్యాశక్యత్వాత్ మలినవాసనాత్వమ్. తాం చాశక్యతామిన్ద్రః ప్రతిబోధ్య పాఠాన్నివర్త్య తతోఽప్యధికాయ పురుషార్థాయ సగుణబ్రహ్మవిద్యాముపదిదేశ. తదేతత్సర్వం తైత్తిరీయబ్రాహ్మణే ద్రష్టవ్యమ్.

వ్యా. పాఠవ్యసనము, బహు శాస్త్రవ్యసనము, అనుష్ఠానవ్యసనము అని శాస్త్రవాసన మూడు విధములు. భరద్వాజునకు ఈ పాఠవ్యసనము ఉండెడి దని తెలియుచున్నది అతడు మూడు పురుషాయుర్దాయాలతో చాలా వేదాల అధ్యయనము చేసిన పిమ్మట 'ఉంకొక పురుషాయుర్దాయము ను ఇవ్వవలెనా?" అని ఇంద్రుడు నాల్గవ పురుషాయుర్దాయమునకై ప్రలోభనము చేయగా ఆ నాల్గవ పురుషాయుషమునందు కూడ మిగిలిన వేదముల అధ్యయనము చేయుటకు ఉద్యమించెనట ఆ పాఠముకూడ చేయశక్యముకాదు గాన అది మలిన వాసన అని చెప్పబడినది ఇంద్రుడు ఈ విధముగా పఠనము పూర్తి చేయుట అశక్యమని తెలిపి, అతనిని ఆ పాఠమునుండి మరల్చి, అంతకంటె అదికమైన పురుషార్థమునకు ఉపయోగించు సగుణ బ్రహ్మవిద్యను అతనికి ఉపదేశించెను.

ఈ విషయము తైత్తిరీయ బ్రాహ్మణములో ఉన్నది; ఆక్కడ చూచు కొనవలెను.

మూ. తథైవాత్యన్తిక పురుషార్థాభావాద్బహుశాస్త్రవ్యసనస్య మాలిన్యం కావషేయగీతాయాముపలభ్యతే—"కశ్చిన్మునిః దుర్వాసా బహువిధశాస్త్రపుస్తకభారైః సహ మహాదేవం నమస్కర్తుమాగతః తత్సభాయాం మునినా నారదేన భారవాహిగర్దభసామ్యమాపాదితః కోపాత్పుస్తకాని లవణార్ణవే పరిత్యజ్య మహాదేవేనాత్మవిద్యాయాం

ప్రవర్తితః" ఇతి. ఆత్మవిద్యా హి అన్తర్ముఖస్య గురుకారుణ్యరహితస్య న వేదశాస్త్రమాత్రేణోత్పద్యతే తథా చ శ్రుతిః — "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన" (కఠ.ఉ.1.2.22) ఇతి. అన్యత్రాప్యుక్తమ్—

"బహుశాస్త్రకథాకన్థారోమన్థేన వృథైవ కిమ్
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైర్జ్ఞానమాన్తరమ్."
"అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః
బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీ పాకరసం యథా" ఇతి చ.
నారదః చతుఃషష్టికలాకుశలోఽప్యనాత్మవిత్త్వేన అనుతప్తః సనత్కుమారముపససార ఇతి ఛన్దోగా అధీయతే (ఛా. ఉ. 7).

వా. ఆత్మే అత్యుత్తమ పురుషార్థమైన మోక్షమునకు సాధనము కాక పోవుటచేత బహుశాస్త్రవ్యసనము కూడ మలిన మైనదే అని కావషేయ గీతలో చెప్పబడినది దుర్వాసను డను ఒకముని అనేక విధములైన శాస్త్రములకు సంబంధించిన పుస్తకముల కట్టలు తీసికొని మహాదేవునకు నమస్కారము చేయుటకు వెళ్లగా ఆ సభలో ఉన్న నారదముని "నీవు బరువు మోసే గాడిదతో సమానాడవు" అన్నట్లు తేల్చగా అతడు కోపముతో ఆ పుస్తకములను అన్నింటినీ లవణార్ణవములో పడవేసినాడట. అప్పుడు మహాదేవుడు అతనిని ఆత్మవిద్యయందు ప్రవర్తింప చేసెనట అంతర్ముఖుడు కానివానికి, గురుకృప లేనివానికి ఆత్మవిద్య వేద శాస్త్రములను చదివినంత మాత్రమున లభించదు. "వేదాధ్యయనముచేత గాని, మేధాశక్తిచేత గాని, అధిక శాస్త్ర జ్ఞానము చేత కాని ఈ ఆత్మను పొందజాలరు" అని శ్రుతి చెప్పుచున్నది. ఇతర గ్రంథములలో కూడ చెప్పబడనది—

"అనేక శాస్త్రముల చర్చ అనే చింకిరి గుడ్డను నమలి వృథాగా నెమరు వేయుటచేత ఏమి ప్రయోజనము? తత్త్వజ్ఞానము గలవారు (తత్త్వ జ్ఞానము కోరువారు) ప్రయత్నపూర్వకముగా తమలో ఉన్న తేజస్సును అన్వేషించవలెను."

"నాలుగు వేదాల అధ్యయనము చేసినను అనేకధర్మ శాస్త్రిలను చదివినను గరిటె వంట రుచిని ఎట్లు ఎరుగజాలదో అట్లే బ్రహ్మతత్త్వమును ఎరుగ జాలడు."

అరవైనాలుగు కళలలో నేర్పుకలవాడైనను నారదుడు, ఆత్మజ్ఞానము లేకపోవుటచేత బాధపడుచు ఆత్మతత్త్వ ముపదేశించు మని కోరుచు సనత్కుమారుని వద్దకు వెళ్లెనని ఛందోగులు అధ్యయనము చేయుచున్నారు (ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడినది)

మూ. అనుష్ఠానవ్యసనం విష్ణుపురాణే నిదాఘస్యోపలభ్యతే;వసిష్ఠపురాణే దాశూరస్య. నిదాఘో హి ఋభుణా పునః పునః ప్రబోధమానోఽపి కర్మశ్రద్ధాజాడ్యం చిరం న జహౌ. దాశూరశ్చాత్యన్తశ్రద్ధాజాడ్యేన అనుష్ఠానాయ శుద్ధప్రదేశం భూమౌ న క్వాప్యుపలేభే. అస్యాశ్చ కర్మవాసనాయాః పునర్జన్మహేతుత్వాత్ మలినత్వమ్. తథాచాథర్వణికా అధీయతే—

వ్యా॥ నిదాఘు డనే వానికి ఉన్న అనుష్ఠానవ్యసనము విష్ణుపురాణములోను, దాశూరుని అనుష్ఠానవ్యసనము వసిష్ఠపురాణములోను వర్ణింపబడినది. ఋభుడు ఎంత బోధించినను నిదాఘుడు కర్మశ్రద్ధాజడత్వమును చాల కాలము విడువలేదు. దాశూరుని శ్రద్ధాజడత్వము ఎంత తీవ్రమైన దనగా ఆతనికి కర్మానుష్ఠానము చేసికొనుటకు తగిన పరిశుద్ధ మైన ప్రదేశము ఎక్కడా కనబడలేదు. ఇట్టి కర్మవాసన పునర్జన్మకు హేతువు గాన ఇది మలినము. అందుచేతనే ఆధర్వణ వేదాధ్యేతలు ముండకోపనిషత్తులో ఈ విధముగా అధ్యయనము చేయుచున్నారు (చెప్పుచున్నారు) :-

మూ. "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్తమవరం యేషు కర్మ.
ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యన్తి (ముం. 1.2.7)

వ్యా "(జ్ఞానమునకు దూర మగుట చేత) నికృష్టమైన ఈ (యజ్ఞ రూపమైన) కర్మ ఏ పద్దెనిమిది యజ్ఞరూపములపై (పదహారుగురు ఋత్విక్కులు, యజమానుడు, పత్ని అనే యజ్ఞసాధనములపై) ఆధారపడి యున్నట్లు చెప్పబడుచున్నదో ఈ పద్దెనిమిది యజ్ఞరూపములూ కూడ దుర్బలమైనవి. తేలిపోవునవి (నశించునవి) ఈ కర్మయే శ్రేయఃకారణ మని ఏ మూఢులు ఆనందించుచుందురో వారు మరల మరల జరామృత్యువులను పొందుచునే ఉందురు."

మూ. "అవిద్యాయామన్తరే వర్తమానాః
స్వయం ధీరాః పణ్డితంమన్యమానాః,
జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా
అన్ధేనైవ నీయమానా యథాన్ధాః" (ము. ఉ. 1.2.8)

వ్యా "అవిద్యలో చిక్కుకొని ఉండి, తామే బుద్ధిమంతుల మని పండితుల మని అనుకొనుచు ఈ మూఢులు మాటిమాటికి జరామరణాదులచే పీడించబడుచు గ్రుడ్డివారిచేత నడపబడుచున్న గ్రుడ్డివారు వలె తిరుగాడు చుందురు."

మూ. "అవిద్యాయాం బహుధా వర్తమానా
వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః,
యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగా
త్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే." (ము.ఉ. 1.2.9)

వ్యా. "మూర్ఖులు అవిద్యతోనే అనేక విధముల ప్రవర్తించుచు మేము కృతార్థుల మైనా మని అనుకొనుచుందురు ఎందుచేత ననగా ఈ కర్మరులు రాగమువలన తత్త్వమును ఎరుగజాలరు. అందుచేత వారు దుఃఖార్తులై, పుణ్య లోకములు క్షీణించగా వాటినుండి జారి పడి పోవుచుందురు."

మూ. "ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయన్తి ప్రమూఢాః,

నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వే-
మం లోకం హీనతరం వా విశన్తి." (ము.ఉ. 1.2.10)

వ్యా. "ఇష్టము (యాగాదిశ్రౌతకర్మలు), పూర్తము (వాపీకూపతటాకాదినిర్మాణరూపమైన స్మార్తకర్మ ఇవియే శ్రేష్ఠము లని అనుకొనుచు ఈ మూఢులు దీనిని మించిన శ్రేయస్సు ఉన్నదని ఎరుగరు. వారు స్వర్గములో తాము చేసిన పుణ్యమును అనుభవించి పిమ్మట ఈ లోకములోనికో లేదా ఇంతకంటె నికృష్టమైన లోకములోనికో ప్రవేశించుచుందురు."

మూ. భగవతాప్యుక్తమ్—

"యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి.
భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే.
త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్
యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః"

(భ.గీ. 2.42-46) ఇతి

వ్యా. భగవంతుడైన శ్రీకృష్ణుడు కూడ చెప్పి ఉన్నాడు-

"అర్జునా ! వేదవాదమునందే ఆసక్తికలవారై కొందరు అపండితులు వేదోక్తకర్మలకంటె వేరేదీ లేదని చెప్పుచు, కోరికలతో నిండిన మనస్సులు కలవారై స్వర్గమునందు ఆసక్తితో భోగైశ్వర్యముల ప్రాప్తికి సాధనము, జన్మరూపమైన కర్మఫలమును ఇచ్చేదీ, అనేక కర్మలతో కూడినదీ అయిన

పుష్పించిన (పైకి అందముగా కనబడు) వాక్కును పలుకుచుందురు ఆ వాక్కుచేత ఆకర్షింపబడిన మనస్సు కలవారై భోగైశ్వర్యములందే ఆసక్తి గల వారికి నిశ్చయాత్మక మైన బుద్ధి ఉండదు అర్జునా ! వేదములు ప్రతి పాదించే విషయము త్రిగుణాత్మక మైన సంసారమునకు సంబంధించినది. నీవు సంసారాతీతుడవై (కోరికలు లేనివాడవై' శీతోష్ణాదిద్వంద్వములు గాని, యోగక్షేమముల చింతగాని లేక ఎల్లప్పుడు సత్త్వగుణమునందే ప్రమాదరహితుడవై ఉండుము. పరిమితమైన జలము ఉన్న కూపాదులవలన ఎట్టి స్నానపానాదిప్రయోజనములను పొందవచ్చునో అంత ప్రయోజనము అంతట పొర్లుతున్న నీరు గల విశాలజలస్థానమునందు లభించును; దానిలో అంతర్గత మగును సకల వేదములవలన కలుగు ప్రయోజనము బ్రహ్మ-జ్ఞానవంతునకు అట్టిదే "

మూ. దర్పహేతుత్వాచ్చ శాస్త్రవాసనాయా మలినత్వమ్. శ్వేత కేతురల్పేనైన కాలేన సర్వాన్వేదానధీత్య దర్పేణ పితురపి పురతో వినయం న చకారేతి ఛన్దోగాః షష్ఠాధ్యాయే పఠన్తి. తథా బాలాకిః కాని చిదుపాసనాన్యవగత్య దృప్తః ఉశీనరాదిషు బహుషు దేశేషు దిగ్విజ-యేన బహూన్విప్రానవజ్ఞాయ కాశ్యామజాతశత్రుం బ్రహ్మవిచ్ఛిరోమణి-మనుశాసితుం ధార్ష్ట్యం చకారేతి కౌషీతకినో వాజసనేయినశ్చ అధీయతే.

వ్యా. దర్పమునకు హేతు వగుట చేత కూడ శాస్త్రవాసన మలినము. శ్వేతకేతువు అల్పకాలమునందే సకలవేదముల అధ్యయనము చేసి దర్పముతో తండ్రి ఎదుట కూడ వినయము చూపలేదని ఛందోగులు ఛాందోగ్యోపనిషత్తు ఆరవ అధ్యాయములో పఠించుచున్నారు అట్లే బాలాకి కొన్ని ఉపాసనలు నేర్చి దృప్తుడై ఉశీనరదేశము మొదలైన అనేకదేశములలో దిగ్విజయముచేత చాలమంది బ్రాహ్మణులను అవమానించి కాశియందు బ్రహ్మవేత్తలలో శిరోమణి యైన అజాతశత్రువునకు కూడ ఉపదేశించుటకు ధార్ష్ట్యమును చూపె నని కౌషీతకి - వాజసనేయశాఖలకు చెందినవారు అధ్యయనము చేయుదురు

మూ. దేహవాసనా హ్యాత్మత్వగుణాధానదోషాపనయనభ్రాన్తి-భేదాత్ త్రివిధా. తత్రాత్మత్వం భాష్యకార ఉదాజహార-"దేహమాత్రం చైతన్యవిశిష్టమాత్మేతి ప్రాకృతా జనా లౌకాయితికాశ్చ ప్రతిపన్నాః" (బ్ర.సూ.భా. 1.1.1.) ఇతి. "స వా ఏష పురుషోఽన్నరసమయః" ఇత్యారభ్య "తస్మాదన్నం తదుచ్యతే" (తై.ఉ. 2.1.2) ఇత్యన్తేన గ్రన్థేన తామేవ ప్రాకృతప్రతిపత్తిం తైత్తిరీయాః స్పష్టీకుర్వన్తి. విరోచనః ప్రజాపతినా అనుశిష్టోఽపి స్వచిత్తదోషేణ దేహాత్మబుద్ధిం దృఢీకృత్యాసురాన్ సర్వాననుశశాస ఇతి ఛన్దోగాః అష్టమాధ్యాయే సమామనన్తి.

వ్యా. దేహమే ఆత్మ అను భ్రాంతి దేహమునకు గుణములు సమకూర్చుచున్నాము అను భ్రాంతి, దోషములను పోగొట్టుచున్నాము అను భ్రాంతి అని దేహవాసన కూడ మూడు విధములు. దేహాత్మత్వమును బాష్యకారులు ఉదాహరించినారు-"చైతన్యముతో కూడిన దేహమే ఆత్మ అని ప్రాకృతజనులు లౌకాయితకులు భావించుచున్నారు" "ఆ పురుషుడు అన్నరసమయుడు" అని ప్రారంభించి "అందుచే అది అన్నమని చెప్పబడుచున్నది" అను దాని వరకు ఉన్న గ్రంథముచేత తైత్తిరీయులు ప్రాకృతజనుల కున్న ఆ దృష్టిని గూర్చి స్పష్టీకరించుచున్నారు. ప్రజాపతి వద్ద ఉపదేశమును పొందిన పిమ్మట కూడ విరోచనుడు తన చిత్తదోషముచేత దేహాత్మబుద్ధిని దృఢముగా చేసికొని అసురు లందరికి దానినే ఉపదేశించెనని ఛందోగులు అష్టమాధ్యాయములో చెప్పుచున్నారు.

మూ. గుణాధానం ద్వివిధం లౌకికం శాస్త్రీయం చేతి. సమీచీనశబ్దాదిసంపాదనం లౌకికమ్. సమీచీనధ్వనినా గాతుమధ్యేతుం వా తైలపానమరీచభక్షణాదిషు లోకాః ప్రయతన్తే. మృదుస్పర్శాయ లోకాః పుష్టికరావౌషధాహారౌ ఉపయుఞ్జతే. లావణ్యాయాభ్యఙ్గోద్వర్తనదుకూలాలంకారానుపసేవన్తే. సౌగన్ధ్యాయ స్రగ్వనిపనే ధారయన్తి. శాస్త్రీయం గుణమాధాతుం గఙ్గాస్నానసాలగ్రామతీర్థాదికం సంపాదయన్తి.

వ్యా. లౌకికము, శాస్త్రీయము అని గుణాధానము రెండు విధములు, సమీచీనమైన కంఠధ్వని మొదలైన వాటిని సంపాదించుకొనుట లౌకికము. మంచి కంఠధ్వనితో పాడవలె నని లేదా వేదాధ్యయనము చేయవలె నని చాలమంది తైలపానము, మిరియాలు తినుట మొదలైనవి చేయు చుందురు. మృదు స్పర్శకొరకై (శరీరము మెత్తగా ఉండుటకై, జనులు పుష్టికరము లైన ఔషధాహారములను ఉపయోగించుచుందురు. లావణ్యము (శరీరము నకు మెరుగు) కొరకు అభ్యంగస్నానము, ఒళ్లు పట్టుట లేదా నలుగు పెట్టుట పట్టువస్త్రములు మొదలైన అలంకారములు ధరించుట చేయు చుందురు. సువాసన కొరకై పుష్పమాలలు, మైపూతలు ధరించుచుందురు శాస్త్రీయ మైన గుణమును సంపాదించుటకు గంగాస్నానము, సాలగ్రామతీర్థసేవనము మొదలగునవి చేయుచుందురు.

మూ. దోషాపనయనం చ చికిత్సకోక్తై రౌషధై ర్ముఖప్రక్షాలనేన చ లౌకికమ్, శౌచాచమనాదిభిర్వైదికమిత్యుభయవిధమ్. అస్యాశ్చ దేహవాసనాయా మాలిన్యం పశ్యతే. దేహస్యాత్మత్వం తాపత్రయమాణి కత్వాదశేషదుఃఖహేతుత్వాచ్చ మలినమ్. అస్మింశ్చార్థే పూర్వాచార్యైః సర్వైరపి పరాక్రాన్తమ్. గుణాధానం చ ప్రాయేణ న పశ్యామః. ప్రసిద్ధా ఏవ గాయకా అధ్యాపకాశ్చ ప్రయతమానా అపి బహవో ధ్వని సౌష్ఠవం న లభన్తే, మృదుస్పర్శోఽఙ్గపుష్టిశ్చ న నియతౌ లావణ్య సౌగన్ధ్యే అపి దుకూలస్రగాదినిష్ఠే న తు దేహనిష్ఠే. అత ఏవ విష్ణు పురాణేఽభిహితమ్—

"మాంసాసృక్పూయవిణ్మూత్రస్నాయుమజ్జాస్థిసంహతౌ
దేహే చేత్ప్రీతిమాన్ మూఢో భవితా నరకేఽపి సః
స్వదేహాశుచిగన్ధేన న విరజ్యేత యః పుమాన్
వైరాగ్యకారణం తస్య కిమన్యదుపదిశ్యతే" ఇతి

వ్యా. దోషాపనయనము కూడ రెండు విధములు—

వైద్యులు చెప్పిన ఔషధములతో ముఖాదిప్రక్షాలనము చేసికొనుట అనేది లౌకికము. శౌచాచమనాదులచేత చేసేది వైదికము. ఈ దేహవాసన మలిన మను విషయమును మున్ముందు చెప్పెదము ప్రమాణములకు విరుద్ధ మగుట చేతను, సకలదుఃఖములకు హేతు వగుట చేతను దేహమే ఆత్మ అనుకొనుట మలిన మైనది. ఈ విషయమున పూర్వాచార్యు లందరూ తమ పరాక్రమము చూపి ఉన్నారు. సాధారణముగా గుణాధానము (లేని గుణమును సంపాదించుట) కనబడదు. ఎందరో గాయకులు, అధ్యాపకులు ధ్వనిలో సౌష్ఠవమును సంపాదించుటకు ఎంత ప్రయత్నించినను దానిని పొందలేకపోవుటను చూచుచునే ఉన్నాము, మృదుస్పర్శ, శరీరపుష్టి అనేవి కూడ నియతములు (తప్పక లభించేవి) కావు. లావణ్యసౌగంధ్యములు కూడ పట్టు వస్త్రములు మాలికలు మొదలైన వాటిలో ఉన్నవి కాని దేహమునందు లేవు. అందుచేతనే విష్ణుపురాణములో ఇట్లు చెప్పబడినది-

"మాంసము, రక్తము, చీము మలమూత్రములు, కండరములు, కొవ్వు, ఎముకలు-వీటి ప్రోగు అయిన దేహమునందు ప్రీతి గల మూఢునకు నరకమునందు కూడ ప్రీతి ఉండును!." "తన దేహమునుండి వచ్చు అపవిత్రమైన దుర్వాసనకు వైరాగ్యము చెందని వానికి మరి ఏ ఇతర వైరాగ్యకారణములను చూపినను ప్రయోజన ముండదు."

మూ. శాస్త్రీయం చ గుణాధానం ప్రబలేన శాస్త్రాన్తరేణా పోహ్యతే. యథా "న హింస్యాత్సర్వా భూతాని" ఇత్యస్య "అగ్నీషోమీయం పశుమాలభేత" ఇత్యనేన అపవాదః తద్వత్. ప్రబలతరం శాస్త్రమే-తదన్యశాస్త్రాపేక్షయా.

"యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే
స్వధీః కలత్రాదిషు భౌమ ఇజ్యధీః.
యత్తీర్థబుద్ధిః సలిలే న కర్హిచి-
జ్జనేష్వభిజ్ఞేషు స ఏవ గోఖరః." (భా)
"అత్యన్తమలినో దేహో దేహీ చాత్యన్తనిర్మలః
ఉభయోరన్తరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే." ఇత్యాది

వ్యా. శాస్త్రోక్తమైన గుణాధానమును ప్రబలమైన మరొక శాస్త్రము నివారించుచున్నది. "ఏ ప్రాణులను హింసించకూడదు" అను శాస్త్రమునకు అపవాదగా (బాధకముగా) చెప్పిన "అగ్నిషోమీయ యాగమునకు సంబంధించిన పశువును ఆలభించవలెను (బలి ఇవ్వవలెను)" అని చెప్పుట ఇందుకు ఉదాహరణము. ఇతర శాస్త్రములు అన్నింటికంటె ఈ (క్రింది) శాస్త్రము చాల ప్రబలమైనది : "మూడు వాతపిత్తకఫరూపధాతువులతో నిండిన ఈ శవమును ఎవడు ఆత్మ అని భావించుచున్నాడో, భార్యాదులు నావారని అనుకొనుచున్నాడో, భౌతిక పదార్థములు పవిత్రము లని తలచుచున్నాడో, ఉదకమును తీర్థ మని భావించుచు జ్ఞానులైన వారియందు ఎవ్వరి యందూ పవిత్రత్వదృష్టిని చూపడో అతడే ఎద్దులకొఱకు గడ్డి మోసికొనువచ్చు గాడిద."

"దేహము చాల మలిన మైనది ఆత్మ చాల నిర్మల మైనది. ఈ రెండింటికీ ఉన్న భేదమును గ్రహించిన పిమ్మట శౌచము నుదేనికి విధించవలెను ? ఎంతశౌచము చేసినను శరీరము శుద్ధము కాదు. ఆత్మకు శౌచము అవసరము లేదు"

మూ. యద్యప్యనేన శాస్త్రేణ దోషాపనయనం ప్రతిషిధ్యతే న తు గుణాధానమ్, తథాపి సతి విరోధిని ప్రబలదోషే గుణ ఆధాతుమశక్య ఇత్యర్థాద్ గుణాధానస్య ప్రతిషేధః. అత్యన్తమాలిన్యం చాత్ర మైత్రాయణీయశాఖాయాం శ్రూయతే —"భగవన్నస్థిచర్మస్నాయుమజ్జామాంసశుక్రశోణితాశ్రుదూషికాదూషితే విణ్మూత్రవాతపిత్తకఫసంఘాతే, దుర్గన్ధే నిఃసారేఽస్మిన్ శరీరే కిం కామోపభోగైః" (1.1.2) ఇతి. "శరీరమిదం మైథునాదేవోద్భూతం, సంవిద్వ్యపేతం, నిరయ ఇవ మూత్రద్వారేణ నిష్క్రాన్తమ్, అస్థిభిశ్చితం, మాంసేనానులిప్తం, చర్మణావనద్ధం, విణ్మూత్రపిత్తకఫమజ్జామేదోవసాభిరన్యైశ్చ మలైర్బహుభిః పరిపూర్ణం కోశ ఇవ వసునా" ఇతి చ.

వ్యా. ("నిరయ ఇవ" అనుటకు బదులు "నిరయత ఇవ" అను పాఠముండి ఉండవచ్చును.)

ఈ శాస్త్రము దోషములను పోగొట్టుకొనుటకు చేసే ప్రయత్నమును మాత్రమే నిషేధించు చున్నది గాని గుణసంపాదనమును నిషేధించక పోయినను, విరోధి యైన ప్రబలదోషము ఉన్నప్పుడు గుణమును సంపాదించుట కూడ శక్యము కాదు గాన గుణాధానమును కూడ నిషేధించి నట్లే అగును దేహము అత్యంతమలిన మను విషయము మైత్రాయణీయశాఖలో వినబడుచున్నది (చెప్పబడినది). "ఓ పూజ్యుడా! ఎముకలు, చర్మము, కండరములు, కొవ్వు, మాంసము, శుక్రము శోణితము, కన్నీళ్లు, పుసులు మొదలైన వాటితో దూషిత మైనది, మలమూత్ర వాత పిత్తకఫముల ప్రోగు, దుర్గంధభరితము, సారవిహీనమూ అయిన ఈ శరీరమునందు కామభోగములను అనుభవించుట అనగా ఏమి?" "ఈ శరీరము స్త్రీపురుషుల కలయిక వలన పుట్టినది, చైతన్య శూన్యము; నరకమునుండి వలె మూత్ర ద్వారమునుండి బైటకు వచ్చినది; ఎముకలు పేర్చినది; మాంసముచేత పూయబడినది; చర్మచేత బిగించబడినది; సరుకుతో నింపిన తిత్తి వలె మల మూత్ర-పిత్త-శ్లేష్మములతోను, మజ్జ, కొవ్వు, వస మొదలైన ఇతరముల తోను నింపబడినది".

మూ. చికిత్సయా చ రోగశాన్తిర్న నియతా; శాన్తోఽపి రోగః కదాచిత్పునరుదేతి. నవభిః ఛిద్రైః నిరన్తరం స్రవత్సు మలేషు,రోమకూపైరసంఖ్యాతైః స్విన్నే గాత్రే కో నామ ఖేదేన ప్రక్షాలయితుం శక్నుయాత్? తదుక్తం పూర్వాచార్యైః—

"నవచ్ఛిద్రయుతా దేహాః స్రవన్తి ఘటికా ఇవ
బాహ్యశౌచైర్న శుధ్యన్తి నాన్తఃశౌచం చ విద్యతే."

అతో దేహవాసనా మలినా. తదేతన్మాలిన్యమభిప్రేత్య వసిష్ఠ ఆహ—

"ఆపాదమస్తకమహం మాతాపితృవినిర్మితః
ఇత్యేకో నిశ్చయో రామ బన్ధాయాసద్విలోకనాత్."
(ల.వా.20.42) ఇతి.

"సా కాలసూత్రపదవీ సా మహావీచివాగురా
సాసిపత్రవనశ్రేణీ యా దేహోఽహమితి స్థితిః,
సా త్యాజ్యా సర్వయత్నేన సర్వనాశేఽప్యుపస్థితే
స్ప్రష్టవ్యా సా న భవ్యేన సశ్వమాంసేవ పుల్కసీ"
(ల.వా. 18.16,17) ఇతి.

తదేతల్లోక శాస్త్రదేహవాసనాత్రయమవివేకినాముపాదేయత్వేన ప్రతిభాసమానమపి వివిదిషోర్వేదనోత్పత్తి విరోధిత్వాత్, విదుషోర్జ్ఞాన ప్రతిష్ఠావిరోధిత్వాచ్చ వివేకిభిర్హేయమ్.

అత ఏవ స్మర్యతే—
"లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయాపి చ
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే."
(సూ.సం.) ఇతి.

వ్యా చికిత్స చేత రోగము తప్పక శాంతించు ననే నమ్మకము లేదు తగ్గినను ఆ రోగము మరల రావచ్చును. తొమ్మిది రంధ్రముల ద్వారా మలములు నిరంతరము స్రవించుచుండగా లెక్కపెట్ట శక్యము కాని రోమకూపముల ద్వారా శరీరము చెమట పట్టుచుండగా, ఎంత శ్రమ పడినను ఎవడైనా ఈ మలములను కడిగివేయగలడా ? ఈ విషయమునే ప్రాచీనాచార్యులు చెప్పినారు--

"తొమ్మిది ఛిద్రములతో కూడిన దేహములు కుండల వలె కార్చుచునే ఉన్నవి ఇవి బాహ్యశౌచము లెన్ని చేసినా శుద్ధి చెందవు. లోపల శౌచ మనునది కుదరనే కుదరదు''

అందు చేత దేహవాసన మలిన మైనది ఈ మాలిన్యమునే దృష్టిలో ఉంచుకొని వసిష్ఠుడు చెప్పినాడు -

"రామా! పాదములు మొదలు శిరస్సువరకూ నన్ను తలిదండ్రులే నిర్మించినారు అనగా ఈ దేహమే నేను'' అను ఈ నిశ్చయము చెడ్డ దృష్టివలన ఏర్పడినది ఇది బంధహేతువు''.

"దేహమే నేను అను ఈ భావన మృత్యువు దగ్గరకు లాగికొనిపోయే త్రాడు. అవీచి అనే నరకమునకు లాగికొనిపోయే గొప్ప వల. నరకములోని అసిపత్రవనమునకు వాడియైన కత్తులే అకులుగా గల అడవికి) మార్గము" "అన్ని విధములా దానిని త్యజించవలెను, సర్వనాశము సంప్రాప్తించినా కూడ తెలివైన వాడెవ్వడూ, కుక్కమాంసము తీసికొనిపోవుచున్న పుల్కస స్త్రీని వలె, దీనిని దేహాహంభావనను) స్పృశించకూడదు."

ఈ లోకవాసన, శాస్త్రవాసన, దేవావాసన అనే త్రయము వివేకవిహీనులకు గ్రాహ్యముగానే కనబడవచ్చును కాని ఇది వివిదిషువునకు (తత్త్వమును తెలిసికొన గోరువానికి) జ్ఞానము కలుగకుండగా చేయును. విద్వాంసునకు అ జ్ఞానము స్థిరముగా ఉండకుండ చేయును; అందుచే దీనిని వివేకవంతులు విడువవలెను. అందుచేతనే—

"మానవునకు లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన ఉన్నంతవరకు తత్త్వజ్ఞానము కలుగదు" అని చెప్పబడినది.

మూ. యా తు దమ్భదర్పాద్యాసురసంపద్రూపా తస్యాః నరక హేతుత్వాత్ మాలిన్యమతిప్రసిద్ధమ్. అతః కేనాప్యుపాయేన వాసనా చతుష్టయస్య క్షయః సంపాదనీయః. యథా వాసనాయాః క్షయః సంపాదనీయః తథా మనసోఽపి. న చ తార్కికవన్నిత్యద్రవ్యమణు పరిమాణం మనో వైదికా అభ్యుపగచ్ఛన్తి యేన మనోనాశో దుఃసంపాదః స్యాత్. కిం తర్హి సావయవమనిత్యం సర్వదా జతు సువర్ణాదివద్బహువిధపరిణామార్హం ద్రవ్యం మనః. తస్య లక్షణం

ప్రమాణం చ వాజసనేయినః సమామనన్తి-"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతిర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ" (బృ.ఉ. 1.5.3) ఇత్యేతల్లక్షణమ్. యాః కామాదివృత్తయః క్రమేణోత్పద్యమానాశ్చాక్షుషప్రత్యక్షఘటాదివత్ సాక్షిప్రత్యక్షేణాతిస్పష్టం భాసన్తే తదుపాదానం మన ఇత్యర్థః.

వ్యా॥ దంభము, దర్పము మొదలైన అసురసంపద అనే మానస వాసన నరకహేతువు గాన అదిమలిన మను విషయము ప్రసిద్ధమే. అందువలన ఏదో ఒక ఉపాయముచేత ఈ నాలుగు వాసనలను (లోక-శాస్త్ర-దేహ-మనోవాసనలను) క్షీణింపచేసికొనవలెను. మనోవాసనను క్షీణింపచేసికొనినట్లు మనస్సును కూడ క్షీణింప (నశింప) చేసికొనవలెను తార్కికులు అంగీకరించినట్లుగా వైదికులు "మనస్సు అణుపరిమాణము గల నిత్యద్రవ్యము" అని అంగీకరించరు గాన మనోనాశము సంపాదించుట అశక్యము కాదు. వైదికుల మతము ప్రకారము మనస్సు అవయవములు గలది అందుచేత అనిత్యము. లక్క, బంగారము మొదలైన వస్తువుల వలె అనేక విధముల పరిణామము చెంద గలిగిన ద్రవ్యము. దీని లక్షణమును, మనస్సు అనేది ఉన్నదని చెప్పుటకు ప్రమాణమును వాజసనేయులు చెప్పుచున్నారు - "కామము, సంకల్పము, సందేహము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, బుద్ధి, భయము-ఇవన్నీ మనస్సే". ఇది మనస్సునకు లక్షణము చక్షురింద్రియమునకు (కంటికి) ఘటాదులు ప్రత్యక్షముగా కనబడినట్లు. క్రమముగా పుట్టుచున్న కామము మొదలైన వృత్తులు సాక్షిప్రత్యక్షమునకు స్పష్టముగా తెలియుచున్నవి. అట్టి కామాది వృత్తుల ఉపాదానకారణము మనస్సు అని అర్థము. (కంకణము మొదలైన వాటిని ఏ పదార్థముతో చేయుదురో అది ఉపాదానకారణము. ఉదా. సువర్ణము కంకణాదులకు ఉపాదానకారణము అది తయారుచేయువాడు, సాధనములు మొదలైనవి నిమిత్తకారణము).

మూ॥ "అన్యత్రమనా అభూవం నాదర్శమ్" "అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్" (బృ.ఉ.1.5.3)ఇతి, "మనసా హ్యేవ పశ్యతి మనసా

శృణోతి" (బృ.ఉ. 1.5.3) ఇత్యేతత్ ప్రమాణమ్. చక్షుఃసంనికృష్టః స్ఫీతాలోకమధ్యవర్తీ ఘటః, శ్రోత్రసంనికృష్ట ఉచ్చైఃపఠితో వేదశ్చ యస్యానవధానే సతి న ప్రతీయతే, అవధానే తు ప్రతీయతే తాదృశం సర్వవిషయోపలబ్ధిసాధారణకరణమన్వయవ్యతిరేకాభ్యాం ప్రతీయతే ఇత్యర్థః. "తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి" ( బృ.ఉ.1.5.3 ) ఇత్యేతదుదాహరణమ్. యస్మాచ్చ లక్షణప్రమాణాభ్యాం సిద్ధం మనస్తస్మాత్తదేవముదాహరణీయమ్. పృష్ఠభాగేఽప్యన్యేనోపస్పృష్టో దేవదత్తో విశేషేణ జానాతి హస్తస్పర్శోఽయమఙ్గులిస్పర్శోఽయమితి. నహి తత్ర చక్షుః ప్రసరతి. త్వగిన్ద్రియం తు మార్దవకాఠిన్యమాత్రగ్రహణ ఉపక్షీణమ్. తస్మాన్మన ఏవ విశేషజ్ఞానకారణం పరిశిష్యతే.తచ్చ మనసాన్మన ఇతి చేతనాచ్చిత్తమితి చాభిధీయతే.

వ్యా. "నా మనస్సు మరెక్కడనో ఉండెను; అందుచేత చూడలేదు; నా మనస్సు మరెక్కడనో ఉండెను, అందుచేత వినలేదు" "ఇతడు మనస్సుతోనే చూచుచున్నాడు; మనస్సుతోనే వినుచున్నాడు" ఇత్యాద్యుపనిషద్వాక్యములు మనస్సు అనేది ఒకటి ఉన్నదని చెప్పుటకు ప్రమాణము. అధికమైన వెలుతురులో నేత్రములకు దగ్గరగా ఉన్న ఘటము దేని అవధానము లేనిచో కనబడదో, చెవి దగ్గర బిగ్గరగా చదవబడుచున్న వేదము వినబడదో, దేని అవధాన మున్నప్పుడు అవి కనబడునో, వినబడునో అట్టిది ఒకటి ఉన్నదని, అది సకలవిషయముల జ్ఞానమునకు అవసరమైన సాధారణసాధన మని అన్వయవ్యతిరేకములచేత తెలియుచున్నది ఆ సాధారణసాధనమే మనస్సు

"అది ఉన్నచో ఇది ఉండును" అని చెప్పుట అన్వయము. ఉదా. "అగ్ని ఉన్నప్పుడే ధూమము ఉండును" అనునది అన్వయము. "అది లేనిచో ఇది ఉండదు" అని చెప్పుట వ్యతిరేకము. ఉదా. "అగ్ని లేనిచో

ధూమము ఉండదు" ఇది వ్యతిరేకము. మనస్సు ఇక్కడ ఉన్నప్పుడే ఘటశబ్దాది జ్ఞానము కలుగుచున్నది; అది లేనప్పుడు కలుగుటలేదు అను రీతిలో అన్వయవ్యతిరేకములచేత మనస్సు సాధింపబడుచున్నది; అనగా మనస్సు అనేది ఉన్నదని నిరూపింపబడుచున్నది.

"అందువలననే వీపుమీద స్పృశింపబడినను మనస్సుచేత తెలిసికొనుచున్నాడు'' అనునది ఉదాహరణము. మనస్సు ఉన్నదను విషయము లక్షణముచేతను, ప్రమాణముచేతను సిద్ధించినది గాన దానికి ఉదాహరణమును ఇట్లు చూపవలెను. ఎవరో వచ్చి దేవదత్తుని వీపుమీద స్పృశించినను ఇది హస్తస్పర్శ, ఇది అంగుళి (వేలి) స్పర్శ అని అతడు తెలిసికొనకలుగుచున్నాడు. కన్ను వెనుకవైపు ప్రసరించదు. త్వగింద్రియము మృదుత్వమును, కఠినత్వమును మాత్రమే గ్రహించకలుగును. అందుచేత ఇక్కడ కలిగే విశేషజ్ఞానముకు మనస్సే కారణము. అది మననము చేయునది గాన "మనస్సు" అనీ, చింతించుటవలన "చిత్తము'' అనీ చెప్పబడుచున్న.

అంతఃకరణము ఒక్కటే అయినను అది చేయు వేరు వేరు పనులను పట్టి దానికే నాలుగు పేర్లు ఉన్నవని చెప్పుదురు.

"మనో బుద్ధిరహంకారశ్చిత్తం కరణమాన్తరమ్
సంకల్పో నిశ్చయో గర్వః స్మరణం విషయా ఇమే''

''మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని అంతఃకరణము నాలుగు విధములు. వీటికి వరుసగా సంకల్పముచేయుట, నిశ్చయించుట, గర్వము, స్మరణము అనునవి విషయములు''.

మూ. తచ్చ చిత్తం సత్త్వరజస్తమోగుణాత్మకమ్; ప్రకాశప్రవృత్తిమోహానాం సత్త్వాదికార్యాణాం తత్ర దర్శనాత్. ప్రకాశాదీనాం చ గుణకార్యత్వం గుణాతీతలక్షణేఽవగమ్యతే—

"ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ"
(భ.గీ. 14.22)

ఇత్యభిధానాత్. సాంఖ్యశాస్త్రేఽపి - "ప్రకాశప్రవృత్తిమోహాః నియమార్థాః" ఇత్యుక్తమ్. ప్రకాశో నామ నాత్ర సితిభాస్వరరూపం, కింతు జ్ఞానమ్.

"సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ"

(భ.గీ 14.17)

ఇత్యుక్తత్వాత్, జ్ఞానవత్సుఖమపి సత్త్వకార్యమ్. తదప్యుక్తమ్
"సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత"

(భ.గీ. 14.9) ఇతి.

వ్యా. ఆ చిత్తము సత్త్వరజస్తమోగుణాత్మకము. అందువలననే సత్త్వగుణాదుల కార్యములైన (సత్త్వగుణాదుల వలన పుట్టు) ప్రకాశ-ప్రవృత్తి-మోహములు చిత్తములో కనబడు చున్నవి. ప్రకాశాదులు గుణముల నుండి పుట్టునని భగవద్గీతలోని గుణాతీతలక్షణములో తెలియుచున్నది. "అర్జునా! (యోగి) ప్రకాశమును ప్రవృత్తిని, మోహమునుకూడ(ద్వేషించడు)" అని అక్కడ చెప్పబడినది. "ప్రకాశ - ప్రవృత్తి-మోహములు నియమార్థములు" (?) అని సాంఖ్యశాస్త్రము నందు కూడ చెప్పబడినది, ఇక్కడ ప్రకాశ మనగా తెల్లగా మెరిసే రూప మని అర్థము కాదు; జ్ఞాన మని అర్థము. ఎందుచేత ననగా-

"సత్త్వమునుండి జ్ఞానము, రజోగుణమునుండి లోభము, తమస్సు నుండి ప్రమాదము, మోహము, అజ్ఞానము పుట్టును" అని భగవద్గీతలో చెప్పబడినది.

జ్ఞానము వలె సుఖము కూడ సత్త్వమునుండి పుట్టును. ఈ విషయము కూడ—

"అర్జునా! సత్త్వము సుఖముసందు ఆసక్తుని చేయును; రజోగుణము కర్మయందు ఆసక్తుని చేయును తమస్సు జ్ఞానమును ఆవరించి ప్రమాదము నందు (ఏమరిపాటునందు చిక్కుకొను నట్లు చేయును" అని భగవద్గీతలో చెప్పబడినది.

మూ. సముద్రతరఙ్గవన్నిరన్తరం పరిణమమానేషు గుణేషు కదాచిత్కశ్చిదుద్భవతి; ఇతరావభిభూయేతే. తదుక్తమ్—

"రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా"
(భ.గీ. 14.10.) ఇతి.

"బాధ్యబాధకతాం యాన్తి కల్లోలా ఇవ సాగరే."
(యో.వా.) ఇతి చ.

తత్ర తమస ఉద్భవే సత్యాసురసంపదుదేతి. రజస ఉద్భవే సతి లోకాదివాసనాస్తిస్రో భవన్తి. సత్త్వస్యోద్భవే సతి దైవీ సంపదుపజాయతే. ఏతదేవాభిప్రేత్యోక్తమ్—

"సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత."
(భ.గీ. 14.11) ఇతి.

వ్యా. గుణములు సముద్రతరంగముల వలె నిరంతరము పరిణతి (మార్పు) చెందుచుండును ఒకప్పుడు వాటిలో ఒకటి పెరుగుచుండగా మిగిలిన రెండు అణగి ఉండును ఈ విషయము భగవద్గీతలోను, యోగ వాసిష్ఠములోను చెప్పబడినది –

"అర్జునా ! ఒకప్పుడు సత్త్వము రజస్తమోగుణములను తిరస్కరించి (అణగద్రొక్కి) తాను పైకి వచ్చుచుండును. ఒకప్పుడు రజోగుణము సత్త్వతమోగుణములను, ఒకప్పుడు తమోగుణము సత్త్వరజోగుణములను అణగద్రొక్కుచుండును."

"ఈ గుణములు సముద్రములోని తరంగముల వలె పరస్పరము బాధ్య (బాధింపబడేది) బాధక (బాధించేది) భావమును పొందుచుండును."

తమస్సు విజృంభించినపుడు ఆసుర సంపద ఉదయించును రజస్సు ఆవిర్భవించినపుడు లోకవాసనా - శాస్త్రవాసనా - దేహవాసనలు పుట్టును. సత్త్వము ఉత్కటముగా ఉన్నప్పుడు దైవసంపద కలుగును.

మూ. యద్యప్యన్తఃకరణం త్రిగుణాత్మకం భాసతే, తథా పి సత్త్వమేవాస్య ముఖ్యముపాదానకారణమ్. రజస్తమసీ తూపష్టమ్భకే. ఉపాదానసహకారిభూతా అవయవా ఉపష్టమ్భకాః. అత ఏవ జ్ఞానినో యోగాభ్యాసేన రజస్తమసోరపనీతయోః సత్త్వమేవ స్వరూపం పరిశిష్యతే. ఏతదేవాభిప్రేత్య ఉక్తమ్—

"జ్ఞస్య చిత్తమచిత్తం స్యాద్జ్ఞచిత్తం సత్త్వముచ్యతే" ఇతి.

తచ్చ సత్త్వం చాఞ్చల్యహేతురజోగుణశూన్యత్వాదేకాగ్రమ్. భ్రాన్తికల్పితానాత్మస్వరూపస్థూల పదార్థాకారహేతుతమోగుణశూన్యత్వాత్ సూక్ష్మమ్. అత ఆత్మదర్శనయోగ్యమ్. అత ఏవ శ్రుతిః—

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"

(కఠ.ఉ. 1.3.12) ఇతి.

న ఖలు వాయునా దోధూయమానేన ప్రదీపేన మణిముక్తాది లక్షణాని నిర్ధారయితుం శక్యన్తే. నాపి స్థూలేన ఖనిత్రేణ సూచ్యేవ సూక్ష్మపటస్యూతిః సంభవతి. తదేతదీదృశం సత్త్వమేవ అయోగిషు తమోగుణగర్భితేన రజోగుణేనోపస్పృష్టం బహువిధద్వైతసంకల్పేన చేతయమానం చిత్తం భవతి.

వ్యా. అంతఃకరణము త్రిగుణాత్మకముగా భాసించినను దీని ముఖ్యమైన ఉపాదానకారణము సత్త్వమే. రజస్తమోగుణములు ఉపష్టంభకములు

[నిలబెట్టునవి] మాత్రమే. ఉపాదానకారణమునకు సహకరించు అవయవములకు ఉపష్టంభకము లని పేరు అందుచే యోగాభ్యాసముచేత జ్ఞానిలోని రజస్తమోగుణములు తొలగింపబడగా అంతఃకరణము అసలు స్వరూప మైన సత్త్వము మాత్రమే మిగులును. ఈ అభిప్రాయముచేతనే "జ్ఞానిచిత్తము చిత్తము కాదు. జ్ఞాని చిత్తము సత్త్వమే అని చెప్పబడును" అని చెప్పబడినది. ఆ సత్త్వము చాంచల్యమునకు హేతువైన రజోగుణము లేకపోవుటచేత ఏకాగ్రముగా ఉండును. భ్రాంతిచేత కల్పింపబడిన అనాత్మ స్వరూపములైన స్థూలపదార్థాకారమునకు హేతువైన తమోగుణము లేక పోవుటచే సూక్ష్మ మగును అప్పు డది ఆత్మదర్శనమునకు తగి ఉండును. అందువలననే — "ఆత్మ ఏకాగ్రము, సూక్ష్మము అయిన బుద్ధితో సూక్ష్మ దర్శులచేత చూడబడును" అని శ్రుతి చెప్పుచున్నది గాలికి దీపము కొట్టుకొనుచున్నప్పుడు మణులు, ముత్యములు మొదలైనవాటి లక్షణములను నిర్ధారణచేయుట శక్యము కాదు కదా? సన్నటి బట్టను సూదితో కుట్టినట్లు లావైన గునపముతో కుట్టుట శక్యము కాదు కదా? అట్టి ఈ సత్త్వమే యోగులుకానివారియందు తమోగుణము గర్భమునందు గల రజోగుణముచే స్పృశింపబడినదై అనేకవిధములైన ద్వైతవస్తువులను సంకల్పించుటచే చింతించుచు "చిత్తము" అగుచున్నది.

మూ. తచ్చిత్తం తమోగుణాధిక్యే సత్యాసురీం సంపదముపచిన్వత్పీనం భవతి. తథాహ వసిష్ఠః—

"అనాత్మన్యాత్మభావేన దేహభావనయా తథా
పుత్రదారైః కుటుమ్బైశ్చ చేతో గచ్ఛతి పీనతామ్"

(ల.వా. **24.17**)

వ్యా ఆ చిత్తము తమోగుణము అధిక మైనప్పుడు ఆసురసంపదను పెంచుకొని బలిసి పోవును. ఈ విషయమును వసిష్ఠుడు (లఘువాసిష్ఠములో) చెప్పినాడు

"ఆత్మ కానిదానిని ఆత్మ అని అనుకొనుటచేత, దేహమును గూర్చి తలచు కొనుటచేత, భార్యా-పుత్ర కుటుంబముల సంబంధముచేత చిత్తము బలిసి పోవును."

మూ. అహంకారవికారేణ మమతామలలీలయా
ఇదం మమేతి భావేన చేతో గచ్ఛతి పీనతామ్." 18

వ్యా. "అహంకారము వలన కలిగిన వికారముల చేతను, పెద్ద మమకారవిలాసముల చేతను, ఇది నాది అనే భావము చేతను చిత్తము బలిసిపోవును."

మూ. "ఆధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంసృతౌ
హేయాదేయవిభాగేన చేతో గచ్ఛతి పీనతామ్." 19

వ్యా. "మనోవ్యధల, వ్యాధుల విలాసము చేతను, సంసారముతో సంతృప్తి చెందుటచేతను, ఇది విడువదగినది, ఇది గ్రహించదగినది అను విభాగము చేతను చిత్తము బలసి పోవును,"

మూ. "స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్
ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్" 20

"స్నేహముచేత, ధనమునందు లోభముచేత, పైకిచూచుటకు బాగుగా ఉండే స్త్రీ-మణిలాభముచేత చిత్తము బలిసిపోవును"

మూ. "దురాశాక్షీరపానేన భోగానిలబలేన చ
ఆస్థాదానేన చారేణ చిత్తాహిర్యాతి పీనతామ్." 21

ఆస్థా నామ ప్రపఞ్చే సత్యత్వబుద్ధిః, తస్యా ఆదానమఙ్గీకారః, స ఏవ చారో గమనాగమనాదిక్రియా, తేనేతి. తదేవం వినాశనీయ యోర్వాసనామనసోః స్వరూపం నిరూపితమ్.

వ్యా "దురాశ అనే పాలు త్రాగుటచేతను, భోగము లనే వాయువు బలముచేతను, ఆస్థాస్వీకార మనే సంచారముచేతను చిత్త మనే సర్పము లావెక్కెను."

ఆస్థ అనగా ప్రపంచము సత్య మనే బుద్ధి దాని ఆదానము అనగా దానిని స్వీకరించుట. అదే గమనాగమనక్రియ.

ఈ విధముగ నశింపచేయ దగిన వాసనల స్వరూపము, మనస్సు స్వరూపము చెప్పబడినది.

మూ. అథ వాసనాక్షయమనోనాశౌ క్రమేణ నిరూప్యేతే. తత్ర వాసనాక్షయప్రకారమాహ వసిష్ఠః-

"బన్ధో హి వాసనాబన్ధో మోక్షః స్యాద్వాసనాక్షయః
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ."
(ల.వా. **18.20**)

వ్యా ఇప్పుడు క్రమముగా వాసనాక్షయ-మనోనాశములు నిరూపింపబడుచున్నవి. వాసనాక్షయమును గూర్చి వసిష్ఠుడు "లఘుయోగ వాసిష్ఠములో" చెప్పినాడు—

''వాసనలవలన ఏర్పడిన బంధమే బంధము. వాసనలు క్షీణించుట మోక్షము, నీవు వాసనలను పరిత్యజించి మోక్షము కావలె నను కోరికను కూడ త్యజింపుము."

మూ. "మానసీర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసనాః
మైత్ర్యాదిభావనానామ్నీర్గృహాణామలవాసనాః." **(18.21)**

వ్యా "ముందుగా విషయాభిలాష అనే మానసవాసనలను విడచి' మైత్ర్యాదిభావనలు అనే నిర్మలములైన వాసనలను గ్రహించుము

మూ. "తా అప్యన్తః పరిత్యజ్య తాభిర్వ్యవహరన్నపి
అన్తః శాన్తసమస్నేహో భవ చిన్మాత్రవాసనః."
**(18 22)**

వ్యా. "ఆ మైత్ర్యాదివాసనలతో వ్యవహరించుచున్నట్లు కనబడినను లోలోన వాటిని కూడ పరిత్యజించి పూర్తిగా రాగమును శాంతింపచేసికొని చిన్మాత్ర (ఆత్మమాత్ర) వాసనను అలవరచుకొనుము.''

మూ. "తామప్యన్తః పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితామ్
శేషే స్థిరసమాసీనో యేన త్యజసి తత్త్యజ." (18.23)

వ్యా. ''మనస్సుతోను, బుద్ధితోను సహా ఆ చిన్మాత్రవాసనను కూడ లోలోన పరిత్యజించి, ఇక మిగిలిన ఆత్మస్వరూపమునందే స్థిరముగా కూర్చున్నవాడవై దేనిచేత వీటి నన్నింటినీ త్యజించినావో దానిని కూడ త్యజించుము.''

మూ. అత్ర మానసవాసనాశబ్దేన పూర్వోక్తాస్త్రిస్రో లోకశాస్త్ర దేహవాసనా వివక్షితాః. విషయవాసనాశబ్దేన దమ్భదర్పాద్యాసుర సంపద్వివక్షితా. మృదుతీవ్రత్వే తద్విశేషభేదకారణే. యద్వా శబ్ద స్పర్శరూపరసగన్ధా విషయాః. తేషాం కామ్యమానత్వదశాజన్యః సంస్కారో మానసవాసనా. భుజ్యమానత్వదశాజన్యః సంస్కారో విషయవాసనా. అస్మిన్ పక్షే పూర్వోక్తానాం చతసృణామనయోరేవాన్త ర్భావః, అన్తర్బాహ్యవ్యతిరేకేణ వాసనాన్తరాసంభవాత్.

వ్యా. ఇక్కడ 'మానసవాసన' అనగా వెనుక చెప్పబడిన లోక-శాస్త్ర-దేహవాసన లనే మూడువాసనలు అని అర్థము "విషయవాసన" ''అనగా దంభము, దర్పము మొదలైన ఆసురసంపత్తు అని అర్థము. వీటిలో మృదువుగా ఉండుట తీవ్రముగా ఉండుట అనే భేదమును పట్టి వాటిని వేరుగా చెప్పుట జరిగినది. అనగా మృదువుగా ఉన్నవాటిని మానసవాసన లని, తీవ్రముగా ఉన్నవాటిని విషయవాసన లని చెప్పుట జరిగినది. లేదా విషయము లనగా శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు వాటియందు కోరిక కలుగు దశలో ఉన్న సంస్కారము మానసవాసన వాటిని అనుభవించు నపుడు పుట్టు సంస్కారము విషయవాసన. ఈ పక్షములో వెనుక చెప్పిన

నాలుగు వాసనలు (లోక శాస్త్ర దేహ మానసవాసనలు) ఈ రెండింటిలోనే అంతర్గతము లగును. అంతర (లోపల నున్న) వాసనలకంటె, బాహ్య విషయవాసనలకంటె వేరుగా వాసనలు ఉండవు కదా ?

మూ. నను వాసనాయాః పరిత్యాగః కథం ఘటతే? న హి తాసాం మూర్తిరస్తి యేన సంమార్జనీసమూహితధూళితృణవద్ధస్తేన ఉద్ధృత్య బహిః త్యజ్యేమః. మైవమ్-ఉపవాసజాగరణవదుపపత్తేః. స్వభావప్రాప్తయోః భుజిక్రియానిద్రయోః అమూర్తత్వేఽపి తత్పరిత్యాగరూపే ఉపవాసజాగరణే సర్వైరప్యనుష్ఠీయేతే;తద్వదత్రాప్యస్తు."అద్య స్థిత్వా నిరాహారమ్" ఇత్యాదిమన్త్రేణ సంకల్పం కృత్వా సావధానత్వేనావస్థానం తత్ర త్యాగ ఇతి చేత్,అత్రాపి న తద్దణ్డవారితమ్. ప్రైషమన్త్రేణ సంకల్ప్యాప్రమత్తత్వేనావస్థాతుం శక్యత్వాత్.వైదికమన్త్రానధికారిణాం తు భాషయా సంకల్పోఽస్తు. యది తత్ర శాకసూపౌదనాదిసంనిధిత్యాగః తర్హ్యత్రాపి ప్రక్చన్దనవనితాసంనిధిపరిత్యాగోఽస్తు.

వ్యా ఆశంక). వాసనలను విడిచిపెట్టుట అనునది ఎట్లు కుదురును? వాటికి ఆకారము లేదు కదా ? ఆకార మున్నచో, చీపురుతో తుడిచి ప్రోగుగా చేసిన దుమ్ము, గడ్డి మొదలైనవాటిని చేతితో ఎత్తిదూరముగా పారపోసినట్లు వీటిని కూడదూరముగా విడచుటకు అవకాశము ఉండెడిది [సమాధానము] అట్లు కాదు ఉపవాసజాగరణాదుల వలె ఇది కూడ కుదురును స్వభావతః [ఎవరూ చెప్పకుండగనే] ప్రాప్తించే భోజనక్రియా నిద్రలు అమూర్తములే అయినను వాటిని విడచుటను ఉపవాసజాగరణరూపములో అందరు చేయుచున్నారు కదా ? అట్లే ఇక్కడ కూడా జరుగవచ్చును. [ఆశంక] 'అద్య' [ఈనాడు ఆహారముతీసికొనగా ఉండి] ఇత్యాదిమంత్రముచేత సంకల్పము చేసి సావధానముగా [పొరపాటు రాకుండా చూచుకొనుచు] ఉండుటయే భోజననిద్రాత్యాగము; ఇక్కడ అట్టిది ఎట్లు కుదురును ? [సమాధానము] అట్టి త్యాగము ఇక్కడ పనికిరాదు అని ఎవ్వరూ కఱ్ఱ చేతితో ధరించి నివారించుటలేదుకదా? ప్రైషమంత్రముచే [సంన్యాసమంత్రమును చదువుచు]

సంకల్పించి జాగరూకతతో ఉండుట అనునది ఇక్కడ కూడ శక్యమే. వైదికమంత్రములయందు అధికారము లేనివారు భాషచేత సంకల్పించ వచ్చును. అక్కడ కూరలు, పప్పులు, అన్నము మొదలైనవాటి సాంనిధ్య మును త్యజించ వచ్చును అన్నచో ఇక్కడ కూడ మాలికలు, చందనము, స్త్రీలు మొదలైనవాటి సాంనిధ్యమును త్యజించవచ్చును.

మూ. అథ తత్ర బుభుక్షానిద్రాలస్యాదివిస్మారకైః పురాణశ్రవణ దేవపూజానృత్యగీతవాదిత్రాదిభిః చిత్తముపలాల్యేత, తర్హ్యత్రాపి మైత్ర్యాదిభిః తదుపలాలయేత్. మైత్ర్యాదయశ్చ పతఞ్జలినా సూత్రితాః– "మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్." (1.33) ఇతి. చిత్తం హి రాగద్వేష పుణ్యపాపైః కలుషీక్రియతే. రాగద్వేషౌ చ పతఞ్జలిః సూత్రయామాస– "సుఖానుశయీ రాగః" (2.7) "దుఃఖానుశయీ ద్వేషః" (2.8) ఇతి. స్వేనానుభూయమానం సుఖమనుశేతే కశ్చిద్ధీవృత్తివిశేషః "సుఖజాతీయం మే సర్వం భూయాత్"ఇతి. తచ్చ దృష్టాదృష్టసామగ్ర్యభావాన్న సంపాదయితుం శక్యమ్. అతః స రాగశ్చిత్తం కలుషీకరోతి. యదా సుఖిష్వయం మైత్రీం భావయేత్ "సర్వేఽప్యేతే సుఖినో మదీయాః" ఇతి తదా తత్సుఖం స్వకీయమేవ సంపన్నమితి భావయతస్తత్ర రాగో నివర్తతే. యథా స్వస్య రాజ్యాభావేఽపి పుత్రాదిరాజ్యమేవ స్వకీయం రాజ్యం తద్వత్. నివృత్తే చ రాగే వర్షాస్వతీతాసు శరత్సరిదివ చిత్తం ప్రసీదతి.

వ్యా. ఉపవాసాదులవిషయములో ఆకలిని, నిద్రను, ఆలసత్వమును మరిపించే పురాణశ్రవణము, దేవతాపూజ నృత్యము, గీతము, వాద్యములు మొదలైనవాటిచేత చిత్తమును లాలన చేయుటకు అవకాశమున్నది; ఇక్కడేమి ఉన్నది అని కూడ అనుటకు వీలులేదు. ఏందుచేత ననగా ఇక్కడకూడా మైత్ర్యాదులచేత చిత్తమును లాలనచేయవచ్చును మైత్ర్యా

దులను గూర్చి పతంజలి "మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యా పుణ్యవిషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్" అను సూత్రములో చెప్పి నాడు. (సుఖితులు, దుఃఖితులు, పుణ్యాత్ములు, పాపకార్యము చేయువారు అను ఈ నాలుగు విధముల మనుష్యుల విషయములో వరుసగా మైత్రి, కరుణ, సంతోషించుట, ఉపేక్షించుట అను భావనలు చేసికొన్నచో చిత్తము నిర్మల మగును అని ఈ సూత్రమునకర్థము). చిత్తమును రాగ ద్వేష-పుణ్యపాపములు కలుషము చేయుచుండును "సుఖమునకు సంబంధించినది రాగము" "దుఃఖమునకు సంబంధించినది ద్వేషము" అని పతంజలి రాగద్వేషములను గూర్చి సూత్రములు చెప్పినాడు ఒకానొక చిత్తవృత్తి విశేషము- "నాకు ఇట్టి సుఖమే కలుగుగాక" అని కోరుకొనుచు తాను అనుభవించుచున్న సుఖమును అనుసరించి ఉండును కాని అట్టి సుఖము కావలె నన్నచో తెలిసినవి తెలియనివి ఎన్నో సామగ్రులు కావలెను. అవి అన్ని సమకూరుట కష్టము గాన దానిని సంపాదించుట శక్యము కాదు' అందువలన రాగము చిత్తమును కలుషముచేయును. అయితే సుఖవంతులను గూర్చి ఇతడు "ఈ సుఖవంతు లందరూ నావారే" అని భావన చేసిన ట్లయితే ఆ సుఖము తనదే అను భావన ఏర్పడును గాన దానిపై ఇక అతనికి రాగము ఉండదు. తనకు రాజ్యము లేకపోయినను పుత్రాదుల కున్న రాజ్యము తనదే అను భావన ఎట్లో ఇది కూడా అట్లే రాగము తొలగి పోయిన వెంటనే, వర్షాకాలము గడచిన పిమ్మట శరత్కాలనది వలె చిత్తము నిర్మల మగును.

మూ. తథా దుఃఖమనుశేతే కశ్చిత్ప్రత్యయః "ఈదృశం సర్వం దుఃఖం సర్వదా మే మా భూత్" ఇతి. తచ్చ రోగశత్రువ్యాఘ్రాదిషు సత్సు న నివారయితుం శక్యమ్. న చ సర్వే దుఃఖహేతవో హన్తుం శక్యన్తే, తతః స ద్వేషః సదా హృదయం దహతి. యదా స్వస్యేవ పరేషాం సర్వేషాం ప్రతికూలం దుఃఖం మా భూదిత్యనేన ప్రకారేణ

కరుణాం దుఃఖిషు ప్రాణిషు భావయేత్. తదా వైర్యాదిద్వేషనివృత్తౌ చిత్తం ప్రసీదతి. అత ఏవ స్మర్యతే—

"ప్రాణా యథాత్మనోఽభీష్టా భూతానామపి తే తథా
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వన్తి సాధవః" ఇతి.

తత్ప్రకారం చ మహాన్తో దర్శయన్తి—

"సర్వేఽత్ర సుఖినః సన్తు సర్వే సన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్ దుఃఖమాప్నుయాత్" ఇతి.

వ్యా. అట్లే "ఇట్టి ఏ దుఃఖము నాకు ఎన్నడు కలగకుండుగాక" అను ఒక చిత్తవృత్తి కలుగును రోగములు, శత్రువులు, వ్యాఘ్రాదులు ఉంటూండగా ఆ దుఃఖమును నివారించుట శక్యము కాదు. దుఃఖహేతువులైన, వాటిని అన్నింటిని నశింపచేయుట శక్యము కాదు కదా? అందుచేత ఆ ద్వేషము ఎల్లప్పుడు హృదయమును దహించివేయుచుండును. తనకు వలెనే ఇతరు లెవ్వరికీ కూడ ప్రతికూలమైన దుఃఖము కలగకూడదు అను రీతిలో దుఃఖముతో బాధపడుచున్న ప్రాణుల విషయమునందు భావన చేసి నట్లయితే శత్రువులు మొదలైనవారియందు ద్వేషము తొలగిపోయి చిత్తము ప్రసన్న మగును. అందుచేతనే స్మృతిలో చెప్పబడినది-

"తన ప్రాణములు తన కెట్లు ఇష్టములో ఇతరప్రాణులకు. వాటి ప్రాణము లట్లే ప్రియములు. సత్పురుషులు తనతో పోల్చుకొనుచు ఇతర ప్రాణుల విషయమున దయ చూపుదురు." ఆ పద్ధతిని మహాత్ములు చూపుచున్నారు-

"ఈ లోకములో అందరూ సుఖపడుదురుగాక. అందరూ రోగములు లేనివారై ఉందురుగాక. అందరూ మంచి మంగళకరవిషయములనే చూచెదరు గాక. ఏ ఒక్కడూ దుఃఖమును పొందకుందురుగాక."

మూ. తథాహి-ప్రాణినః స్వభావత ఏవ పుణ్యం నానుతిష్ఠన్తి పాపం త్వనుతిష్ఠన్తి, తదాహుః—

"పుణ్యస్య ఫలమిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః
న పాపఫలమిచ్ఛన్తి పాపం కుర్వన్తి యత్నతః" ఇతి.

తే చ పుణ్యపాపే పశ్చాత్తాపం జనయతః. స చ తాపః శ్రుత్యానూద్యతే – "కిమహం సాధు నాకరవమ్; కిమహం పాపమకరవమ్" (తై.ఉ.2.9). ఇతి. యద్యసౌ పుణ్యపురుషేషు ముదితాం భావయేత్ తదా తద్వాసనయా స్వయమేవాప్రమత్తః పుణ్యేషు ప్రవర్తేత.

**వ్యా.** ప్రాణులు సహజముగానే పుణ్యమును ఆచరించరు. అది వారి స్వభావము. పాపమును మాత్రము ఆచరించుచుందురు. అందుచేతనే ఇట్లు చెప్పబడినది-

"మానవులు పుణ్యమువలన కలిగే ఫలమును (సుఖాదులను) కోరుకొనుచుందురు గాని పుణ్యమును కోరుకొనరు. పాపమువల్ల కలిగే ఫలమును కోరుకొనరు. కాని ప్రయత్నపూర్వకముగా పాపమునే చేయుచుందురు."

ఆ పుణ్యపాపములు పశ్చాత్తాపమును కలిగించుచుండును. ఈ పశ్చాత్తాపమును శ్రుతి అనువదించి చెప్పుచున్నది-"అయ్యో! నేను పుణ్యము ఎందుకు చేయలేదు! పాపమే ఎందుకు చేసితిని?" ఇతడు పుణ్యపురుషుల విషయమును ముదితను (సంతోషమును) బావన చేసినట్లయితే అప్పుడు ఆ బావనచేత కలిగిన వాసనచేత తాను కూడ అప్రమత్తుడై పుణ్యములయందు ప్రవర్తించును.

**మూ.** తథా పాపిషూపేక్షాం భావయన్ స్వయమపి పాపాన్నివర్తేత. అతః పశ్చాత్తాపస్యాభావేన చిత్తం ప్రసీదతి. సుఖిషు మైత్రీం భావయతో న కేవలం రాగనివృత్తిః కిం త్వసూయేర్ష్యాదయోఽపి నివర్తన్తే, గుణేషు దోషావిష్కరణమసూయా. పరగుణానామసహనమీర్ష్యా. యదా మైత్రీవశాత్ పరకీయం సుఖం స్వకీయమేవ సంపద్యతే తదా పరగుణేషు కథమసూయాదికం సంభవేత్? ఏవం దోషాన్తరనివృత్తిరపి యథాయోగమున్నేయా.

వ్యా. అట్లే పాపము నాచరించువారి విషయమునందు ఉపేక్షను భావన చేసేవాడు తాను కూడ పాపమునుండి నివర్తించును. అప్పుడు పశ్చాత్తాప ముండదు గాన చిత్తము ప్రసన్న మగును సుఖవంతుల విషయమున మైత్రిని భావనచేసేవానికి కేవలము రాగము తొలగుట మాత్రమే కాదు, అసూయ, ఈర్ష్య మొదలైనవి కూడ తొలగును గుణములను దోషములుగా చిత్రించుట అసూయ. పరుల గుణములను చూచి సహించలేకపోవుట ఈర్ష్య. మైత్రీవశమువలన పరుల సుఖము కూడ తనదే అయినప్పుడు పరగుణముల యందు అసూయ ఎట్లు కలుగును ? ఇతరదోషములు నివర్తించుటను కూడ ఈ విధముగనే ఊహించుకొనవలెను.

మూ. దుఃఖిషు కరుణాం భావయతః శత్రువధాదికరో ద్వేషో యదా నివర్తతే తదా దుఃఖిత్వ ప్రతియోగికస్వదుఃఖిత్వప్రయుక్తో దర్పోఽపి నివర్తతే స చ దర్ప ఆసురసంపద్వ్యహంకారప్రస్తావే పూర్వం నిరూపితః——

"ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ"
"ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా"

ఇత్యాది.

వ్యా. దుఃఖవంతుల విషయమున కరుణను భావించువానికి శత్రువధాదులను చేసే ద్వేషము తొలగిపోవును అప్పుడు ఇతరులు దుఃఖములతో బాధపడుచుండగా తాను సుఖముగా ఉన్నాను అనే భావమువలన ఏర్పడిన దర్పము కూడ తొలగిపోవును. వెనుక, ఆసురసంపత్తులో అహంకారమును గూర్చిన ప్రస్తావమునందు, దర్పము - "నేను సమర్థుడను; భోగము లన్నీ నాకే ఉన్నవి; నేను అన్నికార్యములను సాధించగలను; బలవంతుడను; సుఖవంతుడను"; "నాకు చాల ఐశ్వర్యము బంధువర్గము ఉన్నది. నాతో సమానుడు ఎవడు ?" ఇత్యాదివిధముగా ఉండు నని విశదీకరింపబడినది.

మూ. నను పుణ్యాత్మసు ముదితాం భావయతః పుణ్యప్రవృత్తిః ఫలత్వేనోక్తా; సా చ యోగినో న యుక్తా; మలినాయాం వాసనాయాం పుణ్యమన్తర్భావ్య పూర్వముదాహృతత్వాత్. మైవమ్-పునర్జన్మకారణస్య కామ్యేష్టాపూర్తాదేస్తత్ర మలినత్వేనోదాహరణాత్. ఇహ తు యోగాభ్యాసజన్యమశుక్లాకృష్ణత్వేన జన్మానాపాదకం పుణ్యం వివక్షితమ్. అశుక్లాకృష్ణత్వం పతఞ్జలిః సూత్రయామాస-"కర్మాశుక్లాకృష్ణం యోగినస్త్రివిధమితరేషామ్" (4.7) ఇతి. కామ్యం కర్మ విహితత్వాత్ శుక్లం, నిషిద్ధం కృష్ణమ్. మిశ్రం శుక్లకృష్ణమ్. తదేతత్త్రియమితరేషామయోగినాం సంపద్యతే. తచ్చ త్రివిధం జన్మ ప్రయచ్ఛతి. తదాహుర్విశ్వరూపాచార్యాః—

"శుభైః ప్రాప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీం గతిమ్
ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽవశః"
(నై. 1.41.) ఇతి.

వ్యా. (ఆశంక) పుణ్యాత్ములవిషయమున ముదితాభావన చేయువానికి పుణ్యకర్మలయందు ప్రవర్తించుటే ఫలము అని ఇక్కడ చెప్పబడినది. అది యోగికి యుక్తము కాదు. ఎందుచేత ననగా - పుణ్యమును కూడ మలినవాసనలో అంతర్గతము చేసి వెనుక ఉదాహరించి ఉన్నారు. (సమాధానము). అట్లు కాదు. అక్కడ మలినకర్మగా ఉదాహరించినది పునర్జన్మకు కారణమైన కామ్యమైన ఇష్టాపూర్తాదికర్మ. ఇక్కడ చెప్పిన యోగాభ్యాసమువలన కలుగు పుణ్యము అశుక్లాకృష్ణ మగుటచే పునర్జన్మకు హేతువు కాని పుణ్యము. అశుక్లాకృష్ణకర్మను పతంజలి సూత్రములో చెప్పిఉన్నాడు-"యోగి కర్మ అశుక్లాకృష్ణము; ఇతరుల కర్మ త్రివిధమైనది". కామ్యకర్మ శాస్త్రవిహితము గాన శుక్లము. నిషిద్ధకర్మ కృష్ణము మిశ్రకర్మ శుక్లకృష్ణము. ఈ మూడు విధములైన కర్మ ఇతరులకు, అనగా యోగులు కానివారికి, సంభవించును. అది మూడు విధాలైన జన్మను

ఇచ్చును. ఈ విషయమును విశ్వరూపాచార్యులు (నైష్కర్మ్యసిద్ధిలో) చెప్పి ఉన్నారు-

"జీవుడు పుణ్యకర్మలచేత దేవత్వమును పొందును. నిషిద్ధకర్మల చేత నరకబాధ అనుభవించే గతిని పొందును పుణ్యాపాపములు రెండూ సమముగా ఉన్నచో మనుష్యత్వమును పొందును. అంతేకాని వానికి స్వాతంత్ర్య మేమీ లేదు''.

మూ. నను యోగస్యానిషిద్ధత్వాదకృష్ణత్వేఽపి విహితత్వాచ్ఛుక్లత్వమితి చేత్, నైవమ్; అకామ్యత్వాభిప్రాయేణాశుక్లత్వాభిధానాత్, అతోఽశుక్లకృష్ణే పుణ్యే ప్రవృత్తిర్యోగినోఽపేక్షితా. నను యోగినోఽప్యనేన న్యాయేన యథోచితం పుణ్యాత్మసు ముదితాం భావయిత్వా పుణ్యేష్వేవ ప్రవృత్తేరస్త్వితి చేత్, ప్రవర్తన్తాం నామ. యే మైత్ర్యాదిభిశ్చిత్తం ప్రసాదయన్తి తేషామేవ యోగిత్వాత్.

వ్యా. (ఆశంక) యోగము నిషిద్ధము కాదు గాన అది అకృష్ణమే అయినను, విధింపబడినది గాన శుక్ల మగును కదా ? (సమాధానము) అట్లు కాదు. యోగము శాస్త్రవిహితమే అయినను కామ్యకర్మ కాదు గాన ఇది అశుక్లము అని చెప్పబడినది. అందుచేత అశుక్లము, అకృష్ణము అయిన పుణ్యమును చేయుటకు ప్రవర్తించుట యోగికి అవసరమే. అయితే యోగులు కూడ ఈ న్యాయముచే (రీతిచేత) పుణ్యాత్ముల విషయమున యథోచితముగా ముదితాభావన చేసి పుణ్యమును ఆచరించుటయందే ప్రవర్తింతురు గదా ? ప్రవర్తించనిమ్ము! మైత్ర్యాదులచేత చిత్తమును నిర్మలముగా ఉంచుకొన్నవారే కదా యోగు లనగా ?

మూ. మైత్ర్యాదిచతుష్టముపలక్షణమ్, తేన "అభయం సత్త్వసంశుద్ధిః" ఇత్యాదిదైవసంపత్, "అమానిత్వమదమ్భిత్వమ్" ఇత్యాది జ్ఞానసాధనాని, జీవన్ముక్తస్థితప్రజ్ఞాదివచనోక్తా ధర్మాశ్చోపలక్ష్యన్తే. సర్వేషామేతేషాం శుభవాసనారూపత్వేన మలినవాసనానివర్తకత్వాత్. నను సత్త్వ

నన్తాః శుభవాసనాః, న చైకేన తాః సర్వా అభ్యసితుం శక్యన్తే, నిరర్థకశ్చ తదభ్యాసప్రయాస ఇతి చేన్న; తన్నివర్త్యానామనన్తానాం మలినవాసనానామేకస్య మనస్యసంభవాత్. న హ్యాయుర్వేదోక్తాని సర్వాణ్యౌషధాన్యేకేన సేవితుం శక్యన్తే.నాపి తన్నివర్త్యాః సర్వే రోగా ఏకస్య దేహే సంభవన్తి.

వ్యా. మైత్ర్యాదిచతుష్టయ మనునది ఉపలక్షణము, చెప్పవలసిన వాటిలో ఒకటిరెండు మాత్రమే చెప్పుట ఉపలక్షణము. మిగిలినవాటిని శ్రోత ఊహించుకొనును. ఉదా. "ఇక్కడ నెయ్యి పెట్టినాను; కాకులు తినకుండా చూడుము" అని చెప్పగా ఒక్క కాకులే కాదు, ఆ నేతిని అన్నింటి నుండీ, పిల్లి, కుక్క, చివరకు దొంగ అందరినుండి, రక్షించ మని అర్థము). మైత్ర్యాదులు ఉపలక్షణముగా చెప్పబడినవిగాన "అభయం సత్త్వసంశుద్ధిః" ఇత్యాదిశ్లోకములలో చెప్పిన దైవసంపద, "అమానిత్వ మదమ్భిత్వమ్" ఇత్యాదిజ్ఞానసాధనములు,జీవన్ముక్తస్థితప్రజ్ఞాదులకు చెప్పిన ధర్మములు, వీటిని కూడా గ్రహించవలెను ఎందుచేత ననగా ఇవన్నీ కూడ శుభవాసనలే గాన ఇవి మలినవాసనలను నివర్తింపచేయును. (ఆశంక) శుభవాసనలు అనంతములుగా ఉన్నవి. ఒక్కడు వాటిని అన్నింటిని అభ్యసించజాలడు అందుచే వాటిని అభ్యసించుటకు చేయు ప్రయాస వ్యర్థము కదా ? (సమాధానము) అట్లనకూడదు. ఆ శుభవాసనలచేత నివర్తింపచేయ దగిన మలినవాసనలు కూడ అనంతములే; ఆ మలినవాసన లన్నీ ఒకని మనస్సులో ఉండవు. ఆయుర్వేదములో చెప్పిన ఔషధము లన్నీ ఒకడు సేవింపజాలడుకదా ? వాటిచేత పోగొట్టదగిన రోగము లన్నీ ఒకని శరీరమునందు సంభవించవు కదా ?

మూ. ఏవం తర్హి స్వచిత్తం ప్రథమతః పరీక్ష్య తత్ర యదా యావత్యో మలినవాసనాస్తదా తావతీర్విరోధినీః శుభవాసనాః అభ్యస్యేత్, యథా పుత్రమిత్రకలత్రాదిభిః పీడ్యమానస్తతో విరక్తస్తన్నివర్తకం పారివ్రాజ్యం గృహ్ణాతి, తథా విద్యామదధనమదకులాచారమదాదిమలిన

వాసనాభిః పీడ్యమానః తద్విరోధినం వివేకమభ్యస్యేత్, స చ వివేకో జనకేన దర్శితః-

"అద్య యే మహతాం మూర్ధ్ని తే దినైర్నిపతన్త్యధః
హన్త చిత్త మహత్తాయాః కైషా విశ్వస్తతా తవ"
(ల.వా. 19.39)

"క్వ ధనాని మహీపానాం బ్రహ్మణః క్వ జగన్తి వా
ప్రాక్తనాని ప్రయాతాని కేయం విశ్వస్తతా తవ"
"కోటయో బ్రహ్మణాం యాతా గతాః స్వర్గపరమ్పరాః
ప్రయాతాః పాంసువద్భూపాః కా ధృతిర్మమ జీవితే"
(ల.వా. 19.41,42)

"యేషాం నిమేషణోన్మేషౌ జగతః ప్రలయోదయౌ
తాదృశాః పురుషా నష్టా మాదృశాం గణనైవ కా".
(ల.వా. 19.49) ఇతి.

వ్యా. అందుచేత ముందుగా తన చిత్తమును పరీక్షించుకొని దానిలో ఎన్ని మలినవాసనలు ఉన్నవో అన్ని, ఆ మలినవాసనలకు విరోధులైన, శుభవాసనలను అభ్యసించవలెను పుత్రమిత్రకలత్రాదులచేత బాధపెట్టబడు చున్నవాడు వారినుండి విరక్తుడై, ఆ బాధలను తొలగించు సంన్యాసమును గ్రహించినట్లు విద్యామదము, ధనమదము, కులమదము, ఆచారమదము మొదలైన మలినవాసనలచేత పీడింపబడుచున్నవాడు ఆ వాసనలకు, విరోధియైన వివేకమును అభ్యసించవలెను ఆ వివేకమును జనకుడు చూపినాడు-

"ఈ నాడు గొప్పవారి శిరస్సులపై (అందరికంటె గొప్పవారుగా) ఉన్నవారు కొన్ని రోజులలో క్రిందపడిపోవుదురు ఆహా! ఓ చిత్తమా! గొప్పతనమును గూర్చి నా కింత విశ్వాసము ఎందుకో తెలియదు!"

"రాజుల ధనము లన్ని ఎక్కడ ఉన్నవి? బ్రహ్మ సృష్టించిన ఆ జగత్తులు ఎక్కడ ఉన్నవి? ప్రాచీనమైన వన్ని పోనే పోయినవి; నీ

కింత విశ్వాస మెందుకు?'' "కోట్ల కొలది బ్రహ్మలు గడచిపోయినారు; స్వర్గపరంపరలు మాయ మైనవి; రాజులందరూ బూడిద వలె ఎగిరిపోయి నారు; నీకు ఈ జీవితముమీద ధైర్యము (స్థిరత్వబుద్ధి) అనగా ఎట్టిది.''

"ఎవరి నిమేషోన్మేషములు జగత్తుకు ప్రళయోదయములో(ఎవరు రెప్ప పాటువేసిన జగత్తు నశించునో, కనులు తెరచిన జగత్తు ఆవిర్భవించునో) అట్టి మహాపురుషులే పోయినారు; నావంటివాళ్లు ఒక లెక్కయా?"

మూ. నన్వయమపి వివేకస్తత్త్వజ్ఞానోదయాత్ప్రాచీనః, నిత్యానిత్యవస్తువివేకాదిసాధనవ్యతిరేకేణ బ్రహ్మజ్ఞానాసంభవాత్· ఇహ తు ఉత్పన్నబ్రహ్మసాక్షాత్కారస్య జీవన్ముక్తయే వాసనాక్షయాదిసాధనం వక్తుముపక్రాన్తమ్; అతః కిమిదమకాణ్డే తాణ్డవమితిచేత్; నాయం దోషః, సాధనచతుష్టయసంపన్నస్య పశ్చాత్ బ్రహ్మజ్ఞానమిత్యేష సర్వపురుషసాధారణః ప్రౌఢో రాజమార్గః. జనకస్య తు పూర్వపుణ్యపుఞ్జపరిపాకేణాకాశఫలపాతవదకస్మాత్సిద్ధగీతాశ్రవణమాత్రేణ తత్త్వజ్ఞాన ముపపన్నమ్, తతశ్చ చిత్తవిశ్రాన్తయే వివేకోఽయం క్రియతే ఇతి కాణ్డ ఏవేదముచితం తాణ్డవమ్

వ్యా. (ఆశంక) ఈ వివేకము తత్త్వజ్ఞానము కలుగుటకంటె ముందు ఉండవలసినది కదా? నిత్యానిత్యవస్తువివేకాదిసాధనములు లేకుండ బ్రహ్మజ్ఞానము కలుగుటకు వీలులేదు కదా? బ్రహ్మసాక్షాత్కారము కలిగినవానికి జీవన్ముక్తి లభించుటకై వాసనాక్షయము మొదలైన సాధనమును చెప్పుటకు ఇక్కడ ప్రారంభించబడినది. ఈ ఘట్టములో ఈ అకాండ తాండవము (సమయము కాని సమయమున తాండవము) ఏమిటి? వివేక మనునది బ్రహ్మసాక్షాత్కారము కలుగక ముందు కావలసినది. మన మిప్పుడు మాటలాడు కొనుచున్నది బ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత ఆ జ్ఞాని వాసనాక్షయమును సంపాదించుట ఎట్లు అనునది. ఇప్పుడు వివేకము ప్రసక్తి ఏమున్నది అని ప్రశ్న. [సమాధానము] ఈ దోషము లేదు. సాధనచతుష్టయమును సంపాదించుకొనిన పిమ్మట బ్రహ్మజ్ఞానము కలు

గును అనునది అందరికి సాధారణమైన, అడ్డు లేని రాజమార్గము. అయితే జనకునకు మాత్రము పూర్వపుణ్యసముదాయపరిపాకవశముచే సిద్ధగీత వినగానే, ఆకాశమునుండి ఫలము పడినట్లు అకస్మాత్తుగా తత్త్వజ్ఞానము కలిగినది. అందుచేత చిత్తమునకు విశ్రాంతి కలుగుటకై ఈ వివేకము చేయబడుచున్నది గాన ఇది అకాండతాండవము కాదు; కాండతాండవమే.

మూ. నన్వేవమప్యస్య వివేకస్య జ్ఞానసమనన్తరభావిత్వేన మలిన వాసనానువృత్త్యభావాత్ శుద్ధవాసనాభ్యాసో నాపేక్షిత ఇతి చేత్, న; జనకస్య తదనువృత్త్యభావేఽపి యాజ్ఞవల్క్యభగీరథాదేస్తదను వృత్తిదర్శనాత్. అస్తి హి యాజ్ఞవల్క్యస్య తత్ప్రతివాదినాముషస్తి కహోలాదీనాం చ భూయాన్విద్యామదః; తైః సర్వైరపి విజిగీషుకథా- యాం ప్రవృత్తత్వాత్. నను తేషాం విద్యాన్తరమేవాస్తి న తు బ్రహ్మ విద్యేతి చేత్, న; కథాగతయోః ప్రశ్నోత్తరయోర్బ్రహ్మవిషయత్వాత్; నను బ్రహ్మవిషయత్వేఽపి తేషామాపాతతో జ్ఞానమేవ న తు సమ్య గ్వేదనమితి చేత్; న. తథాసత్యస్మాకమపి తదీయవాక్యైరుత్పన్నాయా బ్రహ్మవిద్యాయా అసమ్యక్త్వప్రసఙ్గాత్. నను సమ్యక్త్వేఽపి పరో క్షజ్ఞానమేవేతి చేన్న, "యత్సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ" ఇతి ముఖ్యాపరోక్ష విషయతయైవ విశేషతః ప్రశ్నోపలమ్భాత్.

వ్యా. (ఆశంక) ఈ వివేకము జ్ఞానము కలిగిన తరువాత కలిగేది కావున మలినవాసనలు అనువర్తించవు అందుచేత శుద్ధవాసనాభ్యాసము అవసరము లేదు కదా? (సమాధానము) అట్లు కాదు; జనకునకు మలిన వాసనలు అనువర్తించకపోయినను యాజ్ఞవల్క్య భగీరథాదులకు జ్ఞానము కలిగిన తరువాత కూడ ఆ మలినవాసనలు అనువర్తించినట్లు కనబడుచున్నది కదా? యాజ్ఞవల్క్యునకు, ఆతని ప్రతివాదులైన ఉషస్తి-కహోలాదులకు చాల విద్యామదము ఉన్నట్లు తెలియుచున్నది. ఎందుచేత ననగా వారందరూ విజిగీషుకథలో [ఇతరులను జయించవలె నని చేసిన వాదములో] పవర్తించి

నారు. [ఆశంక] వారికి మరేవో విద్యలున్నవి గాని బ్రహ్మవిద్య లేదు కదా ? [సమాధానము] అట్లనుటకు వీలు లేదు ఎందుచేతననగా వారు చేసిన వాదమునకు సంబంధించిన ప్రశ్నోత్తరములు బ్రహ్మకు సంబంధించి ఉన్నవి. అవి బ్రహ్మవిషయములే అయినను వారికున్న బ్రహ్మజ్ఞానము పైకి జ్ఞానముగా కనబడుచున్నదే తప్ప అది సరియైన జ్ఞానము కాదు అని అనుటకు వీలులేదు. అట్లయినచో వారి వాక్యముల ద్వారా మనకు కలిగిన బ్రహ్మజ్ఞానము కూడ సరియైనది కాదని చెప్పవలసి వచ్చును. అది సరియైన బ్రహ్మజ్ఞానమే అయినను పరోక్షజ్ఞానమై ఉండును అని అనరాదు. ''ఏ బ్రహ్మ సాక్షాత్ ప్రత్యక్షమో'' ఇత్యాది విధముగ అక్కడ ప్రశ్నలు ముఖ్యమైన అపరోక్షజ్ఞానమునకు సంబంధించినవిగానే కనబడుచున్నవి కదా?

మూ. నన్వాత్మజ్ఞానినో విద్యామద ఆచార్యైర్నాభ్యుపగమ్యతే; తథా చోపదేశసాహస్ర్యామభిహితమ్—

"బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః"

(12.13) ఇతి.

నైష్కర్మ్యసిద్ధావపి—

"న చాధ్యాత్మాభిమానోఽపి విదుషోఽస్త్యాసురత్వతః

విదుషోఽప్యాసురశ్చేత్స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్" ఇతి;

ఇతి చేత్, నాయం దోషః. జీవన్ముక్తిపర్యన్తస్య తత్త్వజ్ఞానస్య తత్ర వివక్షితత్వాత్; న ఖలు వయమపి జీవన్ముక్తానాం విద్యామదమభ్యుపగచ్ఛామః.

వ్యా. (ఆశంక) ఆత్మజ్ఞానము కలవారికి విద్యామద ముండు నని శంకరాచార్యులు అంగీకరించరుకదా ? అందుచేతనే ఉపదేశసాహస్రిలో- "పూర్వము చెప్పిన విధమున ఎవడు తనకు బ్రహ్మజ్ఞాన మున్నది అని కూడ అనుకొనడో అతడే ఆత్మజ్ఞాని; ఇతరుడు కాదు" అని చెప్పినారు. ''జ్ఞానికి "నాకు జ్ఞాన మున్నది'' అను అభిమానము కూడ ఉండదు. ఎందుచేత ననగా అది అసురభావము. జ్ఞానికి కూడ ఆసురభావ మున్నచో అతని

బ్రహ్మజ్ఞానము వ్యర్థము'' అని నైష్కర్మ్యసిద్ధిలో కూడ చెప్పబడినది (సమాధానము ఈ దోషము లేదు. ఇక్కడ మేము చెప్పే తత్త్వజ్ఞానము జీవన్ముక్తి కలుగు నంతవరకు ఉన్న తత్త్వజ్ఞానము. ఆ తత్త్వజ్ఞానికి జీవన్ముక్తి కలిగిన పిమ్మట అట్టి జీవన్ముక్తునకు విద్యామద ముండు నని మేము కూడ అంగీకరించము.

మూ. నను విజిగీషోరాత్మబోధ ఏవ నాస్తి,

"రాగో లిఙ్గమబోధస్య చిత్తవ్యాయామభూమిషు
కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః"

(నై.4.67)

ఇత్యాచార్యైరభ్యుపగమాదితి చేత్, న;
"రాగాదయః సన్తు కామం న తద్భావోఽపరాధ్యతి
ఉత్ఖాతదంష్ట్రోరగవదవిద్యా కిం కరిష్యతి" (బృ. వా.4.1746)

ఇత్యత్ర తైరేవ రాగాద్యభ్యుపగమాత్. న చాత్ర పరస్పర వ్యాహతిః; స్థితప్రజ్ఞే జ్ఞానిమాత్రే చ వచనద్వయస్య వ్యవస్థాపనోప యుక్తత్వాత్.

వ్యా. (ఆశంక) వాదములో జయమును కోరువానికి ఆత్మబోధయే లేదు అందుచేతనే "చిత్తము ప్రసరించే ప్రదేశములయందు ఆసక్తి ఉన్న వానికి జ్ఞానము లేదని అర్థము తొఱ్ఱలో నిప్పు ఉన్న చెట్టు పచ్చగా ఎలా ఉండును ?" అని సురేశ్వరాచార్యులు చెప్పినారు. (సమాధానము) అట్లు కాదు. ఆ సురేశ్వరాచార్యులే–"రాగాదులు ఉన్నచో ఉండనిమ్ము. అవి ఉండుటవలన ఏ అపరాధము భయము) లేదు. కోరలు పీకివేసిన సర్పము వలె అవిద్య ఏమి చేయును" అని రాగాదు లుండవచ్చు నని చెప్పినారు. అయితే ఈ మాటలు పరస్పరవిరుద్ధములు అని అనరాదు. ఎందుచేత ననగా స్థితప్రజ్ఞుని విషయమునందు, కేవలజ్ఞాని విషయము నందు వీటికి వ్యవస్థ చూపవచ్చును. అనగా మొదటిది స్థితప్రజ్ఞుల విషయమునందు, రెండవది కేవలజ్ఞానివిషయమునందు అన్వయించుకొన వలెను.

మూ. నను జ్ఞానినో రాగాద్యభ్యుపగమే ధర్మాధర్మద్వారేణ జన్మాన్తరప్రసఙ్గ ఇతి చేత్, నైవమ్, అదగ్ధబీజపదవిద్యాపూర్వక కామాదేరేవ ముఖ్యరాగాదిత్వేన పునర్జన్మహేతుత్వాత్. జ్ఞానినస్తు దగ్ధబీజపదాభాసమాత్రా ఏవ రాగాదయః. ఏతదేవాభిప్రేత్యోక్తమ్-

"ఉత్పద్యమానా రాగాద్యా వివేకజ్ఞానవహ్నినా
తదా తదైవ దహ్యన్తే కుతస్తేషాం ప్రరోహణమ్"

(పఞ్చ 7) ఇతి.

తర్హి స్థితప్రజ్ఞస్యాపి తే సన్తీతి చేత్, న; తత్కాలే ముఖ్యపదవభాసమానానాం బాధకిత్వాత్. రజ్జుసర్పోఽపి ముఖ్యసర్పవదేవ తదానీం షయమ్నుపలభ్యతే; తద్వత్, తర్హ్యాభాసత్వానుసంధానాను-వృత్త్యా న కోఽపి బాధ ఇతి చేత్-చిరం జీవతు భవాన్. ఇయమేవాస్మదభిమతా జీవన్ముక్తిః.

వ్యా. (ఆశంక) జ్ఞానికి రాగాదులు ఉండు నని అంగీకరించినచో ధర్మాధర్మముల ద్వారా జన్మాంతరములు కలుగును కదా ? (సమాధానము) ఆ దోషము లేదు. అవిద్యాపూర్వకములైన కామాదులే ముఖ్యములైన రాగములు. అవి కాల్చని మంచి విత్తనముల వంటివి. అట్టి రాగాదులే పునర్జన్మకు కారణము. జ్ఞాని యందు ఉన్న రాగాదులు కాల్చివేసిన బీజాదులవలె ఆభాసమాత్రములే. ఈ అభిప్రాయముచేతనే ఇట్లు చెప్పబడినది —

"పుట్టుచుండే రాగాదులు పుట్టుచున్న సమయమునందే వివేకజ్ఞానమనే అగ్నిచేత కాల్చివేయబడుచుండును. అది ఇంక మొలచుట ఎట్లు ?"

(ఆశంక) అట్లైతే అవి స్థితప్రజ్ఞునికి కూడా ఉండవచ్చును కదా ? (సమాధానము అట్లు కాదు. ఆ సమయములో ముఖ్యములుగా కనబడునవే బాధకములు. రజ్జుసర్పము కూడ ఆ సమయమునందు ముఖ్యసర్పము వలె భయమును ఎట్లు కలిగించుచున్నదో అట్లే. అయితే అవి ఆభాసమాత్రమే

అను అనుసంధానము (ఆలోచన) అనువర్తించుచున్నప్పుడు ఏ బాధా కలిగించ వని అర్థమా ? నాయనా ! చిరకాలము జీవించుము. మేము చెప్పు జీవన్ముక్తి ఇదే.

మూ. యాజ్ఞవల్క్యస్తు విజిగీషుదశాయాం స హీదృశః. చిత్త విశ్రాన్తయే విద్వత్సంన్యాసస్య తేన కరిష్యమాణత్వాత్. న కేవలమస్య విజిగీషా కింతు ధనతృష్ణాపి మహతీ జాతా. యతః బహూనాం బ్రహ్మవిదాం పురతః స్థాపితం సాలఙ్కారం గోసహస్రమపహృత్య స్వయమేవేదమాహ–"నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయం స్మః" (బృ.ఉ.3.1.2) ఇతి. ఇతరాన్ బ్రహ్మవిదోఽవ జ్ఞాతుమియం కాచిద్వచోభఙ్గీతి చేత్; అయమపి ఈర్ష్యాపరో దోషః. ఇతరే చ బ్రహ్మవిదః స్వకీయం ధనమనేనాపహృతమితి మత్వా చుక్రుధుః. అయం చ క్రోధపరవశః శాకల్యం శాపేన మారయామాస. న చాస్య బ్రహ్మహత్యా మోక్షాభావః శఙ్కనీయః. యతః కౌషీతకినః సమామనన్తి–"నాస్య కేన చన కర్మణా లోకో మీయతే న మాతృవధేన న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా" (3.1.) ఇతి. శేషోఽపి స్వకృతాయామార్యాపఞ్చాశీత్యామిదమాహ–

"హయమేధశతసహస్రాణ్యథ కురుతే బ్రహ్మఘాతలక్షాణి
పరమార్థవిన్నపుణ్యైర్న చ పాపైః స్పృశ్యతే విమలః" ఇతి.

తస్మాత్ కిం బహునా, బ్రహ్మవిదాం యాజ్ఞవల్క్యాదీనామస్త్యేవ మలినవాసనానువృత్తిః. భగీరథస్తు తత్త్వం విదిత్వాపి రాజ్యం పాలయన్మలినవాసనాభిశ్చిత్తవిశ్రాన్త్యభావే సతి సర్వం పరిత్యజ్య పశ్చాద్విశ్రాన్తవానితి వసిష్ఠేనోపాఖ్యాయతే. అతః స్వకీయం వర్తమానం మలినవాసనాదోషం పరకీయదోషవత్సమ్యగుత్ప్రేక్ష్య తత్ప్రతీకారమభ్యస్యేత్. అనేనైవాభిప్రాయేణ స్మర్యతే–

"యథా సునిపుణః సమ్యక్పరదోషేక్షణే రతః
తథా చేన్నిపుణః స్వేషు కో న ముచ్యేత బన్ధనాత్" ఇతి.

వ్యా విజిగీషువుగా ఉన్న దశలో యాజ్ఞవల్క్యుడు ఈ విధముగా లేడు. అందుచేతనే చిత్తవిశ్రాంతికొరకు అతడు విద్వత్సంన్యాసమును స్వీకరించుటకై సంకల్పించినాడు. ఇతనికి విజిగీష (జయించవలెననే ఇచ్ఛ) మాత్రమే కాదు; ధనాశ కూడ చాలా బయలుదేరినది. అందుచేతనే చాల మంది బ్రహ్మవేత్తల ఎదుట ఉంచబడిన, అలంకారసహితములైన వేయి గోవులను తీసికొని స్వయముగా—"బ్రహ్మిష్ఠునకు ఒక నమస్కారము, మాకు గోవులమీదనే వాంఛ ఉన్నది" అని పలికెను ఇది మిగిలిన బ్రహ్మవేత్తలను అవమానించుటకు అవలంబించిన వచోభంగి (మాటలాడే పద్ధతి) అనవచ్చును కదా ? అట్లయితే ఇది మరొక దోషము. ఇతరబ్రహ్మవేత్త లందరు తమ ధనమును అపహరించినా డని అతని విషయమున కోపించిరి. ఇతడు కోపావేశముతో శపించి శాకల్యుని చంపివేసినాడు. అయితే బ్రహ్మహత్య చేసిన ఇతనికి మోక్షము లభించదు అని శంకింపరాదు ఎందుచేత ననగా—"జ్ఞాని లోకము (మోక్షము) ఏ కర్మచేతను దెబ్బతినదు; మాతృవధచేత గాని, పితృవధచేత గాని, భ్రూణహత్యచేత గాని ఏ మాత్రము హాని కలుగదు" అని కౌషీతకులు చెప్పుచున్నారు. శేషుడు కూడ తాను రచించిన ఆర్యాపంచాశీతిలో ఇట్లు చెప్పినాడు—

"నిర్మలుడైన ఆత్మజ్ఞాని వేలకొలది అశ్వమేధములు చేయవచ్చును. లక్షలకొలది బ్రహ్మహత్యలు చేయవచ్చును. అయినను పుణ్యము కాని పాపము కాని ఇతనిని ముట్టదు"

అందువలన, వేయేల; బ్రహ్మవేత్తలైన యాజ్ఞవల్క్యాదులకు కూడ మలినవాసనలు అనువర్తించుచునే ఉండెను. భగీరథుడైతే తత్త్వమును తెలిసికొనిన పిమ్మట గూడ రాజ్యపాలనము చేయుచు, మలిన వాసనలచేత చిత్తమునకు విశ్రాంతి లేకపోగా, అన్నింటిని విడచి తరవాత విశ్రమించి నాడని వసిష్ఠుడు చెప్పుచున్నాడు. అందుచేత పరులలోని దోషములను

శ్రద్ధగా తెలిసికొని నట్లు తనలో ఉన్న మలినవాసనాదోషమును కూడ బాగుగా తెలిసికొని దానికి ప్రతిక్రియను అభ్యసించవలెను. ఈ అభిప్రాయము చేతనే స్మృతిలో ఇట్లు చెప్పబడినది–

"పరుల దోషములను గూర్చి అతినైపుణ్యముతో ఎట్లు ఆసక్తి చూపునో తన దోషములను గూర్చి తెలిసికొనుటకు కూడ అట్టి నైపుణ్యమునే ప్రదర్శించినట్లయితే ఎవడు బంధమునుండి విముక్తుడు కాడు ?"

మూ. నన్వాదౌ తావద్విద్యామదస్య కః ప్రతీకారః ఇతి చేత్_ కిం స్వనిష్ఠస్య పరవిషయస్య మదస్య, కిం వా స్వవిషయస్య పరనిష్ఠస్య ? అద్యే భఙ్గోఽవశ్యం క్వచిద్భవిష్యతీతి నిరన్తరం భావయేత్. తద్యథా శ్వేతకేతుర్విద్యయా మత్తః ప్రవాహణస్య రాజ్ఞః సభాం గత్వా తేన పఞ్చాగ్నివిద్యాయాం పృష్టాయాం స్వయమజానానో నిరుత్తరో రాజ్ఞా బహుధా భర్త్సితః పితుః సమీపమాగత్య సనిర్వేదముదాజహార. పితా తు నిర్మదస్తమేవ రాజానమనుసృత్య తాం విద్యాం లేభే. దృప్తబాలాకిశ్చాజాతశత్రుణా రాజ్ఞా భర్త్సితః దర్పం సంత్యజ్య రాజానముపససాద. ఉషస్తకహోలాదయశ్చ మదేన కథాం కృత్వా పరాజితాః.

వ్యా. అయితే ముందు ఈ విద్యామదానికి ప్రతీకారము ఏమిటి? ఏ మదానికి ? పరులవిషయమై తనలో ఉన్న మదానికా [అనగా అందరి కంటె నేను విద్యావంతుడను అను మదానికా] లేదా తనను గూర్చి పరులలో ఉన్న మదానికా? మొదటి రకమైన మదము పోవలె ననుకొన్నచో ఎక్కడో ఒక చోట ఈ గర్వానికి భంగము కలుగు నని నిరంతరము భావన చేయవలెను. ఉదాహరణకు–విద్యామదముతో కూడిన శ్వేతకేతువు ప్రవాహణమహారాజు సభకు వెళ్లినపుడు ఆతడు పంచాగ్నివిద్యను గూర్చి ప్రశ్నించగా తెలియక పోవుటచే సమాధానము చెప్పలేకపోయెను. అప్పుడా రాజు అనేక విధముల నిందించగా తండ్రివద్దకు వచ్చి తనకు జరిగిన

అవమానమును చెప్పుకొనెను. ఆతని తండ్రి మాత్రము అట్టి మద మేమీ లేక ఆ రాజును అనుసరించి ఆ విద్యను సంపాదించెను. దృప్తుడైన బాలాకి అజాత శత్రు వనే రాజుచేత నింపితుడై దర్పమును విడచి ఆ రాజునకు శిష్యుడయ్యెను. ఉషస్తకహోలాదులు గర్వముతో వాదించి పరాజయము పొందిరి.

మూ. యదా స్వవిషయః పరనిష్ఠో మదః ప్రవర్తేత తదా మత్తః స పరో మాం నిన్దతు, అవమన్యతాం వా. సర్వథాపి న మే హానిరితి భావయేత్; తథా హి—

"ఆత్మానం యది నిన్దన్తి నిన్దన్తి స్వయమేవ హి
శరీరం యది నిన్దన్తి సహాయాస్తే మతా మమ.
నిన్దావమానావత్యన్తం భూషణం యస్య యోగినః
ధీవిక్షేపః కథం తస్య వాచాలైః క్రియతామిహ" ఇతి.

వ్యా. తనను గూర్చి పరులకు మద మున్నచో అనగా తన కేమీ తెలియదని అనుచు ఇతరులు విద్యాగర్వమును చూపినచో- మదించిన ఆతడు నన్ను నిందించిన నిందించుగాక! అవమానించుగాక. ఏమైనా నాకు హాని లేదు ఎందుచేత ననగా-"వారు నిందించునది ఆత్మనా శరీరమునా ? ఆత్మను నిందించుచున్నట్లయితే తమనే నిందించుకొనుచున్నారు. [నా ఆత్మ వారి ఆత్మ ఒకటే కదా ?] నా శరీరమును నిందించుచున్నట్లయితే వాళ్లు నాకు గొప్ప సాహాయ్యము చేయుచున్నారు. నిరర్థకముగా పేలేవారు నిందావమానములు అలంకారము లని భావించు యోగికి చిత్తవిక్షేపము ఎట్లు చేయగలరు ?" అని చెప్పబడినది.

మూ. నైష్కర్మ్యసిద్ధౌ—

"పర్చాస్కే సంపరిత్యక్తే దోషతశ్చావధారితే
యది దోషం వదేత్తస్మై కిం తత్రోచ్ఛరితుర్భవేత్. (2.16)

తద్వత్ స్థూలే తథా సూక్ష్మే దేహే త్యక్తే వివేకతః
యది దోషం వదేత్ బాహ్యం కిం తత్ర విదుషో భవేత్"

(2.17)

శోకహర్షభయక్రోధలోభమోహస్పృహాదయః
అహంకారస్య దృశ్యన్తే జన్మ మృత్యుశ్చ నాత్మనః" ఇతి

వ్యా. "విడచిన మలము దుష్ట మని నిర్ధారిత మైనప్పుడు దాని దోషమును గూర్చి ఎవరైన చెప్పినచో దానివలన మలమును విడచిన వానికి నష్ట మేమి? అట్లే వివేకముచేత స్థూలసూక్ష్మశరీరములను త్యజించిన విద్వాంసునకు, ఆ దేహములకు సంబంధించిన దోషములను ఎవ్వరైన చెప్పినచో నష్ట మేమి? శోకము, సంతోషము, భయము, క్రోధము, లోభము, మోహము, ఆశ, జన్మ, మృత్యువు ఇవన్నీ అహంకారమునకే సంబంధించినవి కాని ఆత్మకు సంబంధించినవి కావు" అని నైష్కర్మ్య సిద్ధిలో చెప్పబడినది.

మూ. నిన్దాయా భూషణత్వం జ్ఞానాఙ్కుశే దర్శితమ్—

"మన్నిన్దయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్నసులభోఽయమనుగ్రహో మే.
శ్రేయోర్థినో హి పురుషాః పరతుష్టిహేతో
ర్దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజన్తి.
సతతసులభదైన్యే నిఃసుఖే జీవలోకే
యది మమ పరివాదాత్ప్రీతిమాప్నోతి కశ్చిత్.
పరివదతు యథేష్టం మత్సమక్షం తిరో వా
జగతి హి బహుదుఃఖే దుర్లభః ప్రీతియోగః" ఇతి.

వ్యా. నింద భూషణ మని జ్ఞానాంకుశమునందు చెప్పబడినది—

"నన్ను నిందించుటచేత జనులు సంతోషము పొందినచో ఇది నాకు అప్రయత్నముగా లభించిన అనుగ్రహము. శ్రేయస్సు కోరే మానవులు

పరుల సంతోషముకొరకు తాము ఎంతో కష్టపడి ఆర్జించిన ధనములను కూడ పరిత్యజించుచున్నారు కదా !"

"ఎల్లప్పుడూ దైన్యమే అధికముగా లభించే సుఖము లేని ఈ జగత్తులో ఎవనికైనా సంతోషము కలిగే పక్షములో అతడు ఇష్టము వచ్చినట్లు, నా సమక్షములో కాని, పరోక్షములో కాని నన్ను తిట్టుగాక. దుఃఖబహుళమైన ఈ జగత్తులో ఈ మాత్రము ఆనందమైనా లభించుట కష్టము కదా !"

మూ. అవమానస్య భూషణత్వం స్మర్యతే-

"తథా చరేత వై యోగీ సతాం ధర్మమదూషయన్
జనా యథావమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతిమ్" ఇతి.

వ్యా. అవమానము భూషణ మని స్మృతి చెప్పుచున్నది:-

"యోగి సత్పురుషుల ధర్మమునకు విరోధము లేకుండగా, జనులు తనను అవమానించేటట్లు తనతో సంబంధము పెట్టుకొనకుండా ఉండేటట్లు సంచరించవలెను"

మూ. యాజ్ఞవల్క్యోషస్తాదీనాం యౌ స్వనిష్ఠపరనిష్ఠౌ విద్యామదౌ తయోర్యథా వివేకేన ప్రతీకారః తథా ధనాభిలాషక్రోధయోరప్యవగన్తవ్యః.

"అర్థానామర్జనే క్లేశ స్తథైవ పరిపాలనే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్ క్లేశకారిణః"
ఇతి ధనవిషయే వివేకః.

వ్యా. యాజ్ఞవల్క్యుడు, ఉషస్తుడు మొదలైనవారి స్వనిష్ఠ పరనిష్ఠ విద్యామదములకు వివేకముచేత ప్రతీకారము చేసినట్లు ధనాభిలాష క్రోధములకు కూడ వివేకముచేత ప్రతీకారమును తెలుసుకొనవలెను. [పైన చూపిన ఉదాహరణములను పట్టి యాజ్ఞవల్క్యునకు, ఉషస్తునికి

కూడ విద్యామదము స్వనిష్ఠమే అనగా వారి కున్నది ఇతరులకంటె నేను విద్యావంతుడను అనుమదమే పరనిష్ఠమదమునకు పరిహారోపాయము చెప్పబడినది గాని ఉదాహరణముగా ఎవరినీ చూపలేదు. అందుచేత యాజ్ఞవల్క్యోషస్తుల స్వనిష్ఠమదము ఇతరుల పరనిష్ఠమదము అని అర్థము]

"ధనములను సంపాదించుటలో క్లేశము. వాటిని రక్షించుటలో క్లేశము అవి పోయినా, వ్యయమైనా క్లేశము. ఈ విధముగా క్లేశమును కలిగించు ధనములు ఛీ! ఎంత చెడ్డవి."

ఇది ధనవిషయమున నేర్వవలసిన వివేకము.

మూ. క్రోధోఽపి ద్వివిధః–స్వనిష్ఠః పరవిషయః, పరనిష్ఠః స్వవిషయశ్చేతి. తత్ర స్వనిష్ఠం పరవిషయం ప్రత్యేవముక్తమ్–

"అపకారిణి కోపశ్చేత్ కోపః కోపే కథం న తే
ధర్మార్థకామమోక్షాణాం ప్రసహ్య పరిపన్థిని.
ఫలార్థినో ధర్మయశోర్థనాశనః
స చేదపార్థః స్వశరీరతాపనః.
న చేహ నాముత్ర హితాయ యః సతాం
మనాంసి కోపః సముపాశ్రయేత్ కథమ్" ఇతి.

**వ్యా.** కోపము కూడ పరుల విషయమై తనకు కలిగిన కోపము, పరులకు తనపై కలిగిన కోపము అని రెండు విధములు. పరుల విషయమై తనకు కలిగిన కోపమును గూర్చి ఇట్లు చెప్పబడినది —

"అపకారము చేసేవారి విషయమున కదా కోపము కలిగేది? అట్లయినచో ధర్మార్థకామమోక్షములను బలాత్కారముగా అడ్డుకొని నీ కింత అపకారము చేయుచున్న కోపము మీద నీకు కోపము ఎందుకు రాదు?''

"ధర్మము, యశస్సు, అర్థము మొదలైన ఫలములు కోరువానికి వాటినన్నింటినీ నశింపచేసి కోపము చాల అపకారమును చేయుచున్నది. తన

శరీరమునకే తాపము కలిగించుచున్నది. అది ఇహలోకమునకు ఉపయోగించదు, పరలోకమునకు ఉపయోగించదు. అట్టి కోపము సత్పురుషుల మనస్సులలో ఎట్లు ప్రవేశించును ?"

మూ. స్వవిషయం పరనిష్ఠం ప్రత్యేవమీరితమ్—

"న మేఽపరాధః కిమకారణే నృణాం
మదభ్యసూయేత్యపి నైవ చిన్తయేత్.
న యత్కృతా ప్రాగ్భవబన్ధనిష్కృతి
స్తతోఽపరాధః పరమోఽనుచిన్త్యతామ్.
నమోఽస్తు కోపదేవాయ స్వాశ్రయజ్వాలినే భృశమ్
కోప్యస్య మమ వైరాగ్యదాయినే దోషబోధినే" ఇతి

వ్యా. తనను గూర్చి ఇతరులకు కలిగిన కోపమును గూర్చి ఇట్లు చెప్పబడినది :-

"నేను ఏ అపరాధమూ చేయలేదు కదా; అకారణంగా ఈ మానవులకు నామీద కోపము ఎందుకు అని కూడ ఆలోచించకూడదు. నీవు పూర్వజన్మలనుండే వచ్చుచున్న కర్మరూపమైన బంధమునకు ప్రాయశ్చిత్తము చేసికొనలేదు కదా ! ఇంతకంటె పెద్ద అపరాధము ఏమి ఉండునో ఆలోచించుకొనుము." ఇతరులకు నీమీద నిష్కారణంగా కోపము కలుగుటకు కూడ నీ పూర్వకర్మయే కారణ మని భావము. అట్టి కర్మ చేసి, దానికి ప్రాయశ్చిత్తము చేసికొనకుండుట మహాపరాధము కాదా ?

"తన ఆశ్రయమునే (ఎవనికి కోపము వచ్చునో ఆతనినే) పూర్తిగా కాల్చివేసే కోపదేవునికి నమస్కారము. కోపమునకు గురియైన నాకు ఈ కోపదేవుడు నాలో ఉన్న దోషములను తెలిపి వైరాగ్యము కలిగించినాడు."

మూ. ధనాభిలాషక్రోధవద్యోషిత్పుత్రాభిలాషావపి వివేకేన నివర్తనీయౌ. తత్ర యోషిద్వివేకో వసిష్ఠేన దర్శితః—

"మాంసపాఞ్చాలికాయాస్తు యన్త్రలోలేఽఙ్గపఞ్జరే
స్నాయ్వస్థిగ్రన్థిశాలిన్యాః స్త్రియాః కిమివ శోభనమ్."

(ల.వా. 2.90)

వ్యా. ధనాభిలాషను, క్రోధమును నివర్తింపచేసికొని నట్లు స్త్రీ విషయమున కోరికను, పుత్రులకై కోరికను కూడ వివేకముచేతనే నివర్తింప చేసికొనవలెను. స్త్రీల విషయమున అభ్యసించవలసిన వివేకమును వసిష్ఠుడు చెప్పినాడు—

కండరాలు, ఎముకలు అనే గ్రంథులతో కూడిన మాంసపుబొమ్మ స్త్రీ యంత్రము వలె కదలుచుండే ఆ శరీరపంజరములో అందమైనది ఏ మున్నది ?".

మూ. "త్వఙ్మాంసరక్తబాష్పామ్బు పృథక్కృత్వా విలోచనే
సమాలోకయ రమ్యే చేత్ కిం ముధా పరిముహ్యసి"(2.91)

వ్యా. "చర్మమును, మాంసమును, రక్తమును, కన్నీళ్లను వేరు చేసి ఆమె నేత్రములను అందముగా ఉన్నవా అని పరీక్షించి చూడుము. వ్యర్థముగా ఎందుకు మోహము చెందెదవు ?''

మూ. "మేరుశృఙ్గతటోల్లాసిగఙ్గాజలదయోపమా
దృష్టా యస్మిన్ స్తనే ముక్తాహారస్యోల్లాసశాలితా.
శ్మశానేషు దిగన్తేషు స ఏవ లలనాస్తనః
శ్వభిరాస్వాద్యతే కాలే లఘుపిణ్డ ఇవాన్ధసః" (2.92,93)

వ్యా. ''ఏ స్తనముమీద ప్రకాశించుచున్న ముత్యాల హారము మేరు పర్వతశిఖరముమీద ప్రకాశించుచున్న గంగాప్రవాహముతో సమముగా ఉన్నట్లు వర్ణింపబడినదో ఆ స్త్రీస్తనమునే మరణానంతరము శ్మశానములో నాలుగువైపులా లాగుచు, చిన్న అన్నము ముద్ద వలె కుక్కలు తినుచున్నవి."

మూ. "కేశకజ్జలధారిణ్యో దుఃస్పర్శా లోచనప్రియాః
దుష్కృతాగ్నిశిఖా నార్యో దహన్తి తృణవన్నరాన్." (2.94)

వ్యా. జుట్టు అనే పొగచూరిన బూజు ధరించినవారు, కంటికి చూచుటకు అందముగా ఉండువారు, కాని స్పృశించుటకు శక్యముకానివారు అయిన స్త్రీలు అనే చెడ్డగా ఏర్పడిన అగ్నిశిఖలు నరులను తృణములను వలె దహించివేయును.

మూ. "జ్వలతామతిదూరేఽపి సరసా అపి నీరసాః
స్త్రియో హి నరకాగ్నీనామిన్ధనం చారు దారుణమ్." (2.95)

వ్యా. "సరసలైనను రసవిహీనలైన స్త్రీలు చాల దూరమునందే జ్వలించుచున్నను నరకాగ్నులకు అందమైన, కాని దారుణమైన కట్టెలు. నరకాగ్నిని రగుల్కొలుపుదురు".

మూ. "కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసామ్
నార్యో నరవిహఙ్గానామఙ్గబన్ధనవాగురాః" (2.96)

వ్యా. "స్త్రీలు, మూఢచిత్తులైన నరులనే పక్షుల శరీరములను బంధించుటకై మన్మథుడనే కిరాతుడు పన్నిన వలలు."

మూ. "జన్మపల్వలమత్స్యానాం చిత్తకర్దమచారిణామ్
పుంసాం దుర్వాసనారజ్జౌ నారీ బడిశపిణ్డికా" (2.97)

వ్యా. "స్త్రీ, జననమరణములు అనే చిన్న చెరువులో మత్స్యములై చిత్తమనే బురదలో సంచరించుచున్న పురుషులను పట్టుకొనుటకై దుర్వాసనలనే త్రాడుకు కట్టిన ఎరముద్ద".

మూ. "సర్వేషాం దోషరత్నానాం సుసముద్గికయానయా
దుఃఖశృఙ్ఖలయా నిత్యమలమస్తు మమ స్త్రియా" (2.98)

వ్యా. "దోషము లనే సమస్తరత్నములు దాచుకొనే మంచి పెట్టె, నిత్యము పీడించు దుఃఖము లనే సంకెళ్లు అయిన ఈ స్త్రీ ఇంక నాకు వద్దు".

మూ. "ఇతో మాంసమితో రక్తమితోఽస్థీనితి వాసరైః
బ్రహ్మన్ కతిపయైరేవ యాతి స్త్రీ విశరారుతామ్" (2.99)

వ్యా. "ఓ! బ్రాహ్మణుడా! ఇటు మాంసము; ఇటు రక్తము; ఇటు ఎముకలు-ఈ విధముగా కొన్ని రోజులలోనే స్త్రీలోని శరీరభాగము లన్నీ విడివిడిగా పడిపోవును''.

మూ. ''యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిఃస్త్రీకస్య క్వ భోగభూః
స్త్రియస్త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్"
(2.100)

వ్యా. స్త్రీ ఉన్నవానికి భోగేచ్ఛ ఉండును. స్త్రీ లేనివానికి భోగమునకు అవకాశ మెక్కడ? స్త్రీలను విడచినచో జగత్తును విడచినట్లే. జగత్తును విడచినవాడు సుఖవంతు డగును.

మూ. పుత్రవివేకో బ్రహ్మనన్దే దర్శితః-
"అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్
లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేన చ బాధతే" 65
జాతస్య గ్రహరోగాదిః కుమారస్య చ మూర్ఖతా
ఉపనీతే త్వవిద్యత్వమనుద్వాహశ్చ పణ్డితే 66
యూనశ్చ పరదారాదిర్దారిద్ర్యం చ కుటుమ్బినః
పిత్రోర్దుఃఖస్య నాస్త్యన్తో ధనీ చేన్మ్రియతే తదా" 67. ఇతి.

వ్యా. పుత్రుడు పుట్టనంతవరకు తలిదండ్రులకు చాల కాలము దుఃఖము ఉండును. పుత్రుడు కలుగును అనుకొన్నప్పుడు గర్భస్రావము, ప్రసవము మొదలైనవాటిచేత బాధ కలుగును, కుమారుడు పుట్టిన తరువాత

వానికి గ్రహరోగాదిబాధ కలిగినా, వాడు మూర్ఖుడైనా తలిదండ్రులకు దుఃఖమే. ఉపనయనము చేసిన తరువాత చదువురాకపోయినచో దుఃఖము, పండితుడైనవానికి వివాహము కాలేదని దుఃఖము. యౌవనవంతుడైన పిమ్మట అతనికి పరదారసంబంధాదులు ఏర్పడినచో దుఃఖము. వివాహము చేసికొని కుటుంబవంతుడైన కొడుకు దారిద్ర్యముతో బాధపడుచున్నచో వానిని చూచి తలిదండ్రులకు దుఃఖము, ధనవంతుడు కూడా అయి మరణించినచో దుఃఖము. ఈ విధముగా తలిదండ్రుల దుఃఖమునకు అంతము లేదు.

మూ. యథా విద్యాధనక్రోధయోషిత్పుత్రవిషయాణాం మలిన వాసనానాం వివేకేన ప్రతీకారః తథాన్యాసామపి వాసనానాం యథా-యోగం శాస్త్రైః స్వయుక్త్యా చ దోషం వివిచ్య ప్రతీకారం కుర్యాత్. కృతే చ ప్రతీకారే జీవన్ముక్తిలక్షణం పరమం పదం లభ్యతే. తదాహ వసిష్ఠః—

"వాసనానాం పరిత్యాగే యది యత్నం కరోష్యలమ్
తతో శిథిలతాం యాన్తి సర్వాధివ్యాధయః క్షణాత్
పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనాః
స్థితిం బధ్నాసి చేత్తర్హి పదమాసాదయస్యలమ్" ఇతి.

వ్యా. విద్యా-ధన-క్రోధ-స్త్రీ-పుత్రులవిషయమున ఉన్న మలినవాసనలకు వివేకముచేత ప్రతీకారము చేసికొనినట్లే ఇతరవాసనలకు కూడ శాస్త్రములచేతను, తన. యుక్తిచేతను తగు విధముగ వాటిలో ఉన్న దోషములను స్పష్టముగా తెలిసికొని, ప్రతిక్రియ చేసికొనవలెను. ఆ విధముగ ప్రతిక్రియ చేసినకొన్నవానికి జీవన్ముక్తిరూపమైన పరమపదము లభించును ఈ విషయమును వసిష్ఠుడు ఇట్లు చెప్పినాడు —

"వాసనలను త్యజించుటకు బాగుగా ప్రయత్నము చేసినచో నీ మనోవ్యధలు, వ్యాధులు క్షణకాలములో తొలగిపోవును. పురుషప్రయత్నము

చేసి పట్టుపట్టి, వాసనలను తొలగించుకొని నిశ్చలమైన స్థితిని సంపాదించు కొన్నచో నీవు సుందరమైన జీవన్ముక్తిరూపపరమపదమును పొందగలవు."

మూ. నస్వత్ర పౌరుషః ప్రయత్నో నామ పూర్వోక్తో విషయ దోషవివేకః. స చ పునః పునః క్రియమాణోఽపి ప్రబలేన్ద్రియవ్యవ హారేణాభిభూయతే: తదుక్తం భగవతా–

"యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః"
(భ. గీ. **2.60**)

"ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి"
(భ. గీ. **2.67**) ఇతి.

వ్యా. [ఆంశక] ఇక్కడ పురుషప్రయత్న మనగా వెనుక చెప్పిన విషయదోషముల వివేకమే కదా? కాని ఆ వివేకమును మాటిమాటికి చేసినను ప్రబలములైన ఇంద్రియముల ప్రవృత్తిచేత అది తిరస్కరించ బడుచునే ఉండును. ఈ విషయమును భగవంతుడు చెప్పినాడు.

"అర్జునా! పండితుడైన పురుషుడు ఎంత ప్రయత్నము చేసినను కలతపెట్టే ఇంద్రియములు మనస్సును బలాత్కారముగా హరించుచునే ఉండును."

"ఇంద్రియములు సంచరించుచుండగా వాటి వెనుకనే పోవుచుండు మనస్సు వీని బుద్ధిని, గాలి నీటిలో నావను లాగివేసినట్లు లాగివేయును.

మూ. ఏవం తర్హ్యుత్పన్నవివేకరక్షార్థమ్ ఇన్ద్రియాణి నిరోద్ధ వ్యాని. తదపి తత్రైవోత్తర శ్లోకాభ్యాం దర్శితమ్–

"తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"
(భ. గీ. **2.61**)

"తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"
(భ. గీ. 2.68)

వ్యా. (సమాధానము) అట్లయితే పుట్టిన వివేకమును రక్షించు కొనుటకు ఇంద్రియములను నిగ్రహించుకొనవలెను ఆ విషయము కూడ అక్కడనే రెండు శ్లోకములలో చెప్పబడినది-

"ఆ ఇంద్రియములను అన్నింటిని నిగ్రహించుకొని నాయందే మనస్సు నిలిపి నాయందే అత్యంతాసక్తి కలవాడై ఉండవలెను. ఎవనికి ఇంద్రియములు వశములై ఉండునో అతని బుద్ధి స్థిరముగా ఉండును."

"ఓ ! మహాబాహో అందువలన ఎవడు తన ఇంద్రియములను అన్ని ఇంద్రియార్థములనుండి ఉపసంహరించు కొనునో అతని బుద్ధి స్థిరముగా ఉండును."

మూ. స్మృత్యన్తరేఽపి—
"న పాణిపాదచపలో న నేత్రచపలో యతిః
న చ వాక్చపలశ్చైవమితి శిష్టస్య లక్షణమ్." ఇతి.

వ్యా. మరియొక్క స్మృతిలో కూడ చెప్పబడినది.

"యతికి హస్తచాపల్యము ఈ పనీ ఆపనీ చేసే అసక్తి) పాద చాపల్యము (ఇక్కడికి అక్కడికి వెళ్ళు అలవాటు) నేత్ర చాపల్యము, వాక్చాపల్యము ( అనవసరముగా వాగుట ) ఉండకూడదు. ఇదే శిష్టుని లక్షణము."

మూ ఏతదేవాన్యత్ర సంగ్రహావివరణాభ్యాం స్పష్టీకృతమ్—
"అజిహ్వః షణ్ఢకః పఙ్గురన్ధో బధిర ఏవ చ
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతైర్న సంశయః"

వ్యా. ఈ విషయమే మరొక గ్రంథమునందు సంగ్రహముగాను, వివరణపూర్వకముగాను స్పష్టీకరింపబడినది—

"నాలుక లేనివాడు నపుంసకుడు, కుంటివాడు, గ్రుడ్డివాడు, చెవిటి వాడు, తెలివితక్కువవాడు(మూఢుడు) అయిన సంన్యాసి ఈ ఆరు గుణముల చేత ముక్తిపొందును; సందేహము లేదు."

మూ. "ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతే
హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే."

వ్యా. ఎవడు భుజించుచున్నప్పుడు ఇది నాకు ఇష్టము ఇది కాదు అని ఆసక్తి చూపడో, హితము, సత్యము అయిన మాటను మితముగా పలుకునో అతడు నాలుకలేనివా డని చెప్పుదురు.

మూ. "అద్యజాతాం యథా నారీం తథా షోడశవార్షికీమ్
శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారః స షణ్ఢకః."

వ్యా. ఇప్పుడే పుట్టిన ఆడపిల్లను చూచినప్పుడు వలెనే పదహారు సంవత్సరముల స్త్రీని చూచినప్పుడు నూరు సంవత్సరముల వయస్సు గల స్త్రీని చూచినప్పుడు ఎవడు వికారము చెందడో అతడు నపుంసకుడు.

మూ. "భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయచ
యోజనాన్న పరం యాతి సర్వథా పఙ్గురేవ సః."

వ్యా. ఎవడు భిక్షకొరకు, మలమూత్రవిసర్జనకొరకు మాత్రమే బైటకు వెళునో, ఎవడు యోజనము పరిధి దాటి వెళ్ళడో అతడు కుంటివాడే.

మూ. "తిష్ఠతో జాగ్రతో వాపి యస్య చక్షుర్న దూరగమ్
చతుర్యుగాం భువం త్యక్త్వా పరివ్రాట్ సోఽన్ధ ఉచ్యతే."

వ్యా. నిలచి ఉన్నా, నడచుచున్నా ఎవని దృష్టి నాలుగు యుగము (బండికాడి)ల దూరము (ఎనిమిది గజముల దూరము) దాటి ప్రసరించదో అట్టి సంన్యాసి గ్రుడ్డివా డని చెప్పబడును.

మూ. "హితం మితం మనో రమ్యం వచః శోకాపహం చ యత్
శ్రుత్వా యో న శృణోతీవ బధిరః స ప్రకీర్తితః."

వ్యా. హితము, మితము, మనోహరము, దుఃఖమును తొలగించునది అయిన మాట విన్నను విననట్లు ఉండువాడు చెవిటివాడు.

మూ "సంనిధౌ విషయాణాం చ సమర్థోఽవికలేన్ద్రియః
సుప్తవద్వర్తతే నిత్యం భిక్షుర్ముగ్ధః స ఉచ్యతే."

వ్యా. బాగా పని చేయుచున్న ఇంద్రియములు కలిగి ఉండి, విషయములను అనుభవించే సామర్థ్యముండి కూడా ఎవడు విషయముల సమీపమునందు ఎల్లప్పుడు నిద్రించుచున్నట్లు ఉండునో ఆ సంన్యాసి మూఢుడని చెప్పబడును.

మూ. "న నిన్దాం న స్తుతిం కుర్యాన్న కంచిన్మర్మణి స్పృశేత్
నాతివాదీ భవేత్తద్వత్ సర్వత్రైవ సమో భవేత్."

వ్యా. ఉత్తముడైన సంన్యాసి ఇతరుల నింద కాని, స్తుతి కాని చెయ్యడు లేదా చేయకూడదు. ఎవరి మనస్సూ నొప్పించడు. అతిగా మాటలాడడు, అందరి విషయమున సమముగా ప్రవర్తించును.

మూ. "న సంభాషేత్ స్త్రియం కాంచిత్ పూర్వదృష్టాం న చ స్మరేత్
కథాం చ వర్జయేత్తస్యా న పశ్యేల్లిఖితామపి."

వ్యా. ఏ స్త్రీతోను మాటలాడ కూడదు. పూర్వము చూచిన స్త్రీని స్మరించకూడదు ఆమెను గూర్చిన మాటలు కూడ చెప్పకూడదు. చిత్రించిన స్త్రీని కూడ చూడకూడదు.

మూ. యథా కశ్చిద్వ్రతీ నక్తైకభక్తోపవాసమౌనాదివ్రతం సంకల్ప్య సావధానో భ్రంశమకృత్వా సమ్యక్పాలయతి, తథైవాజిహ్వత్వాదివ్రతీ స్థితః సావధానో వివేకం పాలయేత్. తదేవం వివేకేన్ద్రియ

నిరోధాభ్యాం దీర్ఘకాలనైరన్తర్యసత్కారాసేవితాభ్యాం మైత్ర్యాదిభావనాసు ప్రతిష్ఠితాసు అసురసంపద్రూపా మలినవాసనాః క్షీయన్తే. తతో నిఃశ్వాసోచ్ఛ్వాసవత్ నిమేషోన్మేషవచ్చ పురుషప్రయత్నమన్తరేణ ప్రవర్తమానాభిః మైత్ర్యాది వాసనాభిః లోకే వ్యవహరన్నపి తదీయసాకల్యవైకల్యానుసంధానం చిత్తే పరిత్యజ్య నిద్రాతన్ద్రీమనోరాజ్యాదిరూపాః సమస్తచేష్టాః ప్రయత్నేన శాన్తాః కృత్వా చిన్మాత్రవాసనామభ్యస్యేత్.

వ్యా. ఏదైన ఒక వ్రతమును పాటించు వ్యక్తి రాత్రియందే ఒక పర్యాయము భోజనము చేయుట, ఉపవాసము, మౌనము మొదలైన వ్రతమును చేసెదనని సంకల్పించి, ఆ విషయమున జాగర్త వహించి ఆ వ్రతమునకు భంగము రాకుండ ఎట్లు బాగుగా పాలించునో అట్లే అజిహ్వత్వాదివ్రతమును అవలంబించి, జాగరూకతతో వివేకమును పాలించుకొనవలెను. ఈ విధముగ శ్రద్ధతో, నిరంతరము, చాలకాలము వివేకమును, ఇంద్రియనిరోధమును సేవించగా మైత్ర్యాది భావనలు స్థిరముగ నిలచును; ఆసురసంపద్రూపములైన మలినవాసనలు క్షీణించును. పిమ్మట తన ప్రయత్న మేమీ లేకుండగనే ఉచ్ఛ్వాసనిఃశ్వాసములవలె, రెప్పపాటు వలె మైత్ర్యాదివాసనలు ప్రవర్తించుచుండగా లోకములో వ్యవహరించుచున్నను మనస్సులో ఆ లోకములోని మంచి చెడుగులను గూర్చి ఆలోచించక, నిద్ర, సోమరితనము, మనోరాజ్యము (గాలిలో మేడలు కట్టుట) మొదలైన సమస్తచేష్టలను ప్రయత్నపూర్వకముగా శాంతింప చేసికొని చిన్మాత్రవాసనను (చిద్రూపమైన ఆత్మను గూర్చిన వాసనను) అభ్యసించవలెను.

మూ. స్వతస్తావదిదం జగచ్చిజ్జడోభయాత్మకం భాసతే. యద్యపి శబ్దస్పర్శాదిజడవస్తుభాసనాయైవ ఇన్ద్రియాణి సృష్టాని, "పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూః" (కఠ.ఉ. 2.1.1) ఇతి శ్రుతేః. తథాపి చైతన్యస్యోపాదానతయా వర్జయితుమశక్యత్వాత్ చైతన్యపూర్వకమేవ జడం జగత్ భాసతే; "తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వ

మిదం విభాతి"(కఠ.ఉ. **2.2.15**) ఇతి శ్రుతేః. తథా సతి పశ్చాద్భాసమానస్య జగస్య ప్రథమతో భాసమానమేవ చైతన్యంవాస్తవం రూపమితి నిశ్చిత్య జడముపేక్ష్య చిన్మాత్రం చిత్తే వాసయేత్.

వ్యా. స్వభావముచేత ఈ జగత్తు చిజ్జడోభయాత్మకముగా భాసించుచున్నది అనగా జగత్తు చిత్స్వరూపులైన జీవులు, జడములైన పృథివ్యాదులు ఈ రెండు రూపములలోను భాసించుచున్నది. "బ్రహ్మదేవుడు ఇంద్రియములు పరాఙ్ముఖములుగా అనగా బాహ్యవస్తువులను మాత్రమే కనుగొనే వాటినిగా, సృష్టించెను" అని శ్రుతి చెప్పినట్లు ఇంద్రియము శబ్దస్పర్శాది బాహ్యవిషయములను మాత్రమే గ్రహించుటకు సృష్టింపబడినను, ఈ బాహ్యవిషయములకు కూడా ఉపాదానకారణమైన చైతన్యమును విడచుట శక్యము కాదు గాన ఈ జగత్తు చైతన్యపూర్వకముగానే భాసించుచున్నది, అనగా చైతన్యము ద్వారానే భాసించుచున్నది. అందుచేతనే-"ఆ ఆత్మ ప్రకాశించుచుండగా దానిని అనుసరించియే మిగిలిన దంతా భాసించుచున్నది; ఇదంతా ఆ ఆత్మభాస [ప్రకాశము]ను అనుసరించి భాసించుచున్నది" అని శ్రుతి చెప్పుచున్నది. అందువలన తరవాత భాసించే జగత్తుయొక్క వాస్తవమైనరూపము ముందు భాసించు చైతన్యమే అని నిశ్చయించుకొని, జడమును ఉపేక్షించి, అనగా జడమును జడముగా చూడక, చిత్తమునందు చిన్మాత్ర వాసనయే ఏర్పరచుకొనవలెను

మూ. ఏతచ్చ బలిశుక్రయోః ప్రశ్నోత్తరాభ్యాం విస్పష్టమవగమ్యతే-

"కిమిహాస్తీహ కిం మాత్రమిదం కిమయమేవ చ
కస్త్వం కోఽహం క ఏతే వా లోకా ఇతి వదాశు మే."

(ల.వా. **21.50**)

"చిదిహాస్తీహ చిన్మాత్రమిదం చిన్మయమేవ చ
చిత్త్వం చిదహమేతే చ లోకాశ్చిదితి సంగ్రహః."

(ల.వా. **21.52**) ఇతి.

వ్యా. ఈ విషయము బలిశుక్రాచార్యుల ప్రశ్నోత్తరములనుండి స్పష్టముగా తెలియుచున్నది-"ఇక్కడ ఏమి ఉన్నది? ఇది ఎంతటిది? ఇది ఏమి? అది ఏమి? నీవు ఎవరవు? నేను ఎవరిని? ఈ లోకములు ఏమి? నాకు శీఘ్రముగా చెప్పుము''.

"ఇక్కడ ఉన్నది చిత్; ఇది చిత్ మాత్రము; ఇది చిత్స్వరూపము; నీవు చిత్స్వరూపుడవు. నేను చిత్స్వరూపుడను; ఈ లోకములు కూడ చిత్స్వరూపములే, సంగ్రహముగా ఇదే తత్త్వము."

మూ. యథా సువర్ణకామః కటకం క్రీణన్నపి వలయాకారస్య గుణదోషావుపేక్ష్య గురుత్వవర్ణయోరేవ మనః ప్రణిధిత్సతి,తథా చిన్మాత్రే మనః ప్రణిధాతవ్యమ్. యావతా కాలేన జడం సర్వాద్వైవో పేక్ష్య చిన్మాత్రే మనసః ప్రవృత్తిః నిఃశ్వాసాదివత్స్వాభావికీ సంపద్యతే తావన్తం కాలం చిన్మాత్రవాసనాయాం ప్రయతేత. నన్వాదావేవ చిన్మాత్ర వాసనాస్తు,తయైవ మలినవాసనానివృత్తేః;కిమనేనాన్తర్గడునా మైత్ర్యాద్య భ్యాసేనేతి చేన్న, చిద్వాసనాయా అప్రతిష్ఠితత్వప్రసఙ్గాత్. యథా కుట్టిమ దార్ఢ్యవ్యతిరేకేణ క్రియమాణమపి స్తమ్భకుడ్యాత్మకం గృహం న ప్రతి తిష్ఠతి, యథా వా విరేచనేన ప్రబలదోషమనిఃస్సార్య సేవితమప్యౌషధం నారోగ్యకరం తద్వత్.

వ్యా. బంగారము కావలెనను కొనువాడు బంగారు కంకణమును కొనుచున్నను ఆతని దృష్టి ఆ కంకణమునకున్న గుండ్రని ఆకారము బాగున్నదా లేదా అను విషయముమీద కాక దాని బరువెంత, బంగారము ఎట్టిది అను విషయముమీదనే ఉండును. అట్లే మనస్సును చిన్మాత్రమునందే నిలుపవలెను. జడమును అన్ని విధాలా ఉపేక్షించి మనస్సు చిన్మాత్రము నందే ప్రవర్తించుట, ఉచ్ఛ్వాసనిఃశ్వాసలవలె స్వాభావికముగ ఏర్పడు వరకు చిన్మాత్రవాసనయందే ప్రవర్తించవలెను. [ఆశంక] చిన్మాత్ర వాసనచేతనే మలినవాసనలు తొలగిపోవును గాన మొదటినుండి ఆ చిన్మాత్ర వాసనాభ్యాసమే చేయవచ్చును కదా? మధ్య మైత్ర్యాద్యభ్యాసమనే ఈ

అడ్డు ఎందకు? [సమాధానము] అట్లు కాదు; మైత్ర్యాద్యభ్యానము లేనిచో చిద్వాసన స్థిరముగా నిలవదు. ముందు నెలను గట్టిగా ఉండునట్లు చేసి కొనకుండగా దానిమీద స్తంభకుడ్యాదిరూపమైన (స్తంభములు, గోడలు మొదలైనవే రూపముగా గల) ఇల్లు ఎట్లు నిలబడదో, లోపల నున్న ప్రబల మైన దోషమును విరేచనము ద్వారా తొలగించకుండగా ఔషధమును సేవించినను అది ఆరోగ్యమును ఎట్లు కలిగించజాలదో ఇది కూడ అట్లే.

మూ. నను "తామప్యథ పరిత్యజేత్" ఇతి చిన్మాత్రవాసనాయా అపి పరిత్యాగోఽవగమ్యతే. తదప్యయుక్తమ్. చిన్మాత్రం పరిత్యజ్య అన్యస్య కస్యచిదుపాదేయస్య అభావాత్. నాయం దోషః. ద్వివిధా చిన్మాత్రవాసనా-మనోబుద్ధి సమన్వితా, తద్రహితా, చేతి. కరణం మనః. కర్తృత్వోపాధిర్బుద్ధిః. తథా చ సత్యప్రమత్తోఽహమేకాగ్రేణ మనసా చిన్మాత్రం భావయిష్యామీత్యేతాదృశేన కర్తృకరణానుసంధానేన సమ న్వితా ప్రాథమికీ యా చిన్మాత్రవాసనా ధ్యానశబ్దాభిధేయా తాం పరిత్య జేత్. యా త్వభ్యాసపాటవేన కర్తృత్వాద్యనుసంధానవ్యవధానరహితా సమాధిశబ్దాభిధేయా తాముపాదదీత. ధ్యానసమాధ్యోస్తు లక్షణం పతఞ్జలిః సూత్రయామాస-"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్."(3.2.) "తదేకార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః"(3.3) ఇతి. తాదృశే సమాధౌ దీర్ఘకాలనైరన్తర్యసత్కారైః సేవితే స్థైర్యం లబ్ధ్వా పశ్చాత్ కర్తృకరణానుసంధానపరిత్యాగార్థో యః ప్రయత్నస్తమపి పరిత్యజేత్.

వ్యా. [ఆశంక] "తరువాత దానిని కూడా పరిత్యజించవలెను" అని చిన్మాత్రవాసనను కూడ పరిత్యజించవలె నని తెలియుచున్నది. అట్లు చెప్పుట కూడ యుక్తము కాదు. ఎందుచేత ననగా చిన్మాత్రవాసనను కూడా పరిత్యజించినచో పరిగ్రహింపదగినది మరొక టేదీ లేదు కదా? [సమా ధానము] ఈ దోషము లేదు. మనోబుద్ధులతో కూడినది, అవి లేనిది అని

చిన్మాత్రవాసన రెండు విధములు. మనస్సు కరణము (సాధనము). కర్తృత్వమునకు ఉపాధి (నేను కర్తను అను భ్రాంతిని కలిగించునది) బుద్ధి. "నేను అప్రమత్తుడనై ఏకాగ్రమైన మనస్సుతో చిత్స్వరూపమును మాత్రమే భావించెదను" అను నిశ్చయముతో చేసే చిన్మాత్రభావనలో కర్తృకరణముల అనుసంధానము కూడ ఉండును. ఇది చిన్మాత్రభావనకు మొదటి దశ. దీనికే ధ్యాన మని కూడ పేరు. దానిని పరిత్యజించవలెను అభ్యాసము చేయగా చేయగా కర్తృత్వాదుల అనుసంధానము అనే వ్యవధానము లేని, సమాధి అనే నామాంతరము గల యే చిన్మాత్రభావన (ఇది రెండవది) ఉన్నదో దానిని స్వీకరించవలెను. ధ్యానసమాధుల లక్షణములను పతంజలి—"చిత్తవృత్తి ఏకాగ్రముగా ఉండుట ధ్యానము", "ఏ ధ్యానమునందు ధ్యేయమైన విషయము మాత్రమే భాసించునో, చిత్తవృత్తియే లేనట్లు ఉండునో అది సమాధి" అని సూత్రములలో చెప్పినాడు. శ్రద్ధతో, నిరంతరము చాల కాలము అట్టి సమాధిని సేవించి, దానిపై స్థిరత్వము ఏర్పడిన పిమ్మట కర్తృకరణముల అనుసంధానమును త్యజించుటకు చేసిన ప్రయత్నమును కూడ త్యజించవలెను.

మూ. నన్వేవం సతి తత్త్యాగప్రయత్నోఽపి పరిత్యాజ్య ఇత్యనవస్థా స్యాత్. నైవమ్; కతకరజోన్యాయేన స్వపరనివర్తకత్వాత్. యథా కలుషితే జలే ప్రక్షిప్తం కతకరజః ఇతరరజసా సహ స్వాత్మానమపి నివర్తయతి తథా త్యాగార్థః ప్రయత్నః కర్తృకరణానుసంధానం నివర్తయన్ స్వాత్మానమపి నివర్తయిష్యతి. నివృత్తే చ తస్మిన్ మలినవాసనావత్ శుద్ధవాసనానామపి క్షీణత్వాన్నిర్వాసనం మనోఽవతిష్ఠతే. ఏతదేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ:—

వ్యా. ( ఆశంక ) కర్తృకరణానుసంధానపరిత్యాగమునకు చేయు ప్రయత్నమును పరిత్యజించినట్లు, ఈ పరిత్యాగమునకు చేయు ప్రయత్నమును పరిత్యజించవలెను, ఇత్యాది విధముగ ఈ పరిత్యాగాలకు ఒక అవస్థ (ఒకచోట నిలుపుదల) ఉండదు కదా ? (సమాధానము) అట్లు కాదు. పైన

చెప్పిన ప్రయత్నపరిత్యాగము ఇండుపకాయ పరాగము వలె తనను, ఇతరమును కూడ తొలగించును. కలుషముగా నున్న జలములో ఇండుపకాయ పరాగమును కలిపినప్పుడు అది ఇతర రజస్సుతో పాటు తనను కూడ ఎట్లు తొలగింప చేయునో అట్లే త్యాగముకొరకు చేయు ప్రయత్నము కర్తృకరణానుసంధానమును తొలగించుచు తనను కూడ నివర్తింప చేయును. అది నివర్తించగానే మలినవాసనల వలె శుద్ధ వాసనలు కూడ క్షీణ మగును గాన మనస్సు వాసనా రహితమై ఉండిపోవును. ఈ విషయమునే వసిష్ఠుడు ఇట్లు చెప్పి ఉన్నాడు :-

మూ. "తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః
రామ నిర్వాసనీభావమాహరాశు వివేకతః,
సమ్యగాలోచనాత్సత్యా ద్వాసనా ప్రవిలీయతే
వాసనావిలయే చేతః శామ్యత్యస్నేహదీపవత్."

(ల.వా. 16.45,46) ఇతి.

వ్యా. 'రామా ! అందువలన వాసనలతో కూడిన మనస్సు బద్ధము. వాసనలు లేనిది ముక్తము. వివేకముచేత శీఘ్రముగా వాసనారాహిత్యమును సంపాదించుకొనుము. సత్యమైన సరియైన జ్ఞానమువలన వాసనలు అణగిపోవును. వాసనలు అణగిపోగానే చిత్తము తైలము లేని దీపము వలె శమించును."

మూ. "యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే."

(ల.వా. 5.62) ఇతి చ.

వ్యా. "ఎవడు గాఢ నిద్రలో మెలుకువగా ఉండునో (మెలకువతో ఉన్నట్లు కనబడినను బాహ్యప్రపంచమునందు దృష్టి లేనివాడై ఉండునో) ఎవనికి జాగ్రదవస్థ అనేది లేదో, ఎవని జ్ఞానము వాసనాశూన్యమో అతడు జీవన్ముక్తుడని చెప్పబడును."

మూ. "సుషుప్తవత్ ప్రశమితభావవృత్తినా
స్థితం సదా జాగ్రతి యస్య చేతసా,
కలాన్వితో విధురివ యః సదా బుధై
ర్నిషేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః." ఇతి చ.

వ్యా. "ఎవని చిత్తము జాగ్రదవస్థలో కూడ సుషుప్తియందు వలె సకలభావములు, వృత్తులు శమించి ఉండునో, ఎవనిని కళలతో నిండిన చంద్రుని వలె పండితులు సేవించుచుందురో ఆతడే ముక్తుడని చెప్పబడును."

మూ. "హృదయాత్సంపరిత్యజ్య సర్వమేవ మహామతిః
యస్తిష్ఠతి గతవ్యగ్రః స ముక్తః పరమేశ్వరః."

వ్యా. "హృదయమునుండి అన్ని భావములను తొలగించుకొని ఏ మహాబుద్ధిమంతుడు ఎట్టి వ్యథలు (మనోవ్యాకులత్వము) లేనివాడై ఉండునో ఆతడే ముక్తుడు; ఆతడే పరమేశ్వరుడు."

మూ. "సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా
హృదయేనాస్తసర్వాశో ముక్త ఏవోత్తమాశయః."

వ్యా "హృదయమునుండి సమస్తమైన ఆశలను పారద్రోలిన ఉత్తమాశయవంతుడు సమాధిని అవలంబించినను అవలంబించక పోయినను ముక్తుడే "

మూ. "నైష్కర్మ్యేణ న తస్యార్థస్తస్యార్థోఽస్తి న కర్మభిః
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః."

వ్యా. "ఎవని మనస్సు వాసనాశూన్యమో ఆతనికి కర్మత్యాగము-చేత ప్రయోజనము లేదు, కర్మలచేత ప్రయోజనము లేదు. సమాధానము-చేత గాని, జపముచేత గాని ప్రయోజనము లేదు "

మూ. "విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః
సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్."

వ్యా "పరస్పరము బోధించుకొనుచు శాస్త్రమును విచారణ చేసి ప్రయోజన మేమీ లేదు. వాసనలను పరిత్యజించి మౌనముగా ఉండుటకంటె ఉత్తమ మైన పదము లేదు"

మూ. న చ నిర్వాసనమనస్కస్య జీవనహేతుర్వ్యవహారో లుప్యేతేతి శఙ్కనీయమ్. కిం చక్షురాదివ్యవహారలోపః కిం వా మానస వ్యవహారస్య? తత్రాద్యముద్దాలకో నిరాచష్టే:—

"వాసనాహీనమప్యేతచ్చక్షురాదీన్ద్రియం స్వతః
ప్రవర్తతే బహిః స్వార్థే వాసనా నాత్ర కారణమ్" ఇతి.

వ్యా. మనస్సులో వాసన లన్నీ నశించినవానికి జీవనమునకు హేతు వైన వ్యవహారము జరగదు కదా అని ఆశంకించరాదు. జరగనిది చక్షురాదీం ద్రియముల వ్యవహారమా లేక మానసవ్యవహారమా? మొదటిది జరుగుచునే ఉండు నని ఉద్దాలకుడు చెప్పినాడు.-

"ఈ చక్షురాదీంద్రియములు, వాసనలు లేకపోయినను, స్వభావముచే బైటకు ప్రవర్తించుచునే ఉండును. అవి ప్రవర్తించుటకు కారణము వాసన కాదు."

మూ. ద్వితీయం వసిష్ఠో నిరాచష్టే—

"అయత్నోపనతేష్వక్షిదృగ్ద్రవ్యేషు యథా పునః
నీరాగమేవ పతతి తద్వత్ కార్యేషు ధీరధీః." ఇతి

వ్యా. మానసవ్యహారము కూడ జరుగుచునే ఉండు నని వశిష్ఠుడు చెప్పెను-

"అప్రయత్నముగా వచ్చిన దిక్కులమీదను, ద్రవ్యములమీదను నేత్రము ఏవిధమైన ఆసక్తి లేకుండగనే ఎట్లు ప్రసరించునో, జ్ఞాని మనస్సు కూడ కార్యములయందు అట్లే ప్రవర్తించును."

మూ. తాదృశ్యా ధియా ప్రారబ్ధభోగం స ఏవోపపాదయతి—

"పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతి తుష్టయే
విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి న చోరతామ్,
అశఙ్కితోపసంప్రాప్తా గ్రామయాత్రా యథాధ్వగైః
ప్రేక్ష్యతే తద్వదేవ జ్ఞైర్భోగశ్రీరవలోక్యతే."

(ల.వా. 15.14,15) ఇతి

వ్యా. వాసనారహితమైన మనస్సుతో ప్రారబ్ధ భోగము ఎట్లు జరుగునో వసిష్ఠుడే ఉపపాదించుచున్నాడు –

"జ్ఞానమును పొందిన పిమ్మట లేదా విషయముల యదార్థతత్త్వమును తెలిసికొనిన పిమ్మట, అనుభవింపబడిన భోగము సంతృప్తిని కలిగించును. దొంగ అని తెలిసి ఆతనితో కలిసి మెలిసి ఉన్నచో ఆతడు స్నేహితుడగును కాని చోరుడు కాడు."

"మార్గములో నడచి వెళ్ళిపోవుచున్న బాటసారులు, అనుకొనకుండా ఎదురువచ్చిన గ్రామయాత్రను (గ్రామస్థులు చేయు ఉత్సవమును) ఎట్లు చూచి ఆనందింతురో జ్ఞానవంతులు భోగముల సౌందర్యమును కూడ అట్లే చూచుచుందురు "

మూ. భోగకాలేఽపి సవాసనేభ్యో నిర్వాసనానాం విశేషమాహ:—

"నాపరిగ్లానిమాయాన్తి హేమపద్మం యథా నిశి
నేహన్తే ప్రకృతాదన్యద్రమన్తే శిష్టవర్త్మని.

(ల.వా. 18.42)

వ్యా. భోగము లనుభవించు నప్పుడు కూడ వాసన లున్న-వారికంటె వాసనారహితులలో విశేషమును చెప్పుచున్నాడు-

"బంగారుపద్మము రాత్రియందు కూడ ఎట్లు వాడదో అట్లే ఆపదల యందు వ్యథ చెందరు. తాత్కాలికముగ లభించిన దానికంటె వేరుగా మరి దేనినీ కోరరు. శిష్టుల మార్గమునందు ఆనందించుచుందురు."

మూ. నిత్యమాపూర్ణతామన్తరక్షబ్ధామిన్దుసున్దరీమ్
ఆపద్యపి న ముఞ్చన్తి శశినః శీతతామివ."

వ్యా. "చంద్రులు చల్లదనమును విడువనట్లు వారు ఆపత్సమయమునందు కూడ ఎన్నడు, ఏ మాత్రము క్షోభ లేని, చంద్రుని వలె సుందర మైన పరిపూర్ణాంతఃకరణత్వమును (పరిపూర్ణమైన అంతఃకరణము కలిగి ఉండుటను) విడువరు."

మూ. అబ్ధివద్ధృతమర్యాదా భవన్తి వితతాశయాః
నియతిం న విముఞ్చన్తి మహాన్తో భాస్కరా ఇవ.

వ్యా. మహాపురుషులు సముద్రము వలె మర్యాదను కాపాడుదురు (సముద్రము తీరమును దాటి రాక కట్టు బాట్లను రక్షించునట్లు కట్టుబాట్లను రక్షించుదురు ) విశాలహృదయులై ఉందురు సూర్యులు వలె నియమమును విడువరు.

మూ. జనకస్యాపి సమాధివ్యుత్థితస్యేదృశమేవాచరణం పఠ్యతే—
"తూష్ణీమథ చిరం స్థిత్వా జనకో జనజీవితమ్
వ్యుత్థితశ్చిన్తయామాస మనసా శమశాలినా,
కిముపాదేయమస్తీహ యత్నాత్సంసాధయామి కిమ్,
స్వతఃస్థితస్య శుద్ధస్య చితః కా మేఽస్తి కల్పనా,
నాభివాఞ్ఛామ్యసంప్రాప్తం సంప్రాప్తం న త్యజామ్యహమ్,
స్వస్థ ఆత్మని తిష్ఠామి యన్మమాస్తి తదస్తు మే,
ఇతి సంచిన్త్య జనకో యథాప్రాప్తక్రియామసౌ,
అసక్తః కర్తుముత్తస్థౌ దినం దినపతిర్యథా,
భవిష్యన్నానుసన్ధత్తే నాతీతం చిన్తయత్యసౌ
వర్తమాననిమేషం తు హసన్నేవానువర్తతే"
(ల. వా. 19.60-64) ఇతి.

తదేవం యథోక్తేన వాసనాక్షయేణ యథోక్తా జీవన్ముక్తిర్భవిష్యతీతి సుస్థమ్.

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకేవాసనాక్షయని రూపణం నామ ద్వితీయం ప్రకరణమ్

వ్యా. సమాధిస్థితినుండి బైటకు వచ్చిన జనకుడు ఈ విధముగానే ప్రవర్తించినట్లు చెప్పబడుచున్నది-

వ్యా. పిమ్మట జనకుడు చాల సేపు మౌనముగా ఉండి, బహిర్ముఖుడై, శముముతో కూడిన మనస్సుతో జనుల జీవితమును గూర్చి ఆలోచించెను " ఇక్కడ నేను స్వీకరించవలసినది ఏది ? నేను ప్రయత్నపూర్వకముగ ఏమి సాధింతును ? స్వభావముచేత స్థిరుడను, పరిశుద్ధుడను, చిద్రూపుడను అయిన నాకు కల్పన లేవి ఉన్నవి ? నేను లభించనిదానిని కోరను; లభించినదానిని విడువను. స్వస్థుడనై నాలో నేను ఉందును. నాకు ఏది ఉన్నదో అదే ఉండుగాక " జనకుడు ఈ విధముగ ఆలోచించి సూర్యుడు పగటిని చేయుటకు లేచి నట్లు, ఆ సమయమునకు చేయవలసిన పనిని, సంగరహితుడై చేయుటకు లేచెను. ఈ జనకుడు భవిష్యత్తును గూర్చి ఆలోచించడు, గడిచిపోయినదానిని గూర్చి చింతించడు. జరుగుతున్న క్షణమును నవ్వుచు అనుసరించును.

ఈ విధముగ పైన వర్ణించి చెప్పిన వాసనాక్షయముచేత పూర్వము చెప్పిన జీవన్ముక్తి లభించును అను విషయము బాగుగా నిర్ధారణ చేయబడినది.

శ్రీమద్విద్యారణ్యులు రచించిన జీవన్ముక్తి వివేకమునకు "బాలానందిని" అను ఆంధ్రవ్యాఖ్యానములో వాసనాక్షయనిరూపణ మను రెండవ ప్రకరణము సమాప్తము.

## అథ తృతీయం మనోనాశప్రకరణమ్

మూ. అథ జీవన్ముక్తిసాధనం మనోనాశం నిరూపయామః. యద్యప్యశేషవాసనాక్షయే సతి, అర్థాన్మనో నశ్యత్యేవ తథాపి స్వాతన్త్ర్యేణ మనోనాశే సమ్యగభ్యస్తే సతి వాసనాక్షయో రక్షితో భవతి. న చాజిహ్వాత్వషణ్ఢత్వాద్యభ్యాసేనైవ తద్రక్షా సిద్ధేతి వాచ్యమ్. నష్టే మనస్యజిహ్వాత్వాదీనామర్థసిద్ధత్వేనాభ్యాసాభావాత్. నను మనోనాశాభావే సప్రయాసస్తత్రాప్యస్తీతి చేదస్తు నామ, తస్యావశ్యకత్వాత్. అన్తరేణ మనోనాశమభ్యస్తా అజిహ్వాత్వాదయో న స్థిరా భవన్తి.

వ్యా. ఇప్పుడు జీవన్ముక్తికి సాధనమైన మనోనాశమును నిరూపించెదము. వాసన లన్నీ నశించగానే మనస్సు నశించుట కూడ అర్థాత్సిద్ధమే అయినను, స్వతంత్రముగా మనోనాశమును బాగుగా అభ్యసించినచో వాసనాక్షయము రక్షిత మగును. అజిహ్వాత్వ-షణ్ఢత్వాదులను అభ్యసించుట చేతనే వాసనాక్షయరక్షణము సిద్ధించును కదా అని అనుటకు వీలు లేదు. ఎందుచేత ననగా మనస్సు నశించిన పిమ్మట అజిహ్వాత్వము మొదలైనవి వాటంతట అవే సిద్ధించును గాన అభ్యసించవలసిన పని లేదు. అప్పుడు కూడ మనోనాశాభ్యాసము ఉన్నది కదా అన్నచో–ఉండు గాక; అది ఆవశ్యకమే మనోనాశము లేకుండగా అజిహ్వాత్వాదులను అభ్యసించినను అవి స్థిరములుగా ఉండవు.

మూ. అత ఏవ మనసో నాశనీయత్వం జనక ఆహ :–

"సహస్రాఙ్కురశాఖాత్మఫలపల్లవశాలినః
అస్య సంసారవృక్షస్య మనోమూలమితి స్థితమ్
సంకల్పమేవ తన్మన్యే సంకల్పోపశమే న తత్
శోషయామి యథా శోషమేతి సంసారపాదపః
ప్రబుద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి దృష్టశ్చోరో మయాత్మనః
మనో నామేహ హన్మ్యేనం మనసాస్మి చిరం హతః"

(ల.వా. 19.53–54) ఇతి.

వ్యా. అందుచేతనే జనకుడు మనస్సును నశింప చేయవలె నని చెప్పెను–

"వెయ్యి అంకురములు, శాఖలు, ఫలములు, చిగుళ్లు–వీటితో నిండిన ఈ సంసారవృక్షమునకు మనస్సు మూల మని నిశ్చితము మనస్సనగా సంకల్పమే. సంకల్పము శాంతించినచో ఆ మనస్సు కూడ లేదు. అందుచేత ఈ సంసారవృక్షము ఎండిపోవు నట్లు ఈ మనస్సును ఎండింప చేసెదను. ఇంక మేల్కొన్నాను! మేల్కొన్నాను! మనస్సు అనే ఈ దొంగ కనబడినాడు. ఇంత కాలము నన్ను బాధించిన ఈ దొంగను చంపి వేసెదను."

మూ. వసిష్ఠోఽప్యాహ:–

"అస్య సంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః
ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః"
(ల. వా. 17.1)

వ్యా. వసిష్ఠుడు కూడ చెప్పినాడు:–

సమస్తమైన ఉపద్రవములను ఇచ్చుచున్న ఈ సంసార వృక్షమును ఛేదించుటకు తన మనస్సును నిగ్రహించుకొనుట అను ఒక్క ఉపాయము మాత్రమే ఉన్నది.

మూ. "మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః
జ్ఞమనో నాశమభ్యేతి మనోఽజ్ఞస్య హి శృఙ్ఖలా"
(ల. వా. 17.5)

వ్యా. మనస్సు అభివృద్ధిలో ఉండుట వీనికి వినాశము మనస్సు నశించుట వీనికి మహోదయము. జ్ఞానవంతుని మనస్సు నశించును. జ్ఞానము లేనివానికి మనస్సు సంకెళ్లు.

మూ. తావన్నిశీథవేతాలా వల్గన్తి హృది వాసనాః
ఏకతత్త్వదృఢాభ్యాసాద్యావన్న విజితం మనః
15–23)

వ్యా. ఒకే తత్త్వమును దృఢముగా అభ్యసించి మనస్సును జయించనంతవరకు హృదయములో అర్ధరాత్రి సంచరించే వేతాళుల వంటి వాసనలు సంచరించుచునే ఉండును.

మూ. "ప్రక్షీణచిత్తదర్పస్య నిగృహీతేన్ద్రియద్విషః
పద్మిన్య ఇవ హేమన్తే క్షీయన్తే భోగవాసనాః"
(ల. వా. 15.22)

వ్యా. మనస్సులోని దర్పము క్షీణించి, ఇంద్రియము లనే శత్రువులను నిగ్రహించినవాని భోగవాసనలు, హేమంతఋతువులో పద్మలతల వలె నశించును.

మూ. హస్తం హస్తేన సంపీడ్య దన్తైర్దన్తాన్ విచూర్ణ్య చ
అఙ్గాన్యఙ్గైః సమాక్రమ్య జయేదాదౌ స్వకం మనః.
(ల.వా. 15.18)

వ్యా. (ఎవరైన శత్రువు కనబడినప్పుడు చేసి నట్లు) హస్తమును హస్తముతో పీడించి, దంతములచేత దంతములను చూర్ణము చేసి (పండ్లు కొరుకుచు) అవయవములను అవయవములచేత ఆక్రమించి ముందుగా తన మనస్సును జయించవలెను.

మూ. "ఏతావతి ధరణీతలే సుభగాస్తే సాధుచేతసః పురుషాః
పురుషకథాసు చ గణ్యాః న జితా యే చేతసా స్వేన"
(ల.వా. 15.19)

వ్యా ఈ విశాల భూప్రదేశములో తమ మనస్సుచేత జయింపబడని, ఉత్తమ చిత్తవంతులైన పురుషులే భాగ్యవంతులు. పురుషులను గూర్చి మాటలాడుకొనే టప్పుడు పేర్కొనదగినవారు వారే.

మూ. "హృదయబిలే కృతకుణ్డల ఉల్బణకలనావిషో మనోభుజగః
యస్యోపశాన్తిమగమచ్చన్ద్రపదుదితం తమవ్యయం వన్దే"
(ల. వా. 15.20)

వ్యా. సంకల్ప మనే తీవ్రమైన విషము గల మనస్సు అనే సర్పము హృదయబిలములో చుట్టచుట్టుకొని ఉన్నది దానిని నశింప చేసికొన్న నాశరహితు డైన జ్ఞానికి క్రొత్తగా ఉదయించుచున్న చంద్రునకు నమస్కరించు చున్నట్లు నమస్కరించు చున్నాను.

మూ. చిత్తం నాభిః కిలాస్యేదం మాయాచక్రస్య సర్వతః
స్థీయతే చేత్తదాక్రమ్య తన్న కించిత్ ప్రబాధతే.
(ల.వా. 23.92) ఇతి.

వ్యా. ఈ మాయాచక్రమునకు చిత్తము ఇరుసు. దానిని నాల్గు మూలలనుండి గట్టిగా పట్టుకొని కదలకుండా చేసిన వానిని ఏదీ బాధించదు.

మూ. గౌడపాదాచార్యైరప్యుక్తమ్:—
"మనసో నిగ్రహాయత్తమభయం సర్వయోగినామ్
దుఃఖక్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాన్తిరేవ చ."
(మా.ఉ. 3.40) ఇతి.

వ్యా సమస్త యోగులయొక్క అభయము, దుఃఖనాశనము, జ్ఞానము, అక్షయమైన శాంతి ఇవన్నీ మనస్సును నిగ్రహించుకొనుట మీద ఆధార పడి ఉన్నవి.

మూ. యత్త్వర్జునేనోక్తమ్—
"చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్"
(భ.గీ. 6.34)

ఇతి తద్వచనం హఠయోగవిషయమ్. అత ఏవ వాల్మీకిరాహ:—

వ్యా. "కృష్ణా! మనస్సు చాలా కలవరపెట్టునది, చంచలము-అందు చేత వాయువును నిగ్రహించుట ఎంత కష్టమో దానిని నిగ్రహించుట అంత

కష్టము అని నేను తలచుచున్నాను" అని అర్జును డన్న మాటలు హఠయోగమునకు సంబంధించినవి. అందుచేతనే వాల్మీకి కూడ ఇట్లు చెప్పెను—

మూ. "ఉపవిశ్యోపవిశ్యైకచిత్తకేన ముహుర్ముహుః
న శక్యతే మనో జేతుం వినా యుక్తిమనిన్దితామ్,
అఙ్కుశేన వినా మత్తో యథా దుష్టమతఙ్గజః
విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః."
(ల.వా.28.26,27)

వ్యా. "మాటి మాటికి ఏకాగ్రచిత్తముతో కూర్చున్నంత మాత్రమున, నిర్దుష్టమైన యుక్తి లేకుండగా, మనస్సును జయించుటకు శక్యము కాదు,"

"మదించిన దుష్ట గజమును అంకుశము లేకుండ ఎట్లు జయించుటకు శక్యము కాదో అట్లే యుక్తి లేకుండా మనస్సు కయింప శక్యము కాదు."

మూ. "మనోవిలయహేతూనాం యుక్తీనాం సమ్యగీరణమ్
వసిష్ఠేన కృతం తావత్తన్నిష్ఠస్య వశే మనః."
(ల.వా. 28.28)

వ్యా. మనోనిలయమునకు హేతువులైన యుక్తులను వసిష్ఠుడు బాగుగా చెప్పినాడు. వాటిని అనుసరించువాడు మనస్సును వశములో ఉంచుకొనగలడు.

మూ. "హఠతో యుక్తితశ్చాపి ద్వివిధో నిగ్రహో మతః
నిగ్రహో ధీక్రియాక్షాణాం హఠో గోలకనిగ్రహాత్.
కదాచిజ్జాయతే కశ్చిన్మనస్తేన విలీయతే."
(ల. వా. 28.29)

వ్యా. మనోనిగ్రహము హఠముచేతను, యుక్తులచేతను రెండు విధముల జరుగును. జ్ఞానేంద్రియకర్మేంద్రియములను వాటి వాటి గోళములల

నిర్బంధించుటచే నిగ్రహము కలుగును. అప్పుడు ఒకప్పుడు హఠము కలిగి (బలాత్కారము జరిగి) మనస్సు విలీన మగును.

మూ. అధ్యాత్మవిద్యాధిగమః సాధుసంగమ ఏవ చ
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పన్దనిరోధనమ్
ఏతాస్తు యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల.
(ల.వా. 28.30,31)

వ్యా. అధ్యాత్మవిద్యను అభ్యసించుట, సత్పురుషసంగము, వాసనా పరిత్యాగము, ప్రాణవాయువును నిరోధించుట ఇవి చిత్తమును జయించుటకు తగిన ఉత్తమ మైన ఉపాయములు.

మూ. "సతీషు యుక్తిష్వేతాసు హఠాన్నియమయన్తి యే
చేతస్తే దీపముత్సృజ్య వినిఘ్నన్తి తమోఽఞ్జనైః."
(ల.వా 28.32)

వ్యా. ఈ ఉపాయములు ఉండగా ఎవరు చిత్తమును బలాత్కారము చేత నిగ్రహించుకొందురో వారు దీపమును సంపాదించుటకు బదులు చీకటిని కాటుక చల్లి తొలగించుటకై యత్నించుచున్నారు.

మూ. విమూఢాః కర్తుముద్యుక్తా యే హఠాచ్చేతసో జయమ్
తే నిబధ్నన్తి నాగేన్ద్రమున్మత్తం బిసతన్తుభిః.
(ల.వా. 28.33) ఇతి

వ్యా. చిత్తమును బలాత్కారముచేత జయింపప్రయత్నించు మూఢులు మదించిన ఏనుగును తామరతూడు దారములచేత కట్టగోరుచున్నారు.

మూ. నిగ్రహో ద్వివిధః—హఠనిగ్రహః క్రమనిగ్రహశ్చేతి. తత్ర చక్షుఃశ్రోత్రాదిజ్ఞానేన్ద్రియాణి, వాక్పాణ్యాదికర్మేన్ద్రియాణి చ తత్తద్గోలకోపరోధమాత్రేణ హఠాన్నిగృహ్యన్తే. తద్దృష్టాన్తేన మనోఽపి

తథా నిగ్రహీష్యామీతి మూఢస్య భ్రాన్తిర్భవతి. న తు తన్నిగ్రహీతుం శక్యతే,తద్గోలకస్య హృదయకమలస్య నిరోద్ధుమశక్యత్వాత్. అతః క్రమనిగ్రహ ఏవ యోగ్యః. క్రమనిగ్రహే చాధ్యాత్మవిద్యాప్రాప్త్యాదయ ఏవోపాయాః. సా చ విద్యా దృశ్యమిథ్యాత్వం దృగ్వస్తునః స్వప్రకాశత్వం చ బోధయతి. తథా చ సత్యేతన్మనః స్వగోచరేషు దృశ్యేషు ప్రయోజనాభావం ప్రయోజనవతి దృగ్వస్తున్యగోచరత్వం చ బుద్ధ్వా నిరిన్ధనాగ్నివత్స్వయమేవోపశామ్యతి. తథా చ శ్రూయతే—

"యథా నిరిన్ధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి."

(మై ఉ. 4.4.) ఇతి

యోనిః ఆత్మా.

**వ్యా.** హఠనిగ్రహము, క్రమనిగ్రహము అని నిగ్రహము రెండు విధములు. చక్షుఃశ్రోత్రాది జ్ఞానేంద్రియములను, వాక్పాణ్యాదికర్మేంద్రియములను వాటి వాటి గోళములను (స్థానములను) నిరోధించుట ద్వారా బలాత్కారముగా నిగ్రహించవచ్చును. అదే విధముగ మనస్సును కూడ నిగ్రహించెదను అని మూఢులు భ్రాంతి చెందుచుందురు. కాని దానిని నిరోధించుటకు శక్యము కాదు; ఎందుచేత ననగా దాని గోలకమైన హృదయ కమలమును నిరోధించుట శక్యము కాదు కదా? అందుచేత క్రమనిగ్రహమే మంచిది క్రమనిగ్రహమునకు అధ్యాత్మవిద్యాభ్యాసాదులే ఉపాయములు. దృశ్యము (కంటికికనబడేది) అంతా అసత్య మనీ, దృగ్వస్తువు (జ్ఞాన రూపమైన ఆత్మ) స్వప్రకాశము [తనంతట తానే ప్రకాశించును] అనీ ఆ విద్య బోధించును. దానితో తనకు కనబడే ఈ దృశ్యములను తెలిసికొని ప్రయోజన మేమీ లేదనీ, దేనిని తెలిసికొనిన ప్రయోజన ముండునో ఆ దృగ్వస్తువు [ఆత్మ] తనకు గోచరము కాదనీ తెలిసికొన్న మనస్సు కట్టె లేని అగ్ని వలె తనంతట తానే శాంతించును. ఈ విషయమే చెప్పబడినది—

"కట్టెలు లేని అగ్ని తన కారణమునందే శాంతించి నట్లు చిత్తము కూడ వృత్తులు క్షీణించుటచే తన కారణములో లీనమై పోవును."

యోని అనగా మనస్సునకు కారణ మైన ఆత్మ.

మూ. యస్తు బోధితమపి తత్త్వం న సమ్యగ్బుధ్యతే,యశ్చ విస్మరతి,తయోరుభయోః సాధుసంగమ ఏవోపాయః. సాధవో హి పునః పునర్బోధయన్తి స్మారయన్తి చ.యస్తు విద్యామదాదిదుర్వాసనయా పీడ్యమానో న సాధూననువర్తితుముత్సహతే తస్య పూర్వోక్తవివేకేన వాసనా పరిత్యాగ ఉపాయః. వాసనానాం ప్రాబల్యేన త్యక్తుమశక్యత్వే ప్రాణస్పన్దనిరోధనముపాయః. ప్రాణస్పన్దనవాసనయోశ్చిత్తప్రేరకత్వాత్తయోర్నిరోధే చిత్తశాన్తిరుపపద్యతే.

వ్యా. తత్త్వమును బోధించినను అర్థము కానివాడు, అర్థ మైనను మరచి పోవువాడు వారిద్దరికీ సాదుసంగమ మొక్కటే ఉపాయము. ఎందుచేత ననగా సత్పురుషులు మాటిమాటికి బోధించుచుందురు; గుర్తు చేయుచుందురు విద్యామదాదిదుర్వాసనలచేత పీడింపబడుచు సత్పురుషుల సేవ చేయుటకు అభిలషించనివానికి వెనుకచెప్పిన వివేకముచేత వాసనలను త్యజించుటయే ఉపాయము వాసనలు ప్రబలము లగుటచే వాటిని త్యజించుట శక్యము కానిచో ప్రాణవాయు చలనమును నిరోధించుట ఉపాయము. ప్రాణస్పందనము, వాసనలు చిత్తమును ప్రేరేపించుచుండును గాన వాటిని నిరోధించుటచేత చిత్తశాంతి కలుగుట ఉపపన్న మే.

మూ. ప్రేరకత్వం చ వసిష్ఠ ఆహ—

"ద్వే బీజే చిత్తవృక్షస్య వృత్తివ్రతతిధారిణః
ఏకం ప్రాణపరిస్పన్దో ద్వితీయం దృఢవాసనా."

(ల.వా. **28.38**)

"సతీ సర్వగతా సంవిత్ప్రాణస్పన్దేన బోధ్యతే
సంవేదనాదనన్తాని తతో దుఃఖాని చేతసః"

(ల.వా. **28.40**) ఇతి.

వ్యా. ప్రాణస్పందన వాసనలు చిత్తమును ప్రేరేపించు నను విషయమును వసిష్ఠుడు చెప్పినాడు :-

"వృత్తు లను లతలను ధరించి ఉన్న చిత్త మనే వృక్షమునకు రెండు బీజములు-ఒకటి ప్రాణచలనము, రెండవది దృఢమైన వాసన".

అంతటా వ్యాపించి ఉన్న సంవిత్ (జ్ఞానశక్తి) ప్రాణస్పందము చేత మేల్కొల్పబడును. ఆ సంవేదనమువలననే చిత్తమునకు అనంతమైన దుఃఖములు కనుగును.

మూ. యథా భస్మచ్ఛన్నమగ్నిం లోహకారా దృతిభ్యాం ధమన్తి తత్ర చ దృత్యుత్పన్నేన వాయునా సోఽగ్నిర్జ్వలతి తథా చిత్తోపాదానేన కాష్ఠస్థానీయేనాజ్ఞానేన ఆవృతా సంవిత్ ప్రాణస్పన్దేన బోధ్యమానా చిత్తవృత్తిరూపేణ ప్రజ్వలతి. తస్మాచ్చిత్తవృత్తినామకాత్ సంవిజ్జ్వాలారూపాత్ సంవేదనాత్ దుఃఖాన్యుత్పద్యన్తే. సేయం ప్రాణస్పన్దనప్రేరితా చిత్తోత్పత్తిః.

వ్యా. భస్మముచేత కప్పబడిన అగ్నిని కమ్మరులు రెండు తిత్తులతో ఊదగా ఆ తిత్తుల ద్వారా పుట్టిన గాలిచేత ఆ అగ్ని ఏ విధముగా ప్రజ్వలించునో అట్లే చిత్తమునకు ఉపాదాన కారణమైన కాష్ఠస్థానీయ మైన (కాష్ఠము వంటి) అజ్ఞానముచేత ఆవరించబడిన సంవిత్ (జ్ఞానము) ప్రాణసంచలనముచేత బోధింపబడి చిత్తవృత్తుల రూపమున ప్రజ్వలించును. చిత్తవృత్తి అను పేరు గల సంవిజ్జ్వాలారూపమైన సంవేదనమువలన దుఃఖములు ఉత్పన్నమగును. (చిత్తవృత్తులే సంవిత్తు మంటలు. ఆ మంటలే ఆ యా వస్తువుల జ్ఞానము. దానివలన దుఃఖములు ఉత్పన్న మగును) ఇది ప్రాణస్పందముచేత ప్రేరేపింపబడిన చిత్తోత్పత్తి.

మూ. అన్యాం చ స ఏవాహ——

"భావసంవిత్ప్రకటితామనుభూతాం చ రాఘవ
చిత్తస్యోత్పత్తిమపరాం వాసనాజనితాం శృణు,

దృఢాభ్యస్తపదార్థైకభావనాదతిచఞ్చలమ్
చిత్తం సంజాయతే జన్మజరామరణకారణమ్." ఇతి.

వ్యా॰ రెండవదానిని (వాసనాప్రేరితమైన చిత్తోత్పత్తిని) గూడ వసిష్ఠుడే చెప్పెను :—

రామా! పదార్థముల జ్ఞానముచేత ప్రకటితమై అనుభవింపబడిన, వాసనాజన్యమైన మరొక చిత్తోత్పత్తిని గూర్చి చెప్పెదను; వినుము. దృఢముగా మాటిమాటికి ఒక పదార్థమును గూర్చి భావన చేయుటవలన, అతి చంచలమైన మనస్సు జన్మజరామరణములకు కారణ మగును.

మూ. న కేవలం ప్రాణవాసనయోశ్చిత్తప్రేరకత్వమ్, కింతు పరస్పరప్రేరకత్వమప్యస్తి తదాహ వసిష్ఠః—

"వాసనావశతః ప్రాణస్పన్దస్తేన చ వాసనా
జాయతే చిత్తవృక్షస్య తేన బీజాఙ్కురక్రమః.
(ఉ.వా. **28.65**) ఇతి.

వ్యా. ప్రాణవాసనలు చిత్తమును ప్రేరేపించుటయే గాక తమలో ఒకదాని నొకటి కూడ ప్రేరేపించుచుండును ఈ విషయమును వసిష్ఠుడు చెప్పెను.

"వాసనావశమున ప్రాణసంచలనము కలుగును. ప్రాణసంచలనముచేత వాసనలు కలుగును. ఇది చిత్త మనే వృక్షము విషయమున ఏర్పడిన బీజాంకురక్రమము." బీజము నుండి చెట్టు పుట్టును చెట్టునుండి బీజము పుట్టును మరల ఆబీజమునుండి చెట్టు పుట్టును. ఈ విధముగా ఈ క్రమము నిరంతరము కొనసాగు చుండును అట్లే వాసనా - ప్రాణసంచలనముల క్రమము కొనసాగుచుండుటచే, చిత్తవృక్షమునకు ఆ రెండును బీజములు గాన ఆ బీజద్వయచిత్తవృక్షముల క్రమము కొనసాగుచుండు నని భావము.

మూ. అత ఏవాన్యతరనాశేనోభయనాశమప్యాహ:—

"ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పన్దనవాసనే
ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః."
(ల.వా. **28.34**) ఇతి.

వ్యా. అందువలననే వాటిలో ఏ ఒక్కటి నశించినను రెండూ నశించు నని చెప్పినాడు :—

"చిత్త మనే వృక్షమునకు ప్రాణస్పన్దనము వాసనలు అను రెండు బీజములు ఉన్నవి. వాటిలో ఏ ఒకటి నశించినను వెంటనే రెండూ కూడ నశించును."

మూ. తయోర్నాశోపాయం నాశఫలం చాహ—
"ప్రాణాయామదృఢాభ్యాసైర్యుక్త్యా చ గురుదత్తయా
ఆసనాశనయోగేన ప్రాణస్పన్దో నిరుధ్యతే."
(ల.వా. **28.122**)

వ్యా. వాటి నాశమునకు ఉపాయమును కూడ చెప్పి ఉన్నాడు :—

"ప్రాణాయామమును దృఢముగా అభ్యసించుటచేతను, గురువు చూపిన యుక్తిచేతను, ఆసనములచేతను తగు ఆహారమును భుజించుట చేతను ప్రాణస్పందను నిరోధించబడును."

మూ. "అసఙ్గవ్యవహారిత్వాద్భవభావనవర్జనాత్
శరీరనాశదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే." (ల.వా.**28.123**)

వ్యా. ఆసక్తి లేకుండగా వ్యవహరించుటవలన, సాంసారిక విషయములను గూర్చిన ఆలోచనలను విడచుటవలన, శరీరము నశించునది అను విషయమును చింతించుటవలన వాసన ప్రవర్తించదు.

మూ. "వాసనాసంపరిత్యాగాచ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్,
ప్రాణస్పన్దనిరోధాచ్చ యథేచ్ఛసి తథా కురు."

వ్యా॥ వాసనలను త్యజించుట వలన లేదా ప్రాణస్పన్దమును నిరోధించుటవలన చిత్తము, చిత్తభిన్నత్వమును పొందును (చిత్తము కానిది అగును, ఏది ఇష్టమో అది చేయుము.

మూ. "ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ
యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ."
(ల.వా. 28.57)

వ్యా. రామా! వస్తువును వస్తువుగాను, ఆసక్తితోను లోపల భావన చేయుటయే చిత్తము స్వరూప మని తలచెదను.

మూ. యదా న భావ్యతే కించిద్ధేయోపాదేయరూపి యత్
స్థీయతే సకలం త్యక్త్వా తదా చిత్తం న జాయతే.
(ల.వా. 28.54)

వ్యా. హేయముగా గాని, గ్రాహ్యముగా గాని ఏ వస్తువును గూర్చి భావన చేయకుండగా అన్నింటినీ పరిత్యజించి కూర్చున్నచో అప్పుడు చిత్తము పుట్టదు.

మూ. అవాసనత్వాత్సతతం యదా న మనుతే మనః
అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా.
(ల.వా. 28.55) ఇతి.

వ్యా॥ వాసనలేవీ లేకపోవుటచేత మనస్సు ఎల్లప్పుడూ దేనిని గూర్చి తలవకుండా ఉన్నప్పుడు పరమశాంతిని కలిగించు అమనస్కత్వము (మనస్సు లేని స్థితి) ఏర్పడును.

మూ. అమనస్తానుదయే శాన్త్యభావమాహ—
"చిత్తయక్షదృఢాక్రాన్తం న మిత్రాణి న బాన్ధవాః. ఇతి
శక్నువన్తి పరిత్రాతుంగురవోనచమానవాః"

వ్యా. అమనస్కత్వము కలుగ నంతవరకు శాంతి ఉండ దని చెప్పుచున్నాడు—

"చిత్త మనే యక్షుడు గట్టిగా ఆవహించి ఉన్నవానిని మిత్రులు కాని, బంధువులు కాని గురువులు గాని, మరి యే ఇతర మానవులు కాని రక్షించ జాలరు."

మూ. ఆసనాశనయోగేనేతి యదుక్తం తత్ర అవాసనస్య లక్షణముపాయం ఫలం చ త్రిభిః సూత్రైః పతఞ్జలిః సూత్రయామాస- "స్థిరసుఖమాసనమ్" (2.46) "ప్రయత్నశైథిల్యానన్తసమాపత్తిభ్యామ్" (2.47) "తతో ద్వన్ద్వానభిఘాతః" (2.48)ఇతి. పద్మకస్వస్తికాదినా యాదృశేన దేహస్థాపనరూపేణ యస్య పురుషస్యావయవవ్యథానుత్పత్తిలక్షణం సుఖం, స్వదేహచలనరాహిత్యలక్షణం స్థైర్యం చ సంపద్యతే, తస్య తదేవ సుఖమాసనమ్. తస్య చ ప్రయత్నశైథిల్యం లౌకిక ఉపాయః. గమనగృహకృత్యతీర్థయాత్రాస్నానహోమాదివిషయో యః ప్రయత్నో మానస ఉత్సాహస్తస్య శైథిల్యం కర్తవ్యమ్. అన్యథా స ఉత్సాహో బలాద్ దేహముత్థాప్య యత్ర క్వాపి ప్రేరయతి. అలౌకికోపాయశ్చ "ఫణాసహస్రేణ ధరణీం ధారయిత్వా స్థైర్యేణావతిష్ఠతే యోఽయమనన్తః స ఏవాహమస్మి" ఇతి ధ్యానం చిత్తస్య అనన్తసమాపత్తిః. తయా యథోక్తాసనసంపాదకమదృష్టం నిష్పద్యతే. సిద్ధే చాసనే శీతోష్ణసుఖదుఃఖమానావమానాదిద్వన్ద్వైర్యథాపూర్వం నాభిహన్యతే.

వ్యా. వెనుక "ఆసనాశనయోః" అని చెప్పబడిన ఆసన-అశనములలో ఆసనము లక్షణమును, ఉపాయమును, ఫలమును పతంజలి మూడు సూత్రములలో చెప్పెను. "స్థిరము సుఖముగా ఉండు ఆసనమును స్వీకరించవలెను." "అట్టి ఆసనము ప్రయత్న శైథిల్యముచేతను, అనంతసమాపత్తిచేతను సిద్ధించును." "అది సిద్ధించినచో ద్వంద్వముల అభిఘాతము ఉండదు " దేహమును ఒక విధ మగు స్థితిలో ఉంచుట ఆసనము ఏ పద్మక

స్వస్తికాద్యాసనమును అవలంబించుటచేత, ఎవనికి, అవయవములకు వ్యథ కలగకుండుట అను సుఖము, దేహము కదలకుండుట అను స్థైర్యము లభించునో ఆతనికి అది సుఖమైన ఆసనము. దానికి ప్రయత్న శైథిల్యము లౌకికోపాయము. ఎచటికైనా వెళ్లుట, గృహకృత్యములు, తీర్థయాత్రలు చేయుట, స్నానము, హోమము మొదలైనవాటి కొరకు చేయు ఏ ప్రయత్నము, అనగా మానసమైన ఉత్సాహము ఉన్నదో దానిని శిథిలము చేయవలెను (తగ్గించుకొనవలెను). అట్లు చేయనిచో ఆ ఉత్సాహము దేహమును బలాత్కారముగా లేపి ఎక్కడికో ఒక చోటికి తీసికొని పోవును. "ఏ అనంతుడు వేయి పడగలమీద భూమిని ధరించి స్థిరముగా ఉన్నాడో ఆ అనంతుడను నేనే" అని ధ్యానించుటయే చిత్తమునకు "అనంతసమాపత్తి." ఇది అలౌకికోపాయము దీనివలన స్థిరసుఖమైన ఆసనమును సంపాదించు అదృష్టము నిష్పన్నమగును. ఆసనసిద్ధి కలిగిన పిమ్మట శీతోష్ణ-సుఖదుఃఖ-మానావమానాదిద్వంద్వములు వెనుకటి వలె బాధించవు

మూ. తథావిధస్య చాసనస్య యోగ్యో దేశః శ్రూయతే–

"వివిక్తదేశే చ సుఖాసనస్థః
శుచిః సమగ్రీవశిరఃశరీరః" (కై.ఉ.4.) ఇతి.
"సమే శుచౌ శర్కరవహ్నివాలుకా
వివర్జితే శబ్దజలాశయాదిభిః
మనోఽనుకూలే న తు చక్షుపీడనే
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్"

(శ్వే.ఉ. 2.10.) ఇతి చ.

సోఽయమాసనయోగః.

వ్యా. అట్టి ఆసనమునకు యోగ్యమైన ప్రదేశము చెప్పబడినది—

"జనసంచారము లేని వివిక్తప్రదేశమునందు సుఖాసనమునందు కూర్చుండి, పరిశుద్ధుడై, కంఠమును, శిరస్సును, శరీరమును సమముగా

(నిటారుగా) ఉంచి .. . " అని కైవల్యోపనిషత్తు, "ఎత్తుపల్లములు లేనిది, పవిత్రము, గులకరాళ్లు. నిప్పు, ఇసుక, ధ్వని, జలాశయములు లేనిది, మనస్సుకు అనుకూలము, దృష్టికి బాధాకరము కానిది అయిన ప్రదేశములో, గుహలో కాని, ఎక్కువ గాలి లేని ప్రదేశమునందు గాని యోగాభ్యాసము చేయవలెను" అని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పుచున్నది. ఇది ఆసన యోగము.

మూ. అశనయోగస్తు మితాహారత్వమ్

"అత్యాహారమనాహారం నిత్యం యోగీ వివర్జయేత్" ఇతి శ్రుతేః. భగవతాప్యుక్తమ్:-

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చాత్యన్తమనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా"

(భ.గీ.6.16,17) ఇతి.

వ్యా. అశనయోగ మనగా మితముగా భుజించుట."యోగి ఎల్లప్పుడు, అతిగా తినుటను, అసలు తినకుండుటను పరిత్యజించవలెను" అని శ్రుతి చెప్పుచున్నది. భగవంతుడు కూడ చెప్పినాడు-

"అర్జునా ! ఎక్కువగా తినేవానికి యోగము లేదు అసలు తినని వానికీ లేదు. ఎక్కువగా నిద్రపోయే అలవాటు ఉన్నవానికి లేదు. ఎల్ల ప్పుడు నిద్రలేకుండా మేల్కొనేవానికి లేదు. యుక్తముగా ఆహార విహార ములు చేయువానికి, పనులలో యుక్తముగా ప్రవర్తించువానికి, యుక్తముగా నిద్రను, జాగరణమును సేవించువానికి దుఃఖములను నశింపచేయు యోగము కలుగును".

మూ. జితాసనస్య ప్రాణాయామేన మనోవినాశః శ్వేతాశ్వతరై రామ్నాయతే-

"త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీన్ద్రియాణి మనసా సంనివేశ్య.
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయావహాని"

"ప్రాణాన్ ప్రపీడ్యేహ స యుక్తచేష్టః
క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత
దుష్టాశ్వయుక్తమివ వాహమేనం
విద్వాన్ మనో ధారయేతాప్రమత్తః" (శ్వే.ఉ.2.8.9) ఇతి.

వ్యా. ఆసనమును జయించినవానికి ప్రాణాయామముచేత మనోవినాశము సిద్ధించు నని శ్వేతాశ్వతరులు చెప్పుచున్నారు.

"విద్వాంసుడు శరీరమును మూడు చోట్ల (వక్షఃస్థల-కంఠ-శిరస్సుల యందు) సమముగా ఉన్నతముగా ఉండు నట్లు చేసికొని ఇంద్రియములను మనస్సును కూడ హృదయములో నిరోధించి, బ్రహ్మ అనే తెప్ప సాహాయ్యముతో భయమును కలిగించు అన్ని ప్రవాహములను దాటవలెను".

"అతడు ప్రాణములను పీడించి (నిరోధించి) యుక్తమైన చేష్టలు (కర్మలు) చేయుచు, ప్రాణము క్షీణించిన పిదప నాసికతో ఉచ్ఛ్వాసము చేయవలెను. విద్వాంసుడు ఏమరుపాటు లేనివాడై మనస్సును, దుష్టములైన (మాట వినని) అశ్వములు కట్టిన వాహనమును వలె అదుపులో ఉంచుకొనవలెను".

మూ. యోగీ ద్వివిధః – విద్యామదాద్యాసురసంపద్రహిత స్తత్సహితశ్చేతి. తయోరాద్యస్య బ్రహ్మధ్యానేన మనసి నిరుద్ధే సతి తన్నాన్తరీయకతయా ప్రాణో నిరుధ్యతే. తం ప్రతి "త్రిరున్నతమ్" ఇతి మన్త్రః పఠితః. ద్వితీయస్యాధ్యాసేన ప్రాణే నిరుద్ధే, తన్నాన్తరీయకతయా మనో నిరుధ్యతే. తం ప్రతి "ప్రాణాన్నిపీడ్య" ఇతి మన్త్రః

ప్రవృత్తః. ప్రాణపీడనప్రకారో వక్ష్యతే; తేన చ పీడనేన యుక్త-చేష్టో భవతి. మనశ్చేష్టావిద్యామదాదయో నిరుధ్యన్తే. ప్రాణనిరోధేన చిత్తదోషనిరోధే దృష్టాన్తోఽన్యత్ర శ్రూయతే-

"యథా పర్వతధాతూనాం దహ్యన్తే ధమనాన్మలాః
తథేన్ద్రియకృతా దోషా దహ్యన్తే ప్రాణనిగ్రహాత్"
(అ.నా.ఉ. 7) ఇతి

అత్రోపపత్తిర్వారదేన దర్శితా-
"యః ప్రాణపవనస్పన్దశ్చిత్తస్పన్దః స ఏవ హి
ప్రాణస్పన్దక్షయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః"
(ల.వా.28.125)ఇతి.

**వ్యా.** యోగులలో రెండు రకములవారు ఉందురు-కొందరు విద్యామదము మొదలైన అసురసంపద లేనివారు; కొందరు ఉన్నవారు. మొదటి తరగతివారి మనస్సు బ్రహ్మధ్యానముచేత నిరుద్ధము చేయబడగానే, దానితో పాటు తప్పనిసరిగా ప్రాణనిరోధము ఏర్పడును. "త్రిరున్నతమ్" ఇత్యాది మంత్రము అట్టి వారిని గూర్చి చెప్పబడినది. రెండవ తరగతికి చెందిన వారికి అభ్యాసముచేత ప్రాణము నిరుద్ధముకాగా దానితో పాటు తప్పనిసరిగ మనోనిరోధము కూడ కలుగును. వారి విషయమున "ప్రాణాన్ నిపీడ్య" ఇత్యాదిమంత్రము ప్రవర్తించినది. ప్రాణపీడనము ఎట్లు చేయవలెనో చెప్పగలము. ఆ ప్రాణపీడనముచేత యోగి యుక్తములైన చేష్టలు కలవాడు అగును. మనశ్చేష్టలు, విద్యామదము మొదలైనవి నిరోధింపబడును. ప్రాణవాయువును నిరోధించుటచేత చిత్తనిరోధము ఎట్లు కలుగునో చెప్పుటకు దృష్టాంతము మరొక గ్రంథమునందు చెప్పబడినది—

"అగ్నిలో వేసి ఊదుటవలన పర్వతములలో పుట్టిన ధాతువుల మలములు ఎట్లు కాల్చివేయబడునో, అట్లే ప్రాణాయామముచేత ఇంద్రియములచే కలుగు దోషములు దహింపబడును".

ఈ విషయమునందు వసిష్ఠుడు ఉపపత్తి చూపి ఉన్నాడు —

"ప్రాణవాయుస్పందనమే చిత్తస్పందనము అందుచేత బుద్ధిమంతుడు ప్రాణస్పందమును నిలుపుటకు ఎక్కువ ప్రయత్నము చేయవలెను".

మూ. మనోవాక్చక్షురాదీన్ద్రియదేవతాః స్వస్వవ్యాపారం నిరన్తరం కరిష్యామ ఇతి వ్రతం ధృత్వా శ్రమరూపేణ మృత్యునా గ్రస్తాః. స చ మృత్యుః ప్రాణం నాప్నోత్, తతో నిరన్తరముచ్ఛ్వాసనిఃశ్వాసౌ కుర్వన్నప్యయం ప్రాణో న శ్రామ్యతి. తదా వి_ర్య దేవతాః ప్రాణరూపం ప్రావిశన్. సోఽయమర్థో వాజసనేయిభిరామ్నాయతే-"అయం వై నః శ్రేష్ఠో యః సంచరంశ్చాసంచరంశ్చ న వ్యథతే అథో న రిష్యతి హన్తాస్యైవ సర్వే రూపమసామేతి. ఏతస్యైవ సర్వే రూపమభవంస్తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే ప్రాణాః" (బృ.ఉ. 1.5.21) ఇతి. అత ఇన్ద్రియాణాం ప్రాణరూపత్వం నామ ప్రాణాధీనచేష్టావత్త్వమ్. తచ్చాన్తర్యామిబ్రాహ్మణే సూత్రాత్మప్రస్తావే శ్రూయతే - "వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవన్తి. తస్మాద్వై గౌతమ పురుషం ప్రేతమాహుర్వ్యస్రంసిషతాస్యాఙ్గానీతి. వాయునా హి గౌతమ సూత్రేణ సందృబ్ధాని భవన్తి" (బృ.ఉ. 3.7.2) ఇతి. అతః ప్రాణమనఃస్పన్దయోః సహభావిత్వాత్ ప్రాణనిగ్రహే మనో నిగృహ్యతే

**వ్యా.** మనో-వాక్-చక్షుస్సులు మొదలైన ఇంద్రియముల దేవతలు తమ తమ పనులను నిరంతరము చేసెదము అని వ్రతము వహించి శ్రమ రూపమైన మృత్యువుచేత ఆక్రమింపబడెను, కాని ఆ మృత్యువు ప్రాణను చెంతకు వెళ్లలేదు. అందుచేతనే ప్రాణము నిరంతరము ఉచ్ఛ్వాసనిఃశ్వాసములు చేయుచున్నను శ్రమచెందదు. అప్పుడు ఆ ఇంద్రియదేవత లందరు ఆలోచించి ప్రాణరూపములో ప్రవేశించినవి. ఈ విషయము వాజసనేయులు చెప్పుచున్నారు-"ఇది సంచరించినను సంచరించక పోయినను శ్రమ చెందుట

లేదు; కావున నాశము చెందదు. అందుచేత ఇదే (ఈ ప్రాణమే) మనకు శ్రేష్ఠమైన దేవత. మనము దీని రూపములో కలిసిపోవుదము; ఈ విధముగ నిశ్చయించుకొని ఆ ఇంద్రియము లన్నీ ప్రాణరూప మైపోయినవి అందు చేతనే వాటిని ప్రాణము లందురు". అందువలన ఇంద్రియములు ప్రాణ రూపము లనగా వాటి చేష్టలు ప్రాణాధీనము లని అర్థము. ఈ విషయము అంతర్యామిబ్రాహ్మణములో సూత్రాత్మను ప్రతిపాదించు ప్రస్తావములో చెప్పబడినది. గౌతమా! (ఈ ప్రపంచకమునంతా వ్యాపించి యున్న) ఆ సూత్రము వాయువు గౌతమా! సూత్రమైన ఈ వాయువుచేతనే ఈ లోకము పరలోకము, సర్వభూతములూ కూడ కట్టబడి ఉన్నవి. అందు వలననే, ఓ! గౌతమా! మరణించిన పురుషుని చూచి 'ఈతని అవయవములు జారిపోయినవి' అని అందురు. గౌతమా! సూత్రమైన వాయువుచేత అవి కట్టబడును కదా?" అందువలన ప్రాణస్పందనము, మనఃస్పందనము ఒక దానితో ఒకటి కలిసి జరుగుచుండును గాన ప్రాణమును నిగ్రహించి నప్పుడు మనస్సు కూడ నిగ్రహింపబడును.

మూ. నను సహస్పన్దో న యుక్తః; సుషుప్తౌ చేష్టమానేఽపి ప్రాణే మనసః అచేష్టమానత్వాత్. న, విలీనత్వేన తదానీం మనసః సత్త్వాభావాత్. నను క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీతేతి వ్యాహతమ్. న హి క్షీణప్రాణస్య మృతస్య శ్వాసం క్వచిత్పశ్యామః. నాపి శ్వసతో జీవతః ప్రాణక్షయోఽస్తి. మైవమ్; అనుల్బణత్వస్య క్షయత్వేనాత్ర వివక్షితత్వాత్. యథా ఖననచ్ఛేదనాదిషు వ్యాప్రియమాణస్య, పర్వత మారోహతః శీఘ్రం ధావతో వా శ్వాసవేగో యావాన్భవతి న తావాన్ స్థితస్య, ఆసీనస్య, నిద్రితస్య వా విద్యతే. తథా ప్రాణాయామపాటవో పేతస్యేతరస్మాదల్పః శ్వాసో భవతి.ఏతదేవాభిప్రేత్య శ్రూయతే– "భూత్వా తత్రాయతప్రాణః శనైరేవ సముచ్ఛ్వసేత్" ఇతి. యథా దుష్టైరశ్వైరుపేతో రథో మార్గం త్యక్త్వా యత్ర క్వాపి నీయతే, స చ సారథినా దృఢమశ్వాం రజ్జుష్వాకృష్య సుఖమార్గే పునర్ధార్యతే,

తథేన్ద్రియైర్వాసనాదిభిరిత స్తతో నీయమానం చిత్తం ప్రాణరజ్జ్వా దృఢం ధృతాయాం ధార్యతే.

వ్యా. (ఆశంక) ప్రాణమనస్సులు కలిసి స్పందించును అని చెప్పుట యుక్తము కాద; సుషుప్తిలో ప్రాణము స్పందించుచున్నను మనస్సు పని చేయుటలేదు కదా? సమాధానము). అట్లు కాదు. ఆ సమయమునందు మనస్సు అణగిపోయినది గాన ఆ మనస్సే లేదు [ఆశంక] "ప్రాణము క్షీణమైన పిమ్మట ముక్కుతో గాలి పీల్చుచుండవలెను" అని పైన చెప్పబడినది. అది యుక్తము కాదు ప్రాణము క్షీణించి మరణించినవాడు శ్వాస పీల్చుట ఎక్కడా చూడము కదా? శ్వాసపీల్చుచు జీవించి ఉన్నవానికి ప్రాణక్షయము కూడ లేదు కదా? (సమాధానము) అట్లు కాదు. ఇక్కడ క్షీణించుట అనగా తీవ్రముగా లేకుండుట అని అర్థము నేల తవ్వుట, కట్టెలు మొదలైనవి చేదించుట మొదలైన పని చేయువానికి, పర్వతము ఎక్కుచున్నవానికి, శీఘ్రముగా పరుగెత్తుచున్నవానికి ఎంత శ్వాసవేగము ఉండునో అంత శ్వాసవేగము నిలచిఉన్నవానికి గాని, కూర్చున్నవానికి గాని, నిద్రించుచున్నవానికి గాని ఎట్లు ఉండదో అట్లే ప్రాణాయామములో నేర్పు ఉన్నవానికి ఇతరులకంటె శ్వాసవేగము అల్పముగా ఉండును ఈ అభిప్రాయముతోనే-"ప్రాణములను నిగ్రహించి మెల్లగా శ్వాసపీల్చవలెను" అని చెప్పబడినది. పెంకి గుఱ్ఱములు కట్టిన రథమును మార్గము తప్పించి అవి ఏ మూలకో తీసికొనిపోవును, అప్పుడు సారథి గట్టిగా గుఱ్ఱము కళ్లెము లాగి రథమును సుఖమార్గమునకు చేర్చును. అట్లే ఇంద్రియములు, వాసనాదులు చిత్తమును ఇటు అటు లాగి కొనిపోవుచుండగా ప్రాణ మను కళ్లెమును గట్టిగా పట్టుకొని దానిని నిలుపవచ్చును.

మూ. "ప్రాణాన్ ప్రపీడ్య" ఇతి యదుక్తం తత్ర ప్రాణపీడన ప్రకారోఽన్యత్ర శ్రూయతే-

"సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ
త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామః స ఉచ్యతే"

(అ.నా.ఉ. 11)

వ్యా. ''ప్రాణమును పీడించి'' అని పైన చెప్పబడినది. ప్రాణమును పీడించువిధానము గ్రంథాంతరమునం దున్నది.

"ప్రాణవాయువును నిరోధించి వ్యాహృతులతోను, ఓంకారముతోను కూడిన గాయత్రిని ఓంకారముతో కూడ మూడు పర్యాయములు పఠించవలెను. అది ఒక ప్రాణాయామము."

భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యమ్ అనువాటిలో మొదటి మూడు వ్యాహృతులు. ఆ వ్యాహృతులకు మిగిలిన నాలిగింటికి కూడ ఓంకారము మొదట చేర్చి ఓంకారసహిత మైన గాయత్రిని కుంభక ప్రాణాయామస్థితిలో మూడు పర్యాయములు మనసా పఠించవలె నని అర్థము.

మూ. "ప్రాణాయామాస్త్రయః ప్రోక్తా రేచకపూరకకుమ్భకాః
ఉత్క్షిప్య వాయుమాకాశం శూన్యం కృత్వా నిరాత్మకమ్,
శూన్యభావేన యుఞ్జీత రేచకస్యేతి లక్షణమ్" (12)

వ్యా. రేచకము, పూరకము, కుంభకము అని ప్రాణాయామములు మూడు చెప్పబడినవి. వాయువును పూర్తిగా పైకి వదలి లోపలి అవకాశమును శూన్యముగా, ఏమీ లేనిదానినిగా చేసి, ఆ శూన్యత్వముతో కొంతసేపు ఉన్నట్లయితే అది రేచకము.

మూ. "వక్త్రేణోత్పలనాలేన తోయమాకర్షయేన్నరః
ఏవం వాయుర్గ్రహీతవ్యః పూరకస్యేతి లక్షణమ్" 13

వ్యా. కలవ కాడ గొట్టమును నీటిలో ఉంచుకొని పాత్రలో ఉన్న నీరు నోటిలోనికి మెల్లగా తీసికొని నట్లు వాయువును మెల్లగా లోనికి తీసికొనుట పూరకము.

మూ. "నోచ్ఛ్వసేన్నిఃశ్వసేన్నైవ నైవ గాత్రాణి చాలయేత్
ఏవం తావన్నియుఞ్జీత కుమ్భకస్యేతి లక్షణమ్" 14 ఇతి.

వ్యా. గాలిని లోనికి పీల్చకూడదు; పైకి వదలకూడదు. అవయవ ములను కదలనీయకూడదు. ఈ విధముగ వాయువును లోపల బంధించుట కుంభకము.

మూ. అత్ర శరీరాన్తర్గతం వాయుం బహిర్నిస్సారయితుముత్క్షిప్య శారీరమాకాశం శూన్యం నిరాత్మకం వాయురహితం కృత్వా స్వల్పమపి వాయుమప్రవేశ్య శూన్యభావేనైవ నియమయేత్. సోఽయం రేచకో భవతి.

వ్యా. శరీరములో ఉన్న వాయువును బైటకు వెడలగొట్టుటకు పైకి తీసి, శరీరములో ఆకాశము శూన్యముగా, వాయురహితముగా ఉండునట్లు చేసి, ఏ కొంచెము గాలి కూడ లోనికి పోకుండ చూచుకొనుచు శూన్య భావముతో గాలిని బైట బంధించినచో అది రేచక మగును.

మూ. కుమ్భకో ద్వివిధః, ఆన్తరో బాహ్యశ్చేతి. తదుభయం చ వసిష్ఠ ఆహ——

"అపానేఽస్తం గతే ప్రాణో యావన్నాభ్యుదితో హృది
తావత్సా కుమ్భకావస్థా యోగిభిర్యానుభూయతే".

( ల. వా. **29.211** )

"బహిరస్తంగతే ప్రాణే యావన్నాపానఉద్గతః
తావత్పూర్ణసమావస్థాం బహిష్ఠం కుమ్భకం విదుః"

(ల.వా. **29.216**) ఇతి.

తత్రోచ్ఛ్వాస ఆన్తరకుమ్భకవిరోధీ; నిఃశ్వాసో బాహ్య కుమ్భక విరోధీ; గాత్రచాలనముభయవిరోధి: తస్మిన్ సతి నిఃశ్వాసోచ్ఛ్వాసయో రన్యతరస్య అవశ్యంభావిత్వాత్.

వ్యా. అంతరకుంభకము, బాహ్యకుంభకము అని కుంభకము రెండు విధములు. ఆ రెండింటిని గూర్చి వసిష్ఠుడు చెప్పినాడు—

"అపానవాయువు బైటకు పోయే వాయువు ఏదైనా అపాన వాయువే) అప్పుడే బైటకు వెళ్లి ప్రాణవాయువు ఇంకా హృదయములో ప్రవేశించకుండా ఉన్న అవస్థ అంతరకుంభకము. దీనిని యోగులు గుర్తింతురు."

"బైటనుండి లోనికి రావలసిన ప్రాణము ఆగిపోయి అపానము ఇంకను పైకి లేవనప్పు డున్న నిండిన స్థితికి బాహ్య కుంభక మని పేరు"

ఉచ్ఛ్వాసము (గాలి లోనికి పీల్చుట) అంతరకుంభకమునకు విరోధి. నిఃశ్వాసము బాహ్యకుంభకమునకు విరోధి. గాత్రము చలింపచేయుట రెండింటికీ విరోధి. ఎందుచేత ననగా దేహము చలించినచో ఉచ్ఛ్వాసనిఃశ్వాసములలో ఏదో ఒకటి తప్పక జరిగితీరును.

మూ. పతఞ్జలిరప్యాస నానన్తరభావినం ప్రాణాయామం సూత్రయామాస – "తస్మిన్ సతి నిఃశ్వాసోచ్ఛ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః" (2.49) ఇతి. నను కుమ్భకే గత్యభావేఽపి రేచకపూరకయోరుచ్ఛ్వాసనిఃశ్వాసగతీ విద్యేతే ఇతి చేత్–న; అధికమాత్రాభ్యాసేన స్వభావసిద్ధాయాః సమప్రాణగతేర్విచ్ఛేదాత్. తమేవాభ్యాసం సూత్రయతి–"బాహ్యాభ్యన్తరస్తమ్భవృత్తిర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘః సూక్ష్మః" (2-50) ఇతి. రేచకో బాహ్యవృత్తిః, పూరక అభ్యన్తరవృత్తిః. కుమ్భకః స్తమ్భవృత్తిః. తత్రైకైకో దేశాదిః పరీక్షణీయః. తద్యథా–స్వభావసిద్ధే రేచకే హృదయాన్నిర్గత్య నాసాగ్రముఖే ద్వాదశాఙ్గులపర్యన్తం శ్వాసః సమాప్యతే. అభ్యాసేన తు క్రమేణ నాభేరాధారాద్వా వాయుర్నిర్గచ్ఛతి; చతుర్వింశత్యఙ్గులపర్యన్తే షట్త్రింశదఙ్గులపర్యన్తే వా సమాప్తిః. అత్ర రేచకే ప్రయత్నాతిశయే సతి నాభ్యాదిప్రదేశక్షోభేణాన్తర్నిశ్చేతుం శక్యమ్.బహిశ్చ సూక్ష్మం తూలం ధృత్వా

తచ్చాలనేన నిశ్చేతవ్యమ్. సేయం దేశపరీక్షా. రేచకకాలే ప్రణవస్యా వృత్తయో దశ,వింశతిః,త్రింశదిత్యాదిభిః కాలపరీక్షా;అస్మిన్ మాసే ప్రతిదినం దశ రేచకాః,ఆగామిమాసే వింశతిః,ఉత్తరమాసే త్రింశదిత్యా దిభిః సంఖ్యాపరీక్ష; యథోక్తదేశకాలవిశిష్టాః ప్రాణాయామా ఏకస్మిన్ దినే దశ, వింశతిః త్రింశదిత్యాదిభిః సంఖ్యాపరీక్షా; పూరకేఽప్యేవం యోజనీయమ్. యద్యపి కుమ్భకే దేశవ్యాప్తివిశేషో నావగమ్యతే,తథాపి కాలసంఖ్యావ్యాప్తిరవగమ్యత ఏవ. యథా ఘనే భూతస్థూలపిణ్డః ప్రసార్యమాణో దీర్ఘో విరలతయా సూక్ష్మశ్చ భవతి, తథా ప్రాణోఽపి దేశకాలసంఖ్యాధిక్యేన అభ్యస్యమానో దీర్ఘో దుర్ల క్షతయా సూక్ష్మశ్చ భవతి.

వ్యా. ఆసనము సిద్ధించిన పిమ్మట కలుగు ప్రాణాయామమును గూర్చి పతంజలి కూడ చెప్పి ఉన్నాడు "ఆసనము సిద్ధించిన పిమ్మట చేయు నిఃశ్వాసోచ్ఛ్వాసముల గమనమును నిరోధించుట ప్రాణాయామము." కుంభకములో ఉచ్ఛ్వాసనిఃశ్వాస గతి లేకపోయినను రేచకపూరకము లలో అవి ఉండును కదా అని ఆశంకించరాదు అధికమాత్రాపరిమిత మైన కాలము అభ్యసించుటచేత, స్వభావసిద్ధముగా ఒక పద్ధతిలో సమ ముగా నడచు ప్రాణగతి విచ్ఛిన్న మగును గాన అదే గతి విచ్ఛేద మని అర్థము. ఆ అభ్యాసమునే చెప్పుచున్నాడు-"బాహ్యవృత్తి, అభ్యంతరవృత్తి, స్తంభవృత్తి గల ఆ ప్రాణాయామము దేశకాలసంఖ్యలచేత కొలవబడును. అది (ప్రాణము, దీర్ఘముగాను సూక్ష్మముగాను ఉండును " రేచక ప్రాణాయా మము బాహ్యవృత్తి (వెలపల ఉండునది పూరకము అభ్యంతరవృత్తి లోపల ఉండునది). కుంభకము స్తంభవృత్తి (నిలచి ఉండునది) అదెట్లనగా- మామూలుగా జరిగే రేచకములో శ్వాసహృదయమునుండి బయలుదేరి, నాసికాగ్రమునకు ఎదుట పన్నెండు అంగుళముల దూరము వరకు ప్రసరించి సమాప్తి చెందును. అభ్యాసము చేయుటచేత క్రమముగా నాభినుండి గాని, ఆధారమునుండి గాని వాయువు బయలుదేరును. ఇరవైనాలుగు అంగుళముల

దూరములో గాని ముప్పై ఆరు అంగుళముల దూరమునందు గాని సమాప్తి చెందును. రేచకములోఎక్కువ ప్రయత్నముచేయగా నాభ్యాది ప్రదేశములలో క్షోభ కలుగును గాన వాయువు లోపల ఎక్కడి నుండి బయలుదేరినదో తెలిసి కొనవచ్చును. బైట పల్చని దూదిపట్టుకొని చూచి దాని కదలికను పట్టి ఎంత దూరము ప్రసరించుచున్నదో తెలిసికొనవచ్చును ఇది దేశపరీక్ష. రేచకసమ యమునందు ప్రణవమును పదిసార్లు లేదా ఇరవైసార్లు, లేదా ముప్పై సార్లు ఆవృత్తిచేయుచు ఈ విధముగా ప్రణవముల సంఖ్యను పట్టి కాలపరీక్ష చేయ వలెను. ఈ మాసములో ప్రతిరోజు పది రేచకములు, రాబోవు మాసములో ఇరవై రేచకములు,ఆపై మాసములో ముప్పై ఇత్యాదిరీతిని పరీక్షించుట సంఖ్యా పరీక్ష. ఈ చెప్పిన దేశకాలములతో కూడిన ప్రాణాయామములు ఒక రోజున పది, ఇరవై లేదా ముప్పై అని చూచుకొనుట సంఖ్యా పరీక్ష. పూరకము విషయములో కూడ ఈ విధముగనే చూచుకొనవలెను కుంభకములో దేశ వ్యాప్తివిశేషము (ఇంత ప్రదేశము వ్యాపించుట అను విశేషము) తెలియక పోయినను కాల-సంఖ్యావ్యాప్తి తెలియబడుచునే ఉండును. దగ్గరగా నొక్కి ఉన్న దూది ముద్దను విడదీసినప్పుడు అది దీర్ఘముగాను, పల్చగా ఉండుట చేత సూక్ష్మముగాను అయినట్లే ప్రాణము కూడ దేశకాలసంఖ్యలను పెంచుచు అభ్యసించగా దీర్ఘముగాను, గుర్తించుటకు శక్యము కాకపోవుట చేత సూక్ష్మముగాను అగును.

మూ. రేచకాదిభ్యస్త్రిభ్యోఽన్యం ప్రకారం సూత్రయతి — "బాహ్యాభ్యన్తరభ్యవిషయానపేక్షీ చతుర్థః" (2.51) ఇతి.

యథాశక్తి సర్వం వాయుం విరేచ్య అనన్తరం క్రియమాణో బహిష్కుమ్భకః. యథాశక్తి వాయుమాపూర్య అనన్తరం క్రియమా ణోఽన్తఃకుమ్భకః. ఇతి రేచకపూరకావనాదృత్య కేవలః కుమ్భకోఽ భ్యస్యమానః పూర్వత్రయాపేక్షయా చతుర్థో భవతి. నిద్రాతన్ద్రాది ప్రబలదోషయుక్తానాం రేచకాదిత్రయం, దోషరహితానాం చతుర్థ ఇతి వివేకః. ప్రాణాయామఫలం సూత్రయతి-"తతః క్షీయతే ప్రకాశావర

ణమ్" (2.52) ఇతి. ప్రకాశస్య సత్త్వస్య ఆవరణం తమః నిద్రాలస్యాదిహేతుః; తస్య క్షయో భవతి. క్షయే సతి ఫలాన్తరం సూత్రయతి- "ధారణాసు చ యోగ్యతా మనసః" (2.53) ఇతి. ఆధారనాభిచక్ర హృదయభ్రూమధ్యబ్రహ్మరన్ధ్రాదిదేశవిశేషే వికృష్య చిత్తస్య స్థాపనం ధారణా; "దేశబన్ధశ్చిత్తస్య ధారణా" ఇతి సూత్రణాత్. శ్రుతిశ్చ-

"మనః సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్
ధారయిత్వా తథాత్మానం ధారణా పరికీర్తితా".

(అ నా. ఉ. 15) ఇతి.

ప్రాణాయామేన రజోగుణకార్యాచ్చాఞ్చల్యాత్తమోగుణకార్యాదాలస్యాదేశ్చ నివారితం మనస్తస్యాం ధారణాయాం యోగ్యం భవతి.

"ప్రాణాయామదృఢాభ్యాసైర్యుక్త్యా చ గురుదత్తయా"
(ల.వా. 28.122)

ఇత్యత్రత్యేన యుక్తిశబ్దేన యోగిజనప్రసిద్ధం శిరోరూపమేరుచాలనం, జిహ్వాఘణ్టికాభ్రమణం, నాభిచక్రే హృదయే చ జ్యోతిర్ధ్యానం, విస్మృతిప్రదౌషధసేవా చేత్యేవమాదికం గృహ్యతే. తదేవమధ్యాత్మవిద్యాసాధుసంగమవాసనాక్షయప్రాణనిరోధాశ్చిత్తనాశోపాయా దర్శితాః.

**వ్యా.** రేచకాది ప్రాణాయామములు మూడింటికంటె భిన్నమైన ప్రకారమును చెప్పుచున్నాడు—

"బాహ్యవిషయమును, అభ్యంతరవిషయమును అపేక్షించనిది నాల్గవది." శక్త్యనుసారముగా లోపల నున్న వాయువును పూర్తిగా పైకి పంపివేసి తరువాత చేయునది బహిష్కుంభకము. యథాశక్తిగా వాయువును నింపి అనంతరము చేయునది అంతఃకుంభకము ఈ రేచకపూరకములు రెండూ లేకుండగా అభ్యసించబడు కేవలకుంభకము పైన చెప్పిన మూడు ప్రాణాయామములు కాక నాల్గవది. నిద్ర, తంద్ర (బద్ధకము) మొదలైన ప్రబల

దోషము లున్నవారికి రేచకాదిప్రాణాయామత్రయము అవసరము.ఆ దోషము లేనివారికి నాల్గవది చాలును అని వివేకము (విభాగము). ప్రాణాయామము నకు ఫలమును సూత్రించు చున్నాడు-"దానివలన ప్రకాశావరణము క్షీణిం చును." ప్రకాశస్యసత్త్వమునకు, ఆవరణమైన, నిద్రాలస్యాది హేతువైన తమస్సు క్షీణించును. తమస్సు క్షీణించగా కలుగు మరొక ఫలమును చెప్పు చున్నాడు-"మనస్సునకు ధారణలయందు యోగ్యత లభించును." ధారణ అనగా చిత్తమును లాగి మూలాధారము, నాభిచక్రము, హృదయము, కను బొమ్మల మధ్య ప్రదేశము, బ్రహ్మరంధ్రము మొదలైన దేశవిశేషమునందు నిలుపుట చిత్తమును ఒక ప్రదేశమున స్థిరీకరించుట ధారణ" అని సూత్రము చెప్పబడినది.

"బుద్ధిమంతుడు మనస్సు ఎల్లప్పుడు సంకల్పము చేయు చుండును అను విషయమును గుర్తించి దానిని ఆత్మ వైపు మరల్చి అక్కడనే నిలుపును. అదియే ధారణ" అని శ్రుతి కూడ చెప్పుచున్నది ప్రాణాయాయ మము చేయుటవలన రజోగుణమునుండి పుట్టు చాంచల్యము, తమోగుణము నుండి పుట్టు ఆలస్యాదికము తొలగిపోయి మనస్సు దారణ చేయుటకు యోగ్యమగును.

"ప్రాణాయామముచేత, దృఢమైన అభ్యాసములచేత, గురువు చూపిన యుక్తి చేత" అను వాక్యములో చెప్పిన "యుక్తి" శబ్దమునకు, శిరోరూప మైన (శిరస్సు అనే) మేరువును కదల్చుట, జిహ్వాగ్రము చేత కొండనాలు కను త్రిప్పుట, నాభిచక్రమునందు, హృదయమునందు జ్యోతిస్సును ధ్యానిం చుట, మరపును కలిగించు ఔషధమును సేవించుట మొదలైన, యోగులకు తెలిసిన ప్రక్రియలు అని అర్థము. ఈ విధముగ అధ్యాత్మవిద్యాభ్యాసము, సాదుజనసంగమము, వాసనాక్షయము ప్రాణాయామము అను చిత్తనాశొపా యములు చూపబడినవి

మూ. అథ తదుపాయభూతం సమాధిం వక్ష్యామః.పఞ్చ భూమ్యు పేతస్య చిత్తస్య భూమిత్రయత్యాగేన అవశిష్టభూమిద్వయం సమాధిః. భూమయశ్చ యోగభాష్యకృతా దర్శితాః—

"క్షిప్తం, మూఢం, విక్షిప్తమ్ - ఏకాగ్రం, నిరుద్ధమితి పఞ్చ చిత్తస్య భూమయః" (యో.సూ.భా. 1.1) ఇతి. ఆసురసంపల్లోకశాస్త్ర దేహవాసనాసు వర్తమానం చిత్తం క్షిప్తమ్.నిద్రాతన్ద్రాదిగ్రస్తం మూఢమ్. కాదాచిత్కధ్యానయుక్తం క్షిప్తాద్విశిష్టతయా విక్షిప్తమ్.తత్ర క్షిప్తమూఢయోః సమాధిశఙ్కైవ నాస్తి. విక్షిప్తే తు చేతసి విక్షేపోప సర్జనీభూతః సమాధిః యోగపక్షే న వర్తతే. విక్షేపాన్తర్గతతయా దహ నాన్తర్గతబీజవత్ స సద్య ఏవ వినశ్యతి. యస్త్వేకాగ్రే చేతసి సంభూత మర్థం ద్యోతయతి,క్షిణోతి చ క్లేశాన్, కర్మబన్ధనాని శ్లథయతి,నిరోధ మభిముఖీకరోతి స సంప్రజ్ఞాతయోగ ఇత్యాఖ్యాయతే.సర్వవృత్తినిరోధే త్వసంప్రజ్ఞాతసమాధిః.

వ్యా. ఇప్పుడు దానికి ఉపాయమైన సమాధిని చెప్పెదము. ఐదు భూములు (స్థితులు) గల చిత్తము మూడు భూములను త్యజించి మిగిలిన రెండు భూములలో ఉండుట సమాధి ఈ భూములను యోగసూత్రభాష్య కారుడైన వ్యాసుడు చెప్పినాడు "క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకా గ్రము నిరుద్ధము అని చిత్తభూములు ఐదు". ఆసురసంపత్తు, లోకవాసన శాస్త్రవాసన, దేహవాసన ఉన్న చిత్తము క్షిప్తము నిద్ర తంద్ర (బద్ధకము) మొదలైన వాటిచేత వ్యాప్తమైనది మూఢము, ఎప్పుడో ఒక మాటు ధ్యాన ముతో కూడినది క్షిప్తము కంటె విశిష్టము గాన విక్షిప్తము. వాటిలో క్షిప్త- మూఢావస్థలలో ఉన్న చిత్తమునకు సమాధి కలిగే శంకయే లేదు. విక్షిప్త మైన చిత్తములో సమాధి విక్షేపములో అప్రధానముగా ఉండును గాన అది (విక్షిప్తావస్థలోని సమాధి) యోగపక్షమునకు చెందదు విక్షేపములో అంత ర్గత మగుటచే అది (సమాధి) నిప్పులో పడిన విత్తనము వలె వెంటనే నశించును. ఏ సమాధి చిత్తము ఏకాగ్రమై ఉన్నప్పుడు విషయమును ప్రకాశింపచేయునో, క్లేశములను క్షీణింప చేయునో కర్మబంధనములను శిథిలము చేయునో, నిరోధమును అభిముఖముగా (దగ్గరలో) ఉండునట్లు చేయునో అది సంప్రజ్ఞాతసమాధి. అన్నివృత్తులను నిరోధించినప్పుడు అసంప్రజ్ఞాతసమాధి.

తత్ర సంప్రజ్ఞాతసమాధిభూమిమేకాగ్రతాం సూత్రయతి— "శాన్తోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః."(3.12)ఇతి శాన్తః అతీతః. ఉదితో వర్తమానః ప్రత్యయశ్చిత్తవృత్తిః అతీతః ప్రత్యయో యం పదార్థం గృహ్ణాతి తమేవ చేదుదితఃగృహ్ణీయాత్ తదా తావుభౌ తుల్యౌ భవతః.తాదృశ్చిత్తస్య పరిణామః ఏకాగ్రతేత్యుచ్యతే.

వ్యా. అందు, సంప్రజ్ఞాతసమాధిభూమియైన ఏకాగ్రతను (పతంజలి) సూత్రించుచున్నాడు - "శాంతోదితములు తుల్యప్రత్యయము లైనచో అది చిత్తమునకు ఏకాగ్రతాపరిణామము.'' శాంత మనగా గడచినది. ఉదిత మనగా వర్తమానము. ప్రత్యయ మనగా చిత్తవృత్తి. గడచిపోయిన చిత్తవృత్తి ఏ విషయమును గ్రహించెనో ఆ విషయమునే ఇప్పుడు పుట్టి ఉన్న చిత్తవృత్తి కూడ గ్రహించినచో ఆ రెండు చిత్తవృత్తులకు విషయము ఒక్కటే అని అర్థము. అట్టి చిత్తపరిణామము ఏకాగ్రత అని చెప్పబడును. అనగా చిత్తవృత్తులు ఒకదాని తరవాత ఒకటి వరుసగా పుట్టుచునే ఉండును. ఆ అన్ని చిత్తవృత్తులలోను భాసించు విషయముమాత్రము ఒక్కటే అయినచో అదియే ఏకాగ్రత ఇది ఒక విధమైన చిత్తపరిణామము.

మూ. ఏకాగ్రతాభివృద్ధిలక్షణం సమాధిం సూత్రయతి-"సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః"(3.11). రజోగుణేన చాల్యమానం చిత్తం క్రమేణ సర్వాన్ పదార్థాన్ గృహ్ణాతి. తస్య రజోగుణస్య నిరోధాయ క్రియమాణేన యోగినః ప్రయత్నవిశేషేణ దినే దినే సర్వార్థతా క్షీయతే;ఏకాగ్రతా చోదేతి.తాదృశశ్చిత్తస్య పరిణామః సమాధిరిత్యుచ్యతే.

వ్యా ఏకాగ్రతకు అభివృద్ధి అను లక్షణము గల అనగా ఏకాగ్రతాభివృద్ధి రూపమైన, సమాధిని సూత్రించుచున్నాడు-"సర్వార్థతా-ఏకాగ్రతలకు వరుసగా క్షయము, ఉదయము కలుగగా అది సమాధిరూపమైన చిత్త పరిణామము '' రజోగుణము చిత్తమును చలింపచేయుచుండును. అప్పుడది

క్రమముగా అన్ని పదార్థములను గ్రహించు చుండును. ఆ రజోగుణమును నిరోధించుటకై యోగి చేయు ప్రయత్న విశేషముచేత రోజురోజుకు చిత్తమున కున్న సర్వార్థత (అన్ని విషయములను గ్రహించుట అనునది) క్షీణించును; ఏకాగ్రత ఉదయించును అట్టి చిత్తపరిణామమే "సమాధి."

మూ. తస్య సమాధేరష్టస్వఙ్గేషు యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారాః పఞ్చ బహిరఙ్గాని.తత్ర యమాన్ సూత్రయతి–"అహింసా సత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః"(2.30) ఇతి. హింసా దిభ్యో నిషిద్ధధర్మేభ్యో యోగినం యమయన్తీతి యమాః. నియమాన్ సూత్రయతి–"శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః" (2.32)ఇతి.జన్మహేతోః కామ్యధర్మాన్నివర్త్య మోక్షహేతౌ నిష్కామ ధర్మేనియమయన్తి ప్రేరయన్తీతి నియమాః.

వా ఆ సమాధికి సంబంధించిన ఎనిమిది అంగములలో యమ-నియమ-ఆసన - ప్రాణాయామ -- ప్రత్యాహారము లను ఐదూ బహిరంగములు. అందు యమములను సూత్రించుచున్నాడు-"అహింస. సత్యము, చౌర్యము చేయకుం డుట, బ్రహ్మచర్యము, ధనము కూడబెట్టకుండుట అనునవి యమములు". ఇవి హింస మొదలైన నిషిద్ధ ధర్మముల వైపు వెళ్లకుండా యోగిని అడ్డు పెట్టును గాన "యమములు." నియమములను సూత్రించుచున్నాడు-"శౌచము, సంతోషము, తపస్సు స్వాధ్యాయము - ఈశ్వరునికి సర్వకర్మలు అప్పగించుట, నియమములు." జన్మకు హేతువైన కామ్యకర్మనుండి మరలించి మోక్షహేతువైన నిష్కామకర్మ చేయుటకు నియమించును (ప్రేరేపించును) గాన ఇవి "నియమములు."

మూ. యమనియమయోరనుష్ఠానవైలక్షణ్యం స్మర్యతే—

"యమాన్ కుర్వీత సతతం న కుర్యాన్నియమాన్ బుధః
యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్"

పతతి నియమవాన్యమేష్వసక్తో
న తు యమవాన్నియమాలసోఽవసీదేత్,
ఇతి యమనియమౌ సమీక్ష్య బుద్ధ్యా
యమబహులేష్వనుసందధీత బుద్ధిమ్. ఇతి.

వ్యా. యమనియమముల అనుష్ఠానము విషయమున పాటించవలసిన భేదము స్మృతిలో చెప్పబడినది —

"పండితుడు ఎల్లప్పుడు యమములనే సేవించవలెను. నియమములను మాత్రమే సేవించకూడదు కేవలము నియమములనే సేవించుచు యమములను పాటించనివాడు పతితు డగును."

"యమములను పాటించక నియమములను మాత్రమే పాటించువాడు పతితు డగును. కాని యమములను సేవించుచు నియమముల విషయమున అలసు డైనను పతితుడు కాడు. ఈ విధముగా బుద్ధి చేత యమనియమముల తారతమ్యమును తెలిసికొని బుద్ధిని అధికముగా యమములందె నిలుపవలెను."

మూ. యమనియమఫలాని సూత్రయతి – "తత్సంనిధౌ వైరత్యాగః, క్రియాఫలాశ్రయత్వమ్, సర్వరత్నోపస్థానమ్; వీర్యలాభః; జన్మకథన్తాసంబోధః, జననాదిభయాభావః. "శౌచాత్స్వాఙ్గజుగుప్సా పరైరసంసర్గః," "సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేన్ద్రియజయాత్మదర్శనయోగ్యత్వాని చ" సంభవన్తి. "సంతోషాదనుత్తమసుఖలాభః", "కాయేన్ద్రియబుద్ధిశుద్ధిరశుద్ధి క్షయాత్తపసః", "స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః", "సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్" (2.35-45) ఇతి.

వ్యా. యమనియమల ఫలములను పతంజలి సూత్రములలో చెప్పినాడు."అహింసను పాలించి దానియందు స్థైర్యమును సంపాదించిన వాని సమీపము నందు సహజ వైరము గల జంతువులు కూడ తమ వైరమును త్యజించును.అస్తేయమునందు ప్రతిష్ఠ స్థైర్యము గలవానికి అన్ని రత్నములు

వాటంతట అవి లభించును బ్రహ్మచర్యమునందు ప్రతిష్ఠ కలవానికి వీర్యము లభించును. అపరిగ్రహమునందు స్థైర్య మేర్పడిన వానికి జన్మ ఎట్లు వచ్చినది అను విషయము తెలియును. జన్మాదిభయము ఉండదు. "శౌచము వలన తన శరీరము పైననే జుగుప్స (అసహ్యము) కలుగుటచే పరులతో సంబంధము పెట్టుకొనకుండా ఉండును." "బుద్ధికి పరిశుద్ధత్వము, మంచి మనస్సు, ఏకాగ్రత. ఇంద్రియజయము. ఆత్మదర్శనమునకు యోగ్యత్వము కూడ (శౌచమువలన) కలుగును." "సంతోషమువలన అత్యుత్తమమైన సుఖము కలుగును." "తపస్సువలన అశుద్ధు లన్నీ నశించి శరీరేంద్రియ బుద్ధుల శుద్ధి కలుగును." "స్వాధ్యాయము వలన ఇష్టదేవతాసాక్షాత్కారము కలుగును." "ఈశ్వర ప్రణిధానమువలన సమాధి లభించును."

పైన కొన్ని పాతంజల సూత్రముల అర్థతోనువాదము మాత్రము చేసి కొన్ని సూత్రములను యథా తథముగా ఉదాహరించినారు. పాతంజల సూత్రము "కాయేన్ద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః" అని ఉన్నది. తపస్సువలన కాయసిద్ధి, ఇంద్రియసిద్ధి అనగా ఇచ్ఛానుసారము శరీరమును మార్చుకొను శక్తి దూరదర్శనాదిశక్తి, లభించును అని అర్థము.

మూ. ఆసనప్రాణాయామౌ వ్యాఖ్యాతౌ. ప్రత్యాహారం సూత్రయతి– "స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేన్ద్రియాణాం ప్రత్యాహారః" (2.54) ఇతి. శబ్దస్పర్శరూపరసగన్ధా విషయాః; తేభ్యో నివర్తితాః శ్రోత్రాదయశ్చిత్తస్వరూపమనుకుర్వన్త ఇవావతిష్ఠన్తే.

శ్రుతిశ్చ భవతి—

"శబ్దాదివిషయాన్ పఞ్చ మనశ్చైవాతిచఞ్చలమ్
చిన్తయేదాత్మనో రశ్మీన్ ప్రత్యాహారః స ఉచ్యతే."

(ల.వా.ఉ 5) ఇతి

శబ్దాదయో విషయా యేషాం శ్రోత్రాదీనాం తే శ్రోత్రాదయః పఞ్చ; మనఃషష్ఠానామేతేషామనాత్మరూపేభ్యః శబ్దాదిభ్యో నివర్తనమాత్మ

రశ్మిత్వేన చిన్తనమ్ప్రత్యాహారః స ఇత్యర్థః. ప్రత్యాహారఫలం సూత్ర యతి—“తతః పరమా వశ్యతేన్ద్రియాణామ్.” (2.55) ఇతి.

వ్యా. ఆసనప్రాణాయామములను గూర్చి వెనుక చెప్పి ఉన్నాము. ప్రత్యాహారమును సూత్రించుచున్నాడు – “ఇంద్రియములకు తమ విషయములతో సంబంధము లేనప్పుడు అవి చిత్తస్వరూపమును పొందినట్లు ఉండుట ప్రత్యాహారము” శ్రోత్రాదులకు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు విషయములు. శ్రోత్రాదులను ఆ విషయములనుండి మరల్చినప్పుడు అవి చిత్తస్వరూపమును అనుకరించుచున్నట్లు, అనగా చిత్తస్వరూపము లైపోయినట్లు ఉండును. ఈ విషయమును శ్రుతి కూడ చెప్పుచున్నది—

“శబ్దాదివిషయములను గ్రహించు ఐదు ఇంద్రియములను, అతి చంచల మైన మనస్సును ఆత్మరశ్ములనుగా భావించుట ప్రత్యాహారము”

“శబ్దాదయః విషయాః యేషాం తాని” “శబ్దాదులు వేటికి విషయములో అవి” అను విగ్రహముచేత “శబ్దాదివిషయాన్” అనగా శబ్దాదుల విషయములుగా గల ఇంద్రియములను అని అర్థము. ఆ ఐదింటిని, ఆరవదైన మనస్సును కళ్లెము పట్టి లాగినట్లు, ఆత్మ, అనాత్మలైన శబ్దాదుల నుండి వెనుకకు లాగును గాన అవి ఆత్మరశ్ములు–ఆత్మచేతిలోని కళ్లెములు అని భావించుట, అనగా అనాత్మలైన విషయములనుండి ఇంద్రియములను, మనస్సును, వెనుకకు లాగుట ప్రత్యాహారము. ప్రత్యాహారమునకు ఫలమును సూత్రించుచున్నాడు - “ప్రత్యాహారమువలన ఇంద్రియములు పూర్తిగా వశము లగును”.

మూ. ధారణాధ్యానసమాధీన్ సూత్రైస్త్రిభిః సూత్రయతి–“దేశబన్ధశ్చిత్తస్య ధారణా”(3.1.)“తత్ర పత్యయైకతానతా ధ్యానమ్”(3.2), “తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః” (3.3) ఇతి. ఆధారాదిదేశాః పూర్వముక్తాః. దేశాన్తరం శ్రూయతే—

“మనః సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్
ధారయిత్వా తథాత్మానం ధారణా పరికీర్తితా”(అ.నా.ఉ.15)ఇతి.

"యత్సర్వవస్తుసంకల్పకం మనః తదాత్మానమేవ సంకల్పయతు న త్వన్యత్" ఇత్యేవం విధః ప్రయత్న ఆత్మని సంక్షేపః. ప్రత్యయైకతానతా తత్త్వైకవిషయః ప్రవాహః. స చ ద్వివిధః - విచ్ఛిద్య విచ్ఛిద్య జాయమానః, సంతతశ్చేతి. తావుభౌ క్రమేణ ధ్యానసమాధీ భవతః.

వ్యా. ధారణాధ్యానసమాధులను మూడు సూత్రములలో చెప్పుచున్నాడు-''చిత్తమును హృదయాదిప్రదేశములయందు నిలుపుట ధారణ'' ''దానియందే చిత్తవృత్తి ఏకాగ్రముగా ఉండుట ధ్యానము'' "విషయము మాత్రమే భాసించగా చిత్తవృత్తి కూడ లేనట్లుండు స్థితి సమాధి''. ఆధారాదిదేశములు వెనుక చెప్పబడినవి మరొక ప్రదేశము కూడ వినబడుచున్నది (చెప్పబడినది). "మనస్సు సంకల్పము చేయుచుండును అను విషయమును గుర్తించిన బుద్ధిమంతుడు దానిని ఆత్మయందే సంక్షిప్తముచేసి ఆత్మనే చింతించినచో అది ధారణ". మనస్సును ఆత్మయందు సంక్షిప్తము చేయుట అనగా "అన్ని వస్తువులను గూర్చి సంకల్పించు నా మనస్సు ఆత్మను మాత్రమే సంకల్పించు గాక, ఇతరవస్తువులను గూర్చి సంకల్పించకుండు గాక' అను ప్రయత్నమును చేయుట. తత్త్వమును గూర్చి మాత్రమే ప్రవర్తించు చిత్తవృత్తుల ప్రవాహము ప్రత్యయైకతానత, అది మధ్య మధ్య విచ్ఛిన్న మగుచు ప్రవర్తించేది, నిరంతరము ప్రవర్తించేది అని రెండు విధములు. ఆ రెండు విధములైన ప్రవాహములకే వరుసగా ధ్యానము, సమాధి అని పేర్లు.

మూ. తదుభయం సర్వానుభవయోగినా దర్శితమ్-

"చిత్తైకాగ్ర్యాద్యతో జ్ఞానముక్తం సముపజాయతే
తత్సాధనమతో ధ్యానం యథావదుపదిశ్యతే
విలాప్య వికృతిం కృత్స్నాం సంభవవ్యత్యయక్రమాత్
పరిశిష్టం చ సన్మాత్రం చిదానన్దం విచిన్తయేత్" ఇతి
"బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహోఽహంకృతిం వినా
సంప్రజ్ఞాతసమాధిః స్యాద్ ధ్యానాభ్యాసప్రకర్షజః" ఇతి చ.

వ్యా. ఆ రెండింటిని సర్వానుభవయోగి చూపినాడు-

"పైన చెప్పిన ఆత్మజ్ఞానము కలుగవలె నన్నచో చిత్తైకాగ్రత కావలెను అందుచే దానికి సాధనమైన ధ్యానమును గూర్చి దాని యథార్థ స్వరూపము ఉపదేశించుచున్నాము (చెప్పుచున్నాము) సృష్టిసంహారక్రమాను సారముగా (అనగా బ్రహ్మనుండి ఆకాశము, దానినుండి వాయువు, దాని నుండి అగ్ని, అగ్నినుండి ఉదకము, దానినుండి పృథివి పుట్టినవి. ప్రలయ మునందు పృథివి ఉదకములోను, ఉదకము అగ్నిలోను, అగ్ని వాయువు లోను, వాయువు ఆకాశములోను, ఆకాశము బ్రహ్మలోను విలీన మగును కాన వాస్తవమున మూలకారణమైన బ్రహ్మయే సత్యము అని భావించి, తద్ద్వారా) అన్ని వికారములను వాటి వాటి కారణములయందు విలీనము చేయగా మిగిలిన ఏ సత్-చిత్-ఆనందరూప మున్నదో దానిని ధ్యానించ వలెను".

"అహంకారభావము లేని బ్రహ్మాకారచిత్తవృత్తిప్రవాహమే సంప్రజ్ఞాతసమాధి. అది ధ్యానమును అధికముగా అభ్యసించుట ద్వారా పుట్టును"

మూ. తం చ భగవత్పాదా ఉదాజహ్రుః—

"దృశిస్వరూపం గగనోపమం పరం
సకృద్విభాతం త్వజమేకమక్షరమ్
అలేపకం సర్వగతం యదద్వయం
తదేవ చాహం సతతం విముక్త ఓమ్" (ఉప.10.1)

వ్యా. దానిని గూర్చి శంకరభగవత్పాదులు ఉపదేశసాహస్రిలో చెప్పిఉన్నారు.

"ఆకాశముతో సమానము (నిర్మలము), ఉత్తమము, ఒక్కమారుగా భాసించినది; జన్మలేనిది, ఏకము, నాశరహితము, దేనికీ అంటనిది, అంతటా వ్యాపించినది. అద్వితీయము అయిన ఏ జ్ఞానస్వరూపమున్నదో ఆదే నేను. నేను ఎల్లప్పుడు ముక్తుడనే. ఓమ్".

మూ. "దృశిస్తు శుద్ధోఽహమవిక్రియాత్మకో
న మేఽస్తి కశ్చిద్విషయః స్వభావతః.
పురస్తిరశ్చోర్ధ్వమధశ్చ సర్వతః
సంపూర్ణభూమా త్వజ ఆత్మని స్థితః" (ఉప. 102)

వ్యా. "నేను శుద్ధజ్ఞానస్వరూపుడను. వికారములు లేనివాడను, స్వభావ సిద్ధముగా నాకు విషయమైనది ఏదీ లేదు ముందు, అడ్డముగాను, పైన, క్రింద, అన్ని వైపులా నిండి ఉన్న వాడను, జన్మరహితుడను. ఆత్మ యందే ఉన్నవాడను".

మూ. "అజోఽమరశ్చైవ తథాజరోఽమృతః
స్వయంప్రభః సర్వగతోఽహమద్వయః.
న కారణం కార్యమతీవ నిర్మలః
సదైవ తృప్తశ్చ తతో విముక్త ఓమ్" (ఉప. 103) ఇతి.

వ్యా. "జన్మమరణములు లేనివాడను, ముసలితనము లేనివాడను; ఎన్నడు మరణించనివాడను; స్వయముగా ప్రకాశించువాడను; అంతటా వ్యాపించినవాడను, అద్వితీయుడను దేనికీ కారణము గాని కార్యము కాని కాను ఎట్టి మాలిన్యమూ లేనివాడను, ఎల్లప్పుడు తృప్తి చెందినవాడను, అందుచేత ముక్తుడను. ఓమ్".

మూ. నను సంప్రజ్ఞాతసమాధిరఙ్గీ; స కథం ధ్యానానన్తరభావి నోఽష్టమాఙ్గస్య సమాధేః స్థానే ఉదాహ్రియతే? నాయం దోషః అత్యన్త భేదాభావాత్. యథా వేదమధీయానో మాణవకః పదే పదే స్ఖలన్ పునః పునః సమాదధాతి, అధీతవేదస్తు సావధానో న స్ఖలతి, అధ్యాపకో నిరవధానస్తన్ద్రాం కుర్వన్నపి న స్ఖలతి; తథా విషయైక్యేఽపి పరిపాక తారతమ్యేన ధ్యానసమాధిసంప్రజ్ఞాతానామవాన్తరభేదోఽవగన్తవ్యః.

వ్యా. (ఆశంక) సంప్రజ్ఞాతసమాధి అంగి (ప్రధానమైనది) కదా? దానిని ధ్యానానంతరము కలుగు ఎనిమిదవ అంగమైన సమాధిగా ఎట్లు

చెప్పుచున్నారు ? (సమాధానము) ఇతి దోషము కాదు. ఎందుచేత ననగా అంగమైన సమాధికి, అంగియైన సంప్రజ్ఞాతసమాధికి అంతగా భేదము లేదు. వేదాధ్యయనము చేయుచున్న పిల్లవాడు అడుగడుగునా తొట్రుపడుచు మాటిమాటికి సర్దుకొనుచుండును వేదాధ్యయనము పూర్తిచేసికొన్నవాడు సావధానుడై ఉండి తొట్రుపాటు చెందడు ఉపాధ్యాయుడైతే అలసుడై సావధానుడు కాకున్నను పొరబడడు; అట్లే ధ్యాన-సమాధి-సంప్రజ్ఞాత సమాధుల విషయము ఒకటే యైనను పరిపాకములో ఉన్న తారతమ్యమును పట్టి అవాంతరభేదము ఉన్నట్లు తెలిసికొనవలెను.

మూ. ధారణాదిత్రయం మనోవిషయత్వాత్ సంప్రజ్ఞాతసమాధే రన్తరఙ్గమ్. యమాదిపఞ్చకం తు బహిరఙ్గమ్. తదేతత్సూత్రయతి- "త్రయమన్తరఙ్గం పూర్వేభ్యః"(3.7)ఇతి.తతః కేనాపి పుణ్యేన అన్తరఙ్గే ప్రథమం లబ్ధే బహిరఙ్గలాభాయ నాతిప్రయాసః కర్తవ్యః. యద్యపి పతఞ్జలినా భౌతికభూతతన్మాత్రేన్ద్రియాహఙ్కారాదివిషయాః సంప్రజ్ఞాత సవికల్పసమాధయో బహువిధాః ప్రపఞ్చితాః, యథాపి తేషామన్తర్ధా నాదిసిద్ధిహేతుతయా ముక్తిహేతుసమాధివిరోధిత్వాన్నాస్మాభిస్తత్రాదరః క్రియతే. తథా చ సూత్రితమ్-"తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః" (3 28). ఇతి. "స్థాన్యుపనిమన్త్రణే సఙ్గస్మయాకరణం పునరనిష్ట ప్రసఙ్గాత్" (3.52) ఇతి చ. స్థానినో దేవాః.

వ్యా. ధారణాదులు మూడు (ధారణా-ధ్యాన-సమాధులు) మనస్సునకు సంబంధించినవి గాన అవి సంప్రజ్ఞాత సమాధికి అంతరంగములు (దగ్గర సాధనములు). యమాదులు ఐదూ బహిరంగములు. ఈ విషయమునే పతంజలి సూత్రీకరించినాడు-"ధారణాదిత్రయము వెనుకటివాటి కంటె అంతరంగము." అందుచేత ఏదైన పుణ్యము చేత ముందుగానే అంతరంగ సాధనములైన ధారణా-ధ్యాన-సమాధులు లభించినచో బహిరంగముల కొరకు ఎక్కువ ప్రయాస చేయ వలసిన పని లేదు.

పతంజలి, భౌతికములు (పంచమహాభూతకార్యములు), భూతతన్మాత్రలు, ఇంద్రియములు, అహంకారము మొదలగు వాటిని విషయములుగా గ్రహించిన అనేకసంప్రజ్ఞాతసవికల్పకసమాధులను గూర్చి అనగా భౌతికాదిపదార్థములయందు చిత్తమును నిలిపి సాధించిన సంప్రజ్ఞాత సమాధులను గూర్చి, విస్తృతముగా వివరించినాడు; కాని వాటివలన అంతర్ధానము పొందుట మొదలైన సిద్ధులు మాత్రమే లభించును గాన అవి (అట్టి సమాధులు) ముక్తికి హేతువైన సమాధికి విరోధులు. అందుచేత మేము వాటి విషయమున ఆదరము చూపుట లేదు ఆ విషయమును (అవి సిద్ధులకు మాత్రమే కారణము అను విషయమును) పతంజలియే చెప్పినాడు—"అవి సమాధికి విఘ్నకరములు; వ్యుత్థానసమయమున (సమాధినుండి బైటకు వచ్చినపుడు) సిద్ధులు." స్థానులు (అనగా ఆ యా స్థానములకు అధిపతులైన ఇంద్రాది దేవతలు) మా లోకమునకు రమ్మని పిలచినను ఆ లోకముపై ఆసక్తిని చూపకూడదు. నాకు ఆహ్వానము వచ్చినది కదా అని గర్వపడ కూడదు; ఎందుచేత ననగా మరల అనిష్టమైన సంసారములో చిక్కుకొన వలసి ఉండును." స్థాను లనగా దేవతలు.

మూ. ఉద్దాలకో దేవై రామన్త్రితోఽప్యవజ్ఞాయ తాన్ దేవాన్నిర్వికల్పసమాధిమేవ చకారేత్యుపాఖ్యాయతే. ప్రశ్నోత్తరాభ్యామప్యేవమేవావగమ్యతే.

శ్రీరామః- "జీవన్ముక్తశరీరాణాం కథమాత్మవిదాం వర
శక్తయో నేహ దృశ్యన్తే ఆకాశగమనాదికాః"

( ల.వా. 28.1 )

వ్యా. ఉద్దాలకుడు తనను దేవతలు పిలచినను ఆ ఆహ్వానమును ఆదరించక నిర్వికల్పసమాధినే చేసెను అని చెప్పబడుచున్నది. లఘు యోగవాసిష్ఠములో రాముని ప్రశ్నలవలనను, వసిష్ఠుని సమాధానము వలనను కూడ ఇట్లే తెలియుచున్నది.

రాముడు :-"ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడవైన మునీంద్రా ! జీవన్ముక్తుల శరీరములకు ఆకాశగమనము మొదలైన శక్తులు కనబడుట లేదేమి ?''

మూ. వసిష్ఠః-''అనాత్మవిదముక్తోఽపి నభోవిహరణాదికమ్
ద్రవ్యమన్త్రక్రియాకాలశక్త్యాప్నోత్యేవ రాఘవ.''
(28.2)

వ్యా. ''రామా ! ఆత్మజ్ఞానము లేనివాడు ముక్తుడు కాజాలక పోయినను ఆతనికి, ఓషధ్యాదిద్రవ్యములు, మంత్రములు, కొన్ని క్రియలు, కాలము మొదలైన వాటివలన లభించిన శక్తిచేత, ఆకాశవిహరణాదికము లభించుచునే ఉండును.''

మూ. ''నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మమాత్రదృక్
ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యామనుధావతి'' (28.3)

వ్యా. "ఇది ఆత్మజ్ఞాని కోరే విషయము కాదు. ఆత్మజ్ఞాని ఆత్మసాక్షాత్కారమును మాత్రమే పొంది, ఆత్మయందే ఆనందమును పొందుచు అవిద్యాకృతములైన ఇతరవిషయముల వైపు పరుగెత్తడు.''

మూ. "యే కే చన జగద్భావాస్తానవిద్యామయాన్ విదుః
కథం తేషు కిలాత్మజ్ఞస్త్యక్తావిద్యో నిమజ్జతి." (28.5)

వ్యా. ''జగత్తుకు సంబంధించిన విషయము లన్నీ అవిద్యామయములే అని చెప్పుదురు. అవిద్యను విడచిన ఆత్మజ్ఞానవంతుడు వాటిలో ఎట్లు మునిగిపోవును ?''

మూ. "ద్రవ్యమన్త్రక్రియాకాలశక్తయః సాధు సిద్ధిదాః.
పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వన్తి కాశ్చన" (28.7)

వ్యా. "ద్రవ్య-మంత్ర-క్రియా-కాల శక్తులు బాగుగా ఆ యా సిద్ధులను ఇచ్చును. వాటిలో ఏ శక్తులూ కూడ పరమాత్మపదమును పొందుటకు ఉపకరించవు.''

మూ. "సర్వేచ్ఛాజాలసంశాన్తావాత్మలాభోదయో హి యః
స కథం సిద్ధివాఞ్ఛాయాం మగ్నచిత్తేన లభ్యతే." (28.9)

వ్యా. "సమస్తమైన కోరికలు నశించిన పిమ్మట కదా ఆత్మజ్ఞానోదయము కలుగునది ? ఆ యా సిద్ధుల కోరికలలో మునిగిన చిత్తము కల వానికి అది ఎట్లు లభించును ?''

మూ. "న కేచన జగద్భావాస్తత్త్వజ్ఞం రఞ్జయన్త్యమీ.
నాగరం నాగరీకాన్తం కుగ్రామలలనా ఇవ" ఇతి.

వ్యా. ''నగర స్త్రీలకు మనోహరుడైన నాగరికుని కుగ్రామములో నివసించు స్త్రీలు ఎట్లు రంజింప చేయజాలరో అట్లే తత్త్వజ్ఞానము కలవానిని ఈ జగత్తుకు సంబంధించిన విషయము లేవీ రంజింపచేయ జాలవు".

మూ. "అపి శీతరుచావర్కే సుతీక్ష్ణేఽపీన్దుమణ్డలే
అప్యధః ప్రసరత్యగ్నౌ జీవన్ముక్తో న విస్మయీ"
(ల.వా. 27.66)

వ్యా. "సూర్యుని కిరణములు చల్లబడినను, చంద్రమండలము చాలా తీక్ష్ణముగా ఉన్నను, అగ్నిజ్వాల క్రిందికి ప్రసరించుచున్నను జీవన్ముక్తుడు ఆశ్చర్యము చెందడు".

మూ. "చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురన్తీహ శక్తయః
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్."
(ల.వా. 27.67)

వ్యా. "ఇవన్నీ చిదాత్మకు చెందిన శక్తులే; ఇవి ఈ విధముగా ప్రకట మగుచున్నవి అని గ్రహించుటచేత ఆతనికి ఆశ్చర్యకరములైన విషయములమీద కూడ కుతూహలము ఉండదు".

మూ. "యస్తు వా భావితాత్మాపి సిద్ధిజాలాని వాఞ్ఛతి
స సిద్ధిసాధకైర్ద్రవ్యైస్తాని సాధయతి క్రమాత్" ఇతి చ.

ఆత్మవిషయస్తు సంప్రజ్ఞాతసమాధిర్వాసనాక్షయస్య నిరోధసమాధేశ్చ హేతుః తస్మాదత్రాదరః కృతః.

వ్యా "ఆత్మ: ంతన కలవాడు కూడ ఎవడైన సిద్ధులను కోరినచో వాటిని, ఆతడు క్రమముగా సిద్ధిసాధనములైన ద్రవ్యములచేతనే సాధించును" అనగా ఆత్మజ్ఞానికి ఏవైన సిద్ధులు ఉన్నచో అవి ఆ యా సిద్ధిసాధనములైన ఓషధిమంత్రాదులవలననే లభించినవి కాని సంప్రజ్ఞాతసమాధివలన లభించినవి కాదు అని అర్థము. ఆత్మవిషయకమైన సంప్రజ్ఞాతసమాధి వాసనాక్షయమును చేసి నిరోధసమాధిని ఇచ్చును అందుచేత దానియందే మేము ఆదరము చూపినాము.

మూ. అథ పఞ్చమభూమిరూపో నిరోధసమాధిర్నిరూప్యతే, తం చ నిరోధం సూత్రయతి—

"వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః" (3.9) ఇతి. వ్యుత్థానసంస్కారాః సమాధివిరోధినః. తే చోద్దాలకస్య సమాధావుదాహృతాః-

వ్యా. ఇపుడు పంచమభూమిరూపమైన నిరోధసమాధి నిరూపింపబడుచున్నది. ఆ నిరోధమును పతంజలి ఈ విధముగా సూత్రించుచున్నాడు- "వ్యుత్థాననిరోధసంస్కారములకు అభిభవము, ప్రాదుర్భావము, అనగా వ్యుత్థానసంస్కారము అణగుట నిరోధసంస్కారము ఉదయించుట నిరోధక్షణమునకు సంబంధించిన చిత్తము అన్వయించుట (అనుస్యూతముగా ఉండుట) నిరోధపరిణామము". వ్యుత్థానసంస్కారములు (సమాధినుండి బైటకు వచ్చునట్లు చేసే సంస్కారములు) సమాధికి విరోధులు. ఉద్దాలకుని సమాధిని గూర్చి చెప్పినప్పుడు ఆ వ్యుత్థానసంస్కారముల వర్ణన (లఘుయోగవాసిష్ఠములో 24.29,35-39,109-114) ఉన్నది.

మూ. "కదాహం త్యక్తమననే పదే పరమపావనే
చిరం విశ్రాన్తిమేష్యామి మేరుశృఙ్గ ఇవామ్బుదః.

ఇతి చిన్తాపరవశో బలాదుద్దాలకో ద్విజః
పునః పునస్తూపవిశ్య ధ్యానాభ్యాసం చకార హ"

వ్యా. "మేఘము మేరుపర్వతశిఖరముపై విశ్రమించి నట్లు నేను చిత్తవృత్తు లేవీ లేని పరమపావనమైన బ్రహ్మపదమునందు ఏ నాడు చిరకాలము విశ్రాంతి పొందుదునో కదా'' అని ఉద్దాలకుడు చింతాపరవశుడై మాటిమాటికి కూర్చుండి ధ్యానాభ్యాసమును చేసెను"

మూ. "విషయైర్హ్రియమాణే తు చిత్తే మర్కటచఞ్చలే
స స లేభే సమాధానే ప్రతిష్ఠాం ప్రీతిదాయినీమ్."

వ్యా. "మర్కటము వలె చంచలమైన చిత్తమును విషయములు ఇటు అటూ తీసికొనిపోవుచుండగా ఆతనికి ఆనందకరమైన సమాధానప్రతిష్ఠ (సమాధానమునందు స్థిరత్వము) లభించలేదు".

మూ. "కదాచిద్బాహ్యసంస్పర్శపరిత్యాగాదనన్తరమ్
తస్యాగచ్ఛచ్చిత్తకపిరాన్తరస్పర్శసంచయాన్"

వ్యా. "ఆతని చిత్తకపి (కపివంటి చిత్తము ఒక్కొకప్పుడు బాహ్య విషయములతో సంబంధమును విడచి అంతరములైన[కామక్రోధాది]విషయముల సముదాయముతో సంబంధమును పొందుచుండెను".

మూ. "కదాచిదాన్తరస్పర్శాద్బాహ్యం విషయమాదదే
తస్యోడ్డీయ మనో యాతి కదాచిత్త్రస్తపక్షివత్"

వ్యా. "ఆతని మనస్సు ఒకొ్కకప్పుడు అంతరవిషయసంబంధమును విడచి బాహ్యవిషయములను గ్రహించుచుండెను. ఒకొ్కకప్పుడు భయపడిన పక్షివలె ఎగిరి ఎక్కడికో వెళ్లిపోవుచుండెను."

మూ. "కదాచిదుదితార్కాభం తేజః పశ్యతి విస్తృతమ్
కదాచిత్కేవలం వ్యోమ కదాచిన్నిబిడం తమః."

వ్యా. "ఒక్కొకప్పుడు ఉదయించిన సూర్యునివంటి కాంతి గల విస్తృతమైన తేజస్సును చూచుచుండెడివి ఒక్కొకప్పుడు ఆకాశమును మాత్రము, ఒక్కొకప్పుడు దట్టమైన చీకటిని చూచుచుండెడిది"

మూ. "ఆగచ్ఛతో యథాకామం ప్రతిభాసాన్ పునః పునః
అచ్ఛినన్మనసా శూరః ఖడ్గేనేవ రణే రిపూన్"

వ్యా. "మాటిమాటికి వాటి ఇష్టము వచ్చినట్లు వచ్చుచున్న భావములను ఆతడు, శూరుడు రణములో ఖడ్గముచేత శత్రువులను ఛేదించినట్లు మనస్సుచేత ఛేదించెను".

మూ. "వికల్పౌఘే సమాలూనే సోఽపశ్యద్ధృదయామ్బరే
తమశ్ఛన్నవివేకార్కం లోలకజ్జలమేచకమ్."

వ్యా. "వికల్పముల సముదాయము ఖండించబడిన పిమ్మట ఆతడు హృదయాకాశమునందు వివేకమనే సూర్యుణ్ణి కప్పివేసిన, కదలుచున్న కాటుక వలె నల్లని తమస్సును చూచెను."

మూ. "తదప్యుత్సాదయామాస సమ్యగ్జ్ఞానవివస్వతా
తమస్యుపరతే స్వాన్తే తేజఃపుఞ్జం దదర్శ సః"

వ్యా. "ఆతడు తత్త్వజ్ఞానమనే సూర్యునిచేత దానిని కూడ నశింపచేసెను. ఆ తమస్సు తొలగిన పిమ్మట హృదయములో తేజఃపుంజమును చూచెను."

మూ. "తల్లులావ స్థలాబ్జానాం వనం బాల ఇవ ద్విపః
తేజస్యుపరతే తస్య ఘూర్ణమానం మనో మునేః
నిశాబ్జవదగాన్నిద్రాం తామప్యాశు లులావ సః."

వ్యా. "గున్న ఏనుగు మెట్టతామరల వనమును ఛేదించి నట్లు, ఆతడు దానిని కూడ ఛేదించెను. ఆ తేజస్సు తొలగిన పిమ్మట మునీశ్వరుని మనస్సు తిరిగిపోవుచు రాత్రియందు పద్మమువలె నిద్రను పొందెను. ఆతడు దానిని కూడ శీఘ్రముగా ఖండించెను".

మూ. "నిద్రావ్యపగమే తస్య వ్యోమసంవిత్సముద్యయౌ
వ్యోమసంవిది నష్టాయాం మూఢం తస్యాభవన్మనః
మోహమప్యేష మనస స్తం మమార్జ మహాశయః"

వ్యా. "నిద్ర తొలగిపోగానే అతని చిదాకాశము ఉదయించెను. అది కూడ నష్టమైపోగా అతని మనస్సు మూఢము (మోహావిష్టము) అయ్యెను. ఆ మహాశయుడు మనస్సులోని ఆ మోహమును కూడ తుడిచివేసెను''.

మూ. "తత స్తేజ స్తమోనిద్రామోహాదిపరివర్జితామ్
కామప్యవస్థామాసాద్య విశశ్రామ మనః క్షణమ్'' ఇతి.

వ్యా. తరువాత అతని మనస్సు. తేజస్సు కాని, తమస్సు కాని, నిద్ర కాని, మోహాదులు కాని లేని ఒకానొక అనిర్వచనీయమైన అవస్థను పొంది క్షణకాలముపాటు విశ్రమించెను".

మూ. త ఏతే వ్యుత్థానసంస్కారాః నిరోధహేతునా యోగిప్రయత్నేన ప్రతిదినం ప్రతిక్షణం చాభిభూయన్తే; తద్విరోధినశ్చ నిరోధసంస్కారాః ప్రాదుర్భవన్తి. తథా సతి నిరోధ ఏకైకస్మిన్ క్షణే చిత్తమనుగచ్ఛతి, సోఽయమీదృశశ్చిత్తస్య నిరోధపరిణామో భవతి. నను "ప్రతిక్షణపరిణామినో హి భావా ఋతే చితిశక్తేః'' ఇతి న్యాయేన చిత్తస్య సర్వదా పరిణామప్రవాహో వక్తవ్యః. బాఢమ్, తత్ర వ్యుత్థితచిత్తస్య వృత్తిప్రవాహః స్ఫుటః, నిరుద్ధచిత్తస్య తు కథమిత్యాశఙ్క్యాహ ఉత్తరం సూత్రయతి-"తతః ప్రశాన్తవాహితా సంస్కారాత్''(3.10)ఇతి.యథా సమిదాజ్యాహుతిప్రక్షేపే వహ్నిరుత్తరోత్తరవృద్ధ్యా ప్రజ్వలతి, సమిదాదిక్షయే ప్రథమక్షణే కించిచ్ఛామ్యతి, ఉత్తరోత్తరక్షణే శాన్తిర్వర్ధతే, తథా నిరుద్ధచిత్తస్యోత్తరోత్తరాధికః ప్రశమః ప్రవహతి. తత్ర పూర్వపూర్వప్రశమజనితః సంస్కార ఏవోత్తరోత్తరప్రశమస్య కారణమ్.

**వ్యా.** ఈ వ్యుత్థానసంస్కారములు నిరోధమునకు (చిత్తవృత్తులను అరికట్టుటకు) హేతువైన యోగి ప్రయత్నముచేత ప్రతిదినము, ప్రతిక్షణము తిరస్కరించబడుచుండును. వ్యుత్థానసంస్కారములకు విరోధులైన నిరోధ సంస్కారములు ఆవిర్భవించుచుండును. అప్పుడు ఒక్కొక క్షణములో నిరోధము చిత్తమును అనుసరించుచుండును. ఈ విధముగ చిత్తమునకు నిరోధరూపమైన పరిణామము కలుగును (ఆశంక) "చితిశక్తి (చైతన్యశక్తి) తప్ప అన్ని పదార్థములు క్షణక్షణమునకు పరిణామము చెందుచుండును" అను న్యాయము ప్రకారము చిత్తమునకు ఎల్లప్పుడు పరిణామముల ప్రవాహము ఉండును అని చెప్పవలెను కదా ? (సమాధానము) నిజమే. వ్యుత్థితమైన (బాహ్యవిషయములయందు ప్రవర్తించు) చిత్తమునకు వృత్తిప్రవాహముండు నను విషయము స్పష్టమే. ఇక నిరుద్ధమైన చిత్తమునకు పరిణామ మెట్లుండును అను ఆశంకకు సమాధానముగా సూత్రించుచున్నాడు- "అప్పుడు సంస్కారమువలన చిత్తము ప్రశాంతవాహిగా (శాంతిప్రవాహము కలదిగా) ఉండును." సమిధలను, ఆజ్యమును వేసినప్పుడు అగ్ని ఉత్తరోత్తరోత్తర వృద్ధిచేత (తరువాత తరువాత పెరుగుచు) ప్రజ్వలించును. సమిధలు మొదలైవి క్షీణించినప్పుడు మొదటి క్షణములో కొంచెము శాంతించును. ఉత్తరోత్తరక్షణములలో దాని శాంతి వృద్ధి పొందును. అట్లే నిరుద్ధమైన చిత్తముయొక్క ప్రశమము ఉత్తరోత్తరము అధికము అధిక మగుచు ప్రవహించును. అక్కడ పూర్వపూర్వ ప్రశమములవలన కలిగిన సంస్కారమే ఉత్తరోత్తర ప్రశమమునకు కారణము.

**మూ.** తామేతాం ప్రశాన్తవాహితాం భగవాన్విస్పష్టముదాజహార—

"యదా వినియతం చిత్తమాత్మన్యేవాతిష్ఠతే
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా."

**వ్యా.** చిత్తమునకు కలుగు ప్రశాంతవాహితను (ప్రశాంతిప్రవాహమును) భగవంతుడు భగవద్గీతలో (6.18-23) స్పష్టముగా చెప్పెను :—

"బంధింపబడిన చిత్తము ఆత్మయందే స్థిరముగా ఉన్నప్పుడు ఆతడు ఏ కామములయందు ఆసక్తి లేనివాడై 'యుక్తుడు' (యోగము కలవాడు అని చెప్పబడును"

మూ. "యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః."

వ్యా. ఆత్మయొక్క యోగమును సాధించుచు చిత్తమును నియమించి ఉన్న యోగికి (యోగిచిత్తమునకు) గాలి లేని ప్రదేశములో కదలకుండా ఉండు దీపము ఉపమానముగా చెప్పబడినది."

మూ. "యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి"

వ్యా. "ఎప్పుడు చిత్తము యోగమును సేవించుటచేత నిరుద్ధమై ఉపరత మగునో (శాంతించునో) ఎప్పుడు పరిశుద్ధమైన అంతఃకరణముచేత చైతన్యజ్యోతిఃస్వరూపమైన ఆత్మను చూచుచు ఆత్మయందే సంతోషమును చెందునో అప్పుడు యోగసిద్ధి కలుగును."

మూ. "సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః"

వ్యా. "ఎప్పుడు ఇంద్రియములకు అందనిది, అనంతము, బుద్ధికి మాత్రమే గోచరము అయిన సుఖమును అనుభవించుచు ఆ తత్త్వమునందు స్థిరుడై దానినుండి చలించడో అప్పుడు యోగసిద్ధి కలుగును."

మూ. "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే"

వ్యా. "ఏ ఆత్మలాభమును పొందిన పిమ్మట దానికంటె అధికమైన మరొక లాభ మున్నదని అనుకొనడో, ఏ ఆత్మతత్త్వమునందున్నవాడు గొప్ప దుఃఖముచేత కూడ చలింపచేయబడడో ఆతడు యోగసిద్ధిని పొందినవాడు."

మూ. "తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా"

వ్యా. "దుఃఖసంయోగము లేని ఆ స్థితినే యోగ మను పేరు కల దానినిగా తెలుసుకొనవలెను. ఆ యోగమును నిర్వేదము చెందని మనస్సుతో నిశ్చయపూర్వకముగా అభ్యసించవలెను."

మూ. నిరోధసమాధేః సాధనం సూత్రయతి–"విరామప్రత్యయాభ్యాసపూర్వకః సంస్కారశేషోఽన్యః" (1.18) ఇతి. విరామో వృత్త్యుపరమః. తస్య ప్రత్యయః కారణం వృత్త్యుపరమార్థః పురుషప్రయత్నః. తస్యాభ్యాసః పౌనఃపున్యేన సంపాదనమ్; తత్పూర్వకస్తజ్జన్యః, అనన్తరాతీతసూత్రే సంప్రజ్ఞాతసమాధేరుక్తత్వాత్ తదపేక్షయా అన్యః అసంప్రజ్ఞాతః సమాధిః. తత్ర వృత్తిరహితస్య చిత్తస్వరూపస్య దుర్లక్షత్వాత్ సంస్కారరూపేణ చిత్తం శిష్యతే.

వ్యా. నిరోధసమాధికి సాధనమును చెప్పుచున్నాడు – "రెండవది, అనగా నిరోధసమాధి, విరామప్రత్యయాభ్యాసకపూర్వమైనది; సంస్కారము మాత్రమే మిగులునది". విరామమనగా వృత్తులు తొలగిపోవుట(లేకుండుట). దానికి కారణము ప్రత్యయము. ప్రత్యయ మనగా వృత్తులు నశించుటకు పురుషుడు చేయు ప్రయత్నము. ఆ ప్రత్యయముయొక్క అభ్యాస మనగా మాటిమాటికి సంపాదించుట. అది పూర్వమునందు కలది, అనగా దానివలన పుట్టునది. అనగా "విరామప్రత్యయాభ్యాసపూర్వః" అనుదానికి చిత్త వృత్తులు కలుగకుండా మాటిమాటికి చేయు ప్రయత్నముచేత పుట్టునది అని అర్థము. వెనుకటి సూత్రములో సంప్రజ్ఞాతసమాధిని గూర్చి చెప్పబడినది గాన ఇక్కడ దానికంటె అన్యము అనగా అసంప్రజ్ఞాతసమాధి అని అర్థము. ఏ వృత్తులూ లేని చిత్తమును గుర్తించుట శక్యముకాదు గాన చిత్తము సంస్కారరూపములో మాత్రమే మిగులును.

మూ. విరామప్రత్యయజన్యత్వం భగవాన్విస్పష్టమాహ:–
"సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వాసర్వానశేషతః

మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః.
శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్
యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్.''

(భ.గీ. 6.24-26) ఇతి.

వ్యా॥ అసంప్రజ్ఞాతసమాధి విరామప్రత్యయమువలన కలుగును అను విషయమును భగవంతుడు స్పష్టముగా చెప్పి ఉన్నాడు—

"సంకల్పించుట వలన కామములను అన్నింటినీ పూర్తిగా విడచి, ఇంద్రియసముదాయమును మనస్సుచేతనే అన్ని వైపులనుండి వెనుకకు మరల్చి, స్థిరత్వముచేత బుద్ధిని నిగ్రహించుకొని మెల్ల మెల్లగా ఉపరతిని ఇంద్రియమనో నిగ్రహమును సాధించవలెను. మనస్సును ఆత్మమీదనే నిలిపి దేనినీ గూర్చి ఆలోచించగూడదు. చంచలము అస్థిరమూ అయిన మనస్సు ఏ యే వైపునకు పోవు చుండునో ఆ యా ప్రదేశముల (విషయముల) నుండి వెనుకకు మరల్చి ఆత్మయందే నిలిపి, వశము చేసికొనవలెను'

మూ. కామ్యమానాః స్రక్చన్దనవనితాపుత్రమిత్రగృహక్షేత్రాదయః మోక్షశాస్త్రకుశలవివేకిజనప్రసిద్ధైర్బహుభిర్దోషైరుపేతా అప్యనాద్యవిద్యావశాత్ తాన్ దోషానాచ్ఛాద్య తేషు విషయేషు సమ్యక్త్వం మనః కల్పయతి. తస్మాచ్చ సంకల్పాదిదం మే స్యాదితేవంరూపాః కామాః ప్రభవన్తి, తథా చ స్మర్యతే—

"సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః
కామ జానామి తే మూలం సంకల్పాత్ కిల జాయసే
న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినఙ్క్ష్యసి'' ఇతి.

వ్యా. కోరబడుచుండే పుష్పమాలలు, చందనము, స్త్రీలు, పుత్రులు మిత్రులు, గృహములు, పొలములు మొదలైనవి మోక్ష శాస్త్రమునందు

ప్రవీణులైన వివేకవంతులకు బాగా తెలిసిన దోషములతో కూడి ఉన్నవి. అయినను మనస్సు అనాది యైన అవిద్యయొక్క ప్రభావముచేత ఆ దోషములను కప్పివేసి ఆ విషయములు మంచి వని కల్పించును (చూపును). ఆ సంకల్పమువలన "నా కిది లభించుగాక" అను కోరికలు పుట్టును. ఈ విషయము స్మృతిలో చెప్పబడినది—

"కామములు సంకల్పమువలననే పుట్టును. యజ్ఞములు [వివిధ కర్మలు] సంకల్పమువలననే పుట్టును. ఓ! కామమా! నీ కారణ మేదో నాకు తెలిసినది లే? నీవు సంకల్పమువలన పుట్టుదువట కదా? నేను దేనినీ గూర్చి సంకల్పమే చేయను. దానితో నీవు సమూలముగా నశించెదవు."

[పై వాక్యములో వాక్య నిర్మాణము సరిగాలేదు. లేఖకులు మార్చి ఉందురు. "కామ్యమానాః" ఇత్యాది ప్రథమాబహువచనాంతశబ్దములను "కామ్యమానానాం" ఇంత్యాది విధముగా షష్ఠ్యంతములుగా మార్చుకొనవలెను. లేదా "దోషైః ఉపేతాః; తథాపి" అని ఉన్న బాగుండును. అట్లే "న త్వాం సంకల్పయిష్యామి"కి బదులు "నాహం సంకల్పయిష్యామి" అని ఉన్న బాగుండును. కామము ఇతర వస్తువులను గూర్చి సంకల్పించుట వలన కలుగుచున్నది గాని కామమును గూర్చి సంకల్పించుట వలన కాదు కదా?]

మూ. తత్ర వివేకేన విషయదోషేషు సాక్షాత్కృతేషు శునా వాన్తే పాయస ఇవ కామాస్త్యజ్యన్తే. స్రక్చన్దనాదిష్విప బ్రహ్మలోకాదిష్వణిమాద్యష్టైశ్వర్యేషు చ కామాస్త్యాజ్యా ఇత్యభిప్రేత్య సర్వానిత్యుక్తమ్. మాసోపవాసవ్రతినా తస్మిన్మాసేఽన్నే త్యక్తేఽపి కామః పునపునరుదేతి. తద్వ్యావృత్త్యర్థ మాత్మతుష్టావిత్యుక్తమ్. కామత్యాగే మనఃపూర్వకప్రవృత్త్యభావేఽపి చక్షురాదీనాం రూపాదిషు యా స్వాభావసిద్ధా ప్రవృత్తిః సాపి ప్రయత్నయుక్తేన మనసైవ నియన్తవ్యా. దేవతాదర్శనాదిష్వప్యనుసరణాయ సమన్తత ఇత్యుక్తమ్, భూమికాజయక్రమేణోపరమస్యవివక్షితత్వాత్ శనైః శనైరిత్యుక్తమ్.

వ్యా. అందు వివేకముచేత విషయములలో ఉన్న దోషములను ప్రత్యక్షముగా తెలిసి కొనిన పిమ్మట కుక్క కక్కిన పాయసము మీద వలె ఆ విషయముల మీద కామములు విడువబడును. పుష్పమాలా చందనాదుల మీద కలుగు కోరికలను విడచి సత్యే బ్రహ్మలోకాదులమీద, అణిమ మొదలైన అష్టైశ్వర్యముల మీద కూడ కామములను త్యజించవలె నను అభిప్రాయముతో [''సంకల్ప ప్రభవాన్ ' ఇత్యాది భగవద్గీతా శ్లోకములో] సర్వాన్ =అన్ని కామములను అని చెప్పబడినది. ''ఈ మాస మంతా ఉపవాసము చేసెదను'' అని సంకల్పించి ఆ వ్రతము నాచరించు వారు ఆ మాసము అన్నమును పరిత్యజించినను ఆతనికి మాటి మాటికి దానిపై కోరిక కలుగుచునే ఉండును. అట్లు కాకూడదు అను ఉద్దేశ్యముతో అశేషతః=పూర్తిగా అని చెప్పబడినది. కామమును త్యజించిన పిమ్మట కూడ చక్షురాదీంద్రియములకు రూపాదుల విషయమున మనఃపూర్వకముగా ప్రవృత్తి లేకపోయినను, స్వాభావికముగ ప్రవృత్తి కలుగవచ్చును దానిని కూడ [స్వాభావికమైన ఇంద్రియ ప్రవృత్తిని కూడ] మనస్సు చేతనే నిలిపి వేయవలెను. దేవతాదర్శనాదుల విషయమునందు కూడ చక్షురాదిప్రవృత్తి కలుగునప్పుడు దానిని అనుసరించ కూడదు అని చెప్పుటకై ''సమన్తతః'' [అన్ని వైపులనుండి] అని చెప్పబడినది. ఉపరమమును ఆ యా భూమికలను జయించు క్రమమున సంపాదింప వలెను అను అభిప్రాయము చేత ''శనైః శనైః'' [మెల్లమెల్లగా] అని చెప్పబడినది

మూ. తాశ్చ భూమికాశ్చతస్రః కఠవల్లీషు ప్రోయన్తే-
యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని"
(1.3.13) ఇతి.

వ్యా. అట్టి నాలుగు భూమికలు కఠవల్లులలో చెప్పబడినవి—

"బుద్ధిమంతుడైన యోగి వాక్కును మనస్సులో నియమించవలెను. ఆ మనస్సును జ్ఞానాత్మయందు నియమింపవలెను ఆ జ్ఞానాత్మను మహాత్మ

యందు నియమించవలెను. ఆ మహాత్మను శాంతమైన ఆత్మయందు నియమించవలెను (దీని భావము మున్ముందు స్పష్ట మగును)

మూ. వాగ్వ్యాపారో ద్వివిధః—లౌకికో వైదికశ్చ. జల్పాదిరూపో లౌకికః. జపాదిరూపో వైదికః. తత్ర లౌకికస్య బహువిక్షేపకారిత్వాత్ వ్యుత్థానకాలేఽపి యోగీ తం పరిత్యజేత్. అత ఏవ స్మర్యతే—

"మౌనం యోగాసనం యోగ స్తితిక్షై కాన్తశీలతా
నిఃస్పృహత్వం సమత్వం చ సప్తైతాన్యేకదణ్డినః" ఇతి.

జపాదికం నిరోధసమాధౌ పరిత్యజేత్. సేయం వాగ్భూమిః ప్రథమా.

వ్యా. లౌకికము, వైదికము అని వాగ్వ్యాపారము రెండు విధములు. జల్పాది [వ్యర్థముగా మాటలాడుటమొ.] రూపమైనది లౌకికము. జపాదిరూపమైనది వైదికము. వాటిలో లౌకిక మైన వాగ్వ్యాపారము చాల చిత్తవిక్షేపమును కలిగించును గాన వ్యుత్థాన కాలములో కూడ యోగి దానిని పరిత్యజించవలెను. అందువలననే స్మృతి ఇట్లు చెప్పుచున్నది—

"మౌనము, యోగాసనము, యోగము, ఓర్పు, ఏకాంతప్రదేశమునందు ఆసక్తి, ఆశ లేకపోవుట, సమబుద్ధి ఈ ఏడూ ఏకదండియైన సంన్యాసికి విధించబడినవి"

నిరోధ సమాధిలో జపాదికమును కూడ పరిత్యజించవలెను ఈ వాగ్భూమి మొదటిది.

మూ. తాం భూమిం ప్రయత్నమాత్రేణ కతిపయైర్దినైర్మాసై ర్వత్సరైర్వా దృఢం విజిత్య పశ్చాద్ద్వితీయాయాం మనోభూమౌ ప్రయతేత. అన్యథా బహుభూమికాప్రాసాదవత్ ప్రథమభూమిపాతేనైవో పరితనయోగభూమయః సర్వా వినశ్యేయుః. యద్యపి చక్షురాదయో (ఽపి) నిరోద్ధవ్యాః తథాపి తేషాం వాగ్భూమౌ మనోభూమౌ వాన్తర్భావో ద్రష్టవ్యః.

వ్యా. ఈ ప్రథమభూమియైన వాగ్భూమిని ప్రయత్నము చేసి, కొన్ని రోజులలోనో, మాసములలోనో, సంవత్సరములలోనో పూర్తిగా జయించి తరువాత రెండవ మనోభూమిక కొరకు ప్రయత్నము చేయవలెను. అట్లు కానిచో అనగా మొదటి దానియందు పూర్తిగా స్థైర్యము లేనిచో చాలా అంతస్తు లున్న మేడ వలె మొదటి భూమి పడిపోగానే పైన ఉన్న భూములు అన్నీ నశించును. చక్షురాదీంద్రియములు కూడ జయించవలసినవే అయినను వాటిని వాగ్భూమిలో కాని, మనోభూమిలో కాని అంతర్గతము చేయుటచే వాటిని వేరుగా చెప్పలేదు.

మూ. నను వాచం మనసి నియచ్ఛేదిత్యనుపపన్నమ్. న హీన్ద్రియస్యేన్ద్రియాన్తరే ప్రవేశోఽస్తి, మైవమ్; ప్రవేశస్యావివక్షితత్వాత్. నానావిక్షేపకారిణోర్వాఙ్మనసోర్మధ్యే ప్రథమతో వాగ్వ్యాపారనియమనేన మనోవ్యాపారమాత్రపరిశేష ఇహ వివక్షితః. గోమహిషాశ్వాదీనామివ వాఙ్నియమే స్వాభావికే సంపన్నే తతో జ్ఞానాత్మని మనో నియచ్ఛేత్.

వ్యా. (ఆశంక) "వాక్కును మనస్సులో నియమించవలెను" అని చెప్పుట అనుపపన్నముగా ఉన్నది. ఒక ఇంద్రియము మరొక ఇంద్రియములో ప్రవేశించదు కదా? [సమాధానము] అది కాదు. ఇక్కడ వాగింద్రియమును మనోరూపేంద్రియములో ప్రవేశపెట్టవలెను అని అభిప్రాయము కాదు. వాగింద్రియమనస్సులు అనేకవిధములైన విక్షేపములను కలిగించును. వాటిలో ముందుగా వాగ్వ్యాపారమును కట్టి మనోవ్యాపారము మాత్రమే మిగులుట అని ఇక్కడ చెప్పదలచిన విషయము. గోవులు,మహిషములు, అశ్వములు మొదలైన వాటిని మామూలుగా కట్టివేసినట్లు వాగింద్రియమును కట్టివేయుట స్వాభావికమైపోయిన పిమ్మట మనస్సును జ్ఞానాత్మలో బంధించవలెను.

మూ. ఆత్మా త్రివిధః; జ్ఞానాత్మా, మహాత్మా, శాన్తాత్మా చేతి. జ్ఞానాత్యత్ర స్థిత ఆత్మేతి జ్ఞాతృత్వోపాధిరహంకారోఽత్ర జ్ఞానశబ్దేన వివక్షితః; కరణస్య మనసః నియమ్యత్వేన పృథగుపాత్తత్వాత్. అహం

తారో ద్వివిధః-విశేషరూపః, సామాన్యరూపశ్చేతి. "అయమహమేతస్య పుత్రః" ఇత్యేవం వ్యక్తమభిమన్యమానో విశేషరూపః. "అస్మి" ఇత్యేతావన్మాత్రమభిమన్యమానః సామాన్యరూపః స చ సర్వవ్యక్తిషు వ్యాప్తత్వాన్మహానిత్యుచ్యతే. తాభ్యామహంకారాభ్యాం ద్వాభ్యాముపహితౌ ద్వావాత్మానౌ. నిరుపాధికః శాన్తాత్మా. తదేతత్సర్వమన్తర్బహిర్భావేన వర్తతే. శాన్త ఆత్మా సర్వాన్తరశ్చిదేకరసః. తస్మిన్నాశ్రితం జడశక్తిరూపమవ్యక్తం మూలప్రకృతిః. సా చ ప్రథమం సామాన్యాహంకారరూపేణ మహత్తత్త్వనామ్నా వ్యక్తీభవతి. తతో బహిర్విశేషాహంకారరూపేణ; తతో బహిర్మనోరూపేణ; తతో బహిర్వాగాదీన్ద్రియరూపేణ.

వ్యా. జ్ఞానాత్మ, మహాత్మ, శాంతాత్మ అని ఆత్మ మూడు విధములు "ఇక్కడ ఉన్న ఆత్మ తెలిసికొనుచున్నది" అని జ్ఞాతృత్వమునకు ఉపాధియైన అహంకారము ఇక్కడ జ్ఞాన శబ్దమునకు అర్థము. అనగా "నేను తెలిసికొనుచున్నాను." అని అనుకొనుచున్నది అహంకారము; ఇక్కడ జ్ఞానాత్మలోని జ్ఞానము ఆ అహంకారమే; మనస్సు కాదు. ఎందుచేత ననగా కరణమైన ఆ మనస్సును నియమింపదగిన దానిని వేరుగా చెప్పుట జరిగినది. అహంకారము-విశేషరూపము, సామాన్యరూపము అని రెండు విధములు. "ఈ నేను ఫలానావాని కుమారుడను" అని స్పష్టముగా అభిమానమును చూపునది విశేషాహంకారము, "ఉన్నాను" అని మాత్రము అభిమానమును చూపునది సామాన్య రూపము. ఈ సామాన్యరూప మైన అహంకారము అందరు వ్యక్తులయందు వ్యాప్తమై ఉన్నది గాన "మహాన్" అని చెప్పబడు చున్నది. ఈ రెండు అహంకారములచేత ఉపహితము లైనవి రెండు ఆత్మలు. ఏ ఉపాధి లేనిది శాంతాత్మ, ఇవి అన్నీ అంతర్బహిర్భావముతో [అంతరములు గాను బాహ్యములు గాను] ఉన్నవి. శాంతాత్మ అన్నింటికంటె అంతర మైనది; కేవలచిత్ [జ్ఞాన] స్వరూపము దానిని ఆశ్రయించి ఉన్న జడశక్తిరూపమైన అవ్యక్తము మూలప్రకృతి అది ముందుగా సామాన్యాహంకార రూపములో వ్యక్త మగును. ఆ సామాన్యాహంకారమే మహత్తత్త్వము. పిమ్మట దాని

కంటె బాహ్యమైన విశేషాహంకారరూపములో అభివ్యక్తమగును. దానికంటె బాహ్యమైన మనోరూపములోను దానికంటె బాహ్యమైన వాగాదీంద్రియ రూపములోను వ్యక్తమగును.

మూ. తదేతదభిప్రేత్యోత్తరోత్తరమాన్తరత్వం వివినక్తి శ్రుతిః—
"ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః
పురుషాన్న పరం కించిత్సాకాష్ఠా సా పరా గతిః"
(కఠ. ఉ. **1.3.10,11**) ఇతి.

"ఏవం సత్యత్ర నానావిధసంకల్పవికల్పసాధనం కరణరూపం మనోఽహంకర్తరి నియచ్ఛేత్, మనోవ్యాపారాన్ పరిత్యజ్య అహంకార మాత్రం శేషయేత్.

వ్యా. ఈ అభిప్రాయముచేతనే శ్రుతి వీటిలో తరువాతితరువాతివాటికి ఆంతరత్వమును (మొదటివానికంటె రెండవది రెండవదానికంటె మూడవది ఆంతరము అని) వివేచించి చెప్పుచున్నది—

"ఇంద్రియములకంటె విషయములు పరములు; విషయములకంటె మనస్సు పరము, మనస్సుకంటె బుద్ధి పరము; బుద్ధికంటె మహద్రూపమైన ఆత్మ పరము, మహత్తుకంటె అవ్యక్తము పరము అవ్యక్తముకంటె పురుషుడు పరుడు. పురుషునికంటె పరమైనది ఏదీ లేదు. ఆ పురుషుడే (ఆత్మయే) అత్యుత్తమమైన అవధి. అత్యుత్తమమైన గతి."

కావున నానావిధములైన సంకల్పవికల్పములకు సాధనమైన, కరణ రూపమైన మనస్సును అహంకర్తయందు నిగ్రహించవలెను. అనగా మనో వ్యాపారములను విడచి అహంకారమును మాత్రము మిగల్చవలెను

మూ. న చైతదశక్యమితి వాచ్యమ్;
"తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్"
(భ.గీ. **6.34**)

ఇతి పదన్తమర్జునం ప్రతి భగవతోత్తరాభిధానాత్—
"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః"
(భ.గీ 6.35,36) ఇతి

అభ్యాసవైరాగ్యే పతఞ్జలిసూత్రోదాహరణేన వ్యాఖ్యాస్యేతే. పూర్వ పూర్వ భూమిదార్ఢ్యరహితోఽసంయతాత్మా. తత్సహితో వశ్యాత్మా.

వ్యా. ఇది అశక్యము కదా అని భావించపని లేదు. ''మనస్సును నిగ్రహించుట వాయువును బంధించుటవలె చేయ శక్యము కాదు అని తలచుచున్నాను" అని పలికిన అర్జునునితో భగవంతుడు ఈ విధముగా చెప్పి ఉన్నాడు కదా ?

''మహాబాహువైన అర్జునా ! మనస్సు చంచల మైనది; నిగ్రహింప శక్యము కానిది. సందేహము లేదు. కాని అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను దానిని నిగ్రహించవచ్చును. మనస్సును నిగ్రహించుకొనజాలని వాడు యోగమును పొందజాలడని నా నిశ్చయము. కాని ప్రయత్నము చేసి మనస్సును నిగ్రహించుకొన్నవాడు ఉపాయముచే దానిని పొంద సమర్థుడగును''.

అభ్యాసవైరాగ్యములను గురించి పతంజలి సూత్రములను ఉదాహరించి వ్యాఖ్యానింపగలము. పూర్వపూర్వభూముల యందు స్థిరత్వము లేనివాడు అసంయతాత్ముడు. ఆ స్థిరత్వ మున్నవాడు సంయతాత్ముడు.

మూ. ఉపాయతః ప్రాప్తిం గౌడపాదాచార్యాః సదృష్టాన్తమాహుః—
"ఉత్సేక ఉదధేర్యద్వత్ కుశాగ్రేణైకబిన్దునా
మనసో నిగ్రహస్తద్వద్ భవేదపరిఖేదతః." ఇతి.

"బహుభిర్న విరోద్ధవ్యమేకేనాపి బలీయసా
స పరాభవమాప్నోతి సముద్ర ఇవ టిట్టిభాత్."

అత్ర చ సంప్రదాయవిద ఆఖ్యాయికామాచక్షతే:—"కస్యచిత్కిల పక్షిణోఽణ్డాని తీరస్థాన్యుదధిరుత్సేకేనాపజహార. తం చ సముద్రం శోషయామీతి ప్రవృత్తః స చ పక్షీ స్వముఖాగ్రేణైకైకం జలబిన్దుం ప్రక్షిపతి స్మ. తదా బహుభిర్బన్ధువర్గైర్వార్యమాణోఽప్యనుపరతః ప్రత్యుత తానపి సహకారిణో వవ్రే. తాంశ్చపతనోత్పతనాభ్యాం బహుధా క్లిశ్యతః సర్వానవలోక్య కృపాలుర్నారదో గరుడం సమీపే ప్రేషయామాస. తతో గరుడపక్షవాతేన శుష్యన్ సముద్రో భీతస్తాన్యణ్డాని ఆనీయ పక్షిణే దదౌ." ఏవమఖేదేన మనోనిరోధే పరమధర్మే ప్రవర్తమానం యోగినమీశ్వరోఽనుగృహ్ణాతి. అఖేదశ్చ మధ్యే మధ్యే తదనుకూల వ్యాపారమిశ్రణేన సంపద్యతే, యథౌదనం భుఞ్జానస్తత్తద్గ్రాసాన్తరే చోష్యలేహ్యాదీన్యాస్వాదయతి తద్వత్. ఇదమేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ:—

వ్యా. ఉపాయమువలన యోగమును ఏ విధములు పొందవచ్చునో గౌడపాదాచార్యులు దృష్టాంతసహితముగా చెప్పినారు —

''దర్భ చివరి భాగమునకు లగ్నమయే ఒక నీటి చుక్క చొప్పున నీరు పైకి తీసివేసి సముద్రము గర్వమును నిగ్రహించినట్లు మనస్సును శ్రమపడకుండా నిగ్రహించుకొనవచ్చును''.

(పై శ్లోకములో దృష్టాంతముగా సూచించిన కథ క్రిందచెప్పబడు చున్నది) ''ఎంత బలవంతుడైనను ఒక్కడు చాలమందితో విరోధము పెట్టు కొనకూడదు అట్టివాడు తీతువుపిట్టనుండి సముద్రము పరాభవము చెందినట్లు పరాభవము చెందును."

ఈ సందర్భమున సంప్రదాయమును ఎరిగినవారు ఒక అఖ్యాయికను చెప్పుచున్నారు - "సముద్రము గర్వించి తన తీరమునందున్న ఒక పక్షి

గ్రుడ్లను అవహరించెనట "సముద్రము ఎండిపోవునట్లు చేసెదను" అని సంకల్పించి ఆ పక్షి తన ముక్కుతో ఒక్కొక్క జలబిందువును తీసి బైటకు విసరివేయుచుండెను. అప్పుడు అనేకపక్షులు, తన బంధువులు నివారించు చున్నను అది విరమించుటకు బదులు, "మీరు కూడ నాకు సాహాయ్యము చేయుడు" అని వాటిని కోరెను. అవన్నీ పైకి ఎగురుచు, క్రిందికి వాలుచు శ్రమపడుచుండుట చూచి నారదుడు దయతో గరుత్మంతుని అక్కడకు పంపెను. అప్పుడు గరుత్మంతుని రెక్కల గాలికి ఎండిపోవు చున్న సముద్రము భయపడి, ఆ గ్రుడ్లను తీసికొని వచ్చి ఆ పక్షికి ఇచ్చివేసెనట." ఈ విధముగ అలసట, విసుగు అను మాట లేక మనోనిరోధ మను ఉత్తమ ధర్మమునందు ప్రవర్తించు యోగిని ఈశ్వరుడు అనుగ్రహించును. మధ్య మధ్య దానికి (మనోనిరోధమునకు) అనుకూలమైన మరి కొన్ని పనులు కలుపుచుండుటచేత విసుగు కలుగకుండ ఉండును. అన్నమును తినుచున్న వాడు ఒక్కొక్క గ్రాసమునకు మధ్య పులుసు, పచ్చడి మొదలగు వాటిని ఎట్లు ఆస్వాదించుచుండునో అట్లే ఈ అభిప్రాయముచేతనే వసిష్ఠుడు (లఘుయోగవాసిష్ఠములో 21.36 38) చెప్పెను:—

మూ. చిత్తస్య భోగైర్ద్వౌ భాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్
గురుశుశ్రూషయా భాగమవ్యుత్పన్నస్య సత్క్రమే.

వ్యా. చిత్తమునకు మంచి మార్గమునందు సరియైన స్థితి కుదర నప్పుడు దాని రెండు భాగములను భోగములచేత నింపవలెను ఒక భాగ మును శాస్త్రాభ్యాసముచేతను, ఒక భాగమును గురుశుశ్రూషచేతను నింప వలెను.

మూ. "కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచిన్తయా"

వ్యా. "కొంచెము స్థైర్యము లభించిన పిమ్మట ఒక భాగమును భోగ ములచేత నింపవలెను. రెండు భాగములను గురుశుశ్రూషచేతను, ఒక భాగ మును శాస్త్రార్థచింతచేతను నింపవలెను."

మూ. "ప్రవృత్తిమనుయాతస్య పూరయేచ్చేతసోఽన్వహమ్
ద్వౌ భాగౌ శాస్త్రవైరాగ్యైర్ద్వౌ ధ్యానగురుపూజయా"

వ్యా. "చిత్తమునకు స్థైర్యము లభించిన పిమ్మట ప్రతిదినము దాని (దినముయొక్క) రెండు భాగములను శాస్త్రచింతనావైరాగ్యములచేతను, రెండు భాగములను ధ్యానగురుపూజలచేతను నింపవలెను"

మూ. భోగశబ్దేనాత్ర జీవనహేతుర్భిక్షాటనాదివ్యాపారో వర్ణాశ్రమోచితవ్యాపారశ్చోచ్యతే. ఘటికామాత్రం ముహూర్తం వా యథాశక్తి యోగమభ్యస్య తతో ముహూర్తం స్వదేహమనుసృత్య, ముహూర్తం యోగశాస్త్రం పర్యాలోచ్య పునర్ముహూర్తం యోగమభ్యస్యేత్. ఏవం యోగప్రాధాన్యేన వ్యాపారాన్తరాణి మేలయన్ తాని ద్రాగభ్యస్య శయనకాలే తద్దినగతాన్ యోగముహూర్తాన్ గణయేత్. తతః పరేద్యుర్వా పరపక్షే వా, పరమాసే వా యోగముహూర్తాన్ వర్ధయేత్. తథా చైకైకస్మిన్ ముహూర్తే ఏకైకక్షణయోగేఽపి సంవత్సరమాత్రేణ భూయాన్ యోగకాలో భవతి. న చైవం యోగైకశరణత్వే వ్యాపారాన్తరాణి లుప్యేరన్నితి శఙ్కనీయమ్; లుప్తేతరకృత్స్నవ్యాపారస్యైవ యోగేఽధికారాత్. అత ఏవ విద్వత్సంన్యాసోఽపేక్ష్యతే. తస్మాత్ తదేకనిష్ఠః పుమానధ్యేతృవణిగాదివత్ క్రమేణ యోగారూఢో భవతి.

వ్యా. ఇక్కడ భోగ మనగా జీవనమునకు హేతువైన (అవసరమైన) భిక్షాటనాదివ్యాపారము, వర్ణాశ్రమాదులకు సంబంధించిన వ్యాపారము అని అర్థము. ఒక గడియసేపు (24 నిమిషములు) గాని, ఒక ముహూర్తముగాని (48 నిమిషములు) శక్త్యనుసారము యోగమును అభ్యసించి, పిమ్మట ముహూర్తకాలము తన దేహమునకు కావలసిన పనులు చేసికొని, ముహూర్తకాలము యోగశాస్త్రపర్యాలోచనము చేసి, మరల ఒక ముహూర్తము యోగా

ఖ్యాసము చేయవలెను. ఈ విధముగ యోగమునకు ప్రాధాన్య ముండు నట్లు ఇతరవ్యాపారములను కలుపుకొనుచు వాటిని శీఘ్రముగా అభ్యసించి, శయనించే సమయమునందు ఆ రోజు తా నెన్ని ముహూర్తములు యోగము గడిపినాడో లెక్కపెట్టుకొనవలెను. పిమ్మట మరునాడు కాని, తరువాతి పక్షమునందు గాని, తరువాతి మాసమునందు గాని యోగముహూర్తములను పెంచుకొనుచుపోవలెను ఆ విధముగా ఒక్కొక్క ముహూర్తమునకు ఒక్కొక్క క్షణము కలిపినను ఒక సంవత్సరములో యోగమునకు వెచ్చించిన సమయము చాల ఎక్కువ అగును. ఈ విధముగా యోగమునకు ఒక్క దానికే అంత ప్రాధాన్య మిచ్చినచో ఇతరకార్యము లన్నీ చెడిపోవును కదా అని అశంకించరాదు. ఎందుచేత ననగా ఇతరవ్యాపారము లేవీ లేనివానికే యోగమునందు అధికారము. అందుచేతనే విద్వత్సంన్యాసము అవశ్యకము. అందువలన ఆ యోగమునందు ఒక్కదానియందే నిష్ఠ గలవాడు అధ్యయనము చేయువాడు, వర్తకుడు మొదలైనవారు వలె క్రమముగా యోగారూఢుడగును.

మూ. యథాధ్యేతా మాణవకః పాఠాంశం, పాదమ్, అర్ధర్చమ్, ఋచమ్, ఋగ్ద్వయం, వర్గం చ క్రమేణ పఠన్ దశద్వాదశవర్షైరధ్యాపకో భవతి, యథా చ వాణిజ్యం కుర్వన్నేకనిష్కద్వినిష్కాదిక్రమేణ లక్షపతిః, కోటిపతిర్వా భవతి తథా తాభ్యాం వణిగధ్యేతృభ్యాం సహైవావోపక్రమ్య వత్సరగ్రస్త ఇవ యుఞ్జానస్తావతా కాలేన కుతో న యోగమారోహేత్ ? తస్మాత్పునః పునః ప్రాప్యమాణాన్ సంకల్పవికల్పానుద్దాలకవత్ పౌరుషప్రయత్నేన పరిత్యజ్యాహంకర్తరి జ్ఞానాత్మని మనో నియచ్ఛేత్.

వ్యా. వేదాధ్యయనము చేయు పిల్లవాడు పాదములో ఒక భాగమును, ఒక పాదమును, సగము ఋక్కును (రెండు పాదములను), ఒక ఋక్కును, రెండు ఋక్కులను, ఋక్కుల వర్గమును క్రమముగా చదువుచు పది పండ్రెండు సంవత్సరములలో ఎట్లు అధ్యాపకుడు అగునో, వర్తకము చేయు

వాడు ఒక నిష్కము, రెండు నిష్కములు ('నిష్కము' ఒక నాణెమునకు పేరు) ఇత్యాదిక్రమముగ లక్షాధిపతి గాని, కోటీశ్వరుడు గాని ఎట్లు అగునో అట్లే ఆ వర్తకునితోను, వేదాధ్యయనము చేయువానితోను కలిసి (వాళ్ల వాళ్ల పనులు చేసికొనుచుండగా) యోగాభ్యాసమునకు ప్రారంభించి అసూయతో కూడినవాడు వలె (వాళ్లతో పోటీపడుచున్నవాడు వలె) యోగాభ్యాసము చేయువాడు, అంత కాలానికి (పిల్లవాడు అధ్యాపకుడు గాను, వర్తకుడు లక్షాధికారి లేదా కోటీశ్వరుడు, అయేనాటికి) యోగారూఢుడు ఎందుకు కాజాలడు? అందుచే మాటిమాటికి వచ్చుచున్న సంకల్పవికల్పములను, ఉద్దాలకుడు వలె, పౌరుషప్రయత్నముచేత విడచి, అహంకర్త యైన జ్ఞానాత్మ యందు మనస్సును నిలపవలెను.

మూ. తామేతాం ద్వితీయభూమికాం విజిత్య బాలమూకాదివత్ నిర్మనస్కే స్వాభావికే సతి, తతో విశేషాహంకారరూపం విస్పష్టం జ్ఞానాత్మానమస్పష్టే సామాన్యాహంకారే మహత్తత్త్వే నియచ్ఛేత్. యథా స్వల్పాం తన్ద్రాం ప్రాప్తవతో విశేషాహంకారః స్వత ఏవ సంకుచతి, వినైవ తన్ద్రాం తథా విస్మరణే ప్రయతమానస్య అహంకారసంకోచో భవతి. సోఽయం లోకప్రసిద్ధయా తన్ద్రయా తార్కికాభిమతనిర్వికల్ప జ్ఞానేన చ సమానా మహత్తత్త్వమాత్రపరిశేషావస్థా తృతీయా భూమిః. అస్యాం చ అభ్యాసపాటవేన వశీకృతాయాం తమేతం సామాన్యాహంకారరూపం మహాన్తమాత్మానం నిరుపాధితయా శాన్తే చిదేకరసస్వభావే నియచ్ఛేత్.

"మహత్తత్త్వం తిరస్కృత్య చిన్మాత్రం పరిశేషయేత్"

అత్రాపి పూర్వోక్తవిస్మృతిప్రయత్న ఏవ తతోఽప్యతిశయేనోపాయతామాపద్యతే. యథా శాస్త్రాభ్యాసప్రవృత్తస్య వ్యుత్పత్తేః ప్రాక్ ప్రతిగ్రన్థవ్యాఖ్యానాపేక్షాయామపి వ్యుత్పన్నస్య స్వత ఏవోత్తరగ్రన్థార్థః ప్రతిభాతి తథా సమ్యగ్వశీకృతపూర్వభూమేర్యోగిన ఉత్తరభూమ్యుపాయః స్వత ఏవ ప్రతిభాతి. తదేవాహ యోగభాష్యకారః—

"యోగేన యోగో జ్ఞాతవ్యో యోగో యోగాత్ప్రవర్తతే
యోఽప్రమత్తస్తు యోగేన స యోగీ రమతే చిరమ్" ఇతి.

వ్యా. ఈ రెండవ భూమికను జయించి బాలులు, మూగవారు వలె నిర్మనస్త్వము (మనస్సు లేకపోవుట) అలవాటైపోయిన పిమ్మట విశేషాహంకారరూపములో విస్పష్టముగా ఉన్న జ్ఞానాత్మను అస్పష్టమైన సామాన్యాహంకారమైన మహత్తత్త్వములో చేర్చవలెను స్వల్పమైన తంద్ర (కునికిపాట్లు) వచ్చినవాని విశేషాహంకారము స్వయముగానే సంకోచించును; అట్లే తంద్ర లేకుండగానే ఆ విధముగ మరచిపోవుటకు ప్రయత్నము చేయువానికి అహంకారసంకోచము కలుగును. ఈ భూమిక లోకప్రసిద్ధమైన తంద్ర వంటిది. లేదా తార్కికులు చెప్పు నిర్వికల్పకజ్ఞానము వంటిది. ఇది మహత్తత్త్వము మాత్రమే శేషించు మూడవ భూమి.

(ఏదైన ఒక వస్తువును, లేదా వ్యక్తిని చూచినప్పుడు మొట్టమొదటి క్షణములో ఏదో ఒక పదార్థము అను జ్ఞానము మాత్రమే కలుగును పిమ్మట మరు క్షణములో ఇది ఘటము, గోవు, మనుష్యుడు ఇత్యాది వికల్పములు తెలియును. మొదటి క్షణములో కలిగిన జ్ఞానము నిర్వికల్పకజాన మనీ రెండవ క్షణమునుండి కలుగునది సవికల్ప మని తార్కికులు చెప్పుదురు.)

ఈ మూడవ భూమికను కూడ అభ్యాసపాటవముచేత వశము చేసికొనిన పిమ్మట, ఈ సామాన్యాహంకారరూపమైన మహాత్మను, ఉపాధు లేవియు లేకపోవుటచేత శాంత మైన కేవలచిత్స్వరూపమునందు నియమించవలెను. "మహత్తత్త్వమును తిరస్కరించి చిన్మాత్రమును మిగల్చవలెను."
వెనుక చెప్పిన విస్మృతిప్రయత్నమే (మరచిపోవుటకు చేసే యత్నమే)ఇక్కడ కూడ, పూర్వభూమికలోకంటె గూడ ఎక్కువగ ఉపయోగించును ఏదైన ఒక శాస్త్రమును అభ్యసించుటకు ప్రవర్తించువానికి దానిలో వ్యుత్పత్తి కలుగుటకు పూర్వము గ్రంథమును అంతను వ్యాఖ్యానించి చెప్పవలసిన అవసర ముండును. కాని ఆతనికే వ్యుత్పత్తి ఏర్పడిన తరువాత పై గ్రంథములోని విషయము స్వయముగానే అర్థమగును. అట్లే పూర్వభూమికలను బాగుగా

వశము చేసికొన్న యోగికి ఉత్తరభూమికి సంబంధించిన ఉపాయము స్వయముగానే తోచును. ఈ విషయమునే యోగభాష్యకారుడు చెప్పినాడు-
"యోగము సాహాయ్యముతో యోగమును తెలిసికొనవలెను. (ఉత్తర). యోగము [పూర్వ] యోగమునుండి ప్రవర్తించును. యోగము విషయమున ఏమరుపాటు చెందని యోగి చిరకాలము ఆనందించును".

మూ. నను మహత్తత్త్వశాన్త్యాత్మనోర్మధ్యే మహత్తత్త్వోపాదానమవ్యక్తాఖ్యం తత్త్వం శ్రుత్యోదాహృతమ్, తత్ర కుతో నియమనం నాభిధీయతే ఇతి చేత్-న; లయప్రసఙ్గాదితి బ్రూమః. యథా ఘటోఽను పాదానే జలే నిరుధ్యమానో న లీయతే; ఉపాదానభూతాయాం తు మృది లీయతే తథా మహత్తత్త్వమాత్మని న లీయతే, అవ్యక్తే తు లీయతే, న చ స్వరూపలయః పురుషార్థః; ఆత్మదర్శనానుపయోగాత్-
"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" ఇతి పూర్వవాక్యే ఆత్మదర్శనం విధాయ సూక్ష్మత్వసిద్ధయే నిరోధస్యాభిధానాత్. లయస్య ప్రతిదినం సుషుప్తౌ స్వతః సిద్ధత్వేన ప్రయత్నవైయర్థ్యాచ్చ.

వా. (ఆశంక) మహత్తత్త్వమునకు ఆత్మకూ మధ్య మహత్తత్త్వమునకు ఉపాదానకారణమైన అవ్యక్త మను తత్త్వమును కూడ శ్రుతి చెప్పినది కదా; దానియందు నియమించవలె నని ఎందుకు చెప్పలేదు? (సమాధానము) అది లోపము కాదు. అట్లు చేసినచో లయము కలుగును గాన అట్లు చెప్పలే దని అనెదము. ఘటమును, దానికి ఉపాదానకారణము కాని జలములో నిరోధించినను అది దానిలో లీనము కాదు; కాని దానికి ఉపాదానకారణమైన మట్టిలో నిరోధించినచో దానిలో లీనమైపోవును; అట్లే మహత్తత్త్వము ఆత్మలో లీనము కాదు; అవ్యక్తములో లీనమైపోవును; ఆ విధముగ (మహత్తత్త్వ) స్వరూపము లీనమైపోవుట పురుషార్థము కాదు; ఎందుచేత ననగా అది ఆత్మదర్శనమునకు ఉపయోగించదు. పూర్వవాక్యములో- "సూక్ష్మదృష్టికలవారిచేత, సూక్ష్మము, ఏకాగ్రమూ అయిన బుద్ధిచేత (ఆత్మ)

చూడబడును" అని ఆత్మదర్శనమును విధించి (ఆత్మను చూడవలె నని చెప్పి), సూక్ష్మత్వము సిద్ధించుటకై నిరోధము చెప్పబడినది. (మహత్తత్త్వమునకు దాని కారణములో) లయము ప్రతిదినము సుషుప్త్యవస్థలో జరుగుచునే ఉన్నది గాన దానిని గూర్చి ప్రయత్నము వ్యర్థము కూడ

మూ. నను ధారణాధ్యానసమాధిభిః సాధ్యస్య సంప్రజ్ఞాతస్య ఐకాగ్ర్యవృత్తిరూపత్వేన దర్శనహేతుత్వేఽపి శాన్తాత్మన్యవరుద్ధస్యా సంప్రజ్ఞాతసమాధిమాపన్నస్య చిత్తస్య వృత్తిరహితత్వేన సుషుప్తివన్న దర్శనహేతుత్వమితి చేత్-న; స్వతః సిద్ధస్య దర్శనస్య నివారయితుమశక్యత్వాత్. అత ఏవ శ్రేయోమార్గేఽభిహితమ్.

"ఆత్మానాత్మాకారం స్వభావతోఽవస్థితం సదా చిత్తమ్
ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టి విదధీత." ఇతి.

వ్యా [ఆశంక] ధారణాధ్యానసమాధులచేత సాధింపతగిన సంప్రజ్ఞాతము ఏకాగ్రవృత్తిరూపము. అందుచే అది ఆత్మదర్శనమునకు హేతువు కావచ్చును కాని శాంతాత్మయందు నిరుద్ధమై అసంప్రజ్ఞాతసమాధిని పొందిన చిత్తమునకు వృత్తులే ఉండవు గాన అది సుషుప్తివంటి దగుటచే ఆత్మదర్శనమునకు హేతువు కాజాలదుకదా ? [సమాధానము] అట్లు కాదు. స్వతఃసిద్ధమైన ఆత్మదర్శనమును నివారింపశక్యము కాదు గదా అందుచేతనే శ్రేయోమార్గములో చెప్పబడినది. "చిత్తము ఎల్లప్పుడు ఆత్మాకారముతోను, అనాత్మాకారముతోను ఉండుట దానికి స్వాభావికము దానికి ఉన్న అనాత్మదృష్టిని తొలగించి కేవలాత్మాకారముగా చేయవలెను".

మూ. యథా ఘట ఉత్పద్యమానః స్వతో వియత్పూర్ణ ఏవోత్పద్యతే, జలతణ్డులాదిపూరణం తు ఉత్పన్నే ఘటే పశ్చాత్ పురుషప్రయత్నేన భవతి. యథా తత్ర జలాదౌ నిఃసారితేఽపి న వియన్నిస్సారయితుం శక్యతే; ముఖపిధానేఽప్యన్తర్వియదవతిష్ఠత ఏవ, తథా చిత్తముత్పద్యమానమాత్మచైతన్యపూర్ణమేవోత్పద్యతే. ఉత్పన్నే చిత్తే

పశ్చాద్యథా మూషానిషిక్తద్రుతతామ్రవత్ ఘటపటరూపరససుఖదుఃఖాది వృత్తిరూపత్వం భోగహేతుధర్మాధర్మాదివశాత్ భవతి. తత్ర రూపరసాద్యనాత్మాకారే నివారితేఽపి నిర్విషయశ్చిదాకారో న నివారయితుం శక్యతే, తతో నిరోధసమాధినా నిర్వృత్తికేన సంస్కారమాత్రశేషతయా సూక్ష్మేణ చిదాత్మమాత్రాభిముఖత్వాదేకాగ్రేణ చిత్తేన నిర్విఘ్నమాత్మానుభూయతే. అనేనైవాభిప్రాయేణ వార్తికకారసర్వానుభవయోగినావాహతుః—

"సుఖదుఃఖాదిరూపిత్వం ధియో ధర్మాదిహేతుకః
నిర్హేతుత్వాత్మసంబోధరూపత్వం వస్తువృత్తితః,
ప్రశాన్తవృత్తికం చిత్తం పరమానందదీపకమ్
అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాం ప్రియః." ఇతి.

ఆత్మదర్శనస్య స్వతఃసిద్ధత్వేఽపి అనాత్మదర్శననివారణాయ నిరోధాభ్యాసః. అత ఏవోక్తమ్—

"ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్"
(భ.గీ. 7.25) ఇతి.

వ్యా॥ ఘటము పుట్టుచున్నప్పుడు సహజముగా ఆకాశముతో నిండియే పుట్టును. ఘటములో నీరు, బియ్యము మొదలైనవి నింపుట అది పుట్టిన పిమ్మట పురుషప్రయత్నముచేత జరుగును దానిలో నింపిన జలాదులను తీసివేసినను ఆకాశము బైటకు తీసివేయుటకు శక్యము కాదు. దాని మూతి బిగించివేసినను లోపల ఆకాశము ఉండును అట్లే చిత్తము పుట్టుచున్నప్పుడు ఆత్మచైతన్యముతో నిండియే పుట్టును. చిత్తము పుట్టిన పిమ్మట, రాగి మొదలైనవాటిని కరిగించి మూసలో పోసినప్పుడు ఆ రాగి ఆ యా ఆకారములను పొందినట్లు, ఆ చిత్తములో ఘటపటములు, రూపరసములు, సుఖదుఃఖములు మొదలైన వృత్తుల రూపమున పరిణామము కలుగుచుండును. ఇదంతయు భోగమునకు హేతువైన ధర్మాధర్మాదులను పట్టి జరుగు

చుండును. ప్రయత్నించి, అనాత్మలైన రూపరసాదుల ఆకారము గల వృత్తులు కలుగకుండు నట్లు చేసినను, ఏ కారణము లేకుండా సహజముగా ఉన్న చిదాకారమును నివారించుటకు శక్యము కాదు. అప్పుడు చిత్తము నిరోధసమాధిచేత వృత్తు లేవీ లేకుండ, కేవలము సంస్కారముమాత్రమే మిగులుటచే సూక్ష్మముగాను చిదాత్మను గూర్చి మాత్రమే అభిముఖముగా ఉండుటచే ఏకాగ్రముగాను ఉండును. అట్టి చిత్తముచేత నిర్విఘ్నముగా ఆత్మను అనుభవించవచ్చును ఈ అభిప్రాయముచేతనే వార్తికకార సర్వానుభవయోగులు ఇట్లు చెప్పిరి —

"ధర్మము మొదలైన కారణములచేత చిత్తము సుఖదుఃఖాదిరూపమునూ పొందుచుండును అది ఆత్మజ్ఞానరూపముగా ఉండుటకు కారణ మేదీ లేదు. అది వస్తు (దాని) స్వభావముచేతనే అట్లుండును. ఇతరవృత్తు లన్నీ శాంతించిన చిత్తము పరమానందమును దీపింపచేయును. ''అసంప్రాజ్ఞాతము" అను పేరు గల ఈ సమాధి యోగులకు ప్రియమైనది".

ఈ విధముగ ఆత్మదర్శనము స్వతః సిద్ధమే అయినను, [అప్రయత్నముగా లభించునదే అయినను] అనాత్మవస్తువుల దర్శనము లేకుండుటకై నిరోధాభ్యాసము చేయవలెను. అందుచేతనే భగవద్గీతలో - ''మనస్సును ఆత్మయందు నిలిపి ఇతరమైనదానిని దేనినీ చింతించగూడదు" అని చెప్పబడినది.

మూ. యోగశాస్త్రస్య చిత్తచికిత్సకసమాధిమాత్రే ప్రవృత్తత్వాన్నిరోధసమాధావాత్మదర్శనం తత్ర న సాక్షాదుక్తమ్. భఙ్గ్యన్తరేణ త్వభ్యుపగమ్యతే; "యోగశ్చిత్తవృత్తినిరోధః'' (1.2)ఇతి. సూత్రయిత్వా"తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్" ఇతి సూత్రణాత్.యద్యపి నిర్వికారో ద్రష్టా సదా స్వరూప ఏవావతిష్ఠతే, తథాపి వృత్తిషూత్పద్యమానాసు తత్ర చిచ్ఛాయాయాం ప్రతిబిమ్బితాయాం తదవివేకాదస్వస్థ ఇవ ద్రష్టా భవతి. తదప్యనన్తరసూత్రేణోక్తమ్—"వృత్తిసారూప్యమితరత్ర"(1.4) ఇతి. అన్యత్రాపి సూత్రితమ్ — "సత్త్వపురుష

యోరత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థత్వాత్." (3.36) ఇతి, "చితేరప్రతిసంక్రమాయాస్తదాకారాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్" ఇతి చ.

వ్యా. చిత్తమునకు చికిత్స చేయు సమాధిని ప్రతిపాదించుటయే యోగశాస్త్రప్రధానోద్దేశ్య మగుటచే నిరోధసమాధియందు ఆత్మదర్శనము కలుగునని ఆ శాస్త్రములో సాక్షాత్తుగా చెప్పబడలేదు అయితే మరొక పద్ధతిలో ఈ విషయమును కూడ సూచించుట జరిగినది. ఎందుచేత ననగా "చిత్తవృత్తులను నిరోధించుట యోగము'' అని ముందు చెప్పి తరువాతి సూత్రములో "అప్పుడు ద్రష్ట [తెలిసికొను జీవాత్మ] స్వస్వరూపములో ఉండును'' అని సూత్రము చెప్పబడినది. వాస్తవమున ద్రష్టకు ఎట్టి వికారములు లేవు గాన అతడు ఎల్లప్పుడు స్వరూపమునందే ఉండును. అయినను ఆ యా వృత్తులు పుట్టినప్పుడు చిచ్ఛక్తియొక్క ఛాయ వాటియందు ప్రతిబింబించుటచే ఆ వృత్తులతో కలసిపోవుటచే, వాటికంటె వేరుగా భాసించకపోవుటచే ద్రష్ట అస్వస్థుడు [స్వరూపమునందు స్థితి లేనివాడు] వలె అగును ఈ విషయము కూడ తరువాతి సూత్రములో చెప్పబడినది-"ఇతరసమయములందు [యోగము లేనప్పుడు] చిత్తవృత్తులతో సారూప్యము [సమానమైనరూపము కలిగియుండుట] ఉండును" మరొక స్థానమునందు కూడ ఒక సూత్రములో చెప్పబడినది - "పరస్పరము చాల భేదము గల చిత్తపురుషులు ఒకటిగా భాసించుట భోగము, ప్రధానము ప్రవృత్తి పురుషునికోసము గాన ఈ భోగము జరుగుచున్నది".

(ఈ సూత్రము వ్యాసభాష్యానుసారము వేరుగా నున్నది. "సత్త్వపురుషయోరత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థాత్స్వార్థసంయమాత్పురుషజ్ఞానమ్" అని పూర్తి సూత్రము. "పరార్థాత్'' కు బదులు ''పరార్థత్వాత్" అను పాఠ మున్నట్లు ఒక ప్రతిలో ఉన్నది. బహుశా విద్యారణ్యులు సూత్రములో కొంత భాగము మాత్రము ఉద్ధరించి ఉందురు).

''బుద్ధి చిదాకార మైనప్పుడు పరిణామరహితమైన చిచ్ఛక్తికి స్వీయమైన బుద్ధివృత్తియొక్క జ్ఞానము కలుగును'' అని కూడ చెప్పబడినది.

మూ. నిరోధసమాధినా శోధితే త్వంపదార్థే సాక్షాత్కృతేఽపి తస్య బ్రహ్మత్వం గోచరయితుం మహావాక్యేన బ్రహ్మవిద్యానామకం వృత్త్యన్తరముత్పద్యతే. న చ శుద్ధత్వంపదార్థసాక్షాత్కారే నిరోధ సమాధిరేక ఏవ ఉపాయః; కింతు చిజ్జడవివేకేనాపి పృథక్కృతే తత్ర సాక్షాత్కారసంభవాత్.అత ఏవ వసిష్ఠ ఆహ—

"ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ
యోగస్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్."

(ఉ.వా. **27.72**) ఇతి.

"అసాధ్యః కస్య చిద్యోగః కస్య చిద్ జ్ఞాననిశ్చయః
ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః."

(ఉ.వా. **29.60**) ఇతి చ.

**వ్యా.** నిరోధసమాధిచేత శోధింపబడిన త్వంపదార్థము (జీవాత్మ) సాక్షాత్కరింపచేసికొనబడినను అది బ్రహ్మయే అను విషయమును తెలుపుటకు మహావాక్యము ద్వారా బ్రహ్మవిద్య అను పేరు గల మరొక వృత్తి పుట్టును. మరొక విషయ మేమనగా-శుద్ధమైన త్వంపదార్థమును సాక్షాత్కరింపచేసికొనుటకు ఉపాయము నిరోధసమాధి ఒక్కటియే కాదు. చిత్ను జడమును వేరువేరుగా గ్రహించి వాటిని విడదీసి చూచినను త్వంపదార్థ సాక్షాత్కారము కలుగును. అందుచేతనే వసిష్ఠుడు ఇట్లు చెప్పెను—

''రామా! చిత్తనాశమునకు యోగము, జ్ఞానము అనునవి రెండు పద్ధతులు ఆ చిత్తములవృత్తులను నిరోధించుట యోగము. తత్త్వమును తెలిసికొనుట జ్ఞానము''.

''కొంతమందికి యోగము సాధ్యము కాదు, కొంతమందికి జ్ఞాననిశ్చయము సాధ్యము కాదు. అందుచేతనే పరమేశ్వరుడు రెండు పద్ధతులను చెప్పినాడు''

మూ. నను వివేకోఽపి యోగే పర్యవస్యతి; దర్శనవేలాయా మాత్మమాత్రగోచరాయా ఏకాగ్రవృత్తేః క్షణికసంప్రజ్ఞాతరూపత్వాత్. బాఢమ్. తథాపి సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతయోః స్వరూపతః సాధనతశ్చాత్యైవ మహద్వైలక్షణ్యమ్. వృత్త్యవృత్తిభ్యాం స్ఫుటః స్వరూపభేదః. సాధనం తు సంప్రజ్ఞాతస్య సజాతీయత్వాద్ధారణాదిత్రయమన్తరఙ్గమ్, అసంప్రజ్ఞాతస్య తు అవృత్తికస్య విజాతీయత్వాద్బహిరఙ్గమ్. తథా చ సూత్రమ్—"తదపి బహిరఙ్గం నిర్బీజస్య"(3.8) ఇతి. విజాతీయత్వేఽపి బహువిధానాత్మవృత్తినివారణోపకారితయా బహిరఙ్గత్వమవిరుద్ధమ్. తదేవోపకారిత్వం విశదయితుం సూత్రయతి – "శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్"(1.20) ఇతి. తేషాం చిద్దేవాదీనాం పూర్వసూత్రే జన్మనైవ సమాధిముక్త్వా మనుష్యాన్ ప్రత్యేతదుచ్యతే."మమాయం యోగః పరమపురుషార్థసాధనమ్"ఇతి ప్రత్యయః శ్రద్ధా. సా చోత్కర్షశ్రవణేనోపజాయతే. తదుత్కర్షశ్చ స్మర్యతే—

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున"

(భ.గీ. 6.46) ఇతి.

వ్యా. (ఆశంక) వివేకము కూడా చివరికి యోగమునందే పర్యవసానము చెందును కదా ? ఎందుచేత ననగా ఇది ఆత్మ, ఇది అనాత్మ అని చూచు సమయమున ఆత్మమాత్రమే విషయముగా ఉన్న ఏకాగ్రమైన చిత్తవృత్తి క్షణికమైన సంప్రజ్ఞాతమే కదా ? సమాధానము) నిజమే అయినను సంప్రజ్ఞాతసమాధికిని, అసంప్రజ్ఞాతసమాధికిని స్వరూపముచేత, సాధనముచేత చాల వైలక్షణ్య మున్నది ఒకటి వృత్తి, రెండవది వృత్తి కాదు అను భేదము స్పష్టము. సంప్రజ్ఞాతమునకు సజాతీయము లగుటచేత ధారణాదులు మూడు అంతరంగసాధనములు ; వృత్తి లేని అసంప్రజ్ఞాతమునకు అవి విజాతీయములు గాన బహిరంగములు. ఈ విషయము సూత్రములో కూడ

చెప్పబడినది - ''అది నిర్బీజమునకు బహిరంగము'' విజాతీయములే అయి నను అనేకవిధములైన అనాత్మవృత్తులు కలుగ కుండ ఉపకరించును గాన అవి బహిరంగసాధనము లగుటలో విరోధము లేదు. ఆ ఉపకారిత్వమును విశదీకరించుటకు సూత్రము చెప్పినాడు. "ఇతరులకు శ్రద్ధ, వీర్యము, స్మృతి, సమాధి, ప్రజ్ఞ అనునవి ఉన్నచో అసంప్రజ్ఞాతము లభించును". కొందరు దేవతాదులకు జన్మచేతనే సమాధి సిద్ధించును అని వెనుకటి సూత్ర ములో చెప్పి ఈ సూత్రము మనుష్యుల విషయమున చెప్పబడుచున్నది "నాకు ఈ యోగమే పరమపురుషార్థమునకు సాధనము" అను నమ్మకము శ్రద్ధ. గముయొక్క గొప్పతనమును గూర్చి వినుటచే ఆ శ్రద్ధ కలుగును. దాని గొప్పతనము భగవద్గీతలో చెప్పబడినది —

''తపస్సు చేసికొనే మునులకంటె యోగి గొప్పవాడు. జ్ఞానులకంటె గొప్పవాడు. కర్మచేసే వారికంటె కూడ గొప్పవాడు. అర్జునా! నీవు అందు చేత యోగి వగుము".

మూ. ఉత్తమలోకసాధనత్వాత్ కృచ్ఛ్రచాన్ద్రాయణాదితపసః జ్యోతిష్టోమాదికర్మణశ్చ యోగోఽధికః. జ్ఞానం ప్రత్యన్తరఙ్గత్వాచ్చి త్తవిశ్రాన్తిహేతుతయా చ జ్ఞానతోఽప్యధికః. ఏవం జానతో యోగే శ్రద్ధా జాయతే. తస్యాం చ శ్రద్ధాయాం వాసితాయాం వీర్యమ్ ఉత్సాహః భవతి - సర్వథా యోగం సంపాదయిష్యామీతి. ఏతాదృశేనోత్సాహేన తదా తదానుష్ఠేయాని యోగాఙ్గాని స్మర్యన్తే.తయా చ స్మృత్యా సమ్యగనుష్ఠితసమాధేరధ్యాత్మప్రసాదే సత్యృతంభరా ప్రజ్ఞోదేతి. తత్ప్రజ్ఞాపూర్వకః తత్ప్రజ్ఞాకారణకః అసంప్రజ్ఞాతసమాధిరితరేషాం దేవాదిభ్యోఽర్వాచీనానాం మనుష్యాణాం సిధ్యతి.

వ్యా. యోగము ఉత్తమలోకమునకు సాధనము. (ఉత్తమలోకమనగా ఆత్మ ; ఆత్మసాక్షాత్కారము). అందుచేత ఇది కృచ్ఛ్రచాంద్రాయణము మొదలైన తపస్సుకంటెను, జ్యోతిష్టోమాదికర్మకంటెను అధికమైనది. జ్ఞానమునకు ఇది అంతరంగము, చిత్తవిశ్రాంతికి హేతువు; అందుచేత

జ్ఞానముకంటె అధికము. ఈ విధముగ తెలిసికొనినవానికి యోగమునందు శ్రద్ధ కలుగును. ఆ శ్రద్ధ ఏర్పడిన పిమ్మట వీర్యము అనగా "తప్పక యోగమును సంపాదించెదను" అను ఉత్సాహము కలుగును. ఇట్టి ఉత్సాహముచేత ఆ యా సమయములలో చేయదగిన యోగాంగములు స్మరింపబడును. ఈ విధముగ స్మరించుచు సమాధిని చక్కగా అనుష్ఠించినవానికి చిత్తము ప్రసన్నమై ఋతంభరప్రజ్ఞ ఉదయించును. ఆ ప్రజ్ఞ పూర్వము నందు గల, అనగా అది కారణముగా గల అసంప్రజ్ఞాతసమాధి ఇతరులకు అనగా దేవాదులకంటె అర్వాచీనులైన మనుష్యులకు కలుగును. (ఇది పైన ఉదాహరించిన సూత్రమునకు అర్థము).

మూ. తాం చ ప్రజ్ఞాం సూత్రయతి–"ఋతంభరా తత్ర ప్రజ్ఞా" (1.48) ఇతి. ఋతం సత్యం వస్తుయాథాత్మ్యం బిభర్తి ప్రకాశయతీతి ఋతంభరా.తత్ర తస్మిన్ సమాధ్యుత్కర్షజన్యేఽధ్యాత్మప్రసాదే సతీత్యర్థః. ఋతంభరత్వోపపత్తిం సూత్రయతి – "శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్"(1.49)ఇతి. సూక్ష్మవ్యవహితవిప్రకృష్టవస్తుష్వయోగిప్రత్యక్షం న ప్రవర్తతే. ఆగమానుమానాభ్యాం తాని వస్తూన్యయోగిభిః జ్ఞాయన్తే. తే చ శాస్త్రానుమానజన్యే ప్రజ్ఞే వస్తుసామాన్యమేవ గోచరయతః.ఇదం తు యోగిప్రత్యక్షం వస్తువిశేషగోచరత్వా దృతంభరమ్.

వ్యా. ఆ ప్రజ్ఞను సూత్రించుచున్నాడు-"అప్పుడు ప్రజ్ఞ ఋతంభరయై ఉండును" ఋతమ్ - సత్యమును, వస్తుయథార్థ - స్వరూపమును, బిభర్తి= ప్రకాశింపచేయుచున్నది గాన, "ఋతంభర" అని చెప్పబడుచున్నది. తత్ర=సమాధియొక్క ఉత్కర్ష (అతిశయము) వలన కలిగిన అధ్యాత్మ ప్రసాదము (చిత్తప్రసాదము) ఉన్నప్పుడు అని అర్థము. అది 'ఋతంభర" ఎందు కైనదో చెప్పుచున్నాడు – "ఇది విశేషార్థము గాన శ్రుతానుమానప్రజ్ఞలకంటె వేరైన విషయము గలది". యోగులు కానివారి ప్రత్యక్షము సూక్ష్మములు, వ్యవహితములు [దేనిచేతనైన కప్పబడినవి], దూర

ములు అయిన వస్తువుల విషయమున ప్రవర్తింపజాలదు వారు [యోగులు కానివారు] అట్టి వస్తువులను శాస్త్రముచేతను, అనుమానముచేతను తెలిసికొనుచుందురు. కాని శాస్త్రమువల్ల అనుమానమువల్ల కలిగిన జ్ఞానములు ఆ వస్తువులను గూర్చి సామాన్యరూపముననే తెలుప గలవు గాని వాటి విశేష రూపములను తెలుపజాలవు. ఈ యోగిప్రత్యక్షము ఆ వస్తువుల విశేష రూపములను కూడ తెలుపగలదు. అందుచేతనే దానికి ''ఋతంభరము'' అని పేరు.

మూ. తస్య చ యోగిప్రత్యక్షస్యాసంప్రజ్ఞాతసమాధౌ బహిరఙ్గత్వసిద్ధ్యర్థమ్ ఉపకారిత్వం సూత్రయతి - "తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబన్ధీ." (1.50) ఇతి. అసంప్రజ్ఞాతసమాధేర్బహిరఙ్గసాధనముక్త్వా తన్నిరోధప్రయత్నస్యాన్తరఙ్గసాధనతాం సూత్రయతి— "తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః"(1.51)ఇతి.న చాసౌ సర్వధీవృత్తిరాహిత్యాత్ సుషుప్తిరేవేతి శఙ్కనీయమ్;మనఃస్వరూపస్య సదసత్త్వాభ్యాం విశేషాత్, తదుక్తం గౌడపాదాచార్యైః—

"నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః
ప్రచారః స తు విజ్ఞేయః సుషుప్తేఽన్యో న తత్సమః"
(3.34)

వ్యా. ఆ యోగిప్రత్యక్షము[ఋతంభరప్రజ్ఞ] అసంప్రజ్ఞాతసమాధిలో బహిరంగము అను విషయమును చెప్పుటకై అది దానికి ఉపకారి యని సూత్రించుచున్నాడు - ''దానివలన కలుగు సంస్కారము ఇతరసంస్కారములకు ప్రతిబంధకము".అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగసాధనమైన ఋతంభరప్రజ్ఞను చెప్పి దానిని నిరోధించుటకై చేయు యత్నము అంతరంగ సాధన మని చెప్పుచున్నాడు ''దానిని కూడ నిరోధించినచో అన్నీ నిరోధింపబడును గాన నిర్బీజసమాధి సిద్ధించును''. ఈ సమాధి సుషుప్తివంటిది. సాక్షిచైతన్యముచే దానిని అనుభవించవచ్చును. ఎట్టి ధీవృత్తులు లేకపోవుటచేత ఇది సుషుప్తియే కదా అని శంకించరాదు. ఎందుచేత ననగా మనఃస్వరూపము,

ఉండుట లేకపోవుట అనుదానిని పట్టి ఆ రెండింటికి భేద మున్నది (సుషుప్తిలో మనస్సు లీనమై పోవును; అసంప్రజ్ఞాతసమాధిలో లీనము కాదు). ఈ విషయమునే గౌడపాదాచార్యులు చెప్పినారు —

''మనస్సు నిగ్రహింపబడి నిర్వికల్పసమాధిలో ఉన్నప్పుడు అది జ్ఞానముతో నిండి సంచరించుచుండును. దాని సంచారము యోలగుకుమాత్రమే తెలియును, సుషుప్తిలోని మనఃసంచారము మరొకవిధముగా ఉండును; దానితో సమానము కాదు''.

మూ. "లీయతే హి సుషుప్తౌ తన్నిగృహీతం న లీయతే
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానాలోకం సమన్తతః" (3.35

వ్యా. సుషుప్తియందు మనస్సు లీన మైపోవును. నిగ్రహింపబడిన మనస్సు లీనము కాదు. అది పూర్తిగా జ్ఞాన మనే తేజస్సుతో నిండి నిర్భయమైన బ్రహ్మస్వరూపమున ఉండును''.

మూ. "ద్వైతస్యాగ్రహణం తుల్యముభయోః ప్రాజ్ఞతుర్యయోః
బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే"
(1.13)

వ్యా. ప్రాజ్ఞతుర్యములు రెండింటిలోను ద్వైతమును గ్రహించకుండుట (ద్వైతము కనబడకపోవుట) తుల్యమే. ప్రాజ్ఞుడు బీజనిద్రతో కూడినవాడు అవిద్యలో లీన మగును . ఆ బీజనిద్ర తుర్యములో లేదు.

మాండూక్యోపనిషత్తులో జీవునకు అవస్థాభేదమును బట్టి మూడు పేర్లు చెప్పబడినవి. జాగ్రదవస్థలో జగత్తును చూచుచున్నవాడు వైశ్వానరుడు, స్వప్నప్రపంచమును చూచువాడు తైజసుడు, సుషుప్త్యవస్థలో ఉన్న జీవుడు ప్రాజ్ఞుడు. ఈ మూడు అవస్థలకు అతీతమైన స్థితి [శుద్ధాత్మరూపస్థితి] తురీయము. ప్రాజ్ఞునకు [సుషుప్తిలో ఉన్నవానికి] తురీయావస్థలోను ద్వైతప్రపంచము భాసించదు. కాని ప్రాజ్ఞుడు అవిద్యలో లీనత్వమును పొందును; తురీయావస్థలో అట్లు అవిద్యాలీనత్వము ఉండదు అని భావము.

మూ. "స్వప్ననిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్ననిద్రయా
న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యన్తి నిశ్చితాః. (1.14)

వ్యా. మొదటి రెండు స్వప్ననిద్రలతో కూడినవి ప్రాజ్ఞుడు స్వప్నము లేని నిద్రలో ఉండును. తురీయావస్థలో స్థిరులైనవారు నిద్రను కాని స్వప్నమును కాని చూడరు.

మూ. "అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రాతత్త్వమజానతః
విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే." (1.15)

వ్యా. "ఉన్నదానిని మరొకవిధముగా గ్రహించువానికి స్వప్నముండును. తత్త్వము తెలియని వానికి నిద్ర ఉండును. ఆ రెండు అవస్థలకు సంబంధించిన విపర్యాసము క్షీణమైనప్పుడు తురీయపదమును పొందును"

మూ. ఆద్యౌ విశ్వతైజసౌ. అద్వైతస్య వస్తునోఽన్యథా గ్రహణం నామ ద్వైతరూపేణ ప్రతిభాసః.స చ విశ్వతైజసయోర్వర్తమానః స్వప్న ఇత్యుచ్యతే. తత్త్వస్య అజ్ఞానం నిద్రా; సా చ విశ్వతైజసప్రాజ్ఞేషు వర్తతే. తయోః స్వప్ననిద్రయోః స్వరూపభూతయోర్విపర్యాసః మిథ్యాజ్ఞానమ్. ("స్వరూపభూతో విపర్యాసః" అను పాఠమై యుండును). తస్మిన్ విద్యయా క్షీణే సతి తురీయం పరమద్వైతం వస్త్వశ్నుతేఽనుభవతీత్యర్థః.

వ్యా. ఆద్యౌ = విశ్వతైజసులు. అద్వైతమైన వస్తువును మరొకవిధముగా గ్రహించుట అనగా ద్వైతరూపమున భాసించుట. అదియే విశ్వతైజసులలో ఉండు స్వప్నము అని చెప్పబడుచున్నది. తత్త్వము తెలియకుండుట నిద్ర. ఈ నిద్ర విశ్వతైజసప్రాజ్ఞులు ముగ్గురిలోను ఉండును. ఆ స్వప్ననిద్రల స్వరూపమైన విపర్యాసము మిథ్యాజ్ఞానము. ఆ మిథ్యాజ్ఞానము విద్యచేత క్షీణించగా తురీయపదమైన అద్వైతవస్తువును, పొందును, అనగా అనుభవించును అని అర్థము.

మూ. నన్వేవమసంప్రజ్ఞాతసమాధిసుషుప్త్యోర్మహాన్ భేదః; తత్ర తత్త్వదిదృక్షోర్దర్శనసాధనత్వేన సమాధ్యపేక్షాయామపి దృష్టతత్త్వస్య జీవన్ముక్తయే నాస్తి తదపేక్షా, రాగద్వేషాదిబన్ధస్య సుషుప్త్యాపి నివృత్తేః; మైవమ్-కిం ప్రతిదినం స్వతః ప్రాప్తా కాదాచిత్కీ-సుషుప్తిర్బన్ధనివర్తికా, కిం వాభ్యాసేన నిరన్తరవర్తినీ? ఆద్యేఽపి కిం సుషుప్తికాలీనస్య క్లేశబన్ధస్య నివృత్తిః, కిం వా కాలాన్తరవర్తినః? నాద్యః, అప్రసక్తేః. న హి మూఢానామపి సుషుప్తౌ క్లేశబన్ధః; అన్యథా-చూసః ప్రసజ్యేత. న ద్వితీయః, అసంభవాత్. న హ్యభ్యాసకాలీనయా సుషుప్త్యా కాలాన్తరవర్తినః క్లేశస్య క్షయః సంభవతి; అన్యథా మూఢానామపి జాగరస్వప్నయోః క్లేశస్య క్షయః ప్రసజ్యేత. నాపి సుషుప్తౌ నైరన్తర్యమభ్యసితుం శక్యమ్, తస్యాః కర్మక్షయనిమిత్తత్వాత్. తస్మాత్ తత్త్వవిదోఽపి క్లేశక్షయాయాస్త్యేవాసంప్రజ్ఞాతసమాధ్యపేక్షా.

వ్యా. (ఆశంక) అసంప్రజ్ఞాతసమాధికి సుషుప్తికి మధ్య ఈ విధముగా చాల భేదము ఉండిన ఉండుగాక. తత్త్వమును చూడదలచినవానికి అట్లు చూచుటకు సాధనముగా సమాధి అపేక్ష ఉన్నను తత్త్వమును చూచినవాడు జీవన్ముక్తి పొందుటకు దాని అపేక్ష లేదు కదా? ఎందుచేత ననగా ఆతని రాగద్వేషాదిక్లేశబంధము సుషుప్తివలన కూడ నశించును. (సమాధానము) అట్లు కాదు. ప్రతిదినము సహజముగానే అప్పుడప్పుడు కలుగు సుషుప్తి బంధమును తొలగించునా, లేక అభ్యాసముచేత నిరంతరము కలుగు సుషుప్తి తొలగించునా? మొదటి పక్షములో కూడ సుషుప్తికాలములో ఉన్న క్లేశబంధము నివర్తించునా లేదా కాలాంతరమునందు కలుగునది నివర్తించునా? మొదటి పక్షము కాదు; ఎందుచేత ననగా సుషుప్తికాలమునందు క్లేశబంధమే ఉండదు గాన అది పోవు ప్రసక్తి లేదు రెండవ పక్షము కూడ కుదరదు ఒక కాలమున్న సుషుప్తి కాలాంతరమునందు కలుగు బంధమును తొలగించుట అసంభవము కదా? అట్లయినచో ప్రతిదినము ఏదో ఒక సమయమున

సుషుప్తి ఉండును గాన ఆత్మజ్ఞానశూన్యులైన మూఢుల జాగ్రత్స్వప్నా వస్థలలోని క్లేశము నశించవలసి ఉండును. నిరంతరము సుషుప్తి ఉండు నట్లు అభ్యసించుట శక్యము కాదు ఎందుచేతననగా ఏపనులూలేకుండుటకే అది (సుషుప్తి) కారణము. (అందుచేత అభ్యాస మనే పని దానిలో ఉండ దని అర్థము) అందువలన తత్త్వవేత్తకు కూడ క్లేశములు క్షీణించవలెనన్నచో అసంప్రజ్ఞాతసమాధి అపేక్ష ఉండును.

మూ. తస్య చ సమాధేర్గవాశ్వాదిష్వివ వాఙ్నిరోధః ప్రథమా భూమిః. బాలమూఢాదిష్వివ నిర్మనస్త్వం ద్వితీయా. తన్ద్రియామివ అహంకారరాహిత్యం తృతీయా. సుషుప్తావివ మహత్తత్త్వరాహిత్యం చతుర్థీ. తదేతద్ భూమిచతుష్టయమభిప్రేత్య "శనైః శనైరుపరమేత్" ఇత్యుక్తమ్.అత్ర చోపరమే ధృతిగృహీతా బుద్ధిః సాధనమ్.మహదహం కారమనోవాగాదీనాం స్వత ఏవ తీవ్రవేగేణ బహిః ప్రవహతాం కూలం కషాయా నద్యా ఇవ నిరోధే ధైర్యం మహదపేక్షితమ్. బుద్ధిర్వివేకః పూర్వా భూమిర్జితా వా న వేతి పరీక్ష్య జితాయాముత్తరభూమ్యు పక్రమః; అజితాయాం తు సైవ పునరభ్యసనీయేతి తదా తదా వివి ఞ్చ్యాత్." "ఆత్మసంస్థమ్" ఇత్యాదినా సార్ధశ్లోకేన చతుర్థభూమ్య భ్యాసోఽపి స్మృతః.

వ్యా గోవులు అశ్వములు మొదలైనవి మాటలాడనట్లు వాక్కును నిరోధించుకొనుట ఆ సమాధికి మొదటి భూమి. బాలులు, మూఢులు మొదలగు వారు వలె మనస్సు లేకుండుట (ఏ ఆలోచనలూ లేకుండుట) రెండవ భూమి. తంద్రలో వలె అహంకారము లేకుండుట మూడవ భూమి. సుషుప్తిలో వలె మహత్తత్త్వము లేకుండుట నాల్గవ భూమి. ఈ నాలుగు భూములను దృష్టిలో ఉంచుకొనియే "శనైః శనైరుపరమేత్" (మెల్ల మెల్లగా ఉపరతిని సంపా దించవలెను) అని (వెనుక ఉదాహరించిన భగవద్గీతాశ్లోకములో) చెప్ప బడినది ఈ ఉపరమమునకు ధృతిచేత నిగ్రహింపబడిన బుద్ధి సాధనము. మహత్తు, అహంకారము, మనస్సు, వాక్కు మొదలైనవి సహజముగానే

తీవ్రవేగముతో బైటకు ప్రవహించుచుండును. ఒడ్డులను ఒరసికొని మహా వేగముతో ప్రవహించు నదిని అడ్డుకొను నట్లు వాటిని నిరోధించుటకు చాల ధైర్యము ఉండవలెను. బుద్ధి అనగా వివేకము. పూర్వభూమి నాకు లొంగి నదా లేదా అని పరీక్షించుకొని పూర్వభూమి లొంగినది అను నమ్మకము ఏర్పడినచో ఉత్తరభూమిని ఉపక్రమించవలెను; అది ఇంకను లొంగనిచో మరల దానినే అభ్యసించవలెను; ఈ విధముగా అప్పుడప్పుడు తెలిసికొను చుండవలెను. "ఆత్మనంస్థమ్'' మొదలైన ఒకటిన్నర శ్లోకములలో చతుర్థ భూమియొక్క అభ్యాసము కూడ చెప్పబడినది.

మూ. గౌడపాదాచార్యా ఆహుః—

"ఉపాయేన నిగృహ్ణీయాద్ విక్షిప్తం కామభోగయోః
సుప్రసన్నం లయే చైవ యథా కామో తథా లయః."

(3.42)

వ్యా. గౌడపాదాచార్యులు కూడ మాండూక్యకారికలలో చెప్పినారు—

"కామములయందు, భోగములయందు విక్షిప్తమై ఉన్న మనస్సు లయమునందు [సుషుప్తియందు] బాగా ప్రసన్నముగానే ఉన్నను దానిని ఉపాయముచేత నిగ్రహించవలెను. కామ మెట్టిదో లయము కూడ అట్టిదే". అందుచేత లయమునందు ప్రసన్నముగా ఉన్నది కదా అని అనుకొనగూడ దని అర్థము.

మూ. "దుఃఖం సర్వమనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్
అజం సర్వమనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి."

(3.43)

వ్యా. "కామభోగాలలో ఉన్న దుఃఖము సంతను స్మరించుచు మన స్సును కామభోగములనుండి మరల్చవలెను. అట్టివాడు ఈ జగత్తు అంతా జన్మరహితపరబ్రహ్మస్వరూపమే. అని గుర్తించి జన్మగల జగత్తు అనునది ఒకటి ఉన్న దని చూడడు".

మూ. "లయే సంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః
సకషాయం విజానీయాత్ సమప్రాప్తం న చాలయేత్."

వ్యా. "చిత్తమునకు లయము కలిగి నపుడు [సుషుప్తి వచ్చి నప్పుడు] దానిని మేల్కొలుపవలెను. విక్షిప్తమైనపుడు శాంతింపచేయవలెను. దానిలో ఏవైన కషాయములు [మాలిన్యములు] ఏర్పడి నప్పుడు వాటిని గుర్తించవలెను. సమమును [బ్రహ్మను] పొందినపుడు దానిని ఆ స్థితినుండి చలింపనీయగూడదు."

మూ. "నాస్వాదయేత్సుఖం తత్ర నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్
నిశ్చలం నిశ్చరచ్చిత్తమేకీకుర్యాత్ప్రయత్నతః." (3.45)

వ్యా. "యోగసాధనాసమయమునందు సుఖము ఉన్నను దానిని ఆస్వాదించకూడదు వివేకముచేత దానియందు ఆసక్తిని చూపకూడదు. నిశ్చలమైన చిత్తము బైటకు పోవుచున్నచో దానిని ప్రయత్నపూర్వకముగ స్థిరము చేయవలెను.''

మూ. యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః
అనిఙ్గనమనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తదా."

(3.46) ఇతి.

వ్యా. "చిత్తము ఎప్పుడు లీనము కాదో, ఎప్పుడు విక్షిప్తము కాదో నిశ్చలముగా, విషయాభాస మేదీ లేకుండా ఉండునో అప్పుడు బ్రహ్మరూపమును పొందిన దని గ్రహించవలెను ''

మూ. లయవిక్షేపకషాయసమప్రాప్తయశ్చత్రస్శ్చిత్తస్యావస్థాః. తత్ర నిరుధ్యమానం చిత్తం విషయేభ్యో వ్యావృత్తం సత్పూర్వాభ్యాసవశాద్యది లయాయ సుషుప్తయేఽభిముఖం భవేత్తదానీముత్థాపనప్రయత్నేన,లయకారణనివారణేన వా తచ్చిత్తం సమ్యక్ ప్రబోధయేత్. లయహేతవో నిద్రావశేషాజీర్ణబహ్వాశనశ్రమాః.అత ఏవాహుః—

"సమాపయ్య నిద్రాం సుజీర్ణాల్పభోజీ
శ్రమత్యాగ్యబాధే వివిక్తే ప్రదేశే
సదాసీత నిస్తృష్ణ ఏవాప్రయత్నో౽
థవా ప్రాణరోధీ నిజాభ్యాసమార్గాత్." ఇతి.

వ్యా. లయము, విక్షేపము, కషాయము, సమప్రాప్తి అని చిత్తావస్థలు నాలుగు. నిరోధింపబడుచున్న చిత్తము విషయములనుండి మరలి, వెనుకటి అలవాటుచేత లయమునకై, అనగా సుషుప్తికై, అభిముఖమైనచో అప్పుడు దానిని లేపు ప్రయత్నముచేత గాని, లయమునకు కారణమును తొలగించుటచేత గాని ఆ చిత్తమును బాగుగా మేల్కొలుప వలెను. ఇంకా నిద్ర పూర్తి కాకపోవుట, అజీర్ణము, ఎక్కువగా తినుట, అలసట ఇవి లయమునకు హేతువులు. అందుచేతనే చెప్పుదురు —

"నిద్రను పూర్తిచేసికొని, బాగుగా జీర్ణమయే అల్పమైన ఆహారమును భుజించుచు, అలసటను విడచి, బాధారహితమైన వివిక్త [నిర్జన] ప్రదేశమునందు, ఎల్లపుడు కూర్చుండవలెను. ఆశలు ఉండగూడదు ఎట్టి ప్రయత్నములు చేయకూడదు. లేదా తనకు తెలిసిన మార్గములో ప్రాణాయామము చేయవలెను.''

మూ. లయాదుత్థాపితం చిత్తం దైనందినప్రబోధాభ్యాసవశాద్వ్యది కామభోగయోర్విక్షిప్యేత, తదా వివేకిజనప్రసిద్ధభోగ్యవస్తుగతసర్వదుఃఖానుస్మరణేన శాస్త్రప్రసిద్ధజన్మాదిరహితాద్వితీయబ్రహ్మతత్త్వానుస్మరణపూర్వకేణ భోగ్యవస్తుదర్శనేన చ పునః పునర్విక్షేపాచ్చిత్తం శమయేత్. కషాయస్త్రీర్వశ్చిత్తదోషః. తీవ్రరాగద్వేషాదివాసనయా గ్రస్తం చిత్తం కదాచిత్ సమాహితమివ లయవిక్షేపరహితం దుఃఖైకాగ్రమవతిష్ఠతే; తాదృశం తచ్చిత్తం విజానీయాత్; సమాహితచిత్తాద్వివేకేనావగచ్ఛేత్. అసమాహితమేతదిత్యవగమ్య లయవిక్షేపవత్ కషాయస్య ప్రతీకారం కుర్యాత్.

వ్యా. లయమునుండి మేల్కొలపబడిన చిత్తము ప్రతిదినము ప్రబోధావస్థలోని అలవాటు ప్రకారము కామములయందు భోగములయందు విక్షిప్తమైనచో, అప్పుడు వివేకవంతులైనవారు ప్రసిద్ధముగా చెప్పుచుండు, భోగ్యవస్తువులలో ఉన్న సమస్తదుఃఖములను స్మరించుటచేతను, భోగ్యవస్తువులను శాస్త్రప్రసిద్ధమైన జన్మాదిరహితాద్వితీయ బ్రహ్మతత్త్వస్మరణపూర్వకముగా చూచుటచేతను [ఆదృష్టితోచూచినచో భోగ్యవస్తువు లన్ని అద్వితీయబ్రహ్మరూపములుగానే కనబడును అని భావము] చిత్తమును మాటి మాటికి విక్షేపము నుండి శమింపచేయుచుండవలెను కషాయ మనగా తీవ్రమైన చిత్తదోషము తీవ్రమైన రాగద్వేషాదివాసనచేత గ్రస్తమై [ఆవహింపబడి] చిత్తము ఒకప్పుడు, సమాధిలో ఉన్నదా అన్నట్లు లయవిక్షేపములు లేక దుఃఖైకాగ్రముగా ఉండును. అట్టి ఆ చిత్తమును బాగుగా గుర్తించి, సమాహితమైన [సమాధిలో ఉన్న] దానికిని దీనికిని ఉన్న భేదమును తెలిసి కొనవలెను "ఇది సమాహితము కాదు" అని తెలిసికొని లయవిక్షేపములకు వలె కషాయమునకు కూడ ప్రతీకారము చేసికొనవలెను.

మూ. సమశబ్దేన బ్రహ్మోచ్యతే—

"సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్" (భ. గీ 13.88) ఇతి స్మృతేః. లయవిక్షేపకషాయేషు పరిహృతేషు పరిశేషాచ్చిత్తేన సమం బ్రహ్మ ప్రాప్యతే. తచ్చ సమప్రాప్తం చిత్తం లయకషాయభ్రాన్త్యా న చాలయేత్. సూక్ష్మయా బుద్ధ్యా లయకషాయప్రాప్తిం వివిచ్య తస్యాం సమప్రాప్తావతిప్రయత్నేన చిరం స్థాపయేత్. స్థాపితే తస్మిన్ బ్రహ్మస్వరూపభూతః పరమానన్దః సమ్యగావిర్భవతి. తథా చోదాహృతమ్—

"సుఖమాత్యన్తికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్"
(భ.గీ. 6.21) ఇతి.

శ్రుతిశ్చ భవతి—

"సమాధినిర్ధూతమలస్య చేతసో
నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్.
న శక్యతే వర్ణయితుం గిరా తదా
స్వయం తదన్తఃకరణేన గృహ్యతే." (మై. ఉ. 4.9) ఇతి.

వ్యా. "సమ" శబ్దమునకు బ్రహ్మ అని అర్థము. "సముడు, సర్వ భూతములయందు ఉన్నవాడు, పరమేశ్వరుడు" అని భగవద్గీత చెప్పు చున్నది. లయము, విక్షేపము, కషాయము పరిహరింపబడిన పిమ్మట పరి శేషన్యాయముచేత [ఇంకమిగిలినది అదే గాన] చిత్తము సమమైన బ్రహ్మను పొందును. ఈ విధముగ సమమును పొందిన చిత్తమును, "ఇది లయమునో, కషాయమునో పొందినది" అను భ్రాంతిచేత చలింపచేయగూడదు. లయ కషాయముల ప్రాప్తిని సూక్ష్మబుద్ధిచేత వివేచించి చాల ప్రయత్నము చేసి, ఆ లయప్రాప్తియందే, చాల సేపు నిలుపవలెను. అది స్థాపితమైన పిమ్మట బ్రహ్మస్వరూపమైన పరమానందము బాగుగా ఆవిర్భవించును. ఈ విష యము-"ఇంద్రియాతీతము, బుద్ధికే గోచరించునది అయిన ఏ ఆత్యంతిక సుఖమున్నదో" అని భగవద్గీతలో చెప్పబడినది. శ్రుతి కూడ ఉన్నది—

"సమాధిచేత తొలగించబడిన మలములు గల మనస్సు ఆత్మయందు స్థిరముగా నిలుపబడినప్పుడు ఏ సుఖము కలుగునో దానిని మాటలతో వర్ణిం చుట శక్యము కాదు. ఆ సుఖము అంతఃకరణమునకే తెలియవలెను".

మూ. నను సమాధ్యావిర్భూతస్య బ్రహ్మానన్దస్య బుద్ధిగ్రాహ్య త్వం శ్రుతిస్మృతిభ్యామభిహితమ్. అద్వైతైస్తు - "నాస్వాదయేత్సుఖం తత్ర"ఇతి బుద్ధిగ్రాహ్యత్వం ప్రతిషిధ్యతే ఇతి చేత్;నాయం దోషః. తత్ర నిరోధసుఖం బుద్ధిగ్రాహ్యం న ప్రతిషిధ్యతే. కిం తు సమాధి విరోధినో వ్యుత్థానరూపస్య పరామర్శస్యైవ ప్రతిషేధాత్. యథా నిదాఘదివసేషు మధ్యాహ్నే జాహ్నవీహ్రదనిమగ్నేనానుభూయమానమపి శైత్యసుఖం తదా వక్తుమశక్యం పశ్చాదున్మగ్నేనాభిధీయతే,యథా వా

సుషుప్తావవిద్యావృత్తిభిరతిసూక్ష్మైభిరనుభూయమానమపి స్వరూపసుఖం తదానీం సవికల్పకేనాన్తఃకరణవృత్తిజ్ఞానేన గ్రహీతుమశక్యం;ప్రబోధ కాలే తు స్మృత్వావిస్పష్టం పరామృశ్యతే,తథా సమాధౌ వృత్తిరహితేన సంస్కారమాత్రశేషతయా సూక్ష్మేణ వా చిత్తేన సుఖానుభవః శ్రుతి స్మృత్యోర్వివక్షితః.

వ్యా. [ఆశంక] సమాధియందు ఆవిర్భవించిన బ్రహ్మానందము బుద్ధి చేత గ్రహింపబడును అని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి కదా? ఆచార్యులు మాత్రము పైన ఉదాహరించిన కారికలో "అక్కడ సుఖమును ఆస్వాదించ గూడదు'' అని చెప్పుచు ఆ సుఖము బుద్ధిగ్రాహ్యముకాదు అని చెప్పుచున్నా రేమి? [సమాధానము] ఇది దోషము కాదు ఆ కారికలో బుద్ధి చేత గ్రహింపదగిన నిరోధసుఖము నిషేధింపబడుటలేదు-సమాధికి విరోధి యైన వ్యుత్థానరూపమైన పరామర్శము (అనగా ''నేను సుఖమును అనుభవించు చున్నాను'' అని తన సుఖానుభవమును గూర్చి చింతించుట) మాత్రమే నిషేధించబడుచున్నది. గ్రీష్మదినములలో, మధ్యాహ్నమునందు గంగాజల మధ్యమునందు మునిగినవాడు శైత్యసుఖమును అనుభవించుచున్నను ఆసమ యమున చెప్పజాలడు; పిదప పైకి లేచినతరువాత తాననుభవించిన శైత్య సుఖమునుగూర్చి చెప్పును.సుషుప్తిలో అతిసూక్ష్మములైనఅవిద్యావృత్తులచేత ఆత్మస్వరూపమైన సుఖము అనుభవింపబడుచున్నను ఆ సమయమునందు సవికల్పకమైన అంతఃకరణవృత్తిజ్ఞానముచేత గ్రహించుటకు శక్యము కాదు; మెలకువ వచ్చిన పిమ్మట దానిని స్మరించి స్పష్టముగా పరామర్శింపబడు చున్నది;అవిధముగానే సమాధియందు వృత్తిలేని లేదా సంస్కారముమాత్రమే శేషించుటచే సూక్ష్మమైన చిత్తముచేత సుఖానుభవము కలుగును అనియే శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి

మూ. "మహదిదం సమాధిసుఖమన్వభూవమ్" ఇత్యేతాదృశో వ్యుత్థితస్య సవికల్పకః పరామర్శోఽత్రాస్వాదనమ్; తదేవాచార్యైః ప్రతిషిధ్యతే.తమేవ స్వాభిప్రాయం ప్రకటయితుం "నిఃసఙ్గః ప్రజ్ఞయా

భవేత్" ఇత్యుక్తమ్. ప్రకృష్టం సవికల్పకం జ్ఞానం ప్రజ్ఞా; తయా సహ సఙ్గం పరిత్యజేత్. యద్వా పూర్వోక్తా ధృతిగృహీతా బుద్ధిః ప్రజ్ఞా; తదాత్మకేన సాధనేన సుఖాస్వాదనతద్వర్ణనాదిరూపామాసక్తిం వర్జయేత్. సమాధౌ బ్రహ్మానన్దే నిమగ్నం చిత్తం యది కదాచిత్సుఖాస్వాదనాయ వా శీతవాతమశకాద్యుపద్రవేణ వా నిశ్చరేత్ తదా నిశ్చరత్తచ్చిత్తం పునః పునర్నిశ్చలం యథా భవతి తథా పరబ్రహ్మణా సహైకీకుర్యాత్. తత్ర చ నిరోధప్రయత్న ఏవ సాధనమ్. ఏకీభావ ఏవ "యదా నిలీయతే చిత్తమ్" ఇత్యనేన శ్లోకేన స్పష్టీక్రియతే. "అలిఙ్గనమనాభాసమ్" ఇత్యాభ్యాం పదాభ్యాం కషాయసుఖాస్వాదౌ ద్వౌ చ ప్రతిషిధ్యేతే.

వ్యా. "సమాధినుండి బైటకు వచ్చినవానికి (వ్యుత్థితునికి) "నేను ఇంత గొప్ప సమాధిసుఖమును అనుభవించితిని" అని కలిగే సవికల్పకమైన, అనగా నేను, సుఖము, ఆస్వాదించుట ఇత్యాదివికల్పములతో కూడిన పరామర్శయే ఇక్కడ చెప్పిన ఆస్వాదనము. ఆచార్యులు నిషేధించినది అట్టి పరామర్శమునే. తమ అభిప్రాయము ఇదే అని ప్రకటించుటకు "నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్" అని చెప్పబడినది. ప్రజ్ఞ అనగా ప్రకృష్టమైన సవికల్పకజ్ఞానము. అట్టి ప్రజ్ఞతో సంగమును పరిత్యజించవలెను. లేదా, ప్రజ్ఞ అనగా వెనుక చెప్పిన ధృతిగృహీతమైన (ధైర్యముచేత గ్రహింపబడిన) బుద్ధి (వివేకము). అట్టి బుద్ధి అనే సాధనముచేత, సుఖాస్వాదనము దానిని వర్ణించుట మొదలైన ఆసక్తిని విడువవలెను సమాధిలో బ్రహ్మానందమునందు మగ్నమైన చిత్తము ఎప్పుడైన సుఖమును ఆస్వాదించుటకు గాని, శీతము, వాతము, దోమలు మొదలైన ఉపద్రవములచేతగాని బైటకు పోవుచున్నచో అప్పుడు ఆ విధముగ బైటకు పోవుచున్న చిత్తమును అది నిశ్చల మగునట్లుగా మాటి మాటికి పరబ్రహ్మతో ఏకము చేయుచుండవలెను. దానికి సాధనము నిరోధప్రయత్నమే. ఈ ఏకీభావమే (ఏకమగుటయే) "యదా నిలీయతే చిత్తమ్" అనే శ్లోకముచేత స్పష్టము చేయబడుచున్నది. అలిఙ్గనమ్" "అనాభాసమ్" అను రెండు పదములచేత కషాయములు, సుఖా

స్వాదము నిషేధింపబడుచున్నవి; అనగా అది ఉండకూడ దని చెప్పబడు చున్నది.

మూ. లయవిక్షేపకషాయసుఖాస్వాదేభ్యో వినిర్ముక్తం చిత్తమ-విచ్ఛేదేన బ్రహ్మణ్యవస్థితం భవతి. ఏతదేవాభిప్రేత్య కఠవల్లీషు పఠ్యతే-

"యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిమ్
తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవావ్యయౌ."
(కఠ.ఉ.**2.3.10,11**) ఇతి.

వ్యా లయము (సుషుప్తి), విక్షేపము, కషాయములు, సుఖాస్వాదము వాటినుండి విముక్తమైన (దూరమైన) చిత్తము నిరంతరము బ్రహ్మయందు ఉండును. ఈ అభిప్రాయముచేతనే కఠవల్లులలో ఇట్లు చెప్పబడినది—

"పంచజ్ఞానేంద్రియములు, మనస్సు ఎప్పుడు స్థిరముగా ఉండునో, బుద్ధి కూడ కదలదో అది ఉత్తమ మైన స్థితి అని చెప్పుదురు. స్థిరమైన ఆ ఇంద్రియధారణమునే యోగము అని చెప్పుదురు యోగము ఉత్పత్తిరో భావరూపమైనది కదా"?

మూ ఉపేక్షితో యోగ ఇన్ద్రియవృత్తీనాం ప్రభవం కరోతి. అనుష్ఠితస్తు తాసాం లయహేతుః. అత ఏవ యోగస్య స్వరూపలక్షణం సూత్రయతి-"యోగశ్చిత్తవృత్తినిరోధః" (**1.2**)ఇతి.వృత్తీనామానన్త్యాన్నిరోధోఽశక్య ఇతి శఙ్కాం వారయితుమియత్తాం సూత్రయతి - "వృత్తయః పఞ్చతయ్యః క్లిష్టా అక్లిష్టాః" (**15**) ఇతి. రాగద్వేషాది క్లేశరూపా ఆసురవృత్తయః క్లిష్టాః.రాగాదిరహితా దైవ వృత్తయోఽ

క్లిష్టాః. యద్యపి పఞ్చస్వేవ క్లిష్టానామక్లిష్టానాం చ అన్తర్భావః, తథాపి క్లిష్టా ఏవ నిరోద్ధవ్యా ఇతి మన్దబుద్ధిం వారయితుం తాభిః సహాక్లిష్టా అప్యుదాహృతాః.

వ్యా. యోగమును ఉపేక్షించినచో అది చిత్తవృత్తులను పుట్టించును. అనుష్ఠించినచో వాటి లయమును చేయును (ఇది పై శ్లోకములోని "యోగో హి ప్రభవాప్యయౌ" అనుదాని వ్యాఖ్యానము). పతంజలి యోగము [యొక్క] స్వరూపలక్షణమును చెప్పుచున్నాడు-"యోగ మనగా చిత్తవృత్తులను నిరోధించుట". వృత్తులు అనంతములు గాన వాటిని నిరోధించుట అశక్యము అను శంకను నివారించుటకై "అవి ఇన్ని" అని చెప్పుచున్నాడు - "క్లిష్టములు అక్లిష్టములు అగు వృత్తులు ఐదు విధములు". రాగద్వేషాదిక్లేశరూపములైన ఆసురవృత్తులు క్లిష్టవృత్తులు, రాగాదులు లేని దైవవృత్తులు అక్లిష్టములు క్లిష్టములు అక్లిష్టములు కూడ పైన చెప్పిన ఐదు విధములైన వృత్తులలో అంతర్గతములే అయినను, క్లిష్టవృత్తులను మాత్రమే నిరోధించిన చాలును అని మందబుద్ధు లెవరైన అనుకొనవచ్చును. అట్టి అభిప్రాయమును తొలగించుటకై క్లిష్టవృత్తులతో పాటు అక్లిష్టవృత్తులు కూడ చెప్పబడినవి.

మూ. నామధేయలక్షణాభ్యాం తా వృత్తీర్విశదయితుం సూత్రషట్కమాహ: - "ప్రమాణవిపర్యయ వికల్పనిద్రాస్మృతయః" (1.6) "ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని" (1.7) "విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రూపప్రతిష్ఠమ్"(1.8)"శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యోవికల్పః" (1.9) "అభావప్రత్యయాలమ్బనా వృత్తిర్నిద్రా" (1.10)"అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః" (1.11) ఇతి. వస్త్వభావః. ప్రతీయతే యస్మింస్తమస్యావరకే సతి తత్తమోఽభావప్రత్యయః. తమోగుణం విషయీకుర్వతీ వృత్తిర్నిద్రేత్యుచ్యతే.అనుభూతవిషయస్యాంసప్రమోషస్తదనుభవజన్యమనుసంధానమ్.

వ్యా. ఆ వృత్తుల నామధేయములను లక్షణములనుచెప్పి వాటిని స్పష్టీకరించుటకై ఆరు సూత్రములు చెప్పుచున్నాడు - "ప్రమాణములు

విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి అనునవి వృత్తులు". "ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అనునవి ప్రమాణములు" "అట్లుకాక అట్లు భాసించు వస్తువును ఆధారముగా చేసికొని ఏర్పడు మిథ్యాజ్ఞానము (రజ్జువునుచూచి సర్పమనుకొన్నట్లు) విపర్యయము". ''వస్తువు లేకపోయి నను శబ్దజ్ఞానమును పట్టి ఏర్పడినది("కుందేటికొమ్ము" వంటిది) వికల్పము". "అభావప్రత్యయము ఆలంబనముగా గల వృత్తి నిద్ర". (దీని అర్థము మున్ముందు స్పష్టము కాగలదు). "అనుభవింపబడిన విషయము ఆ విధము గానే కాలాంతరమునందు మనస్సులో స్ఫురించుట స్మృతి".

ఏ తమస్సు కప్పివేసినపుడు వస్తువు లేనట్లు అనిపించునో ఆ తమస్సు "అభావప్రత్యయము". అట్టి తమోగుణమును విషయముగా చేసి కొన్న వృత్తి నిద్ర. అనుభూతమైన విషయముయొక్క అసంప్రమోషము, అనగా ఆ విషయముయొక్క అనుభవమువలన (సాక్షాత్కారమువలన) కలుగు అనుసంధానము (నేను ఆ వస్తువును చూచితిని ఇత్యాదివిధమున ఉండునది) స్మృతి.

మూ. పఞ్చవిధవృత్తినిరోధసాధనం సూత్రయతి-''అభ్యాసవైరా గ్యాభ్యాం తన్నిరోధః"(1.12) ఇతి. యథా తీవ్రవేగోపేతం నదీప్రవా హం సేతుబన్ధనేన నివార్య కుల్యాప్రణయనేన క్షేత్రాభిముఖం తిర్యక్ ప్రవాహాన్తరముత్పాద్యతే తథా వైరాగ్యేణ చిత్తనద్యా విషయప్రవా హం నివార్య సమాధ్యభ్యాసేన ప్రశాన్తః ప్రవాహః సంపాద్యతే. మన్త్రజపదేవతాధ్యానాదీనాం క్రియారూపత్వేనావృత్తిలక్షణోఽభ్యాసః సంభావ్యతే.

వ్యా. ఐదు విధములైన వృత్తుల నిరోధమునకు సాధనమును సూత్రించు చున్నాడు-"అభ్యాసముచేతను,వైరాగ్యముచేతను వృత్తులనునిరోధించవలెను." తీవ్రవేగముగల నదీప్రవాహమును సేతుబంధనముచేత నిలిపి చిన్న కాలువలు ఏర్పరచి తద్వారా పొలముల వైపు వెళ్లు మరొక ప్రవాహమును అడ్డముగా ఏర్పరచినట్లు చిత్తనదియొక్క విషయప్రవాహమును నివారింపచేసి సమాధిని

అభ్యసించుటచేత ప్రశాంతమైన ప్రవాహము సంపాదింపబడును. మంత్ర జపము, దేవతాధ్యానము మొదలైనవి క్రియారూపములు గాన ఆ క్రియలను ఆవర్తింపచేయుట అనే అభ్యాసము చేయుటకు వీలగును.

మూ. సర్వవ్యాపారోపరమరూపస్య సమాధేః సాధకః కో నామాభ్యాస ఇతి శఙ్కాం వారయితుం సూత్రయతి - "తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః" (**1.13**) ఇతి. స్థితిః నైశ్చల్యమ్; నిరోధః, యత్నో మానస ఉత్సాహః. స్వత ఏవ బహిః ప్రవాహశీలం చిత్తం సర్వథా నిరోధయిష్యామీత్యేవంవిధ ఉత్సాహ ఆవర్త్యమానోఽభ్యాస ఇత్యుచ్యతే.

వ్యా. సమస్తవ్యాపారముల ఉపరమము ( ఆగిపోవుట ) అను రూపము గల సమాధిని సాధించే అభ్యాస మనేది ఏది అను శంకను నివారించుటకై సూత్రించుచున్నాడు - "దానియందు స్థితి విషయమై చేయు యత్నము అభ్యాసము." స్థితి అనగా నిశ్చలత్వము; అనగా నిరోధము. యత్న మనగా మనస్సులోని ఉత్సాహము. సహజముగా బైటకు ప్రవహించే స్వభావము గల చిత్తమును అన్ని విధాల నిరోధించెదను అను ఉత్సాహ మునే మాటి మాటికి చేయుట అభ్యాస మని చెప్పబడుచున్నది.

మూ. అయమభ్యాస ఇదానీం ప్రవృత్తః స్వయమదృఢః సన్ననాది ప్రవృత్తా వ్యుత్థానవాసనాః కథమభిభవేదిత్యాశఙ్కామపవదితుం సూత్రయతి-"స తు దీర్ఘకాలనైరన్తర్యసత్కారసేవితో దృఢభూమిః" (**1.14**)ఇతి. లోకేహి మూఢస్య వచనముదాహరన్తి-"విద్యమానాశ్చత్వార ఏవ వేదాః; తానధ్యేతుం గతస్య మాణవకస్య పఞ్చ దివసా అతీతాః; అద్యాప్యసౌ నాగతః" ఇతి. తాదృశ ఏవాయం యోగీ తదా స్యాద్యదా దివసైర్వా మాసైర్వా యోగసిద్ధిం వాఞ్ఛేత్.తస్మాత్ సంవత్సరైర్జన్మభిర్వా దీర్ఘకాలం యోగ ఆసేవితవ్యః. తథా చ స్మర్యతే-

"అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్"

(భ.గీ. **6.45**) ఇతి.

చిరమాసేవ్యమానోఽపి యది విచ్ఛిద్య విచ్ఛిద్య సేవ్యేత, తర్హ్యుత్పద్యమానానాం యోగసంస్కారాణాం సమనన్తరభావిభిర్విచ్ఛేదకారిభిర్వ్యుత్థానకాలీనైః సంస్కారైరభిభవే సతి ఖణ్డనకారోక్తన్యాయ అపతేత్ "అగ్రే ధావన్ పశ్చాల్లుప్యమానో విస్మరణశీలశ్రుతపఙ్క్తిమాలమ్బ్యేత" ఇతి. తస్మాన్నిరన్తరమాసేవితవ్యః. సత్కారః ఆదరః. అనాదరేణ సేవ్యమానే వసిష్ఠోక్తన్యాయ అపతేత్-

"అకర్తృ కుర్వదప్యేతచ్చేతశ్చేత్ క్షీణవాసనమ్
దూరంగతమనా జన్తుః కథాసంశ్రవణే యథా" ఇతి.

అనాదరో లయవిక్షేపకషాయసుఖాస్వాదానామపరిహారః. తస్మాదాదరేణ సేవితవ్యః. దీర్ఘకాలాదిత్రైవిధ్యేన సేవితస్య సమాధేర్దృఢభూమిత్వం నామ విషయవాసనయా దుఃఖవాసనయా వా చాలయితుమశక్యత్వమ్. తచ్చ భగవతా దర్శితమ్-

"యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే"
(భ.గీ. 6.22) ఇతి.

వ్యా. ఇప్పుడు ప్రారంభించిన ఈ అభ్యాసము తానే దృఢముగా లేనప్పుడు అనాదికాలమునుండి వచ్చుచున్న వ్యుత్థానవాసనలను ఎట్లు తిరస్కరించగలదు అను ఆశంకను తొలగించుటకై సూత్రించుచున్నాడు "అది (యోగము) చాలకాలము, నిరంతరము, ఆదరముతో సేవించబడినచో దృఢమైన భూమి కల దగును " లోకములో ఒక మూఢుని వచనమును ఉదాహరించుచుందురు - "ఉన్నవి నాలుగే వేదాలు కదా, అవి చదువుటకు పిల్లవాడు వెళ్ళి ఐదు రోజులు గడచిపోయినవి; వాడు ఇంకనూ రాలేదే!" అని అన్నాడట ఒక ప్రబుద్ధుడు. ఎవడైన యోగి కొన్ని రోజులలోనో, మాసాలలోనో యోగసిద్ధి లభించవలెనని అనుకొన్నచో అతడు కూడ పైన చెప్పిన

మూడునివంటివాడే. అందువలన యోగమును కొన్ని సంవత్సరములపాటు లేదా కొన్ని జన్మలు చాలకాలము సేవించవలెను అందుచేతనే భగవద్గీతలో చెప్పబడినది - "అనేకజన్మల అభ్యాసమునకు ఫలితముగా యోగసిద్ధిని పొంది ఆటుపిమ్మట ఉత్తమగతిని పొందును"

చాలకాలము సేవించినను మధ్యమధ్య విచ్ఛేదము కలిగించుచు సేవించినచో ఆ విధముగా అభ్యసించిన యోగమువలన కలిగిన సంస్కారములను వెంటనే కలుగు విచ్ఛేదకరములైన వ్యుత్థానకాలమునకు సంబంధించిన సంస్కారములు అణచివేయును గాన ఖండనఖండఖాద్యములో శ్రీహర్షుడు చెప్పిన "ముందుకు ప్రవహించుచు వెనుకనుండి హరించుకొనిపోవుచు, మరచిపోయే స్వభావము కలవాని విద్యాభ్యాసమువలె దేనిమీద నిలచును" అను సామెత పట్టును. అందుచేత ముందుకు సాగుతూ వెనుకనుండి హరించుకొనిపోకుండా ఉండవలె నంటే నిరంతరము సేవించవలెను. సత్కార మనగా ఆదరము. అనాదరముగా సేవించినచో వసిష్ఠుడు చెప్పిన ఈ క్రింది న్యాయము పట్టును.

"చిత్తములో వాసనలు (ఆసక్తిశ్రద్ధాదులు) లేనిచో ఆ చిత్తము కర్తృత్వము లేనిదే అగును. దాని స్థితి పురాణశ్రవణసమయమునందు మనస్సు ఎక్కడనో తిరుగుచున్నవాని స్థితి వంటిది" అనగా శ్రద్ధ లేకుండా చేసిన పని చేయనట్లే అని భావము,

లయమును (సుషుప్తిని), విక్షేపమును, కషాయములను, సుఖాస్వాదమును విడువకుండుట అనాదరము అందువలన యోగమును ఆదరపూర్వకముగా సేపించవలెను. దీర్ఘకాలాదులు మూడింటితో సేవించిన సమాధి దృఢభూమికలది అగుట అనగా విషయసుఖముల వాసనచేతగాని దుఃఖవాసనచేతగాని చలింపచేయుటకు శక్యము కాకుండుట. దీనినే భగవంతుడు చెప్పినాడు - "దేనిని పొందిన తరువాత ఇతరమైన ఏ లాభమును దీనికంటె అధిక మని అనుకొనడో దేనియందు స్థితిని పొందిన పిమ్మట అత్యధికమైన దుఃఖముచేత కూడ చలింపచేయబడడో."

మూ, అపరలాభస్యానాధిక్యం కచవృత్తాన్తేన వసిష్ఠ ఉదాజహార:-
"కచః కదాచిదుత్థాయ సమాధేః ప్రీతమానసః
ఏకాన్తే సమువాచేదమేవం గద్గదయా గిరా"
(ల.వా. 18.37)

వ్యా ఇతరలాభము లేవీ ఈ యోగలాభముకంటె ఉత్తమమైనవి కావు అను విషయమును కచవృత్తాంతము ద్వారా వసిష్ఠుడు ఉదాహరించెను —

"ఒకనాడు కచుడు సమాధినుండి లేచి సంతోషించుచున్న మనస్సు కలవాడై, గద్గదస్వరముతో ఏకాంత ప్రదేశమునందు ఇట్లు పలికెను."

మూ. "కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్
ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా."

వ్యా "ఈ ప్రపంచక మంతా ప్రలయకాలజలప్రవాహముచేత వలె ఆత్మచే నింపబడినది; నేను ఏమి చేయుదును! ఎక్కడికి వెళ్ళుదును! దేనిని తీసికొందును! దేనిని విడతును!"

మూ. "స బాహ్యాభ్యన్తరే దేహే హ్యధ ఊర్ధ్వం చ దిక్షు చ
ఇత ఆత్మా తథేహాత్మా నాస్త్యనాత్మమయం క్వచిత్."
(18.39)

వ్యా దేహము వెలుపల, దేహము లోపల, క్రింద, పైన, దిక్కుల యందు, ఇటూ, ఇక్కడా ఆత్మయే ఉన్నది ఎక్కడకూడ ఆత్మ కానిది ఏదీ లేదు.

మూ. న తదస్తి న యత్రాహం న తదస్తి న యన్మయి
కిమన్యదభివాఞ్ఛామి సర్వం సంవిన్మయం తతమ్.
(18.40)

వ్యా. "నేను లేని వస్తువు లేదు. నాలో లేని వస్తువు ఎదీ లేదు ఇంక నాకు కావలసినది మరొకటి ఏమి ఉన్నది. అంతా కూడ చిద్రూపమై వ్యాపించి ఉన్నది."

మూ. స్ఫారబ్రహ్మామలామ్భోధేః ఫేనాః సర్వే కులాచలాః
చిదాదిత్యమహాతేజోమృగతృష్ణా జగచ్ఛ్రియః.
(ల.వా. 18 35) ఇతి

వ్యా "కులపర్వతము లన్నీ నిర్మలమైన అతివిశాలమైన బ్రహ్మ సముద్రము నురుగులు మాత్రమే. ఈ జగత్తు శోభ లన్నీ చిత్ అనే ఆదిత్యుని మహాతేజస్సువలన ఏర్పడిన ఎండమావులు."

మూ. గురుదుఃఖేనాప్యవిచాల్యత్వం శిఖిధ్వజస్య వత్సరత్రయ సమాధివృత్తాన్తేనో దాజహార:—

"నిర్వికల్పసమాధిస్థం తత్రాపశ్యన్మహీపతిమ్
రాజానం తాపదేతస్మాద్ బోధయామి పరాత్పదాత్. 122
ఇతి సంచిన్త్య చూడాలా సింహనాదం చకార సా
భూయో భూయః ప్రభోరగ్రే వనేచరభయప్రదమ్ 123
న చచాల తదా రామ యదా నాదేన తేన సః
భూయో భూయః కృతేనాపి తదా సా తం వ్యచాలయత్.124
చాలితః పాతితోఽప్యేష తదా నో బుబుధే బుధః" 125 ఇతి

వ్యా. గొప్ప దుఃఖము కూడ చలింపచేయజాలదు అనుటకు శిఖిధ్వజుడు మూడు సంవత్సరములు చేసిన సమాధి వృత్తాంతమును ఉదాహరణగా చూపెను శిఖిధ్వజుని రాణియైన చూడాల అక్కడ నిర్వికల్పసమాధిలో ఉన్న రాజును చూచి "ఈరాజును ఈ ఉత్తమస్థితినుండి చలింపచేసెదను" అని ఆలోచించి ఆ రాజు ఎదుట వన్యమృగములకు కూడ భయము కలిగించు సింహనాదమును మాటిమాటికి చేసెను రామా! అతడు మాటి మాటికి చేసిన ఆ ధ్వనికి కూడ ఎప్పుడు లేవలేదో అతనిని కదల్చెను. జ్ఞాని యైన అతడు కదల్చినను, క్రింద పడవేసినను కూడ మేల్కొనలేదు (సమాధిని విడువలేదు).

మూ. ప్రహ్లాదవృత్తాన్తేఽప్యేతదేవోదాజహార—
"ఇతి సంచిన్తయన్నేవ ప్రహ్లాదః పరవీరహా
నిర్వికల్పపరానన్దసమాధిం సముపాయయౌ"(ల.వా. 22.92)

వ్యా. ప్రహ్లాదవృత్తాంతములో కూడ ఈ విషయమునే చెప్పెను-

"శత్రువీరసంహారకుడైన ప్రహ్లాదుడు ఈ విధముగా ఆలోచించుచునే పరమానందరూపమైన నిర్వికల్పసమాధిని పొందెను."

మూ. నిర్వికల్పకమాధిస్థశ్చిత్రార్పిత ఇవాబభౌ
పఞ్చవర్షసహస్రాణి పీనాఙ్గో౽తిష్ఠ దేకదృక్. (22.93)

వ్యా. "నిర్వికల్పసమాధిలో ఉన్న ఆతడు చిత్తమునందు చిత్రింపబడినవాడు వలె ఉండెను. పుష్టముగా ఉన్న శరీరముతో అతడు ఆ విధముగా ఏకాగ్రదృష్టితో ఐదు వేల సంవత్సరములు ఉండెను."

మూ. మహాత్మన్ సంప్రబుధ్యస్వేత్యేవం విష్ణురుదాహరత్
పాఞ్చజన్యం ప్రదధ్మౌ చ ధ్వనయన్ కకుభాం గణమ్.

వ్యా. ''మహాత్మా! మేల్కొనుము'' అని విష్ణుమూర్తి పలికెను. అన్ని దిక్కులు మారుమ్రోగు నట్లు పాంచజన్యమును పూరించెను".

మూ. "మహతా సంప్రబుద్ధాత్మా దానవేశః శనైః శనైః"
(22.107) ఇతి
ఏవం వీతహవ్యాదీనా మపి సమాధిరుదాహరణీయః.

వ్యా ''మహావిష్ణుప్రాణవాయువుచేత పుట్టిన ఆ మహాశబ్దముచేత ఆ దానవరాజు మెల్లి మెల్లిగా మేల్కొ౦న చిత్తము కలవా డయ్యెను".

ఈ విధముగానే వీతహవ్యుడు మొదలైనవారి సమాధిని కూడ ఉదాహరించవలెను.

మూ. వైరాగ్యం ద్వివిధమ్-అపరమ్ పరం చేతి.యతమానవ్యతిరేకైకేన్ద్రియవశీకారభేదై రపరం చతుర్విధమ్.తత్రాద్యం త్రయమర్థాత్సూత్రయన్ సాక్షాచ్చతుర్థం సూత్రయతి - "దృష్టానుశ్రవికవిత్కృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్" (1.15) ఇతి. స్రక్చన్దనవనితా పుత్రమిత్రక్షేత్రధనా

దయో దృష్టాః. వేదోక్తాః స్వర్గాదయః ఆనుశ్రవికాః. తత్రోభయత్ర సత్యామపి తృష్ణాయాం వివేకతారతమ్యేన యతమానాదివైరాగ్యత్రయం భవతి. అస్మిన్ జగతి కిం సారం కిమసారమితి గురుశాస్త్రాభ్యాం జ్ఞాస్యామీత్యుద్యోగో యతమానత్వమ్;(1) స్వచిత్తే విద్యమానానాం దోషాణాం మధ్యేఽభ్యస్యమానేన వివేకేన ఏతావన్తః పక్వాః, ఏతావన్తోఽవశిష్టాః ఇతి వివేచనం వ్యతిరేకః; (2) దృష్టానుశ్రవికవిషయప్రవృత్తేర్దుఃఖాత్మత్వబోధేన తాం ప్రవృత్తిం పరిత్యజ్య మనసశ్చైత్సుక్యమాత్రేణ వితృష్ణావస్థానమేకేన్ద్రియత్వమ్;(3) వితృష్ణత్వం వశీకారః; (4) తదిదమపరం వైరాగ్యమష్టాఙ్గమ్; అసంప్రజ్ఞాతస్య తు బహిరఙ్గమ్.

వ్యా. అపరవైరాగ్యము, పరవైరాగ్యము అని వైరాగ్యము రెండు విధములు. అపరవైరాగ్యము యతమాన-వ్యతిరేక-ఏకేంద్రియ-వశీకారము లను భేదములచేత నాలుగు విధములు. వాటిలో మొదటి మూడింటిని పతంజలి అర్థము ద్వారా సూత్రించి అనగా ప్రత్యక్షముగా చెప్పక సూచనామాత్రము చేసి) నాల్గవదానిని సూత్రీకరించుచున్నాడు -"దృష్టముల యందు, ఆనుశ్రవికములయందు తృష్ణ లేనివానికి వశీకారసంజ్ఞావైరాగ్యము కలుగును", పుష్పమాలలు, చందనము, స్త్రీలు, పుత్రులు, పౌలములు, దనములు మొదలైనవి దృష్టములు వేదములలో చెప్పిన స్వర్గాదులు ఆనుశ్రవికములు. ఈ రెండు విధములైన భోగములయందు తృష్ణ ఉన్నను వివేక తారతమ్యమును (వివేకము యొక్క హెచ్చుతగ్గులను) పట్టి యతమానాది వైరాగ్యములు మూడూ కలుగును (1 ఈ జగత్తు సార మేదో, సారము కానిది ఏదో గురువులనుండి, శాస్త్రమునుండి తెలిసికొనెదను అను ప్రయత్నము యతమానత్వము. (2) వివేకాభ్యాసముచేత తన చిత్తములో ఉన్న దోషములలో ఇవి పక్వమైనవి, ఇవి ఇంకా మిగిలి ఉన్నవి అను వివేచనము వ్యతిరేకము. (3) కనబడుచున్న, వినబడుచున్న విషయములయందు ప్రవృత్తి దుఃఖమును ఇచ్చును అని తెలిసికొనుటచేత అట్టి ప్రవృత్తిని

పరిత్యజించి, తృష్ణ లేకుండా ఉండవలెను అను ఔత్సుక్యముతో మాత్రమే మనస్సు తృష్ణ లేకుండ ఉండుట ఏకేంద్రియత్వము. 4) తృష్ణ పూర్తిగా తొలగిపోవుట వశీకారము ఈ అపరవైరాగ్యము అష్టాంగయోగప్రవర్తకము గాన (అష్టాంగయోగమునందు ప్రవర్తింపచేయునుగాన) ఇది సంప్రజ్ఞాత సమాధికి అంతరంగము, అసంప్రజ్ఞాతమునకు బహిరంగము.

మూ. తత్రాన్తరఙ్గం పరం వైరాగ్యం సూత్రయతి – "తత్పరం పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్(1.16) ఇతి. సంప్రజ్ఞాతసమాధిపాటవేన గుణత్రయాత్మకాత్ప్రధానాద్వివిక్తస్య పురుషస్య ఖ్యాతిః సాక్షాత్కార ఉత్పద్యతే; తస్మాచ్చ సాక్షాత్కారాదశేషగుణత్రయవ్యవహారే యద్వై తృష్ణ్యం తత్పరం వైరాగ్యమ్.

వ్యా. అసంప్రజ్ఞాతసమాధికి అంతరంగమైన పరవైరాగ్యమును సూత్రించుచున్నాడు–''పురుషసాక్షాత్కారమువలన గుణములయందు తృష్ణ లేకుండుట పరవైరాగ్యము''. సంప్రజ్ఞాతసమాధిలో దృఢత్వమును సంపాదించుటవలన గుణత్రయాత్మక మైన ప్రధానమునుండి విరక్తు డైన వానికి పురుషుని (అనగా ఆత్మయొక్క) సాక్షాత్కారము కలుగును ఆ సాక్షాత్కారము కలిగిన పిమ్మట గుణత్రయమువలన ఏర్పడు సమస్తవ్యవహారములయందు ఏ తృష్ణాభావము (తృష్ణ నశించుట) కలుగునో అది పర వైరాగ్యము

మూ. తీవ్రసంవేగేష్వేవ సమాధితారతమ్యం సూత్రయతి – "మృదుమధ్యాధిమాత్రత్వాత్తతోఽపి విశేషః" (1.21) ఇతి. మృదుతీవ్రో,మధ్యతీవ్రోఽధిమాత్రతీవ్ర ఇతి. తేష్వప్యుత్తరోత్తరస్య త్వరయా సిద్ధిర్ద్రష్టవ్యా. ఉత్తమోత్తమా జనకప్రహ్లాదాదయోఽధిమాత్రతీవ్రాః; మహావాక్యమాత్రవిచారేణ దృఢసమాధిలాభాత్. అధమాధమా ఉద్దాలకయథాకాదయో మృదుసంవేగాః,చిరప్రయాసేన తల్లాభాత్.ఏవమన్యేఽపి మోగయోన్నేయాః. తదేవమధిమాత్రతీవ్రస్య దృఢభూమావసంప్రజ్ఞాత

సమాధౌ లబ్ధే సతి పునర్వ్యుత్థాతుమశక్తం సన్మనో నశ్యతి. మనోనాశేన చ వాసనాక్షయే రక్షితే సతి జీవన్ముక్తిః సుప్రతిష్ఠితా భవతి. న చ మనోనాశేన విదేహముక్తిరేవ న తు జీవన్ముక్తిరితి శఙ్కనీయమ్; ప్రశ్నోత్తరాభ్యాం తన్నిర్ణయాత్.

వ్యా. తీవ్రసంవేగము కలవారిలో ఉండు సమాధితారతమ్యమును సూత్రించుచున్నాడు – "దానియందు కూడ మృదువు, మధ్యము, అధిమాత్రము అని విశేష మున్నది". మృదుతీవ్రము, మధ్యతీవ్రము, అధిమాత్రతీవ్రము అను ఆ మూడు విధముల తీవ్రసంవేగసమాధులలో కూడ వెనుకటిదానికంటె తరువాతిదానికి శీఘ్రముగా సిద్ధి కలుగు నని తెలుసుకొనవలెను. జనకప్రహ్లాదాదులు అధిమాత్రతీవ్రత కలవారు; వారు ఉత్తమోత్తములు, ఎందుచేత ననగా ముహూర్తమాత్రము విచారము చేయగానే వారికి దృఢసమాధి లభించినది. మృదుసంవేగము గల ఉద్దాలకాదులు అధమాధములు; ఎందుచేత ననగా చిరకాలప్రయాస చేసిన కాని వారికి దృఢసమాధి లభించలేదు, ఇట్లే ఇతరుల విషయమునందు కూడ తీవ్రతాతారతమ్యమును తెలిసికొనవలెను, అందుచే అధిమాత్రతీవ్రత్వము కలవానికి దృఢభూమియైన అసంప్రజ్ఞాతసమాధి లభించిన పిమ్మట మనస్సు మరల వ్యుత్థానము చెందుటకు అసమర్థమై నశించును. మనోనాశముచేత వాసనాక్షయము రక్షింపబడగా జీవన్ముక్తి బాగా ప్రతిష్ఠిత మగును. అయితే-మనస్సు నశించినచో అది విదేహముక్తియే అగును గాని జీవన్ముక్తి కాదు కదా అని శంకించరాదు, ఎందుచేత ననగా ప్రశ్నోత్తరములచేత ఈ విషయము నిర్ణయింపబడినది.

మూ. శ్రీరామః – "వివేకాభ్యుదయాచ్చిత్తస్వరూపేఽన్తర్హితే మునే
మైత్ర్యాదయో గుణాః కుత్ర జాయన్తే యోగినాం
వద" (ఉ.వా. 28-15)

వ్యా. శ్రీరాముడు: – "మహామునీ! వివేకము ఉదయించుటవలన చిత్తస్వరూపము అంతర్హితమైన పిమ్మట (కనబడకుండ పోయినపిమ్మట) యోగులకు మైత్ర్యాదిగుణములు ఎక్కడ పుట్టును? చెప్పుము."

మూ. వసిష్ఠః—

ద్వివిధశ్చిత్తనాశోఽస్తి సరూపోఽరూప ఏవ చ
జీవన్ముక్తౌ సరూపః స్యాదరూపోఽ దేహముక్తిగః.

(ఉ.వా. 18.16)

వ్యా. వసిష్ఠుడు — "చిత్తనాశము సరూపము, అరూపము అని రెండు విధములు. జీవన్ముక్తిలో ఇది సరూపమై (రూపముతో కూడినదై) ఉండును. విదేహముక్తియందు రూపము లేనిదై ఉండును."

మూ. "ప్రాకృతం గుణసంభారం మమేతి బహుమన్యతే
సుఖదుఃఖాద్యవష్టభ్య విద్యమానం మనో విదుః."

(28.18)

వ్యా. "ప్రకృతికి సంబంధించిన గుణసముదాయమును నాది అని తలచుచు సుఖదుఃఖాదులతో కూడి ఉన్న మనస్సు (రూపము గల మనస్సు) అని చెప్పుదురు."

మూ. "చేతసః కథితా స తా మయా రఘుకులోద్వహ
అస్య నాశ...దానీం త్వం శృణు ప్రశ్నవిదాం వర."

(28.20)

వ్యా. "రామా! నేను చిత్తముయొక్క సత్తను (ఉనికిని) చెప్పినాను, ప్రశ్నవేత్తలలో శ్రేష్ఠుడా! ఇప్పుడు దీని నాశమును గూర్చి వినుము."

మూ. "సుఖదుఃఖదశా ధీరం సామ్యాన్న ప్రోద్ధరన్తి యమ్
నిఃశ్వాసా ఇవ శైలేన్ద్రం తస్య చిత్తం మృతం విదుః"

(28.21)

వ్యా. "నిట్టూర్పులు పర్వతరాజును కదల్పజాల నట్లు ఏ ధీరుణ్ణి సుఖదుఃఖావస్థలు సమస్థితినుండి కదల్పజాలవో ఆతని చిత్తము మరణించిన దని చెప్పుదురు".

మూ. "ఆపత్కార్పణ్యముత్సాహో మదో మాన్ద్యం మహోత్సవః
యం నయన్తి న వైరూప్యం తస్య నష్టం మనో విదుః"
(28.22)

వ్యా. "ఆపద, దీనత్వము, ఉత్సాహము, మదము, మందత్వము, మహోత్సవము ఎవనిలో మార్పు తీసికొనిరాజాలవో అతని మనస్సు నష్టమైన దని చెప్పుదురు ''

మూ. చిత్తమాశానిధానం హి యదా నశ్యతి రాఘవ
మైత్ర్యాదిభిర్గుణైర్యుక్తం తదా సత్త్వముదేత్యలమ్.
భూయోజన్మవినిర్ముక్తం జీవన్ముక్తస్య తన్మనః."
(28.23,24)
సరూపోఽసౌ మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే. (2825)

వ్యా "రామా ! ఆశకు స్థానమైన చిత్తము ఎప్పుడు నశించునో అప్పుడు మైత్రి మొదలైన గుణములతో కూడిన సత్త్వము అధిక మగును. జీవన్ముక్తుని ఆ మనస్సు పునర్జన్మరహిత మగును". "ఇది జీవన్ముక్తునికి సంబంధించిన సరూప (రూపముతో కూడిన) మనోనాశము.''

మూ. "అరూపస్తు మనోశాశో యో మయోక్తో రఘూద్వహ
విదేహముక్తావేవాసౌ విద్యతే నిష్కలాత్మకః"
(ల.వా. 28.26)

వ్యా. "రామా ! నేను చెప్పిన అరూపమనోనాశము భేదరహితమైనది. ఇది విదేహముక్తిలో మాత్రమే ఉండును".

మూ. సమగ్రాగ్ర్యగుణాధారమపి సత్త్వం ప్రలీయతే
విదేహముక్తావమలే పదే పరమపావనే (28.27)

వ్యా. "పరమపావనము, నిర్మలపదము అయిన విదేహముక్తియందు సమస్తమైన శ్రేష్ఠగుణములకు ఆధారమైన ఈసత్త్వము కూడ లీనమైపోవును."

మూ. "సంశాన్తదుఃఖమజడాత్మకమేకరూప
మానన్దమన్థరమపేతరజస్తమో యత్.
ఆకాశకోశతనవోఽతనవో మహాన్త
స్తస్మిన్ పదే గలితచిత్తలవా వసన్తి" (28.32)ఇతి.

వ్యా. "విదేహులై ఆకాశకోశమే శరీరముగా గల మహాత్ములు, సకలదుఃఖములు శాంతించినది చిదాత్మకము, ఏకరూపము, ఆనంద స్వరూపము, రజస్తమోవిహీనము అయిన పదమునందు చిత్తలేశము కూడ లేకుండ నివసింతురు."

మూ. "జీవన్ముక్తా న ముహ్యన్తి సుఖదుఃఖరసస్థితౌ
ప్రాకృతేనార్థకారేణ కించిత్ కుర్వన్తి వా న వా."

తస్మాత్ సరూపో మనోనాశో జీవన్ముక్తిసాధనమితి స్థితమ్.

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే మనోనాశనిరూపణం నామ తృతీయం ప్రకరణమ్ (3)

వ్యా "ప్రకృతికి సంబంధించిన వ్యాపారముచేత ఏమైన చేయుచున్నను, చేయకున్నను జీవన్ముక్తులు సుఖాస్వాదమునందు గాని, దుఃఖానుభవమునందు గాని మోహము చెందరు." అందుచే సరూపమనోనాశము జీవన్ముక్తికి సాధన మని నిశ్చితమైనది.

"బాలానందిని" అను జీవన్ముక్తివివేకవ్యాఖ్యానములో మనోనాశనిరూపణ మను తృతీయప్రకరణము సమాప్తము

## అథ చతుర్థం స్వరూపసిద్ధిప్రయోజనప్రకరణమ్

మూ. కేయం జీవన్ముక్తిః, కిం వా తత్ర ప్రమాణమ్, కథం వా తత్సిద్ధిః, ఇత్యేతస్య ప్రశ్నత్రయస్య ఉత్తరం నిరుపితమ్. సిద్ధా

వా కిం ప్రయోజనమిత్యస్య చతుర్థప్రశ్నస్యోత్తరమిదానీమభిధీయతే - జ్ఞానరక్షాతపోవిసంవాదాభావదుఃఖనాశసుఖావిర్భావాః సన్తి పఞ్చ ప్రయోజనాని.

వ్యా. జీవన్ముక్తి అనగా ఏమి? జీవన్ముక్తి అనేది ఒకటి ఉన్నట్లు ప్రమాణ మేమి? అది (జీవన్ముక్తి) ఎట్లు సిద్ధించును? అను మూడు ప్రశ్నలకు సమాధానములు చెప్పబడినవి. అది సిద్ధించినందువల్ల ప్రయోజన మేమి? అను నాల్గవ ప్రశ్నకు సమాధానము ఇప్పుడు చెప్పబడుచున్నది. జ్ఞానరక్ష, తపస్సు, విసంవాదము [జీవన్ముక్తి అనేది కుదరదు అను అభిప్రాయము] లేకుండుట, దుఃఖనాశము, సుఖావిర్భావము అను ఐదు ప్రయోజనము లున్నవి.

మూ. నను ప్రమాణోత్పన్నస్య తత్త్వజ్ఞానస్య కో నామ బాధప్రసంగః యేన రక్షా అపేక్ష్యత ఇతి చేత్ ఉచ్యతే. చిత్తవిశ్రాన్త్యభావే సంశయవిపర్యయౌ ప్రసజ్యేయాతామ్. తథా హి-తత్త్వవిదో రాఘవస్య విశ్రాన్తేః పూర్వం సంశయం విశ్వామిత్ర ఉదాజహార—

"న రాఘవ తవాస్త్యన్యద్ జ్ఞేయం జ్ఞానవతాం వర
స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవానసి
భగవద్వ్యాసపుత్రస్య శుకస్యేవ మతిస్తవ.
విశ్రాన్తిమాత్రమేవాత్ర జ్ఞాతజ్ఞేయాప్యపేక్షతే."

(ల.వా. 3.17,18) ఇతి.

వ్యా. [ఆశంక] ప్రమాణమువలన కలిగిన తత్త్వజ్ఞానమునకు బాధ కలుగు ప్రసక్తియే ఉండదు కదా; ఇంక దానిని రక్షించుకొనుట అనగా ఏమి? [సమాధానము] చెప్పుచున్నాము, చిత్తమునకు విశ్రాంతి లేనంత వరకు సంశయము, విపర్యయము [విరుద్ధమైన జ్ఞానము] కలుగుచునే ఉండును. అందుచేతనే తత్త్వవేత్తయైన రామునకు కూడ చిత్తవిశ్రాంతికి పూర్వము సంశయము ఉన్నట్లు విశ్వామిత్రుడు చెప్పెను.

జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవైన ఓ రామా! నీవు తెలుసుకొనవలసినది మరేదీ లేదు. నీ సూక్ష్మబుద్ధిచేతనే సర్వమును తెలిసికొంటివి. కాని, వ్యాస భగవానుని పుత్రుడైన శుకుని బుద్ధివలె, నీ బుద్ధి కూడ, అన్ని విషయములు తెలిసినదే అయినను విశ్రాంతి మాత్రమునే అపేక్షించుచున్నది."

మూ. శుకస్తు స్వయమేవాత్మ తత్త్వం విదిత్వా తత్ర సంశయానః పితరం పృష్ట్వా పిత్రాపి తథైవానుశిష్టః తత్రాపి సంశయానో జనకముపసద్య తేనాపి తథైవానుశిష్టస్తం ప్రత్యేవముదాచ—

శ్రీశుకః—"స్వయమేవ మయా పూర్వమేతద్ జ్ఞాతం వివేకతః
ఏతదేవ హి పృష్టేన పిత్రా మే సముదాహృతమ్
భవతాప్యేష ఏవార్థః కథితో వాగ్విదాం వర.
ఏష ఏవ చ వాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే
యథాయం స్వవికల్పోత్థః స్వవికల్పపరిక్షయాత్
క్షీయతే దగ్ధసంసారో నిఃసార ఇతి నిశ్చయః.
తత్కిమేతన్మహాబాహో సత్యం బ్రూహి మమాచలమ్
త్వత్తో విశ్రాన్తిమాప్నోమి చేతసా భ్రామితం జగత్."
(ల.వా.3.43-46)

వ్యా. శుకుడైతే ముందుగా స్వయముగానే తత్త్వము తెలిసికొని దాని విషయమున సంశము కలగగా తండ్రిని అడిగెను, అతడు కూడ అట్లే బోధింపగా దాని విషయమునందు కూడ సంశయము కలుగగా జనకుని వద్దకు వెళ్ళి అతడు కూడ అట్లే బోధించగా అతనితో ఇట్లు పలికెను—

"నేను ముందుగానే స్వయముగా వివేకముచేత ఈ విషయమును తెలిసికొంటిని. ఈ విషయమును గూర్చి మా తండ్రిగారిని అడుగగా ఆయన కూడ ఇదే చెప్పినారు. మాటలు తెలిసినవారిలో శ్రేష్ఠుడా! నీవు కూడ ఈ విషయమునే చెప్పితివి. శాస్త్రములలో కూడ ఈ విషయమే కనబడుచున్నది. అది ఏమనగా - తన ఊహలవలననే పుట్టిన ఈ పాడు సంసారము

ఆ ఊహలన్నీ పోగానే నశించుచున్నది; అందుచే ఇది సారము లేనిది. ఓ! మహాబాహూ! ఇదే స్థిరమైన సత్యము అగునా కాదా అను విషయమును నాకు చెప్పుము. నీవలన నేను విశ్రాంతిని పొందెదను. ఈ జగత్తు చిత్తము చేత త్రిప్పివేయబడుచున్నది."

మూ. జనకః—"నాతఃపరతరః కశ్చిన్నిశ్చయోఽస్త్యపరో మునే
స్వయమేవ త్వయా జ్ఞాతం గురుతశ్చ పునః శ్రుతమ్
అవ్యుచ్ఛిన్నశ్చిదాత్మైకః పుమానస్తీహ నేతరః
స్వసంకల్పవశాద్బద్ధో నిఃసంకల్పస్తు ముచ్యతే
మునే త్వయా స్ఫుటం జ్ఞాతం జ్ఞేయం స్వస్య మహాత్మనః
భోగేభ్యో విరతిర్జాతా దృశ్యాద్వా సకలాదిహ,
ప్రాప్తం ప్రాప్తవ్యమఖిలం భవతా పూర్ణచేతసా
న దృశ్యే యతసే బ్రహ్మన్ ముక్తస్త్వం భ్రాన్తిముత్సృజ
అనుశిష్టః స ఇత్యేవం జనకేన మహాత్మనా
విశశ్రామ శుకస్తూష్ణీం స్వస్థే పరమవస్తుని
వీతశోకభయాయాసో నిరీహశ్ఛిన్నసంశయః
జగామ శిఖరం మేరోః సమాధ్యర్థమనిన్దితమ్.
తత్ర వర్షసహస్రాణి నిర్వికల్పసమాధినా
దశ స్థిత్వా శశామాసావాత్మన్యస్నేహదీపవత్"
(ల.వా. **3.47-53**) ఇతి.

వ్యా. జనకుడు:-"ఓ! మునీ! ఇంతకు మించిన తత్త్వము మరొకటి ఏదీ లేదు. నీవు స్వయముగా దీనిని తెలిసికొన్నావు; మరల నీ తండ్రి నుండి విన్నావు. నాశరహితము, చిద్రూపము(జ్ఞానరూపము)అయిన ఆత్మ ఒక్కటియే ఉన్నది; రెండవది ఏదీ లేదు. జీవుడు తాను చేయు సంకల్పములచేత బద్ధుడగును. సంకల్పములు లేనివాడు ముక్తుడగును. ఓ!మునీ! తెలియదగిన దానిని నీవు స్పష్టముగా తెలిసికొంటివి. మహాత్ముడవైన నీకు భోగముల

నుండి, ఈ సకలదృశ్య ప్రపంచమునుండి వైరాగ్యము కలిగినది పరిపూర్ణ మైన చిత్తము గల నీవు పొందవలసిన దానివి అంతనూ పొందినావు. ఓ! బ్రాహ్మణుడా! నీవు ఈ దృశ్యవస్తుసముదాయమునకై ప్రయత్నించుట లేదు, నీవు ముక్తుడవు. భ్రాంతిని విడిచిపెట్టుము. మహాత్ముడైన జనకుడు ఈ విధముగా బోధించగా శుకుడు మౌనముతో సుఖనిలయమైన పరమతత్త్వ మునందు విశ్రాంతిగైకొనెను. శోకము, భయము ఆయాసము తొలగి పోగా కోరికలు లేనివాడై సంశయములన్నీ భిన్నములయి, సమాధి నిమిత్తము పవిత్రమైన మేరుపర్వత శిఖరమునకు వెళ్లెను. అక్కడ అతడు పదివేల సంవత్సరములు నిర్వికల్పసమాధిలో ఉండి తైలము లేని దీపము వలె తనలోనే శాంతిచెను.

మూ. తస్మాత్ విదితేఽపి తత్త్వే విశ్రాన్తిరహితస్య శుకరాఘవ యోరివ సంశయ ఉత్పద్యతే. స చాజ్ఞానమివ మోక్షస్య ప్రతిబన్ధకః. అత ఏవ భగవతోక్తమ్—

"అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః."

(భ.గీ. 4.40)ఇతి.

అశ్రద్ధా విపర్యయః. స చోత్తరత్రోదాహరిష్యతే.

వ్యా. అందువలన, తత్త్వము తెలిసినను విశ్రాంతి లేనివానికి శుకు నకు, రామునకు కలిగినట్లు సంశయము కలుగును. ఆ సంశయము అజ్ఞా నము వలెనే మోక్షమునకు ప్రతిబంధకము. అందువలననే భగవంతుడు చెప్పినాడు.

"తెలియనివాడు, శ్రద్ధలేనివాడు, సంశయాత్మ నశించును. సంశ యాత్మునికి ఈ లోకమూ లేదు, పరలోకమూ లేదు."

అశ్రద్ధ అనగా విపర్యయము. దానిని మున్ముందు ఉదాహరించెదము.

మూ. అజ్ఞానవిపర్యయౌ మోక్షమాత్రవిరోధినౌ; సంశయస్తు భోగమోక్షయోరుభయోరపి విరోధీ; తస్య పరస్పరవిరుద్ధకోటిద్వయా వలమ్బిత్వాత్. యదా సంసారసుఖాయ ప్రవృత్తిస్తదా మోక్షమార్గే బుద్ధిస్తాం నిరుణద్ధి.యదా చ మోక్షమార్గే ప్రవృత్తిస్తదా సంసారబుద్ధిస్తాం ప్రతిబధ్నాతి. తస్మాత్ సంశయాత్మనో న కించిత్సుఖమస్తీతి ముము క్షుణా సర్వథా సంశయశ్ఛేత్తవ్యః.అత ఏవ శ్రూయతే - "భిద్యన్తే సర్వసంశయాః" (ము.ఉ. 2.2.8) ఇతి.

వ్యా. అజ్ఞాన విపర్యయములు మోక్షమునకు మాత్రమే విరోధులు, సంశయమైతే భోగానికి మోక్షానికీ కూడ విరోధి. ఎందుచేత ననగా దానిలో పరస్పరవిరుద్ధమైన రెండు కోటులు [పక్షములు] ఉండును. సంసారసుఖ మనుభవించవలె నను ప్రవృత్తి కలగినప్పుడు మోక్షమార్గమునందు బుద్ధి కలిగి దానిని అడ్డుకొనును. మోక్షమార్గమునందు ప్రవృత్తి కలిగినప్పుడు సంసారబుద్ధి దానికి ప్రతిబంధకముగా నిలచును అందుచేత సంశయాత్మ నకు ఏ మాత్రమూ సుఖము ఉండదు గాన మోక్షమును కోరువాడు అన్ని విధాలా సంశయమును ఛేదించుకొనవలెను. అందుచేతనే - ''అన్ని సంశయ ములూ ఛిన్నములగును'' అని శ్రుతివాక్యము చెప్పుచున్నది.

మూ. విపర్యయస్యాపి నిదాఘ ఉదాహరణమ్. ఋభుః పరమ కరుణయా నిదాఘస్య గృహమేత్య బహుధా తం బోధయిత్వా నిర్గామ బుద్ధేఽపి తదుపదిష్టే వస్తున్యశ్రద్దధానో నిదాఘః కర్మాణ్యేవ పరమ పురుషార్థహేతురితి విపర్యయం ప్రాప్య కర్మానుష్ఠానే యథాపూర్వం ప్రవృత్తః. సోఽపి శిష్యస్య పరమపురుషార్థభ్రంశో మా భూదితి కృపయాగురుః పునరాగత్య బోధయామాస. తథాపి విపర్యయం న జహౌ తృతీయేన తు బోధనేన విపర్యయం పరిత్యజ్య విశ్రాన్తిమలభత. సంశయ విపర్య యాభ్యామసంభావనావిపరీతభావనారూపాభ్యాం తత్త్వజ్ఞానస్య ఫలం ప్రతిబధ్యతే; తదుక్తం పరాశరేణ:—

"మణిమన్త్రౌషధైర్వహ్నిః సుదీప్తోఽపి యథేన్ధనమ్
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబద్ధస్తథైవ చ
జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోఽపి చ
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ ప్రతిబద్ధస్తు కల్మషమ్
భావనా విపరీతా యా యా చాసంభావనా శుక
కురుతే ప్రతిబన్ధం సా తత్త్వజ్ఞానస్య నాపరమ్."

(ప.ఉ.అ. 14) ఇతి.

వ్యా. విపర్యమునకు నిదాఘుడు ఉదాహరణము. ఋభుడు అధికమైన కరుణతో నిదాఘుని గృహమునకు వచ్చి ఆతనికి అనేక విధముల బోధించి వెళ్లెను. ఆతడుపదేశించిన విషయము అర్థమైనను నిదాఘుడు దానియందు శ్రద్ధ లేనివాడై కర్మలే పరమపురుషార్థము నిచ్చును అని విపరీత బుద్ధిని పొంది యథాపూర్వముగా కర్మాచరణమునందే ఆసక్తుడాయెను. తన శిష్యుడు పరమపురుషార్థము నుండి భ్రష్టుడు కాగూడదనే అభిప్రాయముతో ఋభుడు కృప వహించి మరల వచ్చి బోధించెను. అప్పుడు కూడ ఆతడు విపర్యయమును విడువలేదు. మూడవ సారి వచ్చి బోధించగా ఆ విపర్యమును విడచి విశ్రాంతిని పొందెను. విషయమును తెలిసికొనకపోవుట సంశయము. విపరీతముగా తెలిసికొనుట విపర్యము. ఈ రెండూ తత్త్వజ్ఞాన ఫలమునకు ప్రతిబంధకములుగా ఉండును. ఈ విషయమును పరాశరుడు చెప్పెను.—

"బాగా మండుచున్నను అగ్ని మణులచేత గాని, మంత్రుముచేత గాని, ఓషధిచేతగాని ప్రతిబంధింప బడినప్పుడు కట్టెలను ఎట్లు కాల్చజాలదో అట్లే పుట్టిన జ్ఞానాగ్ని ప్రజ్వలించుచున్నను, చాలా దృఢముగా ఉన్నను అది ప్రతిబద్ధమైనప్పుడు కల్మషమును కాల్చజాలదు. శుకుడా! విపరీత భావన, అసంభావన, ఈ రెండూ తత్త్వజ్ఞానమునకు ప్రతిబంధము చేయును; మరొకటి ఏదీ లేదు."

మూ. తస్మాదవిశ్రాన్తచిత్తస్య సంశయప్రసంగేన తత్త్వ జ్ఞానస్య ఫలప్రతిబన్ధలక్షణాద్బాధాద్రక్షాపేక్ష్యతే. విశ్రాన్తచిత్తస్య తు మనోనాశేన యదా జగదేవ ప్రవిలీయతే తదా సంశయవిపర్యయయోః కః ప్రసఙ్గః? జగత్ప్రతిభాసరహితస్య బ్రహ్మవిదో దేహవ్యవహారోఽపి వినైవ స్వప్రయత్నం పరమేశ్వరప్రేరితేన ప్రాణవాయునా నిష్పాద్యతే. అత ఏవ ఛాన్దోగా ఆమనన్తి – "నోపజనం స్మరన్నిదం శరీరం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవమేవాస్మిఞ్ఛరీరే ప్రాణో యుక్తః" (ఛా.ఉ.8.12.3) ఇతి. ఉపజనం జనానాం సమీపే వర్తమాన మిదం శరీరం న స్మరన్ బ్రహ్మవిద్వర్తతే. పార్శ్వస్థా జనా ఏవ తత్త్వవిదః శరీరం పశ్యన్తి. స్వయం తు నిర్మనస్కత్వాన్మదీయమిదం శరీరమితి న స్మరతి. ప్రయోగ్యో రథశకటాదివహనే ప్రయోక్తుమర్హః శిక్షితోఽశ్వబలీవర్దాదిః. స యథా సారథినా మార్గస్యాచరణే ప్రేరితః పునః పునః సారథిప్రయత్నమనపేక్ష్య స్వయమేవ రథశకటాదికం పురోవర్తి గ్రామం నయతి ఏవమేవాయం ప్రాణవాయుః పరమేశ్వరేణా స్మిన్ శరీరే నియుక్తః సత్యసతి వా జీవప్రయత్నే వ్యవహారం నిర్వా-హయతి.

వ్యా. అందుచేత చిత్తము విశ్రాంతి చెందని వానికి సంశయము, విపర్యయము కలుగవచ్చును గాన తత్త్వజ్ఞానము ఇవ్వవలసిన ఫలమునకు ప్రతిబంధ మేర్పడును అట్టి తత్త్వజ్ఞానమునకు కలిగే బాధలనుండి దానిని రక్షించుకొనవలసి యుండును. చిత్తము విశ్రాంతి చెందినవాని మనస్సు నశించును గాన ఆతని విషయమున జగత్తే నశించినప్పుడు సంశయ విపర్యయములకు అవకాశమే ఉండదు. జగత్ప్రతిభాసము లేని (జగత్తు కనబడని) బ్రహ్మవేత్త దేహవ్యవహార మంతా అతని ప్రయత్న మేమీ లేకుండగనే పరమేశ్వరుని చేత ప్రేరేపింపబడిన ప్రాణవాయువుచేత జరిగి పోవుచుం-డును. ఈ విషయమునే ఛాందోగులు చెప్పిరి :–

"బ్రహ్మవేత్త జనుల మధ్య ఉంటూన్న తన శరీరమును గూర్చి స్మరించడు. బండి మొదలైనవాటికి కట్టబడిన ఎద్దు ఎట్లు తన పని చేయుచుండునో అట్లే ఈ శరీరమునందున్న ప్రాణము పని చేయుచుండును". ఉపజనమ్=జనుల సమీపమునందున్న, ఈ శరీరమును స్మరించకుండగనే బ్రహ్మవేత్త ఉండును. ప్రక్కనున్నవారు మాత్రమే బ్రహ్మవేత్త శరీరమును చూచుచుందురు అతడు, తాను, నిర్మనస్కుడగుటచేత "ఇది నా శరీరము" అని స్మరించడు. ప్రయోగ్యం=రథశకటాదులను లాగుటకై తగు విధముగ నేర్పబడిన గుఱ్ఱము, ఎద్దు మొదలైనది. సారథి మాటి రథాదులను లాగుటకై ప్రేరేపింపబడిన ఆ అశ్వాదికము మాటిమాటికి సారథి ప్రయత్నము అవసరము లేకుండగనే స్వయముగా రథశకటాదికమును ముందున్న గ్రామమునకు తీసికొనివెళ్లినట్లు, పరమేశ్వరునిచేత ఈ శరీరమునందు నియుక్తమైన ప్రాణవాయువు జీవుని ప్రయత్నము ఉన్నను లేకపోయినను వ్యవహారమును నడుపుచుండును.

మూ. భాగవతేఽపి స్మర్యతే—

దేహం వినశ్వరమవస్థితముత్థితం వా
సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమత్స్వరూపమ్.
దైవాదుపేతమథ దైవవశాదపేతం
వాసో యథా పరికృతం మదిరామదాన్ధః."

(భాగ. 11.13.36) ఇతి.

వసిష్ఠోఽప్యాహ—
"పార్శ్వస్థబోధితాః సన్తః పూర్వాచారక్రమాగతమ్
ఆచారమాచరన్త్యేవ సుప్తబుద్ధవదక్షతాః"

(ల.వా.13.127) ఇతి.

వ్యా. భాగతములో కూడ చెప్పబడినది—

"మద్యమదాంధుడు తాను ధరించిన వస్త్రము శరీరముమీద ఉన్ననూ, ఊడిపోయినను ఎట్లు తెలిసికొనడో ఆత్మస్వరూప సాక్షాత్కారము పొందిన

సిద్ధుడు వినశ్వరమైన (నాశస్వభావము గల) ఈ శరీరము ఉన్నను లేక పోయినను గుర్తించడు."

వసిష్ఠుడు కూడ చెప్పెను—

"జ్ఞానులు పార్శ్వమునందున్న వారిచేత బోధింపబడిన వారై, నిద్ర నుండి మేల్కొలుపబడినవారు వలె, పూర్వాచారక్రమముచే వచ్చిన ఆచారమును ఆచరించుచునే ఉందురు."

మూ. సిద్ధో న పశ్యతి, ఆచారమాచరతీత్యుభయోః పరస్పర విరోధ ఇతి చేన్న. విశ్రాన్తితారతమ్యేన వ్యవస్థోపపత్తేః. తదేవ తారతమ్యమభిప్రేత్య శ్రూయతే - "ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః" (ము.ఉ.**3.1.4**) ఇతి. అత్ర చత్వారః ప్రతీయన్తే - బ్రహ్మవిత్ప్రథమః, బ్రహ్మవిద్వరో ద్వితీయః, బ్రహ్మవిద్వరీయాంస్తృతీయః, బ్రహ్మవిద్వరిష్ఠశ్చతుర్థః. త ఏతే సప్తసు యోగభూమిషు చతుర్థీం యోగభూమిమారభ్య క్రమేణ భూమిచతుష్టయం ప్రాప్తా ఇత్యవగన్తవ్యమ్. భూమయశ్చ వసిష్ఠేన దర్శితాః—

"జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా
విచారణా ద్వితీయా స్యాత్తృతీయా తనుమానసా.
సత్త్వాపత్తిశ్చతుర్థీ స్యాత్తతోఽసంసక్తినామికా —
పదార్థాభావినీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా."

(ల.వా. **13.113,114**) ఇతి.

వ్యా. "జ్ఞాని చూడడు", "జ్ఞాని ఆచారమును ఆచరించును" అను ఈ రెండూ పరస్పర విరుద్ధములు కదా అని ఆశంకింపరాదు; ఎందుచేత ననగా మనో విశ్రాంతిలోని తారతమ్యమును బట్టి ఇవి కుదురును ఈ తారతమ్యమునే దృష్టిలో ఉంచుకొని శ్రుతిలో ఇట్లు చెప్పబడినది — "బ్రహ్మవేత్తలలో వరిష్ఠుడైన ఈ ఆత్మజ్ఞాని ఆత్మయందే ఆడుకొను

చుండును, ఆత్మయందే సంతోషించుచుండును; క్రియావంతుడై ఉండును.''
ఈ బ్రహ్మవేత్తలలో నాలుగు తరగతులు కనబడుచున్నవి— మొదటివాడు
బ్రహ్మవేత్త; రెండవవాడు బ్రహ్మవిద్వరుడు (మంచి బ్రహ్మవేత్త);
మూడవవాడు బ్రహ్మవిద్వరీయాంసుడు (బ్రహ్మవేత్తలలో గొప్పవాడు);
నాల్గవవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడు (బ్రహ్మవేత్తలలో ఉత్తముడు). ఏడు
విధములైన యోగభూములలో నాల్గవ భూమిక మొదలు నాలిగింటిని క్రమ
ముగా చేరినవారే ఈ చతుర్విధజ్ఞానులని గ్రహించవలెను. ఈ భూములను
గూర్చి వసిష్ఠుడు చెప్పి ఉన్నాడు—

''శుభేచ్ఛ" అనునది మొదటి జ్ఞానభూమి. "విచారణ" రెండవది.
"తనుమానస" మూడవది. "సత్త్వాపత్తి" నాల్గవది "అసంసక్తి" అనునది
అయిదవది. "పదార్థాభావిని" ఆరవది. ''తుర్యగ'' (తుర్యస్థితికి చెందినది)
ఏడవది.

మూ. "స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః
(ల.వా. 13.116)

వ్యా. "నేను మూఢుడుగానే ఉండిపోయినా నేమి? నేను శాస్త్రముల
సహాయముచేతను, సజ్జనుల సహాయముచేతను తెలిసికొనెదను''— ఈ విధ
ముగ వైరాగ్య పూర్వకముగ కలుగు ఇచ్ఛ "శుభేచ్ఛ'' అని పండితులు
చెప్పుదురు.

మూ. శాస్త్రసజ్జనసంపర్కవైరాగ్యాభ్యాసపూర్వకమ్
సద్విచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా.
(ల.వా. 13.117)

వ్యా. శాస్త్రముల అధ్యయనము, సజ్జనుల సహవాసము, వైరాగ్యా
భ్యాసము చేయుచు ఉత్తమ విచారములందు (తత్త్వ పరిశీలనమునందు)
ప్రవర్తించుట "విచారణ."

మూ. విచారణా శుభేచ్ఛాభ్యామిన్ద్రియార్థేష్వసక్తతా
యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసా.

(ల.వా. 13.118)

వ్యా. ("ఇన్ద్రియార్థేషు సక్తతా" అని పాఠ ముండవలె నని తోచు చున్నది.) ఇంద్రియార్థములమీద [భోగములమీద] ఆసక్తి విచారణచేతను, శుభేచ్ఛచేతను ఎప్పుడు తగ్గిపోవునో అది "తనుమానస" అను భూమిక అని చెప్పబడుచున్నది

మూ. భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తేఽర్థవిరతేర్వశాత్
సత్త్వాత్మని స్థితిః శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా.

(ల.వా. 13.119)

వ్యా. పై భూమికలను మూడింటిని అభ్యసించుటచేత చిత్తమునందు విషయము లేవీ గోచరించకపోవుటచే అది పరిశుద్ధమైన సత్త్వరూపమున ఉండుట "సత్త్వాపత్తి" అని చెప్పబడుచున్నది.

మూ. దశాచతుష్టయాభ్యాసాదసంసర్గఫలా తు యా
రూఢసత్త్వచమత్కారా ప్రోక్తా సంసక్తినామికా

(ల. వా. 13.120)

వ్యా. పైనచెప్పిన నాలుగు భూమికల అభ్యాసమువలన "అసంసక్తి" అను భూమిక లభించును దీనిని చేరినవానికి బాహ్యప్రపంచ సంబంధ ముండదు. సత్త్వగుణ చమత్కారము స్థిరమగును.

మూ. భూమికాపఞ్చకాభ్యాసాత్స్వాత్మారామతయా భృశమ్
ఆభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్
పదార్థాభావినీ నామ షష్ఠీ భవతి భూమికా.

(ల.వా. 13.121,122)

వ్యా ఐదు భూమికలను అభ్యసించుటవలన అధికముగా ఆత్మారాముడు గానే ఉండుటచే (ఆత్మయందు మాత్రమే స్థిరచిత్తుడై ఆనందమును పొందు చుండుటచే) అభ్యంతర లోపలి) పదార్థములుగాని, బాహ్యపదార్థములు కాని భాసించవు ఇతరులు చాలసేపు ప్రయత్నము చేయగా బాహ్యస్మృతి వచ్చును. ఇది "పదార్థాభావిని" అను ఆరవ భూమిక.

మూ. భూమిషట్క-చిరాభ్యాసాద్ భేదస్యానుపలమ్భనాత్
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా స్థితిః
(ల.వా. **13.123**) ఇతి.

వ్యా. ఆరు భూమికలను చిరకాలము అభ్యసించుటనే భేదము గోచరించక కేవలస్వస్వరూపమునందు స్థిరుడుగా ఉండుట "తుర్యగ భూమిక"

మూ. అత్ర భూమికాత్రితయం బ్రహ్మవిద్యాయాః సాధనమేవ, న తు విద్యాకోటావన్తర్భవతి. భూమిత్రయే భేదసత్యత్వబుద్ధేరనివర్తి తత్వాత్. అత ఏవైతజ్జాగరణమితి వ్యపదిశ్యతే. తదుక్తమ్-

"భూమికాత్రితయం త్వేతద్రామ జాగ్రదితి స్థితమ్
యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే" ఇతి.

వ్యా. పైన చెప్పిన వాటిలో మూడు భూమికలు బ్రహ్మవిద్యకు సాధనములు మాత్రమే కాని అవి విద్యాకోటిలో చేరవు. ఎందుచేత ననగా ఈ మూడు భూములయందు "భేదము సత్యము" అను బుద్ధి తొలగదు అందువలననే ఈ భూమికాత్రయమునకు "జాగ్రత్" అని పేరు. ఈ విష యమే చెప్పబడినది— "రామా! ఈ భూమికాత్రయము జాగ్రదవస్థయే అని నిర్ణయము. ఈ జాగ్రత్తులో ఈ జగత్తు, భేదబుద్ధిచేత, యదార్థముగా భాసించును."

మూ. తతో వేదాన్తవాక్యాన్నిర్వికల్పకో బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారశ్చతుర్థీ భూమికా ఫలరూపా సత్త్వాపత్తిః. చతుర్థభూమౌ సర్వ

జగదుపాదానస్య బ్రహ్మణో వాస్తవమద్వితీయసత్తాస్వభావం నిశ్చిత్య బ్రహ్మణ్యారోపితయోర్జగచ్ఛబ్దాభిధేయయోర్నామరూపయోర్మిథ్యాత్వ మవగచ్ఛతి. ముముక్షోః పూర్వోక్తం జాగరణమపేక్ష్య సేయం భూమిః స్వప్నః. తదాహ—

"అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే చోపరతిం గతే
పశ్యన్తి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః
చిత్తం తు శరదభ్రాంశవిలయా ప్రవిలీయతే.
సత్తావశేష ఏవాస్తే చతుర్థీం భూమికామితః"

(ల.వా. **43.70,71**)

వ్యా. అటు పిమ్మట వేదాంతవాక్యములవలన వికల్పశూన్యమైన బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము కలుగును. అది నాల్గవ భూమిక. అది ఫలరూపమైన సత్త్వాప్తి, అనగా శుద్ధసత్త్వ రూపమున ఉండుట. ఈ నాల్గవ భూమికలో-సర్వజగత్తుకు ఉపాదాన కారణమైన బ్రహ్మ వాస్తవమున అద్వితీయ మని, సత్తయే (ఉనికియే) దీని స్వభావమని నిశ్చయించి, ఆ బ్రహ్మయందు ఆరోపించబడిన, జగత్తు అనే పేరు గల నామరూపములు మిధ్య అని, అనగా బ్రహ్మ ఒక్కటియే సత్యము, దానిమీద నామములు, రూపములు ఆరోపించబడిన వగుటచే అవి మిథ్యయని, గ్రహించును. పూర్వము చెప్పిన జాగరణము దృష్ట్యా ముముక్షువునకు ఈ భూమిక స్వప్నము. ఈ విషయమే చెప్పబడినది—

''నాల్గవ భూమికను చేరినవారు, అద్వైతము తొలగిపోగా లోకమును స్వప్నమునువలె చూచుచుందురు. శరత్కాలమేఘము లీనమైపోయి నట్లు చిత్తము లీనమైపోవును ఈ విధముగ నాల్గవ భూమికను చేరినవాడు సత్తామాత్రముతోనే ఉండును, అనగా ఆ భూమికను చేరినవానికి ఉనికి తప్ప మరే ధర్మము ఉండదు.

మూ. సోఽయం చతుర్థీం భూమికాం ప్రాప్తో యోగీ బ్రహ్మ విదిత్యుచ్యతే. పఞ్చమ్యాదయస్తిస్రో భూమయో జీవన్ముక్తేరవాన్తర

భేదాః. తే చ నిర్వికల్పసమాధ్యభ్యాసకృతేన విశ్రాన్తితారతమ్యేన సంపద్యన్తే. పఞ్చమభూమౌ నిర్వికల్పాత్ స్వయమేవ వ్యుత్తిష్ఠతే. సోఽయం యోగీ బ్రహ్మవిద్వరః. షష్ఠభూమౌ పార్శ్వస్థైర్బోధితో వ్యుత్తిష్ఠతే, సోఽయం బ్రహ్మవిద్వరీయాన్. తదేతద్ భూమిద్వయం సుషుప్తిర్గాఢసుషుప్తిరితి చాభిధీయతే. తదాహ-

వ్యా ఈ నాల్గవ భూమికను చేరిన యోగి ''బ్రహ్మవిత్'' అని చెప్పబడును. ఐదవది మొదలైన భూమికలు మూడూ జీవన్ముక్తిలోని అవాంతర భేదములు నిర్వికల్పకసమాధిని అభ్యసించగా కలుగు విశ్రాంతి లోని తారతమ్యమును పట్టి అవి ఏర్పడును పంచమ భూమిలో ఉన్న యోగి నిర్వికల్పసమాధి నుండి స్వయముగానే వ్యుత్థితుడగును.

ఈ యోగి "బ్రహ్మ విద్వరుడు'' ఆరవ భూమికలో ఉన్నవాడు ప్రక్కనున్న వారిచేత బోధింపబడును. అతడు ''బ్రహ్మవిద్వరీయసుడు''. (బ్రహ్మవిద్వరునికంటె గొప్పవాడు). ఈ విషయమునే చెప్పి ఉన్నాడు—

మూ. పఞ్చమీం భూమికామేత్య సుషుప్తిపదనామికామ్
శాన్తాశేషవిశేషాంశస్తిష్ఠత్యద్వైతమాత్రకే.

( ల. వా. **43.73** )

వ్యా "సుషుప్తి'' అను పేరు గల ఐదవ భూమికను చేరినవాడు, సమస్తమైన విశేషాంశములు (భేదములు) శాంతిచుటచే పూర్తిగా అద్వైత స్థితిలో ఉండును.

మూ. అన్తర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోఽపి సన్
పరిశ్రాన్తతయా నిత్యం నిద్రాళురివ లక్ష్యతే.

( ల. వా. **43.75** )

అ. అట్టి యోగి బాహ్య వ్యవహారములు చేయుచున్నను నిత్యము అంతర్ముఖుడుగా ఉండుటచేత, ఎక్కువ అలసిపోయి నిద్రాభిముఖుడైన వ్యక్తివలె కనబడును.

మూ. కుర్వన్నభ్యాసమేతస్యాం భూమికాయాం వివాసనః
షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్ పతతి భూమికామ్.
(ల. వా. 43.76)

వ్యా. ఈ భూమికయందు అభ్యాసము చేయుచున్నవాడు వాసనలను అన్నింటినీ తొలగించుకొని క్రమముగా ''గాఢ సుషుప్తి'' అను ఆరవ భూమికను చేరును.

మూ. యత్ర నాసన్నసద్రూపో నాహం నాప్యనహంకృతిః
కేవలం క్షీణమనన ఆస్తే ద్వైతైక్యవర్జితః (ల. వా. 43.77)

వ్యా. ఆ భూమికను చేరిన యోగి సద్రూపుడు (ఉన్నవాడు) కాడు, అసద్రూపుడు (లేనివాడు) కాడు. అహంకార మున్నవాడు కాడు, అహంకారము లేనివాడు కాడు. అన్ని చిత్తవృత్తులు నశించగా ద్వైతము కాని, అద్వైతముకాని లేనివాడై ఉండును.

మూ. అన్తఃశూన్యో బహిఃశూన్యః శూన్యః కుమ్భ ఇవామ్బరే
అన్తఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణః కుమ్భ ఇవార్ణవే
(ల. వా. 43.79) ఇతి.

వ్యా. అతడు ఆకాశములో ఉంచిన కుంభమువలె బయట ఏమీ లేనివాడై లోపలకూడ ఏమీ లేనివాడై ఉండును. సముద్రములో ముంచిన కుంభమువలె లోపల పూర్ణుడై, బైటకూడ పూర్ణుడై ఉండును.

మూ. గాఢం నిర్వికల్పసమాధిం ప్రాప్తస్య సంస్కారమాత్రశేషస్య చిత్తస్య మనోరాజ్యం కర్తుం, బాహ్యపదార్థాన్ గ్రహీతుం వా సామర్థ్యాభావాదాకాశావస్థితకుమ్భవదన్తర్బహిఃశూన్యత్వమ్; స్వయంప్రకాశసచ్చిదానన్దైకరసే బ్రహ్మణి నిమగ్నత్వేన బహిశ్చ సర్వత్ర బ్రహ్మదృష్ట్యా సముద్రమధ్యస్థాపితజలపూర్ణకుమ్భవదన్తర్బహిః పూర్ణత్వమ్. తురీయాభిధాం సప్తమీం భూమిం ప్రాప్తస్య యోగినః స్వతః

పరతో వా వ్యుత్థానమేవ నాస్తి. తాదృశమేవోద్దిశ్య "దేహం వినశ్వర మవస్థితముత్థితం వా" ఇత్యాది భాగవతవాక్యం ప్రవృత్తమ్. అసంప్ర జ్ఞాతసమాధిప్రవర్తకాని యోగశాస్త్రాణ్యత్రైవ పర్యవసితాని. సోఽయ మీదృశో యోగీ పూర్వోదాహృతశ్రుతౌ బ్రహ్మవిద్వరిష్ఠ ఇత్యుచ్యతే. ఏవం పార్శ్వస్థబోధితః సిద్ధో న పశ్యతీత్యనయోర్భూమిద్వయే వ్యవస్థితత్వాన్న కోఽపి విరోధః.

వ్యా. గాఢమైన నిర్వికల్పసమాధిని పొంది సంస్కారము మాత్రమే మిగిలిన చిత్తమునకు మనోరాజ్యాలు చేయుటకు గాని (గాలిలో మేడలు కట్టుటకు గాని), బాహ్యపదార్థములను గ్రహించుటకు గాని సామర్థ్యముండదు గాన అది ఆకాశములో ఉంచిన కుంభమువలె వెలుపలా, లోపలా కూడ శూన్యముగా ఉండును స్వయంప్రకాశము, సచ్చిదానందైక రసముఅయిన(సచ్చిదానందరూపములో మాత్రమే ఉన్న) బ్రహ్మలో మునిగి ఉండుటవలన ఆ చిత్తము సముద్రమునందు ముంచిన జలపూర్ణమైన కుంభ మువలె లోపలా, బైటాకూడ పూర్ణమై ఉండును. ''తురీయము'' అను పేరు గల సప్తమ భూమికను పొందిన యోగికి స్వతః గాని, పరుల ద్వారా గాని సమాధినుండి వ్యుత్థానమే ఉండదు. అట్టివానినే దృష్టిలో ఉంచుకొని భాగ వతములో ''దేహం వినశ్వరమవస్థితముత్థితం వా''(పుట304 ఇత్యాదిశ్లోకము చెప్పబడినది అసంప్రజ్ఞాతసమాధిని ప్రతిపాదించు యోగశాస్త్రములకు ఇట్టి భూమికయందే పర్యవసానము. అనగా యోగశాస్త్రము లన్నీ ప్రతిపాదించు అత్యున్నతస్థితి ఈ సప్తమభూమికయే పూర్వము ఉదాహరించిన ''ఆత్మ క్రీడః'' ఇత్యాది శ్రుతిలో (పుట 305) చెప్పబడిన ''బ్రహ్మవిద్వరిష్ఠుడు'' ఈ యోగియే ఈ విధముగా ''పార్శ్వస్థబోధితః'' (ప్రక్కనున్న వారు లేపగా లేచును) అను వాక్యము, ''సిద్ధః న పశ్యతి'' [సిద్ధుడు చూడడు) అను వాక్యము రెండు వేరు వేరు భూమికలలో ఉన్న యోగులను గూర్చి చెప్పుచున్నవి గాన విరోధము లేదు.

మూ. తత్రాయం సంగ్రహః-పఞ్చమాదిభూమిరూపాయాం జీవన్ముక్తౌ సంపద్యమానాయాం ద్వైతప్రతిభాసాభావేన సంశయవిపర్యయప్రసంగాభావాదుత్పన్నం తత్త్వజ్ఞానమబాధేన రక్షితం భవతి, సేయం జ్ఞానరక్షా ప్రథమం ప్రయోజనమ్. తపో ద్వితీయం ప్రయోజనమ్. యోగభూమీనాం దేవత్వాదిప్రాప్తిహేతుతయా తపస్త్వం ద్రష్టవ్యమ్. తద్ధేతుత్వం చార్జునభగవతోః శ్రీరామవసిష్ఠయోశ్చ ప్రశ్నోత్తరాభ్యామవగమ్యతే.

వ్యా. ఇంతవరకు చేసిన విచారము సంగ్రహము ఇది : పంచమ-షష్ఠ-సప్తమ భూమికలు అను జీవన్ముక్తి సంపాదించిన పిమ్మట ద్వైత భానము లేకపోవుటచేత సంశయముగాని, విపర్యయము గాని కలిగే ప్రసక్తి ఉండదు గాన, కలిగిన తత్త్వజ్ఞానమునకు ఎట్టి బాధయు ఉండదు; అందుచేత అది రక్షింపబడును. ఈ జ్ఞానరక్ష జీవన్ముక్తికి మొదటి ప్రయోజనము, తపస్సు రెండవ ప్రయోజనము. యోగభూములు దేవత్వాదులను పొందుటకు హేతువులు గాన అవి కూడ తపస్సే అని గ్రహించవలెను. ఇవి దేవత్వాది ప్రాప్తికి హేతువులు అను విషయము అర్జున శ్రీకృష్ణుల ప్రశ్నోత్తరములను శ్రీరామవసిష్ఠుల ప్రశ్నోత్తరములను పట్టి తెలియచున్నది

మూ. అర్జున ఉవాచ-

"అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి
కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి
ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే."

(భ.గీ. 6.37-39)

వ్యా. అర్జునుడు పలికెను - "కృష్ణా శ్రద్ధ ఉన్నను ప్రయత్నము చేయజాలక మరణసమయమునందు యోగమునుండి మనస్సు చలించినవాడు

యోగసిద్ధిని పొందడు కదా; అతనికి ఏ గతి కలుగును ? ఓ! మహాబాహూ! ఆతడు బ్రహ్మమార్గమను (బ్రహ్మస్వరూపమును) తెలిసికొనజాలక, నిలకడ లేనివాడై, ఉభయభ్రష్టుడై చెదిరిపోయిన మేఘమువలె నశించునా? కృష్ణా! నాకు కలిగిన ఈ సంశయమును నీవు పూర్తిగా తొలగించవలెను. నీవు తప్ప మరెవ్వరును ఈ సంశయమును తొలగింపజాలరు కదా?"

మూ. భగవానువాచ :-

"పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి
ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునన్దన"
(భ.గీ. 6.40-43) ఇతి.

వ్యా. భగవంతుడు చెప్పెను:-

"అర్జునా! ఇహలోకములో గాని, పరలోకములో గాని ఆతనికి వినాశము లేదు. (అతడు ఉభయభ్రష్టుడు కాడు) మంచి పనులు చేసేవాడు ఎవ్వడూ దుర్గతి పొందడు యోగభ్రష్టుడు పుణ్యాత్ములకు లభించే లోకములను పొంది, సుదీర్ఘకాలము అక్కడ ఉండి పవిత్రులైన శ్రీమంతుల గృహములో పుట్టును. లేదా జ్ఞానవంతులైన యోగుల కులమునందు పుట్టును. అయితే ఈ లోకములో ఇట్టి కులమునందు జన్మించుట చాల దుర్లభము. అక్కడ పూర్వజన్మలో ఉన్న జ్ఞానమును మరల పొంది సిద్ధికొరకై మరల ప్రయత్నించును.

మూ. శ్రీరామ ఉవాచ :-

ఆద్యామథ ద్వితీయాం వా తృతీయాం భూమికాముత
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్ గతిః

వ్యా. పూజ్యుడా! మొదటి భూమికను గాని, ద్వితీయ భూమికను గాని, తృతీయ భూమికను గాని అధిష్ఠించి మరణించినవానికి ఎట్టి గతి కలుగును?

మూ. వసిష్ఠ ఉవాచ :-

"యోగభూమికయోత్క్రాన్తజీవితస్య శరీరిణః
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతమ్
తతః సురవిమానేషు లోకపాలపురేషు చ
మేరూపవనకుఞ్జేషు రమతే రమణీసఖః
తతః సుకృతసంభారే దుష్కృతే చ పురా కృతే
భోగక్షయపరిక్షీణే జాయన్తే యోగినో భువి
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతామ్
తత్ర ప్రాగ్భావనాభ్యస్తం యోగభూమిత్రయం బుధః
స్పృష్ట్వోపరి పతత్యుచ్చైరుత్తరం భూమికాక్రమమ్" ఇతి.

వ్యా వసిష్ఠుడు పలికెను:-

యోగభూమికను ఎక్కి మరణించినవాని పూర్వపాపము ఆతడు పొందిన భూమిక విశేషమును పట్టి క్షీణించును. పిమ్మట అతడు యువతులతో కూడి దేవతల విమానములెక్కి లోకపాలకుల పురములలోను, మేరు పర్వతోద్యానలతాకుంజములలోను క్రీడించును పిమ్మట పూర్వము చేసిన పుణ్యము భోగముచేతను క్షయముచేతను క్షీణించగా యోగులు భూలోకమునందు పవిత్రులైన శ్రీమంతుల గృహమునందు, గుణవంతులైన సత్పురుషుల పుణ్యముచే రక్షింపబడిన గృహమునందు జనింతురు. పిమ్మట యోగి పూర్వజన్మభావనచే అభ్యసించబడిన మూడు యోగ భూములను స్పృశించి, తరువాతి ఉన్నత భూమికల క్రమమును అతి శీఘ్రముగా పొందును.

మూ. అస్త్వేవం యోగభూమీనాం దేవలోకప్రాప్తిహేతుత్వమ్; తాపతా తపస్త్వం కుత ఇతి చేత్, శ్రుతేరితి బ్రూమః తథా చ

తైత్తిరీయా ఆమనన్తి-"తపసా దేవా దేవతామగ్ర ఆయన్; తప సర్షయః స్వరన్వవిన్దన్" (తై. బ్రా 3.12-3) ఇతి. తత్త్వజ్ఞానాత్ ప్రాచీనస్య భూమికాత్రయస్య తపస్త్వే సతి, తత్త్వజ్ఞానస్యోత్తర కాలీనస్య, నిర్వికల్పసమాధిరూపస్య పఞ్చమ్యాదిభూమికాత్రయస్య తపస్త్వం కైముతికన్యాయసిద్ధమ్. అత ఏవ స్మర్యతే-

"మనసశ్చేన్ద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే" ఇతి.

వ్యా. (ఆశంక) యోగభూములు ఈ విధముగ దేవలోక ప్రాప్తికి హేతువులైతే కావచ్చును; అంతమాత్రముచేత అవి తపస్సు అని చెప్పుట ఎట్లు? [సమాధానము] శ్రుతిని పట్టి అని చెప్పెదము. తైత్తిరీయులు ఈ విధముగా చెప్పుచున్నారు — "పూర్వము దేవతలు తపస్సుచేత దేవత్వ మును పొందిరి. ఋషులు తపస్సుచేత స్వర్గమును చేరిరి". తత్త్వజ్ఞానము కంటె ప్రాచీనమైన భూమికాత్రయము తపస్సు అని చెప్పినప్పుడు తత్త్వ జ్ఞానము తరువాతిదైన నిర్వికల్ప సమాధిరూపమైన ఐదవ భూమిక, ఆరవ భూమిక, ఏడవ భూమిక అను భూమికాత్రయము తపస్సు అను విషయము కైముతిక న్యాయముచేతనే సిద్ధించును. అందుచేతనే స్మృతిలో ఇట్లు చెప్ప బడినది—

''మనస్సుయొక్క, ఇంద్రియములయొక్క ఏకాగ్రతయే పరమ తపస్సు అది అన్ని ధర్మములకంటె గొప్పది అది ఉత్తమధర్మ మని చెప్పబడుచున్నది.''

''కిముత'' అనగా "ఇంకా చెప్పవలెనా?" అని అర్థము. "కొంచెము సామర్థ్యము గల ఇతడే ఈ పని చేయగలిగి నప్పుడు ఈతనికంటె చాల సమర్థుడైన ఆతడు ఆ పనిని చేయగలడని వేరుగా చెప్పవలెనా'' ఇత్యాదులు కైముతికన్యాయమునకు ఉదాహరణములు. "అప్పములు అమర్చిన కట్టిపెట్టెను ఎలకలు తినివేసినా యని చెప్పినప్పుడు అప్పాలను తినివేసినవని వేరే

చెప్పవలెనా'' అని ప్రసిద్ధముగా చెప్పు ఉదాహరణము. దీనికి ''దండా పూపికా న్యాయము" అని పేరు.

మూ. యద్యప్యనేన న్యాయేన తపసా ప్రాప్యం జన్మాన్తరం నాస్తి, తథాపి లోకసంగ్రహాయేదం తపో యుజ్యతే. అత ఏవ భగవానాహ-

"లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి"
(భ.గీ. 320) ఇతి.

వ్యా. ఈ న్యాయమునే అనుసరించి తపస్సుచేత సాధింపదగిన మరొక జన్మ లేకపోయినను ఈ తపస్సు లోక సంగ్రహము కొరకు (లోక మునకు దారి చూపి అనుగ్రహించుటకు) ఉపయోగించును అందుచేతనే భగవంతుడు—''లోకసంగ్రమును దృష్టిలో ఉంచుకొని యైనను నీవు కర్మ చేయవలెను'' అని చెప్పినాడు.

మొదటి మూడు భూమికలు తపస్సు అని వేరుగా చెప్ప పనిలేదని కైముతికన్యాయము చూపబడినది. ఈ కైముతికన్యాయమునే ఉపయోగించినచో - ''ఆ మొదటి భూమికలే స్వర్గాదులను ఇచ్చినప్పుడు చివరి మూడు అంతకంటె గొప్ప జన్మాంతరమును ఇవ్వవలెను కదా'' అని ఆశంకించుకొని ఈ సమాధానము చెప్పబడనది.

మూ. సంగ్రాహ్యాశ్చ లోకస్త్రివిధః-శిష్యా, భక్తస్తటస్థశ్చేతి. తత్ర శిష్యస్యాన్తర్ముఖే యోగిని గురౌ ప్రామాణికత్వబుద్ధ్యతిశయేన తదుపదిష్టే తత్త్వే పరమం విశ్వాసం ప్రాప్య చిత్తం సహసా విశ్రామ్యతి. అత ఏవ శ్రూయతే-

"యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" (శ్వే. ఉ. 6.23)ఇతి. స్మర్యతే చ :-

"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి"
(భ.గీ. 4.39) ఇతి.

వ్యా- శిష్యుడు, భక్తుడు, తటస్థుడు అని సంగ్రహింపదగిన (అనుగ్రహింపదగిన) లోకము (జనము) మూడు విధములు అంతర్ముఖుడైన గురువైన యోగియందు శిష్యునకు ప్రామాణికత్వబుద్ధి [ఈయన బోధించునది తప్పక నమ్మదగినదే అను బుద్ధి] అధికముగా ఉండును గాన ఆ గురువు ఉపదేశించిన తత్త్వమునందు పూర్తి విశ్వాసముతో ఆతని చిత్తము విశ్రాంతిని పొందును. అందుచేతనే శ్రుతిలో ఇట్లు చెప్పబడినది--

"ఎవనికి దేవునియందు గొప్ప భక్తి ఉండునో, దేవునియందు ఎంత భక్తి ఉన్నదో అంత భక్తి గురువుమీద కూడ ఉండునో ఆ మహాత్మునకు చెప్పబడిన ఈ విషయములు ప్రకాశవంతములుగా ఉండును".

స్మృతిలో కూడ చెప్పబడినది—

"ఇంద్రియములను నిగ్రహించి, దానియందే (జ్ఞానమునందే) ఆసక్తి కలవాడైన శ్రద్ధావంతుడే జ్ఞానమును పొందును. జ్ఞానమును పొంది చాల తక్కువకాలములో గొప్ప శాంతిని పొందును".

మూ. అన్నప్రదానసనివాసస్థానకల్పనాదినా యోగినం సేవమానో భక్తస్తదీయం తపః స్వయమేవాదత్తే. తథా చ శ్రూయతే-"తస్య పుత్రా దాయముపయన్తి సుహృదః సాధుకృత్యాం ద్విషన్తః పాపకృత్యామ్" ఇతి. తటస్థోఽపి ద్వివిధః-ఆస్తికో, నాస్తికశ్చేతి; తత్రాస్తికో యోగినః సన్మార్గాచరణం దృష్ట్వా స్వయమపి సన్మార్గే ప్రవర్తతే. తథా చ స్మృతిః-

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే"
(భ.గీ. 3.21) ఇతి.

నాస్తికోఽపి యోగినా దృష్టః పాపాన్ముచ్యతే. తదుక్తమ్-
"యస్యానుభవపర్యన్తా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే
తద్దృష్టిగోచరాః సర్వే ముచ్యన్తే సర్వపాతకైః"
(సూ.సం. 2.20.44) ఇతి.

వ్యా. అన్నము పెట్టుట నివాసస్థానము ఏర్పరచుట మొదలైన పనులచేత యోగిని సేవించు భక్తుడు అతని తపస్సును తానే తీసికొనును. ఈ విషయము శ్రుతిలో చెప్పబడినది "అతని (జ్ఞానియొక్క) పుత్రులు దాయమును (పితృధనమును) పొందుదురు; మిత్రులు పుణ్యమును, శత్రువులు పాపమును పొందుదురు." ఆస్తికుడు, నాస్తికుడు అని తటస్థుడు కూడ రెండు విధములు, యోగి సన్మార్గములో ప్రవర్తించుట చూచి ఆస్తికుడు తాను కూడ అట్టి సన్మార్గమునందు, ప్రవర్తించును. ఈ విషయమును స్మృతి చెప్పుచున్నది—

"శ్రేష్ఠుడైన పురుషుడు ఏమేమి చేయునో సామాన్యజనుడు కూడ దానినే చేయును అతడు దేనిని ప్రమాణమునుగా స్వీకరించునో దానినే లోకము అనువర్తించును".

యోగి దృష్టి పడిన నాస్తికుడు కూడ పాపవిముక్తుడగును. ఈ విషయము (సూతసంహితలో) చెప్పబడినది—

"ఎవని బుద్ధి తత్త్వమునందు అనుభవము పర్యంతము ప్రసరించినదో (అనగా ఎవడు కేవలము పరోక్షజ్ఞానము మాత్రమే కాక ఆత్మసాక్షాత్కారము పొందినాడో) అతని దృష్టికి గోచరించినవారందరూ సకలపాపములనుండి విముక్తులగదురు''.

మూ. అనేన ప్రకారేణ సర్వప్రాణ్యుపకారిత్వం యోగినో వివక్షిత్వా పఠ్యతే-
"స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తావని-
ర్యజ్ఞానాం చ సహస్రమిష్టమఖిలా దేవాశ్చ సంపూజితాః.

సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరస్త్రైలోక్యపూజ్యోప్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్"

"కులం పవిత్రం జననీ కృతార్థా
విశ్వంభరా పుణ్యవతీ చ తేన
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్
లీనం పరే బ్రహ్మణి యస్య చేతః" (సూ.సం-2.20,45) ఇతి

వ్యా. ఈ విధముగా యోగివలన సర్వప్రాణులకు ఉపకారము జరుగుచున్నది అని చెప్పుటకై ఇట్లు పఠింపబడుచున్నది—

"ఎవని మనస్సు క్షణకాలముపాటైనను పరబ్రహ్మవిచారమునందు స్థిర మగునో ఆతడు సకలతీర్థోదకములందు స్నానము చేసినట్లే. ఈ భూమి నంతను దానము చేసినట్లే, వెయ్యి యజ్ఞములు చేసినట్లే, దేవత లందరిని పూజించినట్లే, అతడు తన పితరులను సంసారబంధమునుండి ఉద్ధరించును. అతడు మూడు లోకములచేత పూజింపదగినవాడు".

"ఎవని మనస్సు అపారజ్ఞానానందసముద్రమైన పరబ్రహ్మయందు లీనమగునో ఆతని కులము పవిత్రమైనది, తల్లి కృతార్థురాలు, ఆతడు నివసించిన భూమి పుణ్య మైనది."

మూ. న కేవలం యోగినః శాస్త్రీయవ్యవహారస్యైవ తపస్త్వమ్; కింతు సర్వస్యైవ లౌకికవ్యవహారస్యాపి. తథా చ తైత్తిరీయాః స్వశాఖాయాం నారాయణస్యాన్తిమేనానువాకేన విదుషోఽపి మహిమానమామనన్తి. తస్మింశ్చానువాకే పూర్వభాగే యోగినోఽవయవా యజ్ఞాఙ్గద్రవ్యత్వేనామ్నాతాః-"తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః, శ్రద్ధా పత్నీ, శరీరమిధ్మమ్, ఉరో వేదిః, లోమాని

బర్హిః, వేదః శిఖా, హృదయం యూపః, కామ ఆజ్యమ్, మన్యుః పశుః, తపోఽగ్నిః, దమః శమయితా, దక్షిణా, వాగ్ఘోతా, ప్రాణ ఉద్గాతా, చక్షురధ్వర్యుః, మనో బ్రహ్మా, శ్రోత్రమగ్నీత్" (నారా. ఉ. 80). అత్ర చ దానం దక్షిణేతి దానపదమధ్యాహర్తవ్యమ్; "అథ యత్తపోదానమార్జవమహింసా సత్యవచనమితి తా అస్య దక్షిణాః" ఇతి ఛన్దోగైరామ్నాతత్వాత్.

వ్యా. యోగి చేయు శాస్త్రీయవ్యవహారమే కాదు, సమస్తమైన లౌకిక వ్యవహారము కూడ తపస్సే అని విధముగనే తైత్తిరీయులు తమ శాఖలోని నారాయణీయమునం దున్న చివరి అనువాకములో విద్వాంసుని (బ్రహ్మ జ్ఞానియొక్క) మహిమను కూడ వర్ణించుచున్నారు "ఈ విధముగ ఆత్మ జ్ఞానమును పొందిన జీవన్ముక్తుని యజ్ఞమునకు (నందు) ఆత్మ యజ మానుడు, శ్రద్ధ భార్య; శరీరము సమిధ; వక్షఃస్థలము వేది; రోమములు బర్హిస్సు, శిఖ వేదము (దర్భలకట్ట); హృదయము యూపస్తంభము; కామము ఆజ్యము; మన్యువు (కోపము) పశువు; తపస్సు అగ్ని; దమము శాంతింపచేయునది; దానము దక్షిణ; వాక్కు హోత (అనే ఋత్విక్కు); ప్రాణము ఉద్గాత; చక్షుస్సు అధ్వర్యువు మనస్సు బ్రహ్మ, శ్రోత్రము అగ్నీధుడు (ఉద్గాత మొదలైనవి ఋత్విక్కుల పేర్లు). ఇక్కడ "దానం దక్షిణా" అని దానుపదమును అధ్యాహారము తెచ్చుకొనవలెను, ఎందు చేతనగా చందోగులచే–"తపస్సు, దానము ఋజుత్వము, అహింస, సత్య వచనము అనునవి దీని దక్షిణలు" అని చెప్పబడినది.

వి. పైన చెప్పిన విధముగా "దానమ్'' అను పదము అధ్యాహారము తెచ్చుకొని "దానము దక్షిణ'' అని విద్యారణ్యులు అర్థము చెప్పినారు. కాని సాయణభాష్యములో "దమః శమయితా దక్షిణా" అను మూడు పదములను అవాంతరవాక్యముగా గ్రహించి "సర్వేంద్రియములకు ఉప శమమును ఇచ్చు దమ మను చిత్తవృత్తివిశేషము దక్షిణ" అని అర్థము వ్రాసినారు; "యస్తు దమాఖ్యః శమయితా సర్వేన్ద్రియోపశమకారీ చిత్త

వృత్తివిశేషః తస్య దక్షిణారూపత్వమున్నేయమ్" (కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయారణ్యకభాష్యం, పుట 771) విద్యారణ్యులు ''దానమ్'' అను పదమును అధ్యాహారము తెచ్చుకొనవలె నని వ్రాయుటచేత "దమము శమయిత'' అని అర్థము వ్రాయవలసివచ్చినది; కాని యజ్ఞాంగవర్ణన ప్రసంగమున ఇది సరిగా కుదురుట లేదు.

మూ. ఉక్తానువాకే మధ్యమభాగేన యోగివ్యవహారాస్తజ్జీవన కాలాశ్చ జ్యోతిష్టోమావయవక్రియారూపత్వేన, ఉత్తరభాగేణ సర్వ యజ్ఞావయవక్రియారూపత్వేన చ అమ్నాతాః - "యావద్ ధ్రియతే సా దీక్షా; యదశ్నాతి తద్ధవిః యత్పిబతి తదస్య సోమపానమ్; యద్రమతే తదుపసదో, యత్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో, యన్ముఖం తదాహవనీయో, యా వ్యాహృతిరాహుతిర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయంప్రాతరత్తి తత్సమిధం యత్ప్రాతర్మధ్యందినం సాయం చ తాని సవనాని, యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ, యేఽర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని, య ఋతవస్తే పశుబన్ధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాః సర్వవేదసం వా ఏతత్ సత్రం యన్మరణం తదవభృథః" (నారా. ఉ. 80) ఇతి. సర్వవేదసం సర్వస్వదక్షిణాకమ్. అత్రైతచ్ఛబ్దేన ప్రకృతాహోరాత్రాదిపరివత్సరాన్తం సర్వకాలసమష్ట్యుపలక్షితం యోగిన ఆయుర్వివక్ష్యతే. యదాయుస్తత్సర్వస్వదక్షిణోపేతం సత్రమిత్యర్థః.

వ్యా. పైన చెప్పిన అనువాకములోని మధ్యభాగమునందు యోగి చేసే అన్ని వ్యవహారములు, అతని జీవనకాలములూ కూడ జ్యోతిష్టోమమునకు అవయవములైన క్రియలుగాను ఉత్తభాగమునందు సమస్తయజ్ఞముల అవయవములైన క్రియలుగాను చెప్పబడినవి -"ఆ యోగి అహారము భుజించకుండా ఉన్న సమయము "దీక్ష". అతడు తినునది "హవిస్సు". అతడు త్రాగుట "సోమపానము''. అతడు క్రీడించుట [ఆనందముగా ఉండుట]

"ఉపసదహోమము". అతడు సంచరించుట, కూర్చుండుట, లేచుట అనునవి "ప్రవర్గహోమము." ముఖము "ఆహవనీయాగ్ని". అతని భాషణము "ఆహుతి." అతని జ్ఞానము "హోమక్రియ". సాయంకాలప్రాతఃకాలములందు అతడు చేయు భోజనము "సమిధ." ప్రాతఃకాల-మధ్యాహ్న-సాయంకాలములు "సవనములు" [స్నానములు]; [అతనిజీవితకాలములోని] అహోరాత్రములు దర్శపూర్ణమాసములు"; పక్షములు "చాతుర్మాస్యములు"; ఋతువులు "పశుబంధములు", సంవత్సరములు, పరివత్సరములు "అహర్గణములు" (యజ్ఞదివసగణములు). ఇది[ఈ యోగి ఆయు కాలము]సర్వస్వదక్షిణాకమైన [సర్వస్వమును రక్షణగా ఇచ్చే] సత్త్రము. అతని మరణము అవభృథము".

సర్వవేదసమ్=సర్వస్వము దక్షిణగా గల. ఇక్కడ ఏతత్సత్రమ్ లోని "ఏతత్" అనే శబ్దమునచే అహోరాత్రములు మొదలు పరివత్సరము వరకు ఉన్న సమస్తకాలరూపమైన యోగి ఆయుర్దాయము గ్రహింపబడును. అదే ప్రకృతము. అతని ఆయుర్దాయమే సర్వస్వదక్షిణోపేతమైన సత్త్రము అని అర్థము.

ప్రభవాది సంవత్సరములను అరువదింటిని ఐదేసి గణములుగా చేయగా ఒక్కొక్కగణమునకు "యుగము" అని పేరు. యుగములోని ఐదు సంవత్సరములకు వరుసగా సంవత్సర - పరివత్సర - ఇదావత్సర -అనువత్సర - ఇద్వత్సరములు అని పేర్లు.

"చాన్ద్రాణాం ప్రభవాదీనాం పఞ్చకే పఞ్చకే యుగే
సంపరీదాన్విదిత్యేతచ్ఛబ్దపూర్వాస్తు వత్సరాః"

(సాయణభాష్యములో ఉదాహృతము).

మూ. ఉక్తానువాకే చరమభాగేన సర్వయజ్ఞాత్మకం యోగినము పాసీనస్య క్రమముక్తిరూపం సూర్యాచన్ద్రమసోః కార్యకారణ బ్రహ్మణోః తాదాత్మ్యలక్షణం ఫలమామ్నామతే:"ఏతద్వై జరామర్య మగ్నిహోత్రం సత్త్రం య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వాదిత్యస్య సాయుజ్యం గచ్ఛత్యథ యో దక్షిణే

ప్రమీయతే పితౄణామేవ మహిమానం గత్వా చన్ద్రమసః సాయుజ్యం సలోకతామాప్నోత్యే తా వై సూర్యాచన్ద్రమసోర్మహిమానౌ బ్రాహ్మణో విద్వానభిజయతి తస్మాద్బ్రహ్మణో మహిమానమాప్నోతి తస్మాద్బ్రహ్మణో మహిమానమ్ ఇత్యుపనిషత్" (నా. రా. ఉ. 80) ఇతి.

వ్యా. పైన చెప్పిన అనువాకములోనే చివరి భాగములో "యోగి సర్వయజ్ఞాత్మకుడు" అని ఉపాసన చేయువానికి లభించు సూర్యచంద్రుల తోను, కార్యకారణ బ్రహ్మలతోను తాదాత్మ్యమును [ఐక్యమును] పొందుట అను క్రమముక్తి రూపమైన ఫలము చెప్పబడినది. "జరామరణములవరకు జరిగే యోగి చరితమే వేదోక్తమైన అగ్నిహోత్రము మొదలు సంవత్సర సత్రమువరకు ఉన్న కర్మల స్వరూపమైనది. ఈ విధముగ తెలిసికొని ఉపాసన చేసినవాడు ఉత్తరాయణములో మరణించినచో అతడు దేవతల మహిమను పొంది సూర్యునితో సాయుజ్యమును పొందును; దక్షిణాయనములో మరణించినచో పితృదేవతల మహిమను పొంది చంద్రునితో సాయుజ్యమును లేదా సాలోక్యమును పొందును [సాయుజ్యమనగా ఒక దానితో కలిసిపోవుట. సాలోక్య మనగా ఒకేలోకములో నివసించుట.] ఈ విషయము తెలిసిన బ్రాహ్మణుడు సూర్యచంద్రుల మహిమను పొందును పిమ్మట బ్రహ్మ మహిమను పొందును అతడు తప్పక బ్రహ్మ మహిమను పొందును. ఇదే ఉపనిషత్తు"

మూ. జరామరణావధికం యద్యోగిచరితమస్తి తద్వేదోక్తాగ్నిహోత్రాదిసంవత్సరసత్రాన్తకర్మస్వరూపమిత్యేవముపాసీనో భావనాతిశయేన సూర్యాచన్ద్రమసోః సాయుజ్యం తాదాత్మ్యం ప్రాప్నోతి. భావనామాన్ద్యేన సమానలోకం ప్రాప్య తస్మిన్ లోకే సూర్యాచన్ద్రమసోర్విభూతిమనుభూయ తత ఊర్ధ్వం సత్యలోకే చతుర్ముఖస్యబ్రహ్మణో మహిమానమాప్నోతి, తత్రోత్పన్నతత్త్వజ్ఞానస్తతః ఊర్ధ్వం సత్యజ్ఞానానన్దరూపస్య పరబ్రహ్మణో మహిమానం కైవల్యం ప్రాప్నోతి. ఇత్యుపనిషదిత్యనేన యథోక్తవిద్యాయాస్తత్ప్రతిపాదకగ్రన్థస్య చోపసంహారః క్రియతే.

వ్యా॥ జరామరణములవరకు జరుగు యోగి చరితము వేదోక్తమైన అగ్నిహోత్రాది సంవత్సర సత్రాంతకర్మస్వరూపము అని ఉపాసన చేయువాడు భావనాతిశయముచేత సూర్యచంద్రులతో సాయుజ్యమును అనగా తాదాత్మ్యమును పొందును భావన మందమైనచో సూర్యచంద్రాదులతో సమానలోకములను పొంది ఆ లోకములలో సూర్యచంద్రుల విభూతిని అనుభవించి, పిమ్మట సత్యలోకములో చతుర్ముఖ బ్రహ్మ మహిమను పొందును. అక్కడ తత్త్వజ్ఞానమును పొంది పిమ్మట సత్యజ్ఞానానందరూపమైన బ్రహ్మ మహిమను, అనగా కైవల్యమును పొందును. "ఇత్యుపనిషత్" అని పైన చెప్పిన విద్య దానిని ప్రతిపాదించు గ్రంథము ఉపసంహరింపబడుచున్నది.

మూ. తదేవం జీవన్ముక్తేస్తపోరూపం ద్వితీయం ప్రయోజనం సిద్ధమ్. విసంవాదాభావస్తృతీయం ప్రయోజనమ్. న ఖల్వన్తర్ముఖే బాహ్యవ్యాపారమపశ్యతి యోగేశ్వరే లౌకికైర్బుధైః కో వా కశ్చిద్విసంవదతే. లౌకికవిసంవాదో ద్వివిధః-కలహరూపో నిన్దారూపశ్చ. తత్ర క్రోధాదిరహితేన యోగినా సహ కథం నామ లౌకికః కలహాయతే? తద్రాహిత్యం చ స్మర్యతే-

"క్రుధ్యన్తం న ప్రతిక్రుధ్యేదాక్రుష్టః కుశలం వదేత్"

"అతివాదాంస్తితిక్షేత నావమన్యేత కంచన" (మను.6.48,47)

వ్యా. ఈ విధముగ జీవన్ముక్తికి తపస్సు అనునది రెండవ ప్రయోజనము అని నిశ్చితమైనది. ఇంక విసంవాదము(మనోవైషమ్యము)లేకపోవుట మూడవ ప్రయోజనము. అంతర్ముఖుడై బాహ్యవ్యాపారములను చూడని యోగీశ్వరునితో లౌకికుడు కాని, శాస్త్రజ్ఞుడుకాని మనోవైషమ్యము పెట్టుకొనడుకదా ? లౌకికులతో మనోవైషమ్యము కలహరూపమున గాని, నిందారూపమున గాని ఉండును. క్రోధాదులు లేని యోగితో లౌకికుడు ఎట్లు కలహించును? యోగికి కలహము ఉండదు అని స్మృతిలో చెప్పబడినది—

"తనపై కోపించువానిమీద (యోగి) కోపము చూపకూడదు; పరుడు తిట్టినచో వానితో మంచి మాటలే పలుకవలెను" "ఇతరులు చేయు నిందలను సహించవలెను. ఎవరినీ అవమానించకూడదు".

మూ. నను జీవన్ముక్తేః ప్రాచీనో విద్వత్సంన్యాసః; తతోఽపి ప్రాచీనం తత్త్వజ్ఞానమ్; తస్మాదపి ప్రాచీనో వివిదిషాసంన్యాసః; తత్రైతే క్రోధాదిరాహిత్యాదయో ధర్మాః స్మృతాః ఇతి చేత్-బాఢమ్; అత ఏవ జీవన్ముక్తస్య క్రోధాదయః శఙ్కితుమప్యశక్యాః. అత్యర్వాచీనే పదే వివిదిషాసంన్యాసేఽపి యదా క్రోధాదయో న సన్తి తదోత్తమ పదే తత్త్వజ్ఞానే కుతస్తే స్యుః, కుతస్తరాం చ విద్వత్సంన్యాసే; కుతస్తమాం చ జీవన్ముక్తౌ? అతోన యోగినా సహ లోకస్య కలహః సంభవతి.

వ్యా. (ఆశంక) విద్వత్సంన్యాసము జీవన్ముక్తికంటె ప్రాచీనము [ముందు ఉండునది]; దానికంటె కూడ ప్రాచీనము తత్త్వజ్ఞానము. దానికంటె ప్రాచీనమైనది వివిదిషాసంన్యాసము. ఆ వివిదిషాసంన్యాసమునకే క్రోధాదులు లేకుండుట మొదలైన ధర్మాలు చెప్పబడినవి కదా? [అందుచేత జీవన్ముక్తునకు క్రోధాదులు ఉండవు అని స్మృతివాక్యము చెప్పుటలో అభిప్రాయ మేమి?] [సమాధానము] నిజమే. అందుచేతనే జీవన్ముక్తునకు క్రోధాదులు ఉండునని శంకించుటకు కూడ అవకాశము లేదు. చాలా అర్వాచీనమైన వివిదిషాసంన్యాసమునందే క్రోధాదులు ఉండనప్పుడు ఉత్తమ పదమైన తత్త్వజ్ఞానమునందు అవి ఎట్లుండును? విద్వత్సంన్యాసములో వాటికి అవకాశమే లేదు. జీవన్ముక్తిలో అసలే అవి ఉండే ప్రసక్తి లేదు. అందుచేత యోగికి లౌకికునితో కలహము సంభవించదు.

మూ. నాపి నిన్దారూపో విసంవాదః శఙ్కనీయః నిన్ద్యత్వస్యానిశ్చితత్వాత్. తథా చ స్మర్యతే-

"యం న సన్తం న చాసన్తం నాశ్రుతం న బహుశ్రుతమ్
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్ స వై యతిః" ఇతి.

పదసక్త్యో ఉత్తమాధమజాతీ.

వ్యా. నిందారూపమైన విసంవాదము కూడ ఉండుటకు అవకాశము లేదు. ఎందుచేత ననగా నింద్యత్వము అనిశ్చితము[యోగియందు నింద్యత్వ మున్న దని ఎవ్వడూ నిశ్చయముగా చెప్పజాలడు.] ఈ విషయము స్మృతిలో చెప్పబడినది---

"ఇతడు ఉత్తమజాతికి చెందినవా డని గాని అధమజాతికి చెందినవా డని గాని, విద్యావిహీను డని గాని అధికవిద్యావంతుడని గాని, సచ్చరిత్ర గలవా డని గాని దుశ్చరిత్రకలవా డని గాని ఎవనిని గూర్చి ఎవ్వరూ ఎరుగరో ఆతడే యోగి.''సదసత్త్వములనగా ఉత్తమాధమజాతు లని అర్థము.

మూ. తైర్థికోఽపి కిం శాస్త్రప్రమేయే విసంవదతే కిం వా యోగి చరితే? ఆద్యే-న తావద్యోగీ పరశాస్త్రప్రమేయం దూషయతి-"తమే వైకం జానథ ఆత్మానమ్ అన్యా వాచో విముఞ్చథ" (ము.ఉ. 2.2.5) "నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్" (బృ.ఉ. 4.4.21) ఇత్యాదిశ్రుత్యనురోధాత్. నాపి శాస్త్రప్రమేయం ప్రతివాదినోఽగ్రే సమర్థయతే;

"పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థమశేషతః"

(అమృత బి. ఉ. 18)

"పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్"

(అమృతనా. ఉ. 1)

ఇత్యాదిశ్రుత్యర్థపరత్వాత్.

వ్యా శాస్త్ర పండితుడు కూడ శాస్త్రప్రతిపాద్యమైన విషయమును గూర్చి విసంవాదమును చూపునా, లేక యోగి చరితమును గూర్చి చూపునా? మొదటి పక్షములో--- యోగి యైనవాడు పరుల శాస్త్రము బోధించు విషయ మును దూషించడు. "ఆత్మను ఒక్కదానినే తెలిసికొనుడు; ఇతరములైన మాటలన్నీ కట్టిపెట్టుడు; చాలా మాటలు ఆలోచించగూడదు; అది వాగింద్రి

యమునకు ఆలసట కలిగించుటయే అగును" అని శ్రుతులు చెప్పుచున్నవి కదా ? యోగి తన శాస్త్రము ప్రతిపాదించు విషయమును ప్రతివాది ఎదుట సమర్థించడు కూడ; ఎందుచేతననగా—"ధాన్యము కోరువాడు పొట్టు విడచివేసి నట్లు గ్రంథమును పూర్తిగా విడువవలెను" "పరబ్రహ్మను తెలిసికొనిన తరువాత వాటిని కొరవులను విడచి నిట్లు విడువవలెను" ఇత్యాదిశ్రుతుల అర్థమును యోగి అనుసరించుచుండును

మూ. యదా యోగీ ప్రతివాదినమపి స్వాత్మతయా వీక్షతే తదా విజిగీషాయాః కా కథా ? నాపి లౌకాయితికవ్యతిరిక్తః సర్వోఽపి తైర్థికో మోక్షమఙ్గీకుర్వన్ యోగిచరితేఽపి విసంవదితుమర్హతి; అర్హత బౌద్ధవైశేషికనైయాయికశైవవైష్ణవశాక్తసాంఖ్యయోగాదిమోక్షశాస్త్రేషు ప్రతిపాద్యప్రమేయస్య నానావిధత్వేఽపి మోక్షసాధనస్య యమనియమాద్యష్టాఙ్గయోగస్యైకవిధత్వాత్. తస్మాదవిసంవాదేన సర్వసంమతో యోగీశ్వరః.

వ్యా. ప్రతివాది కూడ తన ఆత్మయే అని భావించు యోగికి జయించవలెనను కోరిక ఉండే అవకాశమే లేదు కదా ? లౌకాయితుకుడు తప్ప మోక్షమును అంగీకరించు ఏ దార్శనికుడూ కూడ యోగి చరితము విషయమునందు విసంవాదమును చూపుటకు అవకాశము లేదు. జైన-బౌద్ధ-వైశేషిక - నైయాయిక - శైవ - వైష్ణవ-శాక్త - సాంఖ్యయోగాదిమోక్షశాస్త్రములలో ప్రతిపాదింపబడే ప్రమేయము (తెలియదగినవిషయము) అనేక విధములుగా ఉన్నను మోక్షసాధనమైన యమనియమాద్యష్టాంగయోగము ఒకే విధముగా ఉన్నది కదా ? (అష్టాంగయోగము మోక్షసాధనము అను విషయములో ఏ దర్శనమునకూ విప్రతిపత్తి లేదు కదా ?). అందుచేత విసంవాద మేమీ లేదు గాన యోగీశ్వరుడు అందరికీ సంమతుడే.

మూ. ఏతదేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ—

"యస్యేదం జన్మ పాశ్చాత్యం తమాశ్వేవ మహామతే
విశన్తి విద్యా విమలా ముక్తా వేణుమివోత్తమమ్.

ఆర్యతా హృద్యతా మైత్రీ సౌమ్యతా ముక్తతా జ్ఞతా
సమాశ్రయన్తి తం నిత్యమన్తఃపురమివాఙ్గనాః
పేశలాచారమధురం సర్వే వాఞ్ఛన్తి తం జనాః
వేణుం మధురనిర్ధ్వానం వనే వనమృగా ఇవ
సుషుప్తవత్ప్రశమితభావవృత్తినా
స్థితః సదా జాగ్రతి యేన చేతసా.
కలాన్వితో విధురివ యః సదా బుధై
ర్నిషేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః" ఇతి.

వ్యా. ఈ అభిప్రాయముతోనే వసిష్ఠుడు ఇట్లు చెప్పినాడు-ఓ! గొప్ప బుద్ధిగలవాడా! ఏ యోగికి ఇది చివరి జన్మమో ఆతనిని, మంచి వెదురు కఱ్ఱను ముత్యములు చేరినట్లు, నిర్మలములైన విద్యలు వెంటనే చేరును (మంచివెదురులో ముత్యములు పుట్టునని చెప్పుదురు) ప్రాజ్ఞత్వము, మనోహరత్వము, స్నేహస్వభావము, సౌమ్యత్వము, ముక్తత్వము, జ్ఞానము, ఆతనిని, స్త్రీలు అంతఃపురమును ఆశ్రయించినట్లు, నిత్యము ఆశ్రయించును

వనములోని మృగములు మధురముగా ధ్వనించు వేణువును కోరినట్లు మంచి నడవడిచేత మధురుడుగా ఉన్న ఆ యోగిని జను లందరు కోరుదురు.

యోగి సుషుప్తియందు వలె సమస్తములైన భావములు, వృత్తులు శమించిన మనస్సుతో మేల్కొని (తత్త్వమును చూచుచు) ఉండును గాన ఆతనిని కళలతో నిండిన చంద్రుని వలె, బుధులు ఎల్లప్పుడు సేవించు చుందురు. అతడే ముక్తుడని చెప్పబడును.

మూ. "మాతరీవ శమం యాన్తి విషమాణి మృదూని చ
విశ్వాసమిహ భూతాని సర్వాణి శమశాలిని" (ఉ. వా. 4 62)
"తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే" ఇతి. (4.66)

తదేవమసంబాధం జీవన్ముక్తేర్విసంవాదాభావరూపం తృతీయం ప్రయోజనం సిద్ధమ్.

వ్యా. "క్రూరములైన ప్రాణులు, సాధువులైన ప్రాణులు అన్ని కూడ శమము కల యోగి విషయమున విశ్వాసము గలవై, తల్లి విషయమునందు వలె శాంతములై ప్రవర్తించును".

"తపశ్శాలులలోను, మంచి పండితులలోను, యజ్ఞములు చేయించువారిలోను, రాజులలోను, బలవంతులలోను, గుణములతో నిండినవారిలోను శమము కలవాడే బాగా ప్రకాశించును".

ఈ విధముగ, జీవన్ముక్తికి విసంవాదము లేకపోవుట అను మూడవ ప్రయోజన మున్న దని చెప్పుటలో ఏమియు బాధ లేదు.

మూ. దుఃఖనాశసుఖావిర్భావరూపే చతుర్థపఞ్చమప్రయోజనే విద్యానందాత్మకేన బ్రహ్మానందగతేన చతుర్థాధ్యాయేన విరూపితే. తదుభయమత్ర సంక్షిప్యోచ్యతే—

"ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్"

(బృ.ఉ. 4.4.12)

ఇత్యాదిశ్రుత్యా దుఃఖస్యైహికస్య వినాశ ఉక్తః, "ఏతం హ వావ న తపతి కిమహం సాధు కర్మ నాకరవమ్; కిమహం పాపమకరవమ్"(తై.ఉ. 2.9) ఇత్యాదిశ్రుతయః ఆముష్మికహేతుపుణ్యపాపచిన్తారూపస్య దుఃఖస్య నాశమాహుః. సుఖావిర్భావస్త్రేధా–సర్వకామావాప్తిః, కృతకృత్యత్వమ్, ప్రాప్తప్రాప్తవ్యత్వం చేతి. సర్వకామావాప్తిస్త్రేధా–సర్వసాక్షిత్వమ్, సర్వత్రాకామహతత్వమ్, సర్వభోక్తృత్వం చేతి. "హిరణ్యగర్భాదిస్థావరాన్తేషు దేహేష్వనుగతం సాక్షిచైతన్యరూపం యద్ బ్రహ్మ తదేవాహమస్మి" ఇతి జానతః స్వదేహ ఇవ పరదేహే

ష్వపి సర్వకామసాక్షిత్వమస్తి. తదేతదభిప్రేత్య శ్రూయతే-"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై.ఉ.2.1) ఇతి. లోకే భుక్తేషు భోగేషు అకామహతత్వం యత్తత్కామప్రాప్తిరిత్యుచ్యతే. తథా చ సర్వభోగదోషదర్శినస్తత్త్వవిదః సర్వత్రాకామహతత్వాదస్తి సర్వకామావాప్తిః. అత ఏవ సార్వభౌమోపక్రమేషు హిరణ్యగర్భపర్యన్తేషు ఉత్తరోత్తరశతగుణేష్వానన్దేషు "శ్రోత్రియస్య చాకామహతస్య" ఇతి శ్రుతమ్. సద్రూపేణ, చిద్రూపేణ, ఆనన్దరూపేణ చ సర్వత్రావస్థితం స్వాత్మానమనుసందధతః సర్వభోక్తృత్వమస్తీత్యభిప్రేత్యైవం శ్రూయతే-"అహమన్నమహమన్నమహమన్నమ్; అహమన్నాదోఽహ మన్నాదోఽహమన్నాదః" (తై.ఉ.3.10) ఇతి.

వ్యా. దుఃఖనాశము సుఖావిర్భావము అను జీవన్ముక్తికి సంబంధించిన నాల్గవ ఐదవ ప్రయోజనములు (పంచదశిలో) బ్రహ్మానంద ప్రకరణములోని విద్యానంద మను చతుర్దాధ్యాయములో నిరూపింపబడినవి, ఆ రెండు ఇక్కడ సంక్షేపముగా చెప్పబడుచున్నవి.

''పురుషుడు ''ఈ ఆత్మయే నేను" అని ఆత్మను తెలిసికొన్నచో ఎవరి కామముకొరకు, దేనిని కోరుచు ఈ శరీరమును గూర్చి తాపము చెందును?'' ఇత్యాది శ్రుతులు [జీవన్ముక్తుని] ఐహికదుఃఖము నశించు నని చెప్పుచున్నవి. "నే నేమీ పుణ్యము చేయలేదే! పాపము చేసితినే! అని ఇతనికి మనస్తాపము కలుగదు'' ఇత్యాది శ్రుతులు పరలోకమునకు సంబంధించిన సుఖదుఃఖములకు హేతువైన పుణ్యపాపములను గూర్చిన చింత అను దుఃఖము నశించు నని చెప్పుచున్నవి. సుఖావిర్భావము [సుఖము పుట్టుట] సర్వకామావాప్తి (అన్ని కోరికలు సిద్ధించుట) ''కృతకృత్యత్వము [చేయవలసినవి పూర్తిచేయుట] ప్రాప్తప్రాప్తవ్యత్వము (పొందవలసినవాటిని పొందుట) అని మూడు విధములు. సర్వసాక్షిత్వము, సర్వత్రాకామహతత్వము సర్వభోక్తృత్వము అని సర్వకామావాప్తి మూడు విధములు."హిరణ్యగర్భుడు మొదలు స్థావరములవరకు ఉన్న దేహము లన్నింటిలోను అను

గతమై (సంబంధించి) ఉన్న సాక్షిచైతన్య రూపమైన ఏ బ్రహ్మ ఉన్నదో అదే నేను" అని తెలిసికొన్నవాడు తన దేహమునందువలె ఇతరుల దేహము లందు కూడ సర్వకామములకు సాక్షిగా ఉండును.(తనదేహముతో ఆయా కామ ములను అనుభవించినట్లే ఇతర దేహములతో కూడ అనుభవించును. (ఇదే సర్వసాక్షిత్వము) ఈ అభిప్రాయముతోనే-- "అతడు(జ్ఞాని) సర్వసాక్షి యైన బ్రహ్మతో కలిసి (బ్రహ్మరూపమున) సమస్తకామములను అనుభవించును'' అని శ్రుతి చెప్పుచున్నది. లోకములో అనుభవించబడిన భోగముల విషయ మున కామముతో బాధపడకుండుట ''కామప్రాప్తి'' అని చెప్పబడుచున్నది. అందుచే అన్ని భోగములయందూ దోషమును చూచు తత్త్వవేత్త అంతటా అకామ హతుడే గాన ఆతనికి సర్వకామప్రాప్తి ఉన్నది. అందుచేతనే సార్వ భౌముడు మొదలు హిరణ్యగర్భుని వరకు క్రమముగా నూరేసి రెట్లు అధిక మైన ఆనందమును గూర్చి వర్ణించుచు శ్రుతి ఈ ఆనందములన్నీ కామహతుడు కాని శ్రోత్రియునకు కూడ ఉండును" అని చెప్పినది.సద్రూపముతోను చిద్రూ ద్రూపముతోను ఆనందరూపముతోను అంతటా వ్యాపించిఉన్న స్వాత్మను అను సంధానము చేసికొను జీవన్ముక్తునికి సర్వభోక్తృత్వము (అన్నింటినీ అను భవించుట) ఉన్నదను అభిప్రాయముతో—"నేనే అన్నము, నేనే అన్నము నేనే అన్నము," నేనే అన్నము తినువాడను, నేనే అన్నము తినువాడను, నేనే అన్నము తినువాడను" అని శ్రుతిలో చెప్పబడినది.

మూ. కృతకృత్యత్వం తు స్మర్యతే-
"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్"
"యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే"
(భ.గీ. 3.17) ఇతి.

వ్యా. జీవన్ముక్తుడు కృతకృత్యుడను విషయము స్మృతులలో చెప్పబడినది—"జ్ఞానమనే అమృతముచేత తృప్తుడై కృతకృత్యుడైన యోగి

చేయవలసిన పని మరొకటి ఏదీ లేదు. అట్టిది ఏదైనా ఉన్నచో అతడు తత్త్వము నెరిగినవాడు కాడు" "ఏ మానవుడు ఆత్మయందే క్రీడించునో ఆత్మయందే సంతృప్తి చెందునో, ఆత్మయందే సంతోషము పొందునో ఆతనికి మరొక చేయవలసిన కర్మ ఏదీ లేదు"

మూ. ప్రాప్తప్రాప్తవ్యతాపి శ్రూయతే-"అభయం వై జనక ప్రాప్తోఽసి" (బృ. ఉ. 4.2 2) ఇతి, "తస్మాత్తత్సర్వమభవత్" (బృ.ఉ. 1.4.10) ఇతి. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. ఉ. 3.2.9) ఇతి చ.

నన్వేతౌ ద్వౌ దుఃఖవినాశసుఖావిర్భావౌ తత్త్వజ్ఞానేనైవ సిద్ధత్వాన్న జీవన్ముక్తిప్రయోజనతామర్హతః; మైవమ్; సురక్షితయోస్తయోరత్ర వివక్షితత్వాత్, యథా తత్త్వజ్ఞానం పూర్వమేవోత్పన్నమపి జీవన్ముక్త్యా సురక్షితం భవతి ఏవమేతావపి సురక్షితౌ భవతః.

వ్యా. (జీవన్ముక్తుడు పొందవలసినదాని నంతనూ పొందినవాడగును అనునది కూడ శ్రుతులలో చెప్పబడినది - "ఓ! జనకుడా! నీకు అభయము లభించినది" "అందువలన (జ్ఞాని) అది అంతా ఆయెను" "బ్రహ్మసాక్షాత్కారము పొందినవాడు బ్రహ్మయే అగును."

(ఆశంక) ఈ దుఃఖవినాశ - సుఖావిర్భావములు తత్త్వజ్ఞానము వలననే సిద్ధించును గాన ఇవి జీవన్ముక్తిప్రయోజనము లని చెప్పకూడదు కదా? (సమాధానము) అట్లుకాదు; అవి బాగుగా రక్షింపబడును అని ఇక్కడ అభిప్రాయము. తత్త్వజ్ఞానము పూర్వమే పుట్టినను జీవన్ముక్తిచేత సురక్షితమైనట్లు ఇవి కూడ జీవన్ముక్త్యవస్థలో సురక్షితము లగును.

మూ. నన్వేవం జీవన్ముక్తేః పఞ్చప్రయోజనత్వే సతి సమాహితో యోగీశ్వరో లోకవ్యవహారం కుర్వతస్తత్త్వవిదోఽపి శ్రేష్ఠ ఇతి వక్తవ్యమ్, తచ్చ రామవసిష్ఠయోః (ఉ. వా. 25) ప్రశ్నోత్తరాభ్యాం నిరాకృతమ్-

శ్రీరామః-

"భగవన్ భూతభవ్యేశ కశ్చిజ్జాతు సమాహితః
ప్రబుద్ధ ఇవ విశ్రాన్తో వ్యవహారపరోఽపి సన్ 5.
కశ్చిదేకాన్తమాశ్రిత్య సమాధినియమే స్థితః
తయోస్తు కతరః శ్రేయా నితి మే భగవన్ వద" 6.

వసిష్ఠః-

"ఇమం గుణసమాహారమనాత్మత్వేన పశ్యతః
అన్తఃశీతలతా యాసౌ సమాధిరితి కథ్యతే." 7.
దృశ్యైర్న మమ సంబన్ధ ఇతి నిశ్చిత్య శీతలః
కశ్చిత్సంవ్యవహారస్థః కశ్చిద్ ధ్యానపరాయణః 8
ద్వావేతౌ రామ సుసమావన్తశ్చేత్ పరిశీతకౌ
అన్తఃశీతలతా యా స్యాత్ తదనన్తతపఃఫలమ్." 9. ఇతి.

వ్యా. (ఆశంక) జీవన్ముక్తికి ఐదు ప్రయోజనము లున్నచో సమాధిలో కూర్చున్న యోగీశ్వరుడు లోకవ్యవహారమును చేయు తత్త్వవేత్తకంటె శ్రేష్ఠ డని చెప్పవలసి ఉండును. కాని రామవసిష్ఠుల ప్రశ్నోత్తరములను పట్టి అట్లు కా దని తెలియచున్నది:-

శ్రీరాముడు —"పుట్టినవారిలోను, పుట్టనున్న వారిలోను శ్రేష్ఠుడవైన ఓ! పూజ్యుడా! ఒకడు అప్పుడప్పుడు సమాధి పొందినను మేల్కొన్నవాడు వలెనే ఉండి, వ్యవహారములు చేయుచున్నను విశ్రాంతుడై (శాంతిగలవాడై) ఉండును. మరొకడు ఏకాన్తప్రదేశముచేరి సమాధినియమములోనే ఉండును. ఈ ఇద్దరిలో ఎవడు గొప్పవాడో చెప్పుము."

వసిష్ఠుడు:-

"ఈ సత్త్వ - రజస్తమోగుణముల కలయికవలన ఏర్పడిన ప్రపంచము ఆత్మ కాదని తెలిసికొన్నవానికి చిత్తమునందు ఏ చల్లదనము ఉండు

నో అది సమాధి అని చెప్పబడును. "నాకు దృశ్యములైన పదార్థములతో సంబంధ మేమీ లేదు" అని నిశ్చయించుకొని శీతలుడైన ఒకడు లోకవ్యవహారములలో ప్రవర్తించుచుండును; మరియొకడు ధ్యానతత్పరుడై ఉండును. రామా! మనస్సులో శీతలులై (చల్లగా) ఉన్నచో వీరిద్దరూ సమానులే. అంతఃకరణములో చల్లగా ఉండగలుగుట అనంతమైన తపస్సుకు ఫలము"

మూ. నైష దోషః - అత్ర వాసనాక్షయరూపమన్తఃశీతలత్వమవశ్యం సంపాదనీయమిత్యేతావదేవ ప్రతిపాద్యతే; న తు తదనన్తరభావినో మనోనాశస్య శ్రేష్ఠత్వం నివార్యతే. శీతలత్వం తృష్ణాయాః ప్రశమనమిత్యేతాదృశీం వివక్షాం స్వయమేవ స్పష్టీచకార-

"అన్తఃశీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్
అన్తస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్" 24 ఇతి.

వ్యా. (సమాధానము) ఈ దోషములేదు. వాసనా క్షయరూపమైన అంతః శీతలత్వమును తప్పక సంపాదింపవలెను అని మాత్రమే ఇక్కడ ప్రతిపాదింపబడుచున్నది; అంతే కాని వాసనలు నశించిన పిమ్మట కలుగు మనోనాశము శ్రేష్ఠము అను విషయము నిరాకరింపబడుటలేదు. శీతలత్వము అనగా తృష్ణ (ఆశ] శమించుటయే అను అభిప్రాయమును స్వయముగానే [వసిస్ఠుడు] స్పష్టము చేసినాడు—

''లోపల చల్లదనము లభించినచో జగత్తు అంతా చల్లగానే ఉండును లోపల ఆశతో తపింప చేయబడుచున్నవారికి ఈ జగత్తుదావాగ్నిమయము.

మూ. నను సమాధినిన్దా వ్యవహారప్రశంసా చాత్రోపలభ్యతే-

"సమాధిస్థానకస్థస్య చేతశ్చేద్ వృత్తిచఞ్చలమ్
తత్తస్య తు సమాధానం సమమున్మత్తతాణ్డవైః. 10
ఉన్మత్తతాణ్డవస్థస్య చేతశ్చేత్ క్షీణవాసనమ్
తదస్యోన్మత్తనృత్యం తు సమం బ్రహ్మసమాధినా" 11 ఇతి.

వ్యా. [ఆశంక] ఇక్కడ సమాధియొక్క నింద, వ్యవహారము యొక్క ప్రశంసాకూడ కనబడుచున్నవి కదా?

"సమాధిస్థితిలో ఉన్నవాని చిత్తము వృత్తులచేత చంచలమైనచో వాని ఆ సమాధి ఉన్మత్తుని తాండవముతో సమానము ఉన్మత్తతాండవము చేయువాని చిత్తము కూడ వాసనలు నశించినది అయినచో అతని ఉన్మత్త నృత్యము బ్రహ్మసమాధితో సమానము.''

మూ. మైవమ్. అత్ర హి సమాధిప్రాశస్త్యమేవాఙ్గీకృత్య వాసనా నిన్ద్యతే. ఇయమత్ర వచనవ్యక్తిః - యద్యపి వ్యవహారాత్సమాధిః ప్రశస్తః తథాప్యసౌ సవాసనశ్చేత్ తదా నిర్వాసనాద్వ్యవహారాదధమ ఏవేతి స న సమాధిః. యదా సమాహితవ్యవహర్తారావుభావప్యతత్త్వజ్ఞౌ సవాసనౌ చ తదా సమాధేరుత్తమలోకప్రాప్తిహేతుపుణ్యత్వేన ప్రాశస్త్యమ్. యదా తూభౌ జ్ఞాననిష్ఠౌ నిర్వాసనౌ చ, తదాపి వాసనాక్షయరూపాం జీవన్ముక్తిం పరిపాలయన్నయం మనోనాశరూపః సమాధిః ప్రశస్త ఏవ. తస్మాత్ యోగీశ్వరస్య శ్రేష్ఠత్వాత్ పఞ్చప్రయోజనోపేతాయా జీవన్ముక్తేర్న కోఽపి విఘ్న ఇతి సిద్ధమ్.

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే జీవన్ముక్తిస్వరూపసిద్ధి ప్రయోజననిరూపణం నామ చతుర్థం ప్రకరణమ్

వ్యా. [సమాధానము] అట్లుకాదు. ఇక్కడ సమాధిప్రాశస్త్యమును అంగీకరించి వాసనలు నిందింపబడున్నవి. ఈ వాక్యముల వివరణము ఇది - వ్యవహారముకంటె సమాధి ప్రశస్తమే అయినను అది వాసనలతో కూడినదైనచో, అప్పుడు వాసనలు లేని వ్యవహారముకంటె అధమమే గాన అది సమాధియే కాదు. సమాధి కలవాడు వ్యవహారము చేయువాడు ఇద్దరూ కూడ తత్త్వజ్ఞానము లేనివారు, వాసనలు ఉన్నవారు అయినచో, సమాధి ఉత్తమలోక ప్రాప్తికి హేతువైన పుణ్యముగాన అది ప్రశస్తము. ఇద్దరూ కూడ జ్ఞాననిష్ఠులు, వాసనలు లేనివారూ అయినప్పుడు కూడ మనోనాశరూప

మైన సమాధి వాసనాక్షయరూపమైన జీవన్ముక్తిని పాలించును గాన ఆ సమాధియే ప్రశస్తము. అందుచేత యోగీశ్వరుడు శ్రేష్ఠుడు గాన ఐదు ప్రయోజనములు గల జీవన్ముక్తికి ఏమి విఘ్నము ఉండదు అని సిద్ధము.

"బాలానందిని" అను జీవన్ముక్తివివేకవ్యాఖ్యానమునందు జీవన్ముక్తిస్వరూపసిద్ధిప్రయోజననిరూపణ మను నాల్గవ ప్రకరణము సమాప్తము.

## అథ పఞ్చమం విద్వత్సంన్యాసప్రకరణమ్

మూ. ఏవం స్వరూపప్రమాణసాధనప్రయోజనైః జీవన్ముక్తిర్నిరూపితా అథ తదుపకారిణం విద్వత్సంన్యాసం నిరూపయామః. విద్వత్సంన్యాసశ్చ పరమహంసోపనిషది ప్రతిపాదితః. తాం చోపనిషదమనూద్య వ్యాఖ్యాస్యామః.

తత్రాదౌ విద్వత్సంన్యాసయోగ్యం ప్రశ్నమవతారయతి-

ఉ. "అథ యోగినాం పరమహంసానాం కోఽయం మార్గస్తేషాం కా స్థితిరితి నారదో భగవన్తముపగత్యోవాచ" ఇతి.

వ్యా ఇంతవరకు జీవన్ముక్తి, దాని స్వరూపము, దానిని గూర్చిన ప్రమాణములు, సాధనములు ప్రయోజనములు ప్రతిపాదింపబడినవి. ఇప్పుడు ఆ జీవన్ముక్తికి ఉపకారియైన విద్వత్సంన్యాసమును నిరూపించెదము విద్వత్సంన్యాసము పరమహంసోపనిషత్తులో ప్రతిపాదింపబడినది ఆ ఉపనిషత్తును అనువదించి మరల ఉదాహరించి వ్యాఖ్యానించెదము. అందు ముందుగా విద్వత్సంన్యాసమునకు తగిన ప్రశ్నను ప్రవేశపెట్టుచున్నాడు- "నారదుడు భగవంతుడైన బ్రహ్మదేవుని సమీపించి ప్రశ్నించెను. ఏమ్మట యోగులైన పరమహంసల మార్గ మేది? వారి స్థితి ఏది?"

మూ. యద్యప్యత్ర శబ్దాపేక్షిత అనన్తస్య ప్రతియోగీ న కోఽప్యత్ర ప్రతిభాతి, తథాపి ప్రష్టవ్యార్థోఽత్ర విద్వత్సంన్యాసః, తస్మింశ్చ విదితతత్త్వో లోకవ్యవహారైర్విక్షిప్యమాణో మనోవిశ్రాన్తిం కామయ

మానోఽధికారీ. తతస్తాదృగధికారసంపత్త్యాన న్తరర్యమథశబ్దార్థః. కేవల యోగినం కేవలపరమహంసం చ వారయితుం పదద్వయముక్తమ్. కేవలయోగీ తత్త్వజ్ఞానాభావేన త్రికాలజ్ఞానాకాశగమనాదిషు యోగైశ్వర్యచమత్కారవ్యవహారేష్వాసక్తః సంయమవిశేషైస్తత్ర తత్రోద్యుక్తః. తతః పరమపురుషార్థాద్ భ్రష్టో భవతి. అస్మిన్నర్థే సూత్రం పూర్వమేవోదాహృతమ్ - "తే సమాధావుపసర్గాః వ్యుత్థానే సిద్ధయః" **(3.38)** ఇతి. కేవలపరమహంసస్తు తత్త్వవివేకేనైశ్వర్యేష్వసారతాం బుద్ధ్వా విరజ్యతి (ల.వా. **27**) తదప్యుదాహృతమ్-

> "చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురన్తీహ శక్తయః
> ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్" **67** ఇతి.

వ్యా "అథ" శబ్దమునకు "అనంతరము" అని అర్థము గాన దేని అనంతరమో చెప్పుటకు వీలైనది ఏదీ ఇక్కడ కనబడుటలేదు. అయినను ఇక్కడ ప్రశ్నించే విషయము విద్వత్సంన్యాసము. తత్త్వమును తెలిసికొనినను, లోకవ్యవహారములచేత చిత్తవిక్షేపము కలుగుచుండుటచే, వాటిని తొలగించుకొని మనోవిశ్రాంతిని కోరువాడు ఈ విద్వత్సంన్యాసమును స్వీకరించుటకు అధికారి అందుచేత "అథ" అనగా "అట్టి అధికారము లభించిన పిమ్మట" అని అర్థము. కేవలయోగి కాని, కేవలతత్త్వజ్ఞాని కాని అధికారి కాదు అని చెప్పుటకు "యోగినాం పరమహంసానామ్" అని రెండు పదములు ప్రయోగించబడినవి. కేవలయోగికి తత్త్వజ్ఞానము ఉండదు గాన, ఆ యా సంయమములను అభ్యసించుచు యోగశక్తిచేత చమత్కారమును చూపుచు త్రికాలజ్ఞానము,ఆకాశగమనము మొదలైన ఆ యా వ్యవహారములు చేయుటకు ఉద్యుక్తు డగుచుండును. (ఏ యే సంయమములు చేసిన ఏ యే శక్తులు వచ్చునో యోగసూత్రమునుండి తెలిసికొనవలెను). దానివలన పరమపురుషార్థమైన మోక్షమునుండి భ్రష్టు డగును. ఈ విషయమును ప్రతిపాదించు యోగసూత్రమును వెనుకనే ఉదాహరించి ఉన్నాము "అవి

సమాధికి విఘ్నములు; వ్యుత్థానసమయమునందు అవి సిద్ధులు". కేవల పరహంసయైతే తత్త్వజ్ఞానముచేత ఈ ఐశ్వర్యములు (శక్తులు) అన్నీ అసారము లని గ్రహించి వాని విషయమున వైరాగ్యమును పొందును. ఇది కూడ చెప్పబడినది —

"ఇవి అన్నీ చిదాత్మశక్తులే; ఈ విధముగా కనబడుచున్నవి అని తెలిసికొనుటచే జ్ఞానికి ఆశ్చర్యసముదాయములందు ఆసక్తి ఉండదు".

మూ. విరక్తోఽప్యసౌ బ్రహ్మవిద్యాదరేణ విధినిషేధావుల్లఙ్ఘయతి. తదుక్తం-"నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః" ఇతి తథా చ శ్రద్ధాలవః శిష్టాః త్వమేవం నిన్దన్తి-

"సర్వే బ్రహ్మ వదిష్యన్తి సంప్రాప్తే తు కలౌ యుగే
నానుతిష్ఠన్తి మైత్రేయ శిశ్నోదరపరాయణాః" (వి.పు.) ఇతి
యోగిని పరమహంసే తు యథోక్తం దోషద్వయం నాస్తి.

వ్యా. ఇతడు వైరాగ్యవంతుడైనను బ్రహ్మజ్ఞానమునందున్న ఆదరముచేత విధినిషేధములను లంఘించును. అందుచేతనే—"త్రిగుణాతీతమైన మార్గమునందు సంచరించువారికి విధి ఏమి; నిషేధ మేమి?" అని చెప్పబడినది. కావుననే కర్మశ్రద్ధ గల శిష్టులు వానిని ఇట్లు నిందింతురు—

"మైత్రేయా! కలియుగము రాగానే అందరూ బ్రహ్మను గూర్చి మాటలాడుచుందురు, కర్మలను అనుష్ఠించరు, స్త్రీసుఖ-భోజనాదులయందు ఆసక్తి కలవారై ఉందురు".

అయితే యోగి అయిన పరమహంసలో ఈ రెండు దోషములూ కూడ ఉండవు.

మూ. అన్యోఽప్యస్యాతిశయః ప్రశ్నోత్తరాభ్యాం (అ.వా. 42) దర్శితః.

శ్రీరామః—

"ఏవం స్థితేఽపి భగవన్ జీవన్ముక్తస్య సన్మతేః
అపూర్వోఽతిశయః కోఽసౌ భవత్యాత్మవిదాం వర" ఇతి.

వ్యా శ్రీరాముడు ప్రశ్నించెను. "ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడవైనవాడా! పూజ్యుడా! ఇట్లున్నను, ఉత్తమబుద్ధి గల జీవన్ముక్తునిలో అపూర్వమైన అతిశయము (గొప్పతనము) ఏమి?"

మూ. వసిష్ఠః—

"జ్ఞస్య కస్మింశ్చిదప్యేషా భవత్యతిశయేన ధీః
నిత్యతృప్తః ప్రశాన్తాత్మా స ఆత్మన్యేవ తిష్ఠతి. 2.
మన్త్రసిద్ధైస్తపః సిద్ధైర్యోగసిద్ధైశ్చ భూరిశః
కృతమాకాశయానాది తత్ర కా స్యాదపూర్వతా. 3.
ఏక ఏవ విశేషోఽస్య న సమో మూఢబుద్ధిభిః
సర్వత్రాస్థాపరిత్యాగాన్నీరాగమమలం మనః. 4.
ఏతావదేవ ఖలు లిఙ్గమలిఙ్గమూర్తేః
సంశాన్తసంసృతిచిరభ్రమనిర్వృతస్య.
తద్ జ్ఞస్య యన్మదనకోపవిషాదమోహ
లోభాపదామనుదినం నిపుణం తనుత్వమ్. 6. ఇతి.

ఏతేన అతిశయేనోపేతానాం దోషద్వయరహితానాం మార్గస్థితిః పృచ్ఛ్యతే. వేషభాషాదిరూపో హి వ్యవహారో మార్గః. చిత్తోపరమ ఆన్తరో ధర్మః స్థితిః. భగవాంశ్చతుర్ముఖో బ్రహ్మా.

వ్యా. వసిష్ఠుడు ఇట్లు చెప్పెను—

జ్ఞానికి ఎట్టి అతిశయమునందూ మనస్సు ప్రవర్తించదు. నిత్యము తృప్తుడై, ప్రశాంతమైన చిత్తము గల అతడు ఆత్మయందే నిలచి ఉండును. (ఆత్మానుధ్యానము చేసికొనుచుండును.)

మంత్రసిద్ధి పొందినవారు, తపఃసిద్ధి పొందినవారు, యోగసిద్ధిని పొందినవారు అనేకపర్యాయములు ఆకాశసంచారము మొదలైన కార్యములు చేసి ఉన్నారు. వాటిలో అపూర్వత్వము (కొత్తతనము) ఏమున్నది?

ఇతనిలో (జ్ఞానిలో) ఒకే విశేష మున్నది; అదేమనగా ఇతడు మూఢ బుద్ధులతో సమానుడు కాదు. ఇతనికి దేనియందూ ఆసక్తి లేకపోవుటచేత ఇతడు మూఢాత్ములతో సమానుడు కాడు. ఇదే ఇతనియం దున్న విశేషము.

అనాదికాలమునుండి వచ్చుచున్న సంసారభ్రమ శాంతించుటచే సుఖముగా ఉన్నవాడై, బాహ్యచిహ్నము లేవీ శరీరమునందు ధరించని ఆత్మజ్ఞానికి గుర్తు ఏమనగా, ఇతనిలో కామము, కోపము, విషాదము (దుఃఖము) మోహము, లోభము, ఆపద ఇవన్నీ, ప్రతిదినము చక్కగా తగ్గిపోవు చుండును.

(ఇక్కడ నారదుడు) ఇట్టి అతిశయము గల, దోషద్వయశూన్యులైన (యోగిపరమహంసల) మార్గస్థితులను ప్రశ్నించుచున్నాడు. మార్గ మనగా వేషభాషాదిరూపమైన వ్యవహారము. స్థితి అనగా చిత్తము ఉపశమించుట (శాంతించుట) అను ఆంతరమైన (లోపలి) ధర్మము. ఇక్కడ ప్రశ్నింపబడిన భగవంతుడు చతుర్ముఖబ్రహ్మ.

మూ. యథోక్త(ం)ప్రశ్నోత్తరమవతారయతి–"తం భగవానాహ" ఇతి వక్ష్యమాణమార్గే శ్రద్ధాతిశయముత్పాదయితుం తం మార్గం ప్రశంసతి–

ఉ. "సోఽయం పరమహంసానాం మార్గో లోకే దుర్లభతరో న తు బాహుల్యః" (పరమ. ఉ. 1.) ఇతి.

యః పృష్టః సోఽయమ్ ఇతి యోజనా. అయమిత్యుత్తరగ్రంథే వక్ష్యమాణః ఆచ్ఛాదనాదిః స్వశరీరోపభోగేన లోకోపకారేణ చ నిరపేక్షో ముఖ్యో మార్గః పరామృశ్యతే. తాదృశస్య పరమకాష్ఠాం ప్రాప్తస్య వైరాగ్యస్య అదృష్టచరత్వాత్ తస్య మార్గస్య దుర్లభతరత్వమ్. న

చైతాపతాత్యన్తాభావః శఙ్కనీయః ఇత్యభిప్రేత్య బాహుల్యమేవ ప్రతి షేధతి-న త్వితి.బాహుల్యమితి వక్తవ్యే లిఙ్గవ్యత్యయః ఛాన్దసః.

వ్యా. పైన చెప్పిన ప్రశ్నకు ఉత్తరమును ప్రవేశపెట్టుచున్నాడు - "బ్రహ్మదేవుడు ఆ నారదునితో ఇట్లు పలికెను"

చెప్పనున్న మార్గమునందు అధికశ్రద్ధ కలుగుటకై ఆ మార్గమును ప్రశంసించుచున్నాడు— "ఈ పరమహంసల మార్గము లోకములో చాల దుర్లభము; అధికముగా లభించునది కాదు".

ఏది ప్రశ్నించబడినదో, సః అయమ్=అట్టి, అని అన్వయము. రాబోవు గ్రంథములో చెప్పబడనున్న స్వశరీరము భోగాపేక్ష కాని లోకో పకారాపేక్ష కాని లేని ఆచ్ఛాదనాదికమైన ముఖ్యమార్గము "అయమ్" (ఈ) అను శబ్దముచేత పరామర్శింపబడుచున్నది. పరమకాష్ఠను చేరిన అట్టి వైరా గ్యము పూర్వము ఎన్నడూ చూడబడకపోవుటచే ఆ మార్గము దుర్లభతర మని చెప్పబడినది. అట్లని ఆ మార్గము అసలే లేదు అని శంకించకూడదు అను ఉద్దేశ్యముతో "న తు బాహుల్యః" అని బాహుల్యమునే (తరచుగా లభించుటనే) నిషేధించుచున్నాడు."బాహుల్యమ్"అని నపుంసకలింగమునకు బదులు పుంలింగ ప్రయోగము ఛాందసము. (వేదములో సాధారణ వ్యాకరణ నియమములు వర్తించవు)

మూ. నన్వయం మార్గో దుర్లభతరశ్చేత్తర్హి తదర్థం ప్రయాసో న కర్తవ్యః, తేన ప్రయోజనాభావాదిత్యాహ-

ఉ. "యద్యేకోఽపి భవతి స ఏవ నిత్యపూతస్థః స ఏవ వేద పురుష ఇతి విదుషో మన్యన్తే" ఇతి.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః" (భ.గీ.7.3)

ఇతి న్యాయేన యత్ర క్వాపి, యదా కదాచిద్ యోగీ పరమ హంసో యది కశ్చిల్లభ్యతే తర్హి స ఏవ నిత్యపూతస్థో భవతి. నిత్య

పూతః పరమాత్మా, "య ఆత్మాపహతపాప్మా" (ఛా.ఉ.8.1) ఇతి శ్రుతేః. ఏవకారేణ కేవలయోగీ కేవలపరమహంసశ్చ వ్యావర్త్యతే. కేవలయోగీ నిత్యపూతం న జానాతి. కేవలపరమహంసో జానన్నపి చిత్తవిశ్రాన్త్యభావాద్ బహిర్ముఖో బ్రహ్మణి న తిష్ఠతి. వేదప్రతిపాద్యః పురుషో వేదపురుషః. విదుషో విద్వాంసః బ్రహ్మానుభవచిత్తవిశ్రాన్తిప్రతిపాదకశాస్త్రపారంగతా యోగినః; పరమహంసస్య బ్రహ్మనిష్ఠత్వం సర్వే జనా మన్యన్తే. యథోక్తా విద్వాంసస్తు తదప్యసహమానా బ్రహ్మత్వమేవ మన్యన్తే. తథా చ స్మర్యతే–

"దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః
యస్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మ న బ్రహ్మవిత్ స్వయమ్"
ఇతి.

అతో న ప్రయోజనాభావః శఙ్కితుమపి శక్యతే.

వ్యా. ఈ మార్గము దుర్లభతరమైన పక్షాన దానికొరకు ప్రయాస చేయుట ఏందుకు? ప్రయోజన మేమీ ఉండదు కదా? అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు—

"ఒక్కడున్నను అతడే బ్రహ్మనిష్ఠుడు అనీ, అతడే వేదపురుషుడు అనీ విద్వాంసులు భావించుచున్నారు".

''వేలమంది మనుష్యులలో ఏ ఒక్కడో సిద్ధికొరకై ప్రయత్నించును, ఆ విధముగా ప్రయత్నించిన సిద్ధులలో కూడ ఏ ఒక్కడో మాత్రమే నన్ను యథార్థస్వరూపముతో తెలిసికొనకలుగును" అని భగవద్గీతలో చెప్పినట్లు, ఎక్కడనైనా, ఎప్పుడైనా యోగియైన పరమహంస ఎవ్వడైనా లభించినచో అతడే (ఆలభించినవ్యక్తియే) నిత్యపూతస్సుడు. నిత్యపూతుడు అనగా పరమాత్మ. "ఎవ్వడు ఏ పాపములూ లేని ఆత్మయో'' అని శ్రుతి చెప్పుచున్నది గాన నిత్య పవిత్రుడు పరమాత్మయే. "స ఏవ" అనునప్పుడు 'ఏవ' అను శబ్దమును ప్రయోగించుటచే (అతడే అని అనుటచేత) కేవలము యోగి

మాత్రమే అయినవాడు కేవలము పరమహంస మాత్రమే అయినవాడు వ్యావర్తింపబడుచున్నారు (మినహాయింపబడుచున్నారు) కేవలయోగికి పరమాత్మజ్ఞాన ముండదు. కేవలపరమహంసకు పరమాత్మజ్ఞాన మున్నను అతడు చిత్తవిశ్రాంతి లేకపోవుటచేత బహిర్ముఖుడై బ్రహ్మయందు నిలువ జాలడు. "వేదపురుషుడు" అనగా వేదముచేత ప్రతిపాదింపబడు పురుషుడు. విదుషః=విద్వాసులు. అనగా బ్రహ్మానుభవమును చిత్తవిశ్రాంతిని ప్రతిపాదించు శాస్త్రములో పారంగతులైన యోగులు. పరమహంస బ్రహ్మనిష్ఠ డని అందరూ భావింతురు. పైన చెప్పిన విద్వాంసుల మాత్రము దానిని కూడ సహించక (పరమహంస బ్రహ్మనిష్ఠుడను విషయమును అంగీకరించక) అతడు సాక్షాత్తు బ్రహ్మమే అని భావింతురు. అట్లు స్మృతిలో కూడ చెప్పబడినది—

"ఓ! బ్రాహ్మణుడా! ఎవడు దర్శనమును (ఆత్మసాక్షాత్కారమును) అదర్శనమును (సాక్షాత్కారము లేకపోవుటను) విడచి తాను కేవలరూపముతో (అద్వయరూపుడై) ఉండునో అతడు సాక్షాత్తు బ్రహ్మమే, బ్రహ్మవేత్త కాడు".

అందువలన ప్రయోజనము ఉండునా అని శంకించుటకు కూడ శక్యము కాదు.

మూ. నిత్యపూతస్థత్వం వేదపురుషత్వం చ ముఖతో విశద యన్నర్థాత్ "కా స్థితిః" ఇతి ప్రశ్నస్యోత్తరం సూత్రయతి-

ఉ. "మహాపురుషో యచ్చిత్తం తత్ సర్వదా మయ్యేవావస్థాపయతి, తస్మాదహం చ తస్మిన్నేవావస్థితః" ఇతి.

వైదికజ్ఞానకర్మాధికారిషు పురుషేషు (మధ్యే) యోగినః పరమహంసస్య అత్యన్తముత్తమత్వాత్ మహాపురుషత్వమ్. స చ మహాపురుషో యచ్చిత్తం స్వకీయం తత్సర్వదా మయ్యేవావస్థాపయతి; సంసారగోచరాణాం తదీయచిత్తవృత్తీనామభ్యాసవైరాగ్యాభ్యాం నిరుద్ధ

త్వాత్. అత ఏవ భగవాన్ ప్రజాపతిః శాస్త్రసిద్ధం పరమాత్మానం స్వానుభవేన పరామృశన్మయీతి వ్యపదిశతి. యస్మాద్యోగీ మయ్యేవ చిత్తం స్థాపయతి తస్మాదహమపి పరమాత్మస్వరూపత్వేన తస్మిన్నేవ యోగిన్యావిర్భూతోఽవస్థితః అస్మి; నేతరేష్వజ్ఞానిషు, తేషామవిద్యావృతత్వాత్, తత్త్వవిత్స్వప్యయోగిషు బాహ్యచిత్తవృత్తిభిరావృతత్వాన్నాస్త్యావిర్భావః.

వ్యా యోగియైన పరమహంసయొక్క నిత్యపూతస్థత్వమును, వేద పురుషత్వమును మాటలలో స్పష్టీకరించి "కా స్థితిః" అను ప్రశ్నకు సమాధానమును అర్థాత్ [అర్థముద్వారా] చెప్పుచున్నాడు -

"మహాపురుషుడు తన ఏ చిత్తమున్నదో దానిని ఎల్లప్పుడు నాయందే నిలుపును. అందువలన నేను కూడ వానియందే ఉందును''

వైదికమువైన జ్ఞానకర్మల యందు అధికారము గల పురుషులలో యోగియైన పరమహంస చాల ఉత్తముడు గాన అతడు మహాపురుషుడు. ఆ మహాపురుషుడు తన ఏ చిత్త మున్నదో దానిని ఎల్లప్పుడు నామీదనే నిలుపును. ఎందుచేత ననగా సంసారమునకు సంబంధించిన ఆతని చిత్తవృత్తులన్నీ అభ్యాసవైరాగ్యములచేత నిరుద్ధము లైపోయినవి. అందుచేతనే భగవంతుడైన ప్రజాపతి స్వానుభవముచేత శాస్త్రసిద్ధమైన పరమాత్మను పరామర్శించుచు "నా యందు" అని చెప్పుచున్నాడు. యోగి నా యందె చిత్తమును నిలుపుచున్నాడు గాన నేను కూడ పరమాత్మ స్వరూపముతో ఆ యోగి యందు ఆవిర్భవించి ఉందును; అజ్ఞానులైన ఇతరులయందు ఉండను. కారణమేమనగా వాళ్లు అవిద్యచేత ఆవరింపబడి ఉందురు. యోగులు కాని తత్త్వవేత్తలు కూడ బాహ్యమైన చిత్తవృత్తులచేత ఆవరింపబడుటచే వారియందు పరమాత్మావిర్భావము ఉండదు.

వి. "మహాపురుషుడు తన చిత్తమును నాయందే నిలుపును గాన నేను కూడ ఆతనియంద ఉన్నాను'' అను మాటలు ప్రజాపతి, ప్రజాపతిగా చెప్పుటలేదు. అద్వైతసిద్ధాతము ప్రకారము చతుర్ముఖాదులు కూడ జీవులే. శుద్ధాద్వైతతత్త్వము చతుర్ముఖాద్యతీతము. యోగి చిత్తము నిలుప,

నది ఆ అద్వైతబ్రహ్మతత్త్వమునందే కాని చతుర్ముఖాదులయందు కాదు. ఆ తత్త్వమే యోగితో సంబంధించి ఉండును. అందుచేత ఇక్కడ ప్రజాపతి తాను కూడ వాస్తవమున శుద్ధాద్వైతతత్త్వమే గావున ఆ దృష్ట్యా ఇట్లు చెప్పినాడని "శాస్త్రసిద్ధం పరమాత్మానం స్వానుభవేన పరామృశన్" ఇత్యాది వాక్యమునకు భావము. ఈ విధముగ చెప్పుట ప్రతర్దనాధికరణాదులలో [బ్రహ్మసూత్రభాష్యములో] ఉన్నది.

మూ. ఇదానీం కోఽయం మార్గ ఇతి పృష్టం మార్గముపదిశతి-

ఉ. "అసౌ స్వపుత్రమిత్రకలత్రబన్ధ్వాదీన్ శిఖాయజ్ఞోపవీతే, స్వాధ్యాయం చ సర్వకర్మాణి సంన్యస్యాయం బ్రహ్మాణ్డం చ హిత్వా కౌపీనం దణ్డమాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకస్యోపకారార్థాయ చ పరిగ్రహేత్." (పరమ. ఉ. 1.) ఇతి.

యో గృహస్థః పూర్వజన్మసంచితపుణ్యపుఞ్జే పరిపక్వే సతి మాతృపిత్రాజ్ఞాదినా నిమిత్తేన వివిదిషాసంన్యాసరూపం పరమహంసాశ్రమమస్వీకృత్యైవ శ్రవణాదిసాధనాన్యనుష్ఠాయ తత్త్వంసమ్యగవగచ్ఛతి, తతో గృహస్థస్య ప్రాప్తైర్లౌకికవైదికవ్యవహారసహస్రైశ్చిత్తే విక్షిప్తే సతి విశ్రాన్తిసిద్ధయే విద్వత్సంన్యాసం చికీర్షతి తం ప్రతి స్వపుత్రమిత్రేద్యాద్యుపదేశః; పూర్వమేవ వివిదిషాసంన్యాసం కృత్వా తత్త్వం విదితవతో విద్వత్సంన్యాసం చికీర్షోః పుత్రకలత్రాదిప్రసంగాభావాత్.

వ్యా. ["మాతృపిత్రాజ్ఞాదినా" అనుపాఠమునకు బదులు "మాతృపితృజ్ఞాత్యాదినా" అను ఆనందాశ్రమప్రతిలోని పాఠము గ్రహింపబడినది].

ఇప్పుడు "ఆ మార్గ మేది?" అని ప్రశ్నించబడిన మార్గమును ఉపదేశించుచున్నాడు. "అతడు తన పుత్ర-మిత్ర-భార్యా-బంధ్వాదులను శిఖాయజ్ఞోపవీతములను, స్వాధ్యాయమును, సర్వకర్మలను సంన్యసించి, బ్రహ్మాండమును కూడ విడచి, తన శరీరభోగమునకు ఉపయోగించుటకు,

లోకోపకారము కొరకు కౌపీనమును, దండమును, ఆచ్ఛాదనమును స్వీకరించవలెను.

తల్లి, తండ్రి, ఇతర బంధువులు మొదలగు నిమిత్తముచేత (అనగా తల్లి మొదలైన వారి కెవరికైనా పోషించవలసి ఉండుటచేత) వివిదిషా సంన్యాసరూపమైన పరమహంసాశ్రమమును స్వీకరించకుండగనే ఏ గృహస్థుడు పూర్వజన్మలలో సంపాదించిన పుణ్యపుంజము పరిపక్వ మగుటచేత శ్రవణాదిసాధనములను అనుష్ఠించి తత్త్వమును బాగుగా తెలిసికొనినాడో అట్టి గృహస్థుడు తాను చేయవలసిన వేలకొలది వైదిక లౌకిక వ్యవహారములచేత చిత్తము విక్షిప్త మైనప్పుడు విశ్రాంతికొరకై విద్వత్సంన్యాసమును చేయ దలపవచ్చును. అట్టి గృహస్థుని గూర్చి ఈ "స్వమిత్రపుత్ర" ఇత్యాద్యుపదేశము చేయబడుచున్నది. అంతేకాని పూర్వమే వివిదిషాసంన్యాసము చేసి, తత్త్వమును తెలిసికొని, విద్వత్సంన్యాసము చేయదలచిన వానిని గూర్చి కాదు. అట్టి వానికి పుత్రకలత్రాదులు ఉండే ప్రసక్తియే లేదు కదా?

మూ. నన్వయం విద్వత్సంన్యాసః కిమితరసంన్యాసవత్ ప్రైషోచ్చారణాదివిధ్యుక్త ప్రకారేణ సంపాదనీయః, కిం వా జీర్ణపత్త్రసోపద్రవగ్రామాదిత్యాగవల్లౌకికత్యాగమాత్రరూపః? నాద్యః, తత్త్వవిదః కర్తృత్వరాహిత్యేన విధినిషేధానధికారాత్. అత ఏవ స్మర్యతే—

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్" ఇతి.

వ్యా (ఆశంక) ఇతర (వివిదిషా) సంన్యాసమునువలె ఈ విద్వత్సంన్యాసమును ప్రైషోచ్చారణము మొదలైన విధ్యుక్త పద్ధతులలో సంపాదించవలెనా, లేక జీర్ణవస్త్రమును. ఉపద్రవ మేర్పడిన గ్రామాదికమును పరిత్యజించినట్లు ఈ విద్వత్సంన్యాసము కూడ లౌకికమైన త్యాగ మేనా? మొదటి పక్షము కుదరదు; ఏందుచేత ననగా తత్త్వవేత్తకు కర్తృత్వము ఉండదు గాన అతనికి విధినిషేధములలో అధికారము లేదు అందుచేతనే స్మృతిలో చెప్పబడినది—

"జ్ఞానామృతముతో తృప్తి చెంది కృతకృత్యుడైన యోగికి ఇక కర్తవ్య మేమీ ఉండదు; ఉన్నచో అతడు తత్త్వవేత్త కాడు."

మూ. న ద్వితీయః; కౌపీనదణ్డాద్యాశ్రమలిఙ్గవిధానశ్రవణాత్. నైష దోషః; ప్రతిపత్తికర్మవదుభయరూపత్వోపపత్తేః. తథాహి-జ్యోతిష్టోమే దీక్షితస్య దీక్షాఙ్గనియమానుష్ఠానకాలే కణ్డూయితుం హస్తం ప్రతిషిధ్య కృష్ణవిషాణా విహితా - "యద్ధస్తేన కణ్డూయేత పామానం భావుకాః ప్రజాః స్యుర్యత్స్మయేత నగ్నంభావుకాః" ఇతి; "కృష్ణవిషాణయా కణ్డూయతే" ఇతి చ. తస్యాశ్చ కృష్ణవిషాణాయాః సమాప్తే నియమే ప్రయోజనాభావాత్, వోఢుమశక్యత్వాచ్చ త్యాగః స్వత ఏవ ప్రాప్తః. తం చ త్యాగం సప్రకారం వేదో విదధాతి - "ఏతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణాం ప్రాస్యతి" ఇతి. తదిదం ప్రతిపత్తి కర్మ లౌకికం వైదికం చేత్యుభయరూపమ్. ఏవం విద్వత్సం న్యాసోఽప్యుభయరూపః.

వ్యా రెండవ పక్షము కూడ [లౌకికత్యాగ మనుట కూడ] సరికాదు; ఎందుచేత ననగా కౌపీనము, దండము మొదలైన ఆశ్రమలింగములు విధింపబడుచున్నవి. [సమాధానము] ఈ దోషములేదు. ప్రతిపత్తికర్మ వలె ఉభయరూపము [విధ్యుక్తము లౌకికము కూడ] అని చెప్పుట కుదురును.

(ఏదైన ఒక పనికి ఉపయోగించిన ద్రవ్యమును ఇంక దాని పని లేకపోవుటచే తగు విధముగా వినియోగించుట 'ప్రతిపత్తికర్మ' అని మీమాంసకుల పరిభాష. ఉదాహరణకు - పసుపు విఘ్నేశ్వరునికి నైవేద్యము పెట్టిన బెల్లంముక్కను, "కళ్లకు అద్దికొని నోట్లో వేసికో" అని చెప్పి ప్రక్కనున్న పిల్లవానికి ఇచ్చుట ప్రతిపత్తికర్మ).

అది ఎట్లనగా - జ్యోతిష్టోమయాగము చేయుటకై దీక్ష వహించిన వాడు దీక్షాంగములైన నియమములను అనుష్ఠించు సమయమునందు గోకికొనవలసి వచ్చినప్పుడు చేతితో గోకికొన కూడదని నిషేదించి నల్ల దుప్పి

కొమ్మ విధింపబడినది - చేతితో గోకికొనచో ఆతవి సంతానము చిడుముతో బాధపడుదురు; చిరునవ్వు నవ్వినచో వస్త్రవిహీను లగుదురు" "నల్లదుప్పి కొమ్ముతో గోకికొనవలెను.'' నియమము (దీక్ష) పూర్తి యైన పిమ్మట నల్లదొప్పి కొమ్ముతో ప్రయోజనము లేదు; దానిని సర్వదా మోసికొనుచు ఉండుట కూడ కష్టము. అందుచేత దానిని ఎవరూ చెప్పవలసిన పని లేకుండగనే విడచిలేయవలసి ఉండును. అయితే దానిని ఎట్లు త్యజించవలెనో కూడ వేదము చెప్పుచున్నది– "దక్షిణలు ఇచ్చివేసిన పిమ్మట (ఆయా ఋత్విక్కులు తమ తమ దక్షిణలు గ్రహించిన పిమ్మట దుప్పికొమ్మను చాత్వాలములో (పనికిరాని వస్తువులు పడవేసే బుట్టకు చాత్వాలమని పేరు) ఉంచవలెను " ఈ విధముగ 'ఈ ప్రతిపత్తికర్మ లౌకికము, వైదికము కూడ అగుటచే ఉభయరూపము (అవసరము లేనిదానిని విడచుటచే లౌకికము; దక్షిణ ఇచ్చుట పూర్తి అయిన పిమ్మట చాత్వాలములోనే వేయవలెను అని చెప్పుటచే వైదికము) ఈ విధముగ విద్వత్సంన్యాసము కూడ ఉభయరూపమైనది.

సూ. న చ తత్త్వవిది కర్తృత్వస్యాత్యన్తాభావః శఙ్కనీయః, చిదాత్మన్యారోపితస్య కర్తృత్వస్య విద్యయాపోహితత్వేఽపి, చిచ్ఛాయో పేతేఽన్తఃకరణోపాధౌ విక్రియాసహస్రయుక్తే స్వతఃసిద్ధస్య కర్తృత్వస్య యావద్ద్రవ్యభావితయాసపోహితత్వాత్. న చ "జ్ఞానామృతేన" ఇత్యాదిస్మృతివిరోధః, సత్యపి జ్ఞానే విశ్రాన్తిరహితస్య తృప్త్యభావేన విశ్రాన్తిలక్షణకర్తవ్యశేషసద్భావేన కృతకృత్యత్వాభావాత్.

వ్యా. తత్త్వవేత్తకు కర్తృత్వము అసలే ఉండ దని శంకింపరాదు. చిదాత్మయందు ఆరోపించబడిన కర్తృత్వము జ్ఞానముచేత తొలగిపోయినను చిదాత్మచ్ఛాయతో కూడిన అంతఃకరణరూపమైన ఉపాధి వేలకొలది వికారములు చెందుచుండుటచే దానిలో సహజముగా ఉండు కర్తృత్వము అది (అంతఃకరణము) ఉన్నంతవరకు తొలగదు కదా?

(శుద్ధచైతన్యమునకు కర్తృత్వము లేదు అను విషయమును జ్ఞాని జ్ఞానముచేత తెలిసికొన్నాడు. కాని ఆతని అంతఃకరణము ఉండనే ఉన్నది. అది అనేక పరిణామములను చెందుచుండును. దానికి చిత్ప్రతిబింబమును గ్రహించు శక్తి ఉన్నది. అందుచేత అది ఘటము ఆకాశమునకు ఉపాధి యైనట్లు లేదా ఘటస్థజలము సూర్యునకు (ప్రతిబింబించిన సూర్యునకు)ఉపాధి యైనట్లు చిదాత్మకు ఉపాధి. క్షణక్షణపరిణామియైన ఆ అంతఃకరణమున కున్న కర్తృత్వము ఆ అంతఃకరణము ఉన్నంతవరకు ఉండును అని భావము).

అట్లయినచో పైన ఉదాహరించిన "జ్ఞానామృతేన" ఇత్యాది స్మృతికి విరోధము కదా అని శంకింపరాదు. జ్ఞానము ఉన్నను విశ్రాంతి లేనివానికి తృప్తి ఉండదు. అందుచే విశ్రాంతిని సంపాదించుట అను కర్తవ్యము మిగిలి ఉన్నది గాన కృతకృత్యత్వము లేదు.

మూ. నను తత్త్వవిదోఽపి విధ్యఙ్గీకారే సతి తేనాపూర్వేణ దేహాన్తరమారభ్యేత. నైవమ్; తస్యాపూర్వస్య చిత్తవిశ్రాన్తిప్రతిబన్ధ నివారణలక్షణస్య దృష్టఫలస్య సంభవే సత్యదృష్టఫలకల్పనాయా అన్యాయ్యత్వాత్; అన్యథా శ్రవణాదివిధిష్వపి బ్రహ్మజ్ఞానోత్పత్తిప్రతిబన్ధ నివారణరూపం దృష్టఫలముపేక్ష్య జన్మాన్తరహేతుత్వం కల్ప్యేత. తస్మాద్విధ్యఙ్గీకారే దోషాభావాద్వివిదిషురివ విద్వానపి గృహస్థో నాన్దీ ముఖశ్రాద్ధోపవాసజాగరణాదివిధిమనుసృత్యైవ సంన్యసేత్.

వ్యా. (ఆశంక తత్త్వవేత్తకు కూడ విధిని అంగీకరించినచో దాని అపూర్వముచేత మరొక దేహము ఎత్తవలసివచ్చును కదా?[సమాధానము]. అట్లుకాదు ఆఅపూర్వమునకు చిత్తమునకు విశ్రాంతి కలుగుటలో ఏర్పడిన ప్రతిబంధములను తొలగించుట అనే కనబడే ఫలమును చెప్పుటకు వీలుండగా అదృష్టమైన (కనబడని దేహాంతరప్రాప్తి అనే) ఫలమును చెప్పుట అన్యాయము కాదా? అట్లు కానిచో "శ్రవణము చేయవలెను"

ఇత్యాది విధులను చూచి, బ్రహ్మజ్ఞానము ఉత్పన్నమగుటకో ఏర్పడు ప్రతిబంధములను నివారించుట అను కనబడే ఫలము కాదని జన్మాంతరమునకు హేతువగుట అను అదృష్టఫలమును చెప్పవలసి ఉండును అందుచేత విధిని అంగీకరించినను దోషము లేదు గాన వివిదుషువు వలె విద్వాంసుడైన గృహస్థుడు కూడ నాందీముఖశ్రాద్ధము, ఉపవాసము, జాగరణము మొదలైన విధులను అనుసరించియే సంన్యసించవలెను.

మూ. యద్యప్యత్ర శ్రాద్ధాదికం నోపదిష్టం తథాప్యస్య విద్వత్సంన్యాసస్య వివిదిషాసంన్యాసవికృతిత్వాత్ "ప్రకృతివద్వికృతిః కర్తవ్యా" ఇతి న్యాయేన తదీయాః ధర్మాః సర్వేఽప్యత్ర ప్రాప్నువన్తి, యథాగ్నిష్టోమస్య వికృతిష్వతిరాత్రాదిషు తదీయధర్మప్రాప్తిస్తద్వత్. తస్మాదితరసంన్యాసవదత్రాపి ప్రైషమన్త్రేణ పుత్రమిత్రాదిత్యాగం సంకల్పయేత్.

వ్యా. ఇక్కడ (ఈ ఉపనిషత్తులో) శ్రాద్ధాదికమును చెప్పకపోయినను ఈ విద్వత్సంన్యాసము వివిదిషాసంన్యాసమునకు వికృతియే గాన "వికృతిని ప్రకృతి వలెనే చేయవలెను" అను న్యాయముచేత దానిధర్మములన్నీ దీనియందు కూడ ప్రాప్తించును అగ్నిష్టోమయాగమునకు వికృతులైన అతిరాత్రాదియాగములందు ఆ అగ్నిష్టోమయాగము ధర్మములు ఎట్లు ప్రాప్తించునో అట్లే ఇక్కడ కూడ గ్రహించవలెను. అందువలన ఇతర (వివిదిషా) సంన్యాసమునందు వలె ఈ సంన్యాసములో కూడ ప్రైషమంత్రముచేత పుత్రమిత్రాదుల త్యాగమును సంకల్పించవలెను.

వి ఒక యాగమునకు ఎన్నో అంగములు ఉండును. ఆ అంగములన్నీ యథావిధిగా పూర్తి చేసిననే ఆ యాగము పూర్తి అగును. కొన్ని యాగములకు సంబంధించిన అంగములన్నీ చెప్పబడును. వాటికి "ప్రకృతి యాగములు"అని పేరు కొన్ని యాగాలకు కొన్ని అంగాలు మాత్రమే చెప్పబడును; మిగిలినవాటిని ప్రకృతియాగమునకు చెప్పినట్లు గ్రహించవలెను, ఇట్టి యాగములకు "వికృతియాగములు" అని పేరు."వికృతిని ప్రకృతివలె

చేయవలెను'' అనుదాని భావ మిదే. ప్రకృతియాగమునకు ఉదాహరణము అగ్నిష్టోమయాగము; వికృతియాగమునకు ఉదాహరణము అతిరాత్రాది యాగములు. అట్లే వివిదిషాసంన్యాసము ప్రకృతి, విద్వత్సంన్యాసము వికృతి అని భావము.

టీకా. బన్ధ్వాదీనిత్యాదిశబ్దేన భృత్యపశుగృహక్షేత్రాదిలౌకికపరిగ్రహాదివిశేషాః సంగృహ్యన్తే. స్వాధ్యాయం చేతి చకారేణ తదర్థనిర్ణయోపయుక్తాని పదవాక్యప్రమాణశాస్త్రాణి వేదోపబృంహణానీతిహాసపురాణాదీని చ సముచ్చినోతి. ఔత్సుక్యనివృత్తిమాత్రప్రయోజనానాం కావ్యనాటకాదీనాం త్యాగః కైముతికన్యాయసిద్ధః. సర్వకర్మాణీతి సర్వశబ్దేన లౌకికవైదికనిత్యనైమిత్తికనిషిద్ధకామ్యాని సంగృహ్యన్తే. పుత్రాదిత్యాగేనైహికభోగః పరిహృతః. సర్వకర్మత్యాగేన చాముష్మికభోగాశా చిత్తవిక్షేపకారిణీ పరిహృతా. అయమితి ఛాన్దసవిభక్తిలిఙ్గవ్యత్యయేన ఇదం బ్రహ్మాణ్డమితి యోజనీయమ్. బ్రహ్మాణ్డత్యాగో నామ తత్ప్రాప్తిహేతోర్విరాడుపాసనస్య త్యాగః. బ్రహ్మాణ్డం చేతి చకారేణ సూత్రాత్మప్రాప్తిహేతోః హిరణ్యగర్భోపాసనస్య తత్త్వజ్ఞానహేతూనాం శ్రవణాదీనాం చ సముచ్చయః. స్వపుత్రాదిహిరణ్యగర్భోపాసనాన్తమైహికమాముష్మికం చ సుఖసాధనం సర్వం ప్రైషమన్త్రోచ్చారణేన పరిత్యజ్య కౌపీనాదికం పరిగృహ్ణీయాత్.

వ్యా. "బన్ధ్వాదీన్'' అను పదములోని 'ఆది' శబ్దముచేత[బంధువులు మొదలైన వారు అన్నప్పుడు" ''మొదలైనవారు'' అను పదముచేత] భృత్యులు, పశువులు, గృహము. పొలములు మొదలైన లౌకిక పరిగ్రహ విశేషములు (సంపాదించిన ధనాదులు) గ్రహింపబడును. భృత్యాదులను త్యజించవలెను లని అర్థము, "స్వాధ్యాయం చ'' అన్నప్పుడు 'చ' శబ్దముచేత (స్వాధ్యాయమును కూడ" అన్నప్పుడు 'కూడ' అనుటచేత) వేదార్థమును నిర్ణయించుటకు ఉపయోగించు వ్యాకరణ మీమాంసా - న్యాయశాస్త్ర

ములను, వేదమునకు ఉపకారకములైన పురాణాదులను సముచ్చయించుచున్నాడు (చేర్చుచున్నాడు). ["రామః లక్ష్మణః చ'' ఇత్యాది ప్రయోగములలో 'చ' అనుదానికి "రామునితో పాటు లక్ష్మణుడు కూడ" అని అర్థము. ఇట్లు మరొక దానిని కూడ చేర్చుటకు సముచ్చయ మని పేరు] అనగా వ్యాకరణాది శాస్త్రములను కూడ పరిత్యజించవలె నని అర్థము. కేవలము ఔత్సుక్యమును నివర్తింపచేసికొనుటకు [కేవలము వినోదముకొరకు] చదివే కావ్యనాటకాదులను విడువవలె నని కైముత్యన్యాయముచేతనే సిద్ధించును. "సర్వకర్మాణి" అన్నప్పుడు 'సర్వ' శబ్దముచేత లౌకికకర్మలు, వైదికములైన నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు నిషిద్ధకర్మలు కామ్యకర్మలు గ్రహింపబడును. పుత్రాదులను విడుచుటచే ఐహికభోగములను పరిహరించినట్లయినది. సర్వకర్మలను త్యజించుటచేత చిత్తవిక్షేపమును కలిగించు ఆముష్మికభోగాశ (పరలోకములో లభించు భోగములపై ఆశ) పరిహరింపబడినది. "అయం బ్రహ్మాణ్డమ్" అన్నప్పుడు "ఇదమ్" అని నపుంసకలింగద్వితీయైకవచనమునకు బదులు "అయమ్" అని పులింగప్రథమైకవచనము ప్రయోగింపబడినది. ఛాందసము గాన దోషము లేదు. "ఇదం బ్రహ్మాణ్డమ్" అనిఉన్నట్లు గ్రహించి అర్థము చెప్పుకొనవలెను. బ్రహ్మాండమును విడుచుట అనగా బ్రహ్మాండ ప్రాప్తికి హేతువైన విరాట్స్వరూపోపాసనను విడచుట అని అర్థము. "బ్రహ్మాణ్డం చ'' అని 'చ' శబ్దమును ప్రయోగించుటచే సూత్రాత్మప్రాప్తికి హేతువైన హిరణ్యగర్భోపాసనమును, తత్త్వజ్ఞానమునకు హేతువులైన శ్రవణాదులను కూడ గ్రహించవలెను. పుత్రులు మొదలు హిరణ్యగర్భోపాసనమువరకు గల ఐహిక ఆముష్మిక సుఖసాధనముల నన్నింటిని ప్రైషమంత్రోచ్చారణపూర్వకముగా పరిత్యజించి కౌపీనాదికమును గ్రహించవలెను.

ఏ ప్రతిజీవునకు స్థూలశరీరము, సూక్ష్మశరీరము ఉండును. ఒక వనములో ఉన్న వృక్షములను ప్రత్యేకముగా గ్రహించినచో ఈ వృక్షము; ఆ వృక్షము అని అందుము. ఆ వృక్షముల నన్నింటిని ఒక సమూహముగా గ్రహించినచో ఆ వృక్షము లన్నీ కలసి ఒక వన మగును. వేరు వేరుగా

గ్రహించినచో అది "వ్యష్టి". సమూహముగా గ్రహించినచో "సమష్టి". అనంతసంఖ్యాకులైన జీవుల స్థూలశరీరముల నన్నింటిని సమష్టిగా గ్రహించినచో ఆ స్థూలశరీరసమష్టితో సంబంధించిన (తదుపహితమైన) చైతన్యమునకు "విరాట్" అని పేరు. అనగా ప్రపంచములోని అందరి జీవుల శరీరములు కలిసి ఈ విరాట్‌కు శరీర మని అర్థము. అట్లే సూక్ష్మ శరీరముల సమష్టితో సంబంధించిన చైతన్యమునకు — 'సూత్రాత్మ' "హిరణ్యగర్భుడు" "ప్రాణము" అని పేర్లు. విరాట్స్వరూపమును ఉపాసన చేసినవారికి బ్రహ్మాండప్రాప్తి కలుగును సంన్యాసి ఈ ద్వివిధోపాసనము కూడ త్యజించు నని పైన చెప్పినదాని భావము.

మూ. ఆచ్ఛాదనం చేతి చకారేణ పాదుకాదీని సముచ్చినోతి. తథా చ స్మృతిః—

"కౌపీనయుగలం వాసః కన్థాం శీతనివారిణీమ్
పాదుకే చాపి గృహ్ణీయాత్ కుర్యాన్నాన్యస్య సంగ్రహమ్"

ఇతి.

స్వశరీరోపభోగో నామ కౌపీనేన లజ్జావ్యావృత్తిః. దణ్డేన గోసర్పాద్యుపద్రవపరిహారః. ఆచ్ఛాదనేన శీతాదిపరిహారః. చకారాత్ పాదుకాభ్యాముచ్ఛిష్టదేశస్పర్శాదిపరిహారం సముచ్చినోతి. లోకస్యోప కారో నామ దణ్డాదిలిఙ్గైస్తదీయముత్తమాశ్రమం పరిజ్ఞాయ తదుచితాభి వన్దనభిక్షాప్రదానాదిప్రవృత్త్యా సుకృతసిద్ధిః. చకారేణాశ్రమమర్యా దాయాః శిష్టాచారప్రాప్తాయాః పాలనం సముచ్చినోతి.

వ్యా. అచ్ఛాదనం 'చ' అని 'చ' కారప్రయోగముచేత పాదుకాదుల సముచ్చయము చేయుచున్నాడు. ఆ విషయమును స్మృతి చెప్పుచున్నది—

"రెండు కౌపీనములను, వస్త్రమును, శీతమును నివారించు బొంతను, పాదుకలను గ్రహించవలెను. మరేమీ పరిగ్రహింపగూడదు."

స్వశరీరోపభోగము అనగా కౌపీనమును ధరించుటచే లజ్జ లేకుండ చేసికొనుట. దండముచేత ఎద్దులు, సర్పములు మొదలగు వాటివలన కలుగు

ఉపద్రవమును తొలగించుకొనుట. ఆచ్ఛాదనముచే శీతబాధాదులను పరిహరించుకొనుట. చకారముచే పాదుకలు ధరించుట ద్వారా ఎంగిలి మొదలైన వాటితో అపవిత్రములైన ప్రదేశముల స్పర్శాదికమును సముచ్చయించుచున్నాడు. లోకోపకార మనగా--దండము మొదలైన లింగముల (గుర్తుల) చేత అతని ఉత్తమాశ్రమమును తెలిసికొని లోకులు ఆ ఆశ్రమమునకు తగిన అభివందనము, భిక్షాప్రదానాదికము చేయుటకు ప్రవర్తింతురు గాన దానిచేత వారికి సుకృతము సిద్ధించుట చకారముచేత శిష్టుల ఆచారముచేత ప్రాప్తమైన ఆశ్రమమర్యాదను పాలించుటను సముచ్చయము చేయుచున్నాడు.

మూ. కౌపీనాదిపరిగ్రహస్యానుకూలత్వమభిప్రేత్య ముఖ్యత్వం ప్రతిషేధతి—

ఉ "తచ్చ న ముఖ్యోఽస్తి" (పరమ. ఉ. 1)

యత్కౌపీనాదిపరిగ్రహణమస్తి తదప్యస్య యోగినః పరమహంసస్య ముఖ్యః కల్పో న భవతి; కిం త్వనుకల్ప ఏవ. వివిదిషాసంన్యాసినస్తు దణ్డగ్రహణం ముఖ్యమితి కృత్వా దణ్డవియోగస్య నిషేధః స్మర్యతే-

"దణ్డాత్మనోస్తు సంయోగః సర్వదైవ విధీయతే
న దణ్డేన వినా గచ్ఛేదిషుక్షేపత్రయం బుధః" ఇతి.

ప్రాయశ్చిత్తమపి దణ్డనాశే ప్రాణాయామశతం స్మర్యతే-"దణ్డత్యాగే శతం చరేత్" ఇతి.

వ్యా. కౌపీనాదుల స్వీకారము అనుకూలము మాత్రమే కాని దానికి ముఖ్యత్వము లేదు అని చెప్పుచున్నాడు-

"అది ముఖ్యము కాదు"

కౌపీనాదులను స్వీకరించుట కూడ యోగియైన పరమహంసకు ముఖ్యకల్పము కాదు, అనుకల్పము (అంతగా ముఖ్యముకాని విధానము) మాత్రమే. కాని వివిదిషాసంన్యాసికి దండగ్రహణము ముఖ్యము గాన అత

తెన్నడూ దండమును విడువరా దని స్మృతిలో చెప్పబడినది - "ఎల్లప్పుడు దండము శరీరము కలిసియే ఉండవలె నని చెప్పబడుచున్నది సంన్యాసి దండము లేకుండా ఇషుక్షేపత్రయము కూడ వెళ్లకూడదు. (విడచిన బాణము ఎంత దూరములో పడునో అది ఇషుక్షేపము. అట్టి మూడు దూరములు ఇషుక్షేపత్రయము).

మూ. యోగినః పరమహంసస్య ముఖ్యం కల్పం ప్రశ్నోత్తరాభ్యాం దర్శయతి-

ఉ. కోఽయం ముఖ్య ఇతి చేదయం ముఖ్యః, న దణ్డం న శిఖమ్, న యజ్ఞోపవీతమ్, నాచ్ఛాదనం చరతి పరమహంసః." (పరమ. ఉ. 1.2) ఇతి.

'న శిఖమ్' ఇతి ఛాన్దసో లిఙ్గవ్యత్యయోఽనుసంధేయః. యథా వివిదిషుః పరమహంసః శిఖాయజ్ఞోపవీతాభ్యాం రహితో ముఖ్యః తథా యోగీ దణ్డాచ్ఛాదనాభ్యాం రహితః సన్ముఖ్యో భవతి. దణ్డస్య వైణవత్వాదిలక్షణమ్, ఆచ్ఛాదనస్య కన్థాత్వాదిలక్షణం చ పరీక్షితుం, దణ్డాదికం సంపాదయితుం, రక్షితుం చ చిత్తే వ్యాపృతే సతి చిత్తవృత్తినిరోధలక్షణో యోగో న సిధ్యేదితి. తచ్చ యుక్తమ్, "న హి పరవివాహాయ కన్యోద్వాహః" ఇతి న్యాయాత్.

వ్యా. యోగియైన పరమహంసకు ముఖ్యమైన కల్పమును (విధిని) ప్రశ్నోత్తరములచేత చూపుచున్నాడు–

"ముఖ్యు డెవరు? ఇతడు ముఖ్యుడు, దండము ధరించడు, శిఖ ధరించడు, యజ్ఞోపవీతము ధరించడు; ఆచ్ఛాదనము ధరించడు; పరమహంస తిరుగుచునే ఉండును".

"న శిఖమ్" అన్నప్పుడు శిఖాశబ్దము స్త్రీలింగములో కాక పులింగములో ప్రయోగింపబడినది. ఇది ఛాందసప్రయోగము. శిఖాయజ్ఞోపవీతములు లేని వివిదిషుపరమహంస ఎట్లు ముఖ్యుడో అట్లే దండాచ్ఛాదనము

శ్రేష్ఠుడగు యోగి ముఖ్యు డగును. "దండము వెదురిదా కాదా; ఆచ్ఛాదనము పాంతయా కాదా" ఈ మొదలైన పరీక్షలు చేయుటలోను, దండాదికమును సంపాదించుకాని రక్షించుకొనుటలోను చిత్తము వ్యాపృత మైనపుడు (పని చేయుచున్నప్పు) "చిత్తవృత్తులను నిరోధించుట" అను స్వరూపము గల యోగము సిద్ధించదు. వరుణ్ణి చంపుటకై ఆతనికి కన్యక నిచ్చి వివాహము చేయరు కదా?" అను న్యాయమును (సామెతను) అనుసరించి చూచినచో అది (దండాదిత్యాగము) యుక్తమే (చిత్తమును స్థిరముగా నిలుపుకొనుటకై సంన్యాసము చేసిన యోగి చిత్తవిక్షేపకారకమునైన దండాదులను గ్రహింప కుండుటయే యుక్త మని భావము).

మూ. ఆచ్ఛాదనాద్యభావే శీతాదిబాధాయాః కః ప్రతీకార ఇత్యాశఙ్క్యాహ——

ఉ. "న శీతం న చోష్ణం న సుఖం న దుఃఖం న మానావమానౌ చ షడూర్మివర్జమ్" (పరమ. ఉ. **2**), ఇతి.

నిరుద్ధాశేషచిత్తవృత్తేర్యోగినః శీతం నాస్తి, తత్ప్రతీత్యభావాత్. యథా లీలాయామాసక్తస్య బాలస్యాచ్ఛాదనాదిరహితస్యాపి హేమన్తశిశిరయోః ప్రాతఃకాలేఽపి శిశిరం నాస్తి తథా పరమాత్మన్యాసక్తస్య యోగినః శీతాభావః. ఘర్మకాలే ఉష్ణాభావశ్చ తథైవావగన్తవ్యః. వర్షాసు తదభావసముచ్చయార్థశ్చకారః. శీతోష్ణయోరప్రతీతౌ తజ్జన్యయోః సుఖదుఃఖయోరభావ ఉపపన్నః. నిదాఘే శీతం సుఖజనకం హేమన్తే దుఃఖజనకమ్. ఉక్తవిపర్యయ ఉష్ణే ద్రష్టవ్యః. మానం పురుషాన్తరేణ సంపాదితః సత్కారః. అవమానస్తిరస్కారః. యదా యోగినః స్వాత్మవ్యతిరిక్తం పురుషాన్తరమేవ న ప్రతీయతే తదా మానావమానౌ దూరాపేతౌ. చకారః శత్రుమిత్రరాగద్వేషాదిద్వన్ద్వాభావం సముచ్చినోతి. షడూర్మయః – క్షుత్పిపాసే శోకమోహౌ జరామరణే చ. తేషాం త్రయాణాం ద్వన్ద్వానాం క్రమేణ ప్రాణమనోదేహధర్మత్వాదాత్మతత్త్వాభిముఖస్య యోగినస్తద్వర్జనం యుజ్యతే.

వ్యా. ఆచ్ఛాదనాదులు లేకపోయినచో శీతాదిబాధ కలుగును కదా; దానికి ప్రతిక్రియ ఎట్లు? అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు— (యోగియైన పరమహంసకు) "శీతము చలి) ఉండదు; ఉష్ణము (వేడి) ఉండదు; సుఖము ఉండదు; దుఃఖము ఉండదు; మానావమానములు ఉండవు. షడూర్మ్మలను కూడ ఆతడు విడచును".

సమస్తమైన చిత్తవృత్తులను నిరోధించుకొనిన యోగికి శీతము లేదు, ఎందుచేత ననగా దాని జ్ఞానము ఆతనికి ఉండదు. ఆటలలో ఆసక్తుడైన పిల్లవాడు ఆచ్ఛాదనాదులు లేకపోయినను, ఆతనికి హేమంతశిశిరములందు ప్రాతఃకాలమందు కూడ శీతము ఎట్లుఉండదో అట్లే పరమాత్మయందు ఆసక్తుడైన యోగికి చలి ఉండదు. గ్రీష్మమునందు ఉష్ణము కూడ ఆ విధముగనే ఉండ దని గ్రహించవలెను. వర్షర్తువునందు శీతము లేకుండుటను సముచ్చయించుటకై చకారము ప్రయోగింపబడినది. శీతోష్ణముల జ్ఞానముండనప్పుడు వాటివలన కలుగు సుఖదుఃఖములు లేకుండుట కూడ యుక్తమే. గ్రీష్మమునందు చల్లదనము సుఖకరము; హేమంతములో దుఃఖజనకము, ఉష్ణము విషయమునందు పైన చెప్పినదానికి విపర్యయము (తారుమారగుట) గ్రహించవలెను. మాన మనగా ఇతరులచేత చేయబడిన సత్కారము. ఇతరులు చేసిన తిరస్కారము అవమానము. యోగికి తనకంటె భిన్నమైన మరొక వ్యక్తియే కనబడనప్పుడు ఆతనికి మానావమానముల ప్రశ్నయే ఉండదు. చకారము శత్రుమిత్రులు, రాగద్వేషములు మొదలైన ద్వంద్వములు లేకుండుటను సముచ్చయించుచున్నది. ఆకలి దప్పులు, శోకమోహములు, జరామరణములు అనునవి ఆరు ఊర్మ్మలు. (తరంగముల వలె వచ్చి మీద పడుచుండును గాన వాటికి ఊర్మ్మలు అని పేరు). ఈ మూడు ద్వంద్వములు వరుసగా ప్రాణ - మనో - దేహముల ధర్మములగుటచే ఆత్మతత్త్వమునందు మనస్సు నిలిపిన యోగి వాటిని విడుచుట యుక్తమే.

మూ. నన్వస్త్వేవం సమాధిదశాయాం శీతాద్యభావః, వ్యుత్థానదశాయాం తు నిన్దాదిక్లేశః సంసారిణమివైనం బాధేతేత్యాశఙ్క్యాహ——

ఉ. "నిన్దాగర్వమత్సర దమ్భదర్పేచ్ఛా ద్వేష సుఖదుఃఖకామ క్రోధలోభమోహహర్షాసూయాహంకారాదీంశ్చ హిత్వా"
(పరమ. ఉ. 2) ఇతి.

వివిధైః పురుషైః స్వస్మిన్నాహదితా దోషోక్తిర్నిన్దా. అన్యేభ్యోఽధికోఽహమితి చిత్తవృత్తిర్గర్వః. విద్యాధనాదిభిరసస్యసదృశో భవామీతి బుద్ధిర్మత్సరః. పరేషామగ్రే జపధ్యానాదిప్రకటనం దమ్భః. భర్త్స్నాదిషు దృఢబుద్ధిర్దర్పః. ధనాద్యభిలాషః ఇచ్ఛా. శత్రువధాదిషు బుద్ధిర్ద్వేషః అనుకూలద్రవ్యాదిలాభేన బుద్ధిస్వాస్థ్యం సుఖమ్. తద్విపర్యయో దుఃఖమ్. యోషిదాద్యభిలాషః కామః. కామితార్థవిఘాతజన్యో బుద్ధిక్షోభః క్రోధః. లబ్ధస్య ధనస్య త్యాగాసహిష్ణుత్వం లోభః. హితేష్వహితబుద్ధిరహితేషు హితబుద్ధిర్మోహః. చిత్తగతసుఖాభివ్యఞ్జికా ముఖవికాసహేతుర్ధీవృత్తిర్హర్షః. పరకీయగుణేషు దోషత్వారోపణమసూయా. దేహేన్ద్రియాదిసంఘాతేష్వాత్మభ్రమోఽహంకారః. ఆదిశబ్దేన భోగ్యవస్తుషు మమకారసమీచీనత్వాదిబుద్ధయో గృహ్యన్తే. చకారో యథోక్తనిన్దాదివిపరీతం స్తుత్యాదికం సముచ్చినోతి. ఏతాన్ సర్వాన్ హిత్వా పూర్వోక్త వాసనాక్షయాభ్యాసేన పరిత్యజ్యావతిష్ఠేతేతి శేషః.

వ్యా సమాధిదశలో ఈ విధముగా శీతాదుల బాధ ఉండకపోవచ్చును. కాని వ్యుత్థానదశయందు నిందాదిక్లేశము సంసారిని వలె యోగిని కూడ బాధించును కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు--

"నిందా - గర్వ - మత్సర - దంభ - దర్ప - ఇచ్ఛా - ద్వేష - సుఖ-దుఃఖ - కామ - క్రోధ - లోభ - మోహ - హర్ష - అసూయా - అహంకారాదులను కూడ విడచి ప్రవర్తించవలెను".

అనేకవిధములైన పురుషులు తనయందు దోషమును ఆరోపించుచు పలికిన మాటలు నింద. నేను ఇతరు లందరికంటె గొప్పవాడను అను చిత్తవృత్తి గర్వము. విద్యాధనాదులలో సాటిలేని వాడను అగుదును అను

బుద్ధి మత్సరము. ఇతరుల ఎదుట తన జపధ్యానాదులను ప్రకటించుట దంభము. ఇతరులను భయపెట్టుట మొదలగు కార్యములందు దృఢమైన బుద్ధి దర్పము ధనాదులయందు అభిలాష ఇచ్ఛ. శత్రువధాదులు చేయవలె నను బుద్ధి ద్వేషము. అనుకూలమైన ద్రవ్యములు మొదలైనవి లభించుటచే చిత్తమునకు కలుగు స్వాస్థ్యము;సుఖము తద్విరుద్ధము అనగా ప్రతికూలమైన ద్రవ్యములు మొదలైనవి ప్రాప్తించుటచే చిత్తమునకు కలుగు అస్వాస్థ్యము దుఃఖము. స్త్రీలు మొదలైనవారియందు అభిలాష కామము. కోరినదానికి విఘాతము ఏర్పడుటచే కలిగిన బుద్ధిక్షోభము క్రోధము. లభించిన ధన మును విడచుటకు ఇచ్ఛగించక పోవుట లోభము హితమైనవాటిని అహిత ములుగాను, అహితమైనవాటిని హితములుగాను భావించుట మోహము. చిత్తములోని సుఖమును వ్యంజింపచేయునది ముఖవికాసాదులకు హేతువు అయిన చిత్తవృత్తి హర్షము. ఇతరుల గుణములయందు దోషత్వమును ఆరోపించుట అసూయ. దేహము, ఇంద్రియములు మొదలైనవాటి సముదాయ మును ఆత్మ అని భ్రమించుట అహంకారము పై వాక్యములో 'ఆది' (మొదలైన) అను శబ్దముచేత భోగ్యవస్తువులయందు మమకారము, అవి మంచివను బుద్ధి మొదలగునవి గ్రహించవలెను. 'చ' కారము పైన చెప్పిన నిందాదులకు విపరీతమైన స్తుతి మొదలగువాటిని సముచ్చయము చేయుచు న్నది. సమస్తమైన ఈ నిందాదికమును హిత్వా=వెనుక చెప్పిన వాసనా క్షయమును అభ్యసించుట ద్వారా విడచి, "అవతిష్ఠేత" (ఉండవలెను) అని అధ్యాహారము.

మూ. నను విద్యమానే స్వదేహే తత్పరిత్యాగో న సంభవ తీత్యాశఙ్క్యాహ—

ఉ. "స్వవపుః కుణపమివ దృశ్యతే యతస్తద్వపురపధ్వస్తమ్."
(పరమ. ఉ. 2) ఇతి

పూర్వం యత్స్వకీయం వపుస్తదిదానీం యోగినా స్వాత్మచైత న్యాత్ పృథగ్భూతత్వేన కుణపమివావలోక్యతే: యథా శ్రద్ధాలుః స్పర్శనభీత్యా శవదేహం దూరే స్థితోఽవలోకయతి, తథాయం యోగి

తాదాత్మ్యభ్రాన్త్యుదయభీత్యా సావధానో దేహం చిదాత్మనః సకాశాన్ని ర న్తరం వివిన క్తి. యతః కారణాత్ తద్వపుః ఆచార్యోపదేశాగమాను భవై రపధ్వ స్తం చిదాత్మనః సకాశాన్నిరాకృతమ్; తతశ్చైతన్యవిము క్త స్య దేహస్య శవతుల్యతయా దృశ్యమానత్వాత్ సత్యపి దేహే నిన్దాది త్యాగో ఘటత ఇత్యభిప్రాయః,

వ్యా. ఈ శరీరము ఉండగా నిందాగర్వాదులను విడచుట సంభవిం చదు అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు: - "తన శరీరము శవమువలె చూడ బడును గాన శరీరము ఆత్మనుండి దూరమైపోయినది".

"ఇది నా శరీరము" అని పూర్వము అనుకొన్న శరీరమునే యోగి తన ఆత్మ చైతన్యముకంటె వేరుగా శవమువలె చూచును. ఆచారశ్రద్ధ గలవాడు స్పర్శభీతిచేత శవశరీరమును దూరమునందే నిలచి ఏ విధముగా చూచునో అట్లే ఈ యోగి కూడ తాదాత్మ్యభ్రాంతి కలుగు నను భయముచేత సావధానచిత్తుడై దేహమును చిదాత్మనుండి నిరంతరము వేరుచేసి చూచు చుండును. యతః=ఏ కారణమువలన, ఆ శరీరము ఆచార్యోపదేశముచేతను, శాస్త్రముచేతను, అనుభవముచేతను అపధ్వ స్తము=చిదాత్మనుండి నిరాకరిం పబడినదో, ఆ కారణమువలన; చైతన్యమునుండి దూరమైన శరీరము శవ ముతో సమానముగ కనబడును గాన దేహమున్నను నిందాదులను విడచుట కుదురును అని అభిప్రాయము.

మూ. ననూత్పన్నో దిగ్భ్రమః సూర్యోదయదర్శనేన వినష్టోఽపి యథా కదాచిదనువ ర్తతే తథా కదాచిదాత్మని దేహాత్మసంశయాద్యను వృత్తౌ నిన్దాదిక్లేశః పునః పునః ప్రసజ్యేతేత్యాశఙ్క్యాహ—

ఉ. "సంశయవిపరీతమిథ్యాజ్ఞానానాం యో హేతుస్తేన నిత్యని వృ త్తః" ఇతి

ఆత్మా క ర్తృత్వాదిధర్మోపేత స్తద్రహితో వేత్యాదికం సంశయ జ్ఞానమ్. దేహరూప ఏవాత్మేతి విపరీతజ్ఞానమ్. ఏతదుభయం భో క్తృ

విషయమ్. మిథ్యాజ్ఞానం తు భోగ్యవిషయమత్ర వివక్షితమ్. తచ్చానేక విధం-"సంకల్పప్రభవాన్ కామాన్".ఇత్యత్ర స్పష్టీకృతమ్ (పుట247) తద్ధేతుశ్చతుర్విధః - "అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా" (2.5)ఇతి సూత్రణాత్. అనిత్యే గిరినదీసముద్రాదౌ నిత్యత్వభ్రాన్తిరేకా,అశుచౌ పుత్రభార్యాదిశరీరే శుచిత్వభ్రాన్తిర్ద్వితీయా, దుఃఖే కృషివాణిజ్యాదౌ సుఖత్వభ్రాన్తిస్తృతీయా, గౌణమిథ్యాత్మని పుత్రభార్యాద్యాపన్నమయాదికే చానాత్మని ముఖ్యాత్మత్వభ్రాన్తిశ్చతుర్థీ. ఏతేషాం సంశయాదీనాం హేతురద్వితీయబ్రహ్మాత్మతత్త్వావరకమజ్ఞానం తద్వాసనా చ. తచ్చాజ్ఞానం యోగినః పరమహంసస్య మహావాక్యార్థబోధేన నివృత్తమ్. వాసనా తు యోగాభ్యాసేన నివృత్తా. ఉదాహృతాయాం దిగ్భ్రాన్తౌ అజ్ఞానే నివృత్తేఽపి వాసనాయాః సద్భావాత్ యథా. పూర్వం భ్రాన్తివ్యవహారః. యోగినస్తుభ్రాన్తి హేతుద్వయరాహిత్యాత్ కుతః సంశయాదీన్యనువర్తేరన్? ఇమమేతమనువృత్త్యభావమభిప్రేత్య తేన హేతుద్వయేన, నిత్యనివృత్త ఇత్యుక్తమ్. సత్యామ [ప్య]జ్ఞానే తద్వాసనానివృత్తౌ తస్యా నివృత్తేర్వినాశాభావాన్నిత్యత్వం ద్రష్టవ్యమ్.

వ్యా. దిగ్భ్రమ (ఏది ఏ దిక్కు అను సంశయము, లేదా ఒక దిక్కును మరొక దిక్కనుకొనుట) కలిగినవానికి సూర్యోదయమును చూచగానే (తుర్పుదిక్కు తెలిసినపిమ్మట) ఆ భ్రమ తొలగిపోయినను అప్పుడప్పుడు అది మరల కలుగుటనే ఉండును. అట్లే ఎప్పుడైనా ఆత్మవిషయమున దేహాత్మసంశయాదులు (దేహమే ఆత్మయా అను సందేహము) అనువర్తించినప్పుడు నిందాదిక్లేశము మాటిమాటికి కలుగుచుండవచ్చును కదా అని ఆశంకించి చెప్పుచున్నాడు--

"సంశయ-విపరీతజ్ఞాన మిథ్యాజ్ఞానములకు ఏది హేతువో దానిచేత నిత్యము నివృత్తుడై ప్రవర్తించును".

ఆత్మకు కర్తృత్వము మొదలైన ధర్మములు ఉన్నవా లేవా అను ఆలోచన సంశయజ్ఞానము. దేహాదులే ఆత్మ అనునది విపరీతజ్ఞానము. ఈ

సంశయవిపరీతజ్ఞానములు రెండూ భోక్తను గూర్చినవి. ఇక్కడ మిథ్యాజ్ఞానము భోగ్యములను గూర్చినది అని గ్రహింపవలెను. అది అనేకవిధములుగా ఉండును. దీనిని గూర్చి "సంకల్పప్రభవాన్ కామాన్" అను శ్లోకమును వ్యాఖ్యానించు సందర్భమున వివరింపబడినది (పు 247)దానికి(మిధ్యాజ్ఞానమునకు కారణము నాలుగు విధములు. "అనిత్యమును నిత్యముగాను, అశుచిని శుచిగాను, దుఃఖమును సుఖముగాను, అనాత్మను ఆత్మగాను భావించుట అవిద్య" అని పాతంజలయోగసూత్రమున చెప్పబడినది నిత్యములు కాని పర్వత నదీ సముద్రాదులు నిత్యము లనుకొనుట మొదటిది. అపవిత్రమైన (శుద్ధము కాని) పుత్రభార్యాదులు శరీరము శుచి అనుకొనుట రెండవది. దుఃఖకరమైన కృషి వాణిజ్యము (వర్తకము) మొదలైనవి సుఖకరము లనుకొనుట మూడవది. పుత్రభార్యాదులు తనకంటె వేరుగా కనబడుచున్నను వారు తానే అనుకొనుచు వారి సుఖదుఃఖాదులను తనపై ఆరోపించుకొనుచుండును గాన పుత్రభార్యాదులు గౌణమిథ్యాత్మలు (అప్రధానములు అసత్యములు అయిన ఆత్మలు) అట్లే అన్నమయమైన తన శరీరమే ఆత్మ అనుకొనుచుండును. ఈవిధముగా ఆత్మ కానివాటిని ఆత్మ అనుకొనుట నాల్గవది. అద్వితీయబ్రహ్మాత్మతత్త్వమును ఆవరించు అజ్ఞానము, దాని వాసన ఇవియే ఈ సంశయాదులకు హేతువు యోగియైన పరమహంస ఆ అజ్ఞానమును మహావాక్యార్థములను తెలిసికొనుటచే తొలగించుకొనినాడు. వాసనను యోగాభ్యాసముచేత తొలగించుకొన్నాడు. పైన ఉదాహరించిన దిగ్భ్రాంతియందు, అజ్ఞానము తొలగినను దాని వాసన మిగిలిపోవుటచే పూర్వము వలె భ్రాంతి కలుగవచ్చును, కాని భ్రాంతికి హేతువైన అజ్ఞానము, దాని సంస్కారము రెండూ నశించిన యోగికి సంశయాదులు ఎట్లు అనువర్తించును? వాటి అనువృత్తి ఉండదు అను విషయమును దృష్టిలో ఉంచుకొని "యోగి ఆ హేతుద్వయముచేత నిత్యనివృత్తుడు" అని చెప్పబడినది. అజ్ఞానము, దాని వాసన నివర్తించిన పిమ్మట వాటి నివృత్తికి వినాశము లేదు గాన సంశయాదులనుండి యోగికి నివృత్తి నిత్యము అని తెలిసికొనవలెను.

మూ. తన్నిత్యత్వే హేతుమాహ :-

ఉ. తన్నిత్యబోధః (పరమ. ఉ. 2) ఇతి.

సర్వనామత్వాత్ ప్రసిద్ధార్థవాచీ తచ్ఛబ్దోఽత్ర సర్వవేదాన్త ప్రసిద్ధం పరమాత్మానమాచష్టే. తస్మిన్ పరమాత్మని నిత్యో బోధః యస్య యోగినః సోఽయం తన్నిత్యబోధః. యోగీ హి "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" (బృ. ఉ. 4-4-21) ఇతి. శ్రుతిమనుసృత్య చిత్తవిక్షేపాన్ యోగేన పరిహృత్య నైరన్తర్యేణ పరమాత్మవిషయామేవ ప్రజ్ఞాం కరోతి. అతో బోధస్య నిత్యత్వాత్ బోధవినాశ్యయోరజ్ఞానతద్వాసనయోర్నివృత్తిర్నిత్యేత్యర్థః

వ్యా. అజ్ఞాన తద్వాసనల నివృత్తి నిత్యమని చెప్పుటకు హేతువును చెప్పుచున్నాడు - "(ఆ) యోగి నిత్యము పరమాత్మ సాక్షాత్కారము కలిగి ఉండును".

"తన్నిత్యబోధః"లోని తచ్ఛబ్దము సర్వనామ శబ్దము. అందుచేత ప్రసిద్ధమైనదానిని అర్థముగా చెప్పును. అనగా "తత్" అనుదానికి ప్రసిద్ధమైన 'అది' అని అర్థము. ఇక్కడ ప్రకరణానుసారము ''సర్వవేదాంత ప్రసిద్ధమైన పరమాత్మ" అని అర్థము. తస్మిన్=ఆ పరమాత్మయందు, నిత్యమైన జ్ఞానము ఏ యోగికి ఉన్నదో అతడు "తన్నిత్యబోధుడు". "బుద్ధిమంతుడైన బ్రాహ్మణుడు ఆత్మనే తెలిసికొని ప్రజ్ఞను (ఆత్మవిషయకమైన జ్ఞానమును) చేయుచుండును" అను శ్రుతిని అనుసరించి, యోగి, చిత్తవిక్షేపములను యోగముచేత పరిహరించి, నిరంతరము పరమాత్మను గూర్చిన ప్రజ్ఞనే (జ్ఞానమునే) చేయును. అందుచేత బోధ [ఆతని ఆత్మజ్ఞానము] నిత్యము గాన ఆ జ్ఞానముచే నశింపచేయ దగిన అజ్ఞాన - అజ్ఞానవాసనల నివృత్తి నిత్యము అని అర్థము

మూ. బుధ్యమానస్య పరమాత్మనస్తార్కికేశ్వరవత్ తటస్థత్వ శఙ్కాం వారయతి——

ఉ. తత్స్వయమేవావస్థితిః. (పరమ. ఉ. 2) ఇతి.

యద్వేదాన్తవేద్యం బ్రహ్మాస్తి తత్స్వయమేవ న తు స్వస్మాదన్యదిత్యేవం నిశ్చిత్య యోగినోఽవస్థితిర్భవతి.

వ్యా. తార్కికులు అనుమానప్రమాణముచేత ఊహించి సాధించిన ఈశ్వరుడు తటస్థుడు. అనగా జీవునితో సంబంధము లేక మరొకజీవునివలె మారముగా ఉండువాడు.అయితే యోగి సాక్షాత్కరింపచేసికొనిన పరమాత్మ ఆ విధముగా తటస్థుడు కాడు అని చెప్పుచున్నాడు—

"ఆ పరమాత్మ తానే అని భావించుచు యోగి స్థితుడగును (ఉండును)" వేదాంత వేద్యమైన ఏ బ్రహ్మ ఉన్నదో అది తానే; తనకంటె భిన్నము కాదు అని నిశ్చయించుకొని యోగి స్థితిని పొందును.

మూ. తస్య యోగినో బ్రహ్మానుభవప్రకారం దర్శయతి—

ఉ. "తం శాన్తమచలమద్వయమానన్దవిజ్ఞానఘన ఏవాస్మి, తదేవ మమ పరమం ధామ" (పరమ. ఉ. 2) ఇతి.

తమిత్యాదిపదత్రయే ద్వితీయా ప్రథమార్థే ద్రష్టవ్యా.యః పరమాత్మా శాన్తః క్రోధాదివిక్షేపరహితః, అచలో గమనాదిక్రియారహితః, స్వగతసజాతీయవిజాతీయభేదరహితః, సచ్చిదానన్దైకరసోఽస్తి స ఏవాహమస్మి. తదేవ బ్రహ్మ తత్త్వం మమ యోగినః పరమం ధామ వాస్తవం స్వరూపమ్; న త్వేతత్కర్తృత్వభోక్తృత్వాదియుక్తమ్; ఏతస్య మాయాకల్పితత్వాత్.

వ్యా. ఆ యోగికి కలిగిన బ్రహ్మానుభవ పద్ధతిని తెలుపుచున్నాడు—"శాంతము, నిశ్చలము, అద్వితీయము అయిన ఆ ఆనంద విజ్ఞానముల ఘనము (ముద్ద) నేనే. అదే నా పరమమైన స్థానము.

'తమ్' మొదలైన మూడు పదములలో ద్వితీయావిభక్తిని ప్రథమార్థములో గ్రహించవలెను. ఏ పరమాత్మ శాంతః=క్రోధాది విక్షేపములు లేనిదో, అచలః=గమనాదులు లేనిదో, అద్వయమో అనగా స్వగతభేదము కాని; సజాతీయభేదము కాని, విజాతీయ భేదము కాని లేనిదో సచ్చిదానందైకరసమో ఆ ఆత్మయే నేను. ఆ బ్రహ్మతత్త్వమే నా, పరం ధామ-వాస్తవ స్వరూపము. కర్తృత్వభోక్తృత్వాదులతో కూడిన ఈ స్వరూపము మాయా కల్పితము గాన ఇది నా వాస్తవరూపము కాదు.

వి. చెట్టు ఒక్కటే అయినను దానిలో మ్రాను, కొమ్మలు. ఆకులు, మొదలైన భేదము లున్నవి. అవి స్వగత భేదములు. మామిడిచెట్టు, పనస చెట్టు రెండూ చెట్లే గాన ఒకే జాతికి చెందినవి. అయినను మామిడి చెట్టు వేరు, పనసచెట్టు వేరు. ఇది సజాతీయభేదము. చెట్టు ఒక గుట్ట విజాతీయములు. అవి వేరువేరుగా ఉన్నవి. ఇది విజాతీయభేదము. పరబ్రహ్మకు అవయవములు లేవు. అందుచేత స్వగత భేదము లేదు. దీని జాతికే చెందిన మరొక పదార్థము కాని; దీని జాతికి చెందని మరొక పదార్థము గాని లేదు; అందుచేత దానికి సజాతీయవిజాతీయభేదములు కూడ లేవు. ఉప్పుగడ్డ ఏ మూల చూచినా ఉప్పగానే ఉండును ఉప్పదనము తప్ప మరేమీ దానిలో లేదు. అట్లే బ్రహ్మలో సచ్చిదానందములు తప్ప మరేమీ లేవు సత్= ఉనికి,చిత్=జ్ఞానము సత్తే చిత్తు. చిత్తే సత్తు.సచ్చిత్తులే ఆనందము, ఆనందమే సచ్చిత్తులు. కావున ఇది సచ్చిదానందైకరసము.

మూ. నన్వాత్మనః పరబ్రహ్మత్వే ఆనన్దావాప్తిరిదానీం కుతో న ఇత్యత్రానన్దావాప్తిః సదృష్టాన్తముక్తా భియుక్తైః—

"గవాం సర్పిః శరీరస్థం న కరోత్యఙ్గపోషణమ్
తదేవ కర్మరచితం పునస్తస్యైవ భేషజమ్
ఏవం సర్వశరీరస్థః సర్పిర్వత్పరమేశ్వరః
వినా చోపాసనాం దేవో న కరోతి హితం నృప". ఇతి.

వ్యా. ఆత్మ పరబ్రహ్మయైన పక్షమున ఇప్పుడు ఆనందప్రాప్తి ఎందుకు కలుగుటలేదు అను ఆశంకకు సమాధానము దృష్టాంత పూర్వకముగా సంప్రదాయజ్ఞులైన పండితులచేత చెప్పబడినది—

"గోవుల శరీరమునందంతటా నెయ్యి వ్యాపించి ఉన్నను వాటి శరీరమునకు పోషణము చేయుట లేదు. పాలు పిదుకుట పెరుగు మథించుట మొదలైన పనుల ద్వారా దానినే పైకి తీసినప్పుడు అది ఆ గోవుల శరీరమునకే ఔషధ మగుచున్నది. పరమేశ్వరుడు నెయ్యి వలెనే అన్ని శరీరములలోను ఉన్నాడు. అయినను ఉపాసన లేకుండా దేవుడు మానవులకు హితముచేయడు."

షూ. యది యోగినః పూర్వాశ్రమసిద్ధా ఆచార్యపితృభ్రాత్రా దయః కర్మిణః శ్రద్ధాజడాః శిఖాయజ్ఞోపవీతసంధ్యావన్దనాదిరాహిత్యేన పాషణ్డిత్వమారోప్య వ్యామోహయేయుస్తదా వ్యామోహానుత్పత్తయే యోగినో వర్తమానం నిశ్చయం దర్శయతి—

ఉ. "తదేవ చ శిఖా తదేవోపవీతం చ పరమాత్మాత్మనో-రేకత్వజ్ఞానేన తయోర్భేద ఏవ విభగ్నః సా సంధ్యా"

(పరమ. ఉ. 2) ఇతి.

యద్వేదాన్తవేద్యస్య పరబ్రహ్మణో జ్ఞానం తదేవ కర్మాఙ్గభూతబాహ్యశిఖాయజ్ఞోపవీతస్థానీయమ్. అన్యే చ మన్త్రద్రవ్యలక్షణే కర్మాఙ్గభూతే చకారాభ్యాం సముచ్చీయేతే. శిఖాద్యఙ్గసాధ్యైః కర్మభిరుత్పన్నం యత్ స్వర్గాదిసుఖం తత్సర్వం బ్రహ్మజ్ఞానేనైవ లభ్యతే; విషయానన్దస్య సర్వస్య బ్రహ్మానన్దలేశత్వాత్ "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" (బృ. ఉ. 4 3.32) ఇతి శ్రుతిః.

వ్యా. యోగి పూర్వాశ్రమమునకు సంబంధించిన ఆచార్యులు తండ్రి సోదరులు మొదలైన కర్మాసక్తులై శ్రద్ధాజడులు (గుడ్డిగా కర్మయందే శ్రద్ధగల వారు) శిఖా - యజ్ఞోపవీత - సంధ్యావందనాదులు లేవు గాన నీవు పాషండుడవు అని ఆ యోగిని వ్యామోహపెట్టినచో, అతనికి అట్టి వ్యామోహము కలుగకుండుటకై, యోగికి ఉన్న నిశ్చయమును చూపుచున్నాడు — "అదే శిఖ; అదే యజ్ఞోపవీతము. పరమాత్మ జీవాత్మల ఏకత్వమును తెలిసికొనుటచేత వాటికి ఉన్న భేదమే తొలగిపోయినది; అదే సంధ్య".

వేదాంతవేద్యమైన పరబ్రహ్మ జ్ఞానమే కర్మాంగములైన బాహ్యశిఖా యజ్ఞోపవీతములు. ఇక్కడ ఉన్న రెండు చకారములచేత మంత్రము ద్రవ్యము అను మిగిలిన కర్మాంగములు రెండు సముచ్చయింపబడుచున్నవి. (అనగా ఆత్మజ్ఞానమే మంత్రద్రవ్యము లను కర్మాంగములు అని అర్థము). శిఖాదులైన అంగములచేత సాధింప దగిన కర్మలవలన పుట్టు స్వర్గాది సుఖము అంతా బ్రహ్మజ్ఞానముచేతనే లభించును - "ఇతరభూతము లన్ని

ఈ బ్రహ్మానందముయొక్క అత్యల్పాంశమునే తీసికొని జీవించుచున్నవి" అని ఉపనిషత్తులో చెప్పినట్లు విషయానందము అంతా బ్రహ్మానందము యొక్క లేశమే కదా?

మూ. ఏతదేవాభిప్రేత్యాథర్వణికా బ్రహ్మోపనిషద్యామనన్తి:-
"సశిఖం వపనం కృత్వా బహిఃసూత్రం త్యజేద్బుధః
యదక్షరం పరం బ్రహ్మ తత్ సూత్రమితి ధారయేత్"

వ్యా. ఈ అభిప్రాయముచేతనే అథర్వణశాఖీయులు బ్రహ్మోపనిషత్తులో ఇట్లు చెప్పుచున్నారు--

"పండితుడు శిఖాసహితముగా వపనము చేయించుకొని బాహ్యమైన సూత్రమును పరిత్యజించి అవినాశియైన ఏపరబ్రహ్మ ఉన్నదోదానినే సూత్రముగా ధరించవలెను."

మూ. "సూచనాత్సూత్రమిత్యాహుః సూత్రం నామ పరం పదమ్
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః"

వ్యా. సూచించుటవలన(సూచింపబడుటవలన అని ఇక్కడ అర్థము) "సూత్రము" అని చెప్పుదురు. సూత్రము అనగా పరమపదము (పరతత్త్వము). ఆ సూత్రమును తెలిసికొన్నవాడే వేదముల అంతమును పొందిన బ్రాహ్మణుడు."

మూ యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్.

వ్యా. యోగమును ఎరిగిన, తత్త్వమును చూచిన యోగి, దారమునందు మణుల సముదాయములు వలె దేనిచేత ఈ జగత్తు అంతా గ్రుచ్చబడి ఉన్నదో ఆ సూత్రమును (పరబ్రహ్మతత్త్వమును) ధరించవలెను,

మూ. బహిఃసూత్రం త్యజేద్విద్వాన్ యోగముత్తమమాస్థితః
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యః సచేతనః"

వ్యా. ఉత్తమమైన యోగమును అవలంబించిన విద్వాంసుడు బాహ్యమైనసూత్రమును (యజ్ఞోపవీతమును) విడువవలెను. బ్రహ్మత్వము అను ఈ సూత్రమును ఎవడు ధరించునో ఆతడే బుద్ధిమంతుడు.

మూ. "ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్
సూత్రమన్తర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినామ్
తే వై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః"

వ్యా. ఆ సూత్రమును ధరించుటవలన ఎంగిలి దోషమును పొందడు; అపవిత్రుడు కాడు. జ్ఞాన మను యజ్ఞోపవీతమును ధరించిన ఎవరి హృదయమునందు సూత్రము (పరతత్త్వము) ఉన్నదో, లోకములో వారే సూత్రము ఎరిగినవారు. వారే నిజమైన యజ్ఞోపవీతము గలవారు.

మూ. "జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే"

వ్యా. జ్ఞాననిష్ఠులకు జ్ఞానమే శిఖ; జ్ఞానమే యజ్ఞోపవీతము జ్ఞానమే వారికి అత్యుత్తమ పవిత్రవస్తువు.

మూ. "అగ్నేరివ శిఖా నాన్యా యస్య జ్ఞానమయీ శిఖా
స శిఖీత్యుచ్యతే విద్వాన్ నేతరే కేశధారిణః"

వ్యా. అగ్నికి వలె ఎవనికి మరొకశిఖ ఏదీ లేదో, జ్ఞాన మనే శిఖ మాత్రమే ఉన్నదో, ఆ విద్వాంసుడే శిఖ కలవా డని చెప్పబడుచున్నాడు; కేశరూపమైన శిఖ ధరించిన ఇతరులు నిజమైన శిఖాధారులు కాదు

మూ. "కర్మణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః
తైర్విధార్యమిదం సూత్రం కర్మాఙ్గం తద్ధి వై స్మృతమ్"

వ్యా. ఏ బ్రాహ్మణాదులు వైదికకర్మయందు అధికారము కలవారో వారే ఈ సూత్రమును ధరించవలెను. ఎందుచేత ననగా అది కర్మకు అంగ మని చెప్పబడినది.

మూ. "శిఖా జ్ఞానమయీ యస్యోపవీతం చాపి తన్మయమ్
బ్రాహ్మణ్యం సకలం తస్య ఇతి బ్రహ్మవిదో విదుః"

ఎవడు జ్ఞాన మను శిఖను ధరించినాడో, జ్ఞాన మను యజ్ఞోపవీతమును ధరించినాడో అతనియందే సమస్తమైన బ్రాహ్మణత్వము ఉన్నది అని బ్రహ్మవేత్తలు చెప్పుదురు

మూ. "ఇదం యజ్ఞోపవీతం చ పరమం యత్పరాయణమ్
విద్వాన్ యజ్ఞోపవీతీ స్యాత్ తద్జ్ఞాస్తం యజ్వినం విదుః"ఇతి.
(బ్ర. ఉ. 6-15)

వ్యా. ఏ పరతత్త్వ మున్నదో ఇదియే సర్వోత్తమమైన యజ్ఞోపవీతము, దీనిని ధరించిన విద్వాంసుడే యజ్ఞోపవీతము గలవాడు. అతడే గొప్ప యజ్వ అని చెప్పుదురు.

మూ. తస్మాద్యోగినః శిఖాయజ్ఞోపవీతే యథా విద్యేతే తథైవ సంధ్యాపి విద్యతే. యః శాస్త్రగమ్యః పరమాత్మా యశ్చాహంప్రత్యయగమ్యో జీవాత్మా తయోరేకత్వజ్ఞానేన మహావాక్యజన్యేన భ్రాన్తిప్రతీతో భేదో విశేషేణ భగ్న ఏవ. పునర్భ్రాన్త్యసుదయో భగ్నస్య విశేషః. యేయమేకత్వబుద్ధిః సేయముభయోరాత్మనోః సంధౌ జాయమానత్వాత్ సంధ్యేత్యుచ్యతే. అహోరాత్రయోః సంధావనుష్ఠేయా క్రియా యథా సంధ్యా తద్వత్. ఏవం చ సతి యోగి శ్రద్ధాజడైర్న వ్యామోహయితుం శక్యః.

వ్యా. అందువలన యోగికి శిఖాయజ్ఞోపవీతములున్నట్లే సంధ్య కూడ ఉన్నది. శాస్త్రమువలన తెలియబడు పరమాత్మ, 'అహమ్' (నేను) అను జ్ఞానములో గోచరించు జీవాత్మ ఒక్కటే అను జ్ఞానము మహావాక్యముల వలనకలగగానే భ్రాంతివలన కనబడు భేదము విశేషముగ భగ్నమైపోవును. విశేషముగ భగ్న మగుట అనగా మరల ఆ భ్రాంతి కలుగ కుండుటయే. ఈ ఏకత్వబుద్ధి ఆ రెండు ఆత్మల సంధియందు పుట్టుచున్నది గాన సంధ్య

అని చెప్పబడుచున్నది. అహోరాత్రముల సంధియందు చేయబడు క్రియ "సంధ్య" అన్నట్లే ఇది కూడ అందుచేత శ్రద్ధాజడులు యోగిని వ్యామోహింపచేయజాలరు.

సూ. "కోఽయం మార్గః" ఇతి ప్రశ్నస్య "అసౌ స్వపుత్ర" ఇత్యాదినా ఉత్తరముక్తమ్. "కా స్థితిః"ఇత్యేతస్య "మహాపురుషః——" ఇత్యాదినా సంక్షిప్యోత్తరముక్త్వా "సంశయవిపరీత" ఇత్యాదినా తదేవ ప్రపఞ్చ్య ఇదానీముపసంహరతి——

ఉ. "సర్వాన్ కామాన్ పరిత్యజ్య అద్వైతే పరమా స్థితిః" (పరమ. ఉ. 3) ఇతి.

క్రోధలోభాదీనాం కామపూర్వకత్వాత్ కామపరిత్యాగేన చిత్త దోషాః సర్వేఽపి పరిత్యజ్యన్తే. ఏతదేవాభిప్రేత్య వాజసనేయిభిరామ్నాతమ్- "అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుష" (బృ.ఉ.4.4.5) ఇతి. అతో నిష్కామస్య యోగిచిత్తస్యాద్వైతే నిర్విఘ్నా స్థితిరుపపద్యతే.

వ్యా. "మార్గమేమి!" అను ప్రశ్నకు "అసౌ స్వపుత్ర" ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పబడినది "స్థితి ఎట్టిది" అను ప్రశ్నకు "మహాపురుషః" ఇత్యాది వాక్యముచేత సంక్షేపముగా సమాధానము చెప్పి "సంశయవిపరీత" ఇత్యాది వాక్యములచేత దానినే వివరించి ఇప్పుడు ఉపసంహరించుచున్నాడు —

"అన్ని కామములను విడచి అద్వైతమునందు గొప్ప స్థితి ఏర్పడును."

క్రోధలోభాదులు కామము మూలముననే పుట్టును గాన కామమును పరిత్యజించినచో చిత్తదోషము లన్నీ తొలగిపోవును. ఈ అభిప్రాయము చేతనేవాజసనేయశాఖవారు ఇట్లు చెప్పిరి "ఈ పురుషుడు కామమయుడు అవి అందుచేతనే చెప్పుచున్నారు''. అందుచేత కామము లేని యోగి చిత్తమునకు అద్వైతమునందు నిర్విఘ్నమైన స్థితి కుదురును.

మూ. నను దణ్డగ్రహణవిధివాసనయోపేతా వివిదిషాసంన్యాసినో యోగినం దణ్డరహితం పరమహంసం నాభ్యుపగచ్ఛన్తీత్యాశఙ్క్యాహ—

ఉ. జ్ఞానదణ్డో ధృతో యేన ఏకదణ్డీ స ఉచ్యతే.
కాష్ఠదణ్డో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జితః
స యాతి నరకాన్ ఘోరాన్ మహారౌరవ సంజ్ఞకాన్.
తితిక్షాజ్ఞానవైరాగ్యశమాదిగుణవర్జితః
భిక్షామాత్రేణ యో జీవేత్ స పాపీ యతివృత్తిహా.
ఇదమన్తరం జ్ఞాత్వా స పరమహంసః. (పరమ. 3.3) ఇతి.

వ్యా. దండమును గ్రహించవలెను అను శాస్త్రవిధివాసన ఉన్న వివిదిషాసంన్యాసులు దండరహితుడైన యోగిని పరమహంసగా అంగీకరించరు కదా అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు—

జ్ఞాన మనే దండమును ధరించినవాడు "ఏకదండి" అని చెప్పబడును. కాష్ఠదండమును ధరించి. జ్ఞానవర్జితుడై అన్నీ భుజించేవాడు మహారౌరవము అను నరకములలో పడును. ఓరిమి, జ్ఞానము, వైరాగ్యము, శమము మొదలైన గుణములు లేక కేవలము భిక్షచేసుకొని జీవించుట అనునది మాత్రము చేయువాడు పాపాత్ముడు, ఎందుచేత ననగా అతడు నిజమైన సంన్యాసుల వృత్తికి అడ్డు తగులుచున్నాడు. ఈ భేదమును గుర్తించినచో వెనుక చెప్పిన జ్ఞానియైన యోగి పరమహంసయే.

మూ. పరమహంసస్య యోఽయమేకదణ్డః స ద్వివిధః–జ్ఞానదణ్డః కాష్ఠదణ్డశ్చేతి. యథా త్రిదణ్డినో వాగ్దణ్డః, మనోదణ్డః, కర్మదణ్డశ్చేతి త్రైవిధ్యం తద్వత్; వాగ్దణ్డాదయో మనునా స్మర్యన్తే—

వాగ్దణ్డోఽథ మనోదణ్డః కర్మదణ్డస్తథైవ చ
యస్యైతే నియతా బుద్ధౌ స త్రిదణ్డీతి చోచ్యతే.
త్రిదణ్డమేతన్నిక్షిప్య సర్వభూతేషు మానవః

కామక్రోధౌ తు సంయమ్య తతః సిద్ధిం నిగచ్ఛతి.
(మను. 12 - 10, 11) ఇతి.

వ్యా. పరమహంసకు విధించబడిన ఈ ఏకదండము - "జ్ఞాన దండము" "కాష్ఠదండము" అని రెండు విధములు. త్రిదండికి వాగ్దండము మనోదండము, కర్మదండము అనే మూడు విధములైన దండములు ఎట్లో అట్లే, వాగ్దండాదులు మనువుచేత చెప్పబడినవి వాగ్దండము, మనోదండము, కర్మదండము అను ఈ మూడు ఎవని బుద్ధియందు నియతములై ఉన్నవో అతడు త్రిదండి యని చెప్పబడుచున్నాడు. మానవుడు ఈ మానవుల విషయమున ఈ త్రిదండమును ఉంచి, కామక్రోధములను అరికట్టుకొన్నచో సిద్ధిని పొందును

వి. నిషిద్ధములైన మాటలు పలుకకుండుట వాగ్దండము. చెడ్డ ఆలోచనలు రానీయకుండుట మనోదండము, నిషిద్ధములైన పనులు చేయ కుండుట కాయదండము (మనుస్మృతిలోను కుల్లూకభట్టు రచించిన దాని వ్యాఖ్యలోను "కాయదణ్డః" అని ఉన్నది.) ఈ మూడు దండములను బుద్ధిలో స్థిరముగా నిలుపుకొనినవాడు త్రిదండి. "త్రిదండమును సర్వభూతముల యందు నిక్షిప్తము చేసి" అనుదానికి "నిషిద్ధవాగాదులను ఏ ప్రాణి విషయ మునను ప్రవర్తింపచేయక, వాటి దమనము చేసి" అని అర్థము. ఇది కుల్లూకభట్టానుసారి వివరణము.

మూ. తేషాం స్వరూపం దక్షః స్మరతి—
"వాగ్దణ్డోఽథ మనోదణ్డః కర్మదణ్డస్తథైవ చ
యస్యైతే నియతా దణ్డాస్త్రిదణ్డీతి స ఉచ్యతే.
వాగ్దణ్డే మౌనమాతిష్ఠేత్ కర్మదణ్డే త్వనీహతామ్.
మానసస్య తు దణ్డస్య ప్రాణాయామో విధీయతే". ఇతి.

"కర్మదణ్డోఽల్పభోజనమ్" ఇతి స్మృత్యన్తరపాఠః. ఈదృశం త్రిదణ్డిత్వం పరమహంసస్యాప్యస్తి. తదేతదభిప్రేత్య పితామహః

స్మరతి- "యతిః పరమహంసస్తు తుర్యాఖ్యః శ్రుతిచోదితః,
యమైశ్చ నియమైర్యుక్తో విష్ణురూపీ త్రిదణ్డభృత్" ఇతి.

వ్యా. వాటి స్వరూపమును దక్షుడు దక్షస్మృతిలో చెప్పినాడు
"ఎవనివద్ద వాగ్దండము, మనోదండము, కర్మదండము అను మూడు దండములు తప్పక ఉండునో అతడు "త్రిదండి" అని చెప్పబడును వాగ్దండమునందు మౌనమును అవలంబించవలెను, అనగా మౌనమును అవలంబించుట ద్వారా వాగ్దండమును అభ్యసించవలెను. కర్మదండమునందు కోరికలు లేక పోవుటను అవలంబించవలెను (కోరికలను విడచుట ద్వారా కర్మదండమును అభ్యసించవలెను). మానసదండమునకు ప్రాణాయామమువిధింపబడుచున్నది.

మరొక స్మృతిలోని పాఠము ప్రకారము కర్మదండ మనగా అల్పముగా భుజించుట. ఈ విధమైన త్రిదండిత్వము పరమహంసకు కూడ ఉన్నది. ఈ అభిప్రాయముచేతనే పితామహుడు చెప్పుచున్నాడు.

వేదముచే ప్రతిపాదింపబడిన పరమహంస అను యతి నాల్గవఆశ్రమమునకు చెందినవాడు; లేదా సన్యాసులలో నాల్గవతరగతికి చెందినవాడు. త్రిదండములను ధరించి యమనియమములు గల ఇతడు విష్ణుస్వరూపుడు

మూ. ఏవం సతి మౌనాదీనాం వాగాదిదమనహేతుత్వాద్యథా దణ్డత్వం తథైవాజ్ఞానతత్కార్యదమనహేతోర్జ్ఞానస్య దణ్డత్వమ్. అయం జ్ఞానదణ్డో యేన గృహీతః స ఏవ ముఖ్య ఏకదణ్డీత్యుచ్యతే. మానసస్య జ్ఞానదణ్డస్య కదాచిచ్చిత్తవిక్షేపేణ విస్మృతిః ప్రసజ్యేతేతి తన్నివారణార్థం స్మారకః కాష్ఠదణ్డో ధ్రియతే. తదేతద్వాస్తార్థమబుద్ధ్వా వేషమాత్రేణ పురుషార్థసిద్ధిమభిప్రేత్య కాష్ఠదణ్డో యేన పరమహంసేన ధృతః స పురుషో బహువిధయాతనోపేతత్వాద్ ఘోరాన్మహారౌరవసంజ్ఞకాన్నరకానాప్నోతి.

వ్యా. కావున మౌనాదులు వాగాదుల దమనమునకు హేతువగుటచే అవి ఏ విధముగా దండమో అట్లే జ్ఞానము కూడ అజ్ఞానమును, దాని

ఏవం చ సతి జ్ఞానదణ్డకాష్ఠదణ్డయోర్యదన్తరముత్తమత్వాధమత్వరూపం తదిదమవగత్యోత్తమం జ్ఞానదణ్డం యో ధారమతి స ఏవ ముఖ్యః పరమహంస ఇత్యభ్యుపగన్తవ్యమ్.

వ్యా. ఇందుకు హేతువు చెప్పబడుచున్నది. జను లందరూ పరమహంసవేషమును చూచి ఇతడు జ్ఞాని అను భ్రాంతిచేత ఆతనికి తమ తమ ఇండ్లలో భోజనము పెట్టుదురు. ఇతడు జిహ్వాచాపల్యముతో తిన దగినది, తిన దగనిది అను వివేకము లేక పెట్టినది అంతా తినివేయును; దానివలన ప్రత్యవాయమును పొందును. "సంన్యాసికి అన్నదోషము అంటదు" "సంన్యాసి నాలుగువర్ణాలవారివద్దా భిక్షాటనము చేయవచ్చును" మొదలైన స్మృతివాక్యము లేవైతే ఉన్నవో అవి జ్ఞానిని గూర్చి చెప్పినవి. ఇతడో జ్ఞానవర్జితుడు. అందుచే వానికి నరకము తప్పదు. అందుచెతనే జ్ఞానము లేని యతి పాటించవలసిన భిక్షానియమములను మనువు చెప్పి ఉన్నాడు—

"ఉత్పాతనిమిత్తములచేత గాని, నక్షత్రాంగవిద్యచేత గాని, అనుశాసనవాదములచేత గాని ఎన్నడూ భిక్ష సంపాదించవలె నని కోరగూడదు."

(ఉత్పాతము లనగా భూకంపాదులు. నిమిత్తము లనగా కన్ను అదరుట మొదలైనవి. భిక్ష అధికముగా లభించుటకై సంన్యాసి ఉత్పాతములు, నిమిత్తములు మొదలైనవాటివలన కలుగబోవు ఫలములను చెప్పుట, నక్షత్రఫలములను, సాముద్రికఫలములను చెప్పుట, నీతిమార్గమును బోధించుట, శాస్త్రము బోధించుట మొదలైన జనాపర్జకములైన ఉపాయములు అనుసరింపరా దని అర్థము.)

"దినమున ఒక్క కాలమునందే భిక్షాచరణము చేయవలెను. అధికముగా భైక్షము సంపాదించుటకు ఆసక్తుడు కాకూడదు. భైక్షమునందు ఆసక్తి చూపిన యతి ఇతరవిషయములయందు కూడ ఆసక్తు డగును కదా?"

కాని జ్ఞానాభ్యాసమును చేయువానిని గూర్చి మాత్రము స్మృతిలో ఇట్లు చెప్పబడినది—"పరమహంస ఒక్కమారుగాని, రెండు మార్లు గాని భుజించవచ్చును, ఏదో విధముగ ఎల్లప్పుడు జ్ఞానాభ్యాసము చేయుచుండవలెను.

అందుచేత జ్ఞానదండ కాష్ఠదండముల ఉత్తమత్వ అధమత్వరూపమైన భేదమును గ్రహించి, ఉత్తమమైన జ్ఞానదండమును ఎవడు ధరించునో అతడే ముఖ్యుడైన పరమహంస అని అంగీకరించవలెను.

మూ. నన్వభిజ్ఞస్య పరమహంసస్యాస్తు జ్ఞానదణ్డో,మా భూత్ కాష్ఠదణ్డనిర్బన్ధః. ఇతరా తు చర్యా సర్వా కీదృశీత్యాహ—

ఉ. "ఆశామ్బరో న నమస్కారో న స్వధాకారో న నిన్దా న స్తుతిర్యాదృచ్ఛికో భవేద్ భిక్షుర్నావాహనం న మన్త్రం న ధ్యానం నో పాసనం న లక్ష్యం నాలక్ష్యం న పృథఙ్ నాపృథఙ్ న చాహం న త్వం స చ సర్వం స చ నికేతస్థితిరేవ స భిక్షుః సౌవర్ణాదీనాం నైవ పరిగ్రహేన్న లోకం నావలోకం చ" (పరమ. ఉ. 4) ఇతి.

వ్యా. జ్ఞానియైన పరమహంసకు జ్ఞానదండమే కాని కాష్ఠదండము తప్పక ఉండవలెను అనునియమము లేకపోవచ్చును; కాని అతని మిగిలిన చర్య ఎట్లుండును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు—

యతి దిగంబరుడై ఉండును. ఇతరులకు నమస్కారముచేయుట ఉండదు. స్వధాకారము (పితృకార్యము) లేదు నింద లేదు; స్తుతి లేదు. ఏది ఎల్లా జరుగునో ఆ విధముగా ప్రవర్తించుచుండును, ఆవాహనము లేదు, విసర్జనము లేదు. మంత్రము లేదు, ధ్యానము లేదు, ఉపాసన లేదు, లక్ష్యము లేదు, అలక్ష్యము లేదు. వేరు కాదు, వేరుకానిది కాదు, 'నేను' లేదు, 'నువ్వు' లేదు; ఏదీ లేదు. గృహమునందు స్థితి లేనివాడు కాదు. అతడే భిక్షువు. అతడు బంగారము మొదలైనవాటిని తీసికొనగూడదు. లోకము, శిష్యసము దాయము లేదు, వారివైపు చూచుట కూడ లేదు.

మూ. ఆశా దిశః;తా ఏవామ్బరం వస్త్రమాచ్ఛాదనం యస్యాసా వాశామ్బరః. యత్తు స్మృతివచనమ్—

"జాన్వోరూర్ధ్వమధో నాభేః పరిధాయైకమమ్బరమ్
ద్వితీయముత్తరం వాసః పరిధాయ గృహాన్వ్రజేత్"

ఇతి తదిదమయోగివిషయమ్. అత ఏవ పూర్వమ్ "తచ్చ న ముఖ్యోఽస్తి" ఇత్యుక్తమ్. యద్యపి స్మృత్యన్తరమ్—

"యో భవేత్పూర్వసంన్యాసీ తుల్యో వై ధర్మతో యది
తస్మై ప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన"

ఇతి, తథాపి తస్యాయోగివిషయత్వాన్నాస్య నమస్కారః కర్తవ్యోఽస్తి. అత ఏవ బ్రాహ్మణలక్షణే "నిర్నమస్కారమస్తుతిమ్" (పుట.69)ఇత్యుదాహృతమ్. గయాప్రయాగాదితీర్థేషు శ్రద్ధాజాడ్యాత్ ప్రాప్తఃస్వధాకారో నిషిధ్యతే పూర్వత్ర "నిన్దాగర్వ" ఇత్యాదివాక్యేన పరకృతయా నిన్దయా క్లేశో నివారితః; అత్ర తు స్వకర్తృకే అన్య విషయే నిన్దాస్తుతీ నిషిధ్యేతే.

వ్యా. ఆశాః = దిక్కులు, అపియే వాసః వస్త్రము అచ్ఛాదనము, ఎవనికో అతడు ఆశాంబరుడు "ఒక వస్త్రము మోకాళ్ళ పైకి బొడ్డు క్రిందికి ఉండునట్లు కట్టుకొని, మరొక వస్త్రము ఉత్తరీయముగా ధరించి ఇండ్లు (భిక్షకై) తిరగవలెను" అను స్మృతివాక్యము యోగి కానివానిని గూర్చి చెప్పినది. అందుచేతనే "అది ముఖ్యము కాదు" అని వెనుక చెప్పబడినది.

"తనకంటె ముందుగా సంన్యాసము చేసినవాడు తనతో సమానమైన ధర్మము కలవాడైనచో ఆతనికి నమస్కారము చేయవలెను ఇతురుని కెన్నడూ చేయరాదు" అను మరొక స్మృతివాక్యము కూడ యోగి కానివానిని గూర్చిచెప్పినదే గాన ఇతడు ఎవరికీ నమస్కారము చేయవలసిన పని లేదు. అందుచేతనే బ్రాహ్మణలక్షణములను చెప్పినప్పుడు "నమస్కారము కాని స్తుతి కాని లేనివాడు" అని ఉదాహరింపబడినది. గయాప్రయాగాదితీర్థములకు వెళ్ళినప్పుడు కర్మశ్రద్ధాజాడ్యమువలన స్వధాకారప్రసక్తి (పితృకార్యము చేయు అవకాశము) ఉన్నది గాన అది నిషేధింపబడుచున్నది వెనుక "నిన్దాగర్వ" ఇత్యాదివాక్యముచేత పరులు చేయు నిందచేత క్లేశము చెందగూడదు అని చెప్పబడినది. తాను ఇతరుల నెవ్వరినీ నిందించుట గాని స్తుతించుట గాని చేయగూడదని ఇక్కడ చెప్పబడుచున్నది.

మూ. యాదృచ్ఛికత్వం నిర్బన్ధరాహిత్యమ్, స క్వచిదపి వ్యవహారే నిర్బన్ధం కుర్యాత్. యస్తు దేవపూజాయాం నిర్బన్ధః శ్రూయతే-

"భిక్షాటనం జపం శౌచం స్నానం ధ్యానం సురార్చనమ్
కర్తవ్యాని షడేతాని సర్వథా నృపదణ్డవత్"

ఇతి తస్యాయోగివిషయత్వ మభిప్రేత్య నావాహనమిత్యాద్యామ్నాతమ్. సకృత్ స్మరణం ధ్యానమ్; నైరన్తర్యేణానుస్మరణముపాసనమితి తయోర్భేదః. యథా యోగినః స్తుతినిన్దాదిలౌకికవ్యవహారాభావః తథా లక్ష్యత్వాలక్ష్యత్వాది జ్ఞానశాస్త్రవ్యవహారోఽపి నాస్తి. "యత్ సాక్షిచైతన్యమస్తి తదిదం "తత్త్వమసి" ఇతి వాక్యే త్వంపదేన లక్ష్యమ్; దేహాదివిశిష్టం చైతన్యం లక్ష్యం న భవతి, కింతు వాచ్యమ్. తచ్చ వాచ్యం తత్పదార్థాత్ పృథక్; లక్ష్యం త్వపృథక్, స్వదేహనిష్ఠో వాచ్యోఽహమితి వ్యవహారార్హః, పరదేహనిష్ఠస్త్వమితి వ్యవహారార్హః. లక్ష్యం వాచ్యమిత్యుభయవిధం చైతన్యోపేతమ్, అన్యజ్జడం జగత్సర్వమితి వ్యవహారార్హమ్. ఇత్యేతాదృశో వికల్పో న కోఽపి యోగినోఽస్తి; తదీయచిత్తస్య బ్రహ్మణి విశ్రాన్తత్వాత్.

వ్యా. యాదృచ్ఛికత్వమ్ నిర్బంధము లేకపోవుట. ఏ వ్యవహారమునందూ కూడ నిర్బంధమును (ఇది ఇట్లే చేయవలెను అను నియమమును) చేయకూడదు. దేవపూజ విషయమునందు స్మృతిలో—"భిక్షాటనము, జపము, శౌచము, స్నానము, ధ్యానము, దేవతాపూజ ఈ ఆరూ అన్ని విధములా రాజశాసనము వలె ఆచరించవలెను" అని చెప్పబడిన నిర్బంధము కూడ యోగి కానివానిని గూర్చి యే చెప్పబడినదను అభిప్రాయముతో "నావాహనమ్" (ఆవాహనము లేదు) ఇత్యాదికము చెప్పబడినది. - ఒక్క మారు స్మరించుట ధ్యానము; నిరంతరము స్మరించుట ఉపాసనము. ఇదే ధ్యానోపాసనల కున్న భేదము. యోగికి స్తుతినిందాది లౌకికవ్యవహారములు ఎట్లు ఉండవో, దేవపూజామతైన ధర్మశాస్త్రోక్తవ్యవహారములు ఎట్లు ఉండవో, అట్లే లక్ష్యత్వము, అలక్ష్యత్వము మొదలైన జ్ఞానశాస్త్రమునకు సంబంధించిన

వ్యవహారము కూడ ఉండదు. "తత్త్వమసి" అను వాక్యములోని "త్వమ్" అను పదము లక్షణావృత్తిచేత సాక్షిచైతన్యమును బోధించును. అందుచేత "త్వమ్" పదమునకు సాక్షిచైతన్యము లక్ష్యము, అంతే కాని దేహాదులతో కూడిన చైతన్యము లక్ష్యము కాదు; అది వాచ్యము. వాచ్యమైన దేహాదివిశిష్ట చైతన్యము 'తత్' పదమునకు అర్థమైన శుద్ధచైతన్యముకంటె భిన్నము, లక్ష్యార్థము మాత్రము దానికంటె అభిన్నము. తన దేహమునందున్న వాచ్యార్థము (దేహాదిసహితచైతన్యము) 'అహమ్' అను వ్యవహారమునకు తగినది పరదేహములో నున్నది 'త్వమ్' (నీవు) అను వ్యవహారమునకు తగినది లక్ష్యము; వాచ్యము ఈ రెండూ చైతన్యముతో కూడినవి. మిగిలిన జడమైన జగత్తు 'సర్వమ్' (అంతా) అను వ్యవహారమునకు తగినది" ఈ విధమైన వికల్పము ఏదీ యోగికి ఉండదు. ఎందుచేత ననగా అతని చిత్తము బ్రహ్మయందు విశ్రాంతమై ఉండును

వి. 'తత్త్వమసి' అను వాక్యమునందు వాచ్యార్థము, లక్ష్యార్థము మొదలైనవాటివివరణము మా వివేకచూడామణ్యాదివ్యాఖ్యలలో లభించును.

మూ. అత ఏవ స భిక్షురనికేతస్థితిరేవ. యది నియతనివాసార్థం కంచిన్మఠం సంపాదయేత్ తదానీం తస్మిన్ మమత్వే సతి తదీయహాని వృద్ధ్యోః చిత్తం విక్షిప్యేత. ఏతత్సర్వమభిప్రేత్య గౌడపాదాచార్యా ఆహుః—

"నిస్తుతిర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవ చ
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్." (2.37) ఇతి.

యథా మఠో న పరిగ్రహీతవ్య స్తథా సౌవర్ణరాజతాదీనాం భిక్షాచమనాది పాత్రాణామేకమపి న గృహ్ణీయాత్. తదాహ యమః—

"హిరణ్మయాని పాత్రాణి కార్ష్ణాయసమయాని చ
యతీనాం తాన్యపాత్రాణి వర్జయేత్తాని భిక్షుకః" ఇతి.

మనురపి—

అతైజసాని పాత్రాణి తస్య స్యుర్నిర్వ్రణాని చ
తేషాం మృద్భిః స్మృతం శౌచం చమసానామివాధ్వరే
అలాబుదారుపాత్రం వా మృన్మయం వైణవం తథా
ఏతాని యతిపాత్రాణి మనుః స్వాయంభువోఽబ్రవీత్.

(6.53,54) ఇతి.

బోధాయనోఽపి—

"స్వయమాహృతపర్ణేషు స్వయంశీర్ణేషు వా పునః
భుఞ్జీత న వటాశ్వత్థకరఞ్జానాం చ పర్ణకే
ఆపద్యపి న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః
సౌవర్ణే రాజతే తామ్రే మృన్మయే త్రపుసీసయోః" ఇతి

వ్యా. కావుననే ఆ భిక్షువు ఒకేగృహములో నివసించకూడదు. ఆతడు నివాసార్థమై ఏదైన ఒక మఠమును సంపాదించినచో దానిపై మమకార మేర్పడి దాని కేదైన హాని గాని, వృద్ధి కాని వచ్చి నపుడు (దుఃఖసంతోషాదుల చేత) చిత్తవిక్షేపము కలుగును దీని నంతనూ దృష్టిలో ఉంచుకొనియే గౌడ పాదాచార్యులు కూడ చెప్పినారు.

"సంన్యాసి స్తుతి కాని నమస్కారము కాని లేనివాడై, స్వధాకారము కూడ లేనివాడై ఉండవలెను. ఆతని నివాసస్థానము స్థిరము కాకూడదు; అస్థిరము కాకూడదు; ఈ విధముగా యాదృచ్ఛికుడై (దైవాధీనుడై) ఉండవలెను.''

మఠమును ఎట్లు స్వీకరించకూడదో అట్లే భిక్షాచమనాదులకై బంగారము వెండి మొదలైన పాత్రలలో ఒక్కదానిని కూడ గ్రహించకూడదు. ఈ విషయమునే యముడు చెప్పినాడు—

"బంగారు పాత్రలు, ఇనుప పాత్రలు ఇవి యతికి తగిన పాత్రలు కావు, సంన్యాసి వాటిని పరిహరించవలెను."

మనువు కూడ చెప్పినాడు—

"సంన్యాసికి బంగారము మొదలైన లోహములతో చేసిన పాత్రలు ఉండకూడదు. బ్రద్దలైపోయినవాటిని ఉంచుకొనకూడదు. యజ్ఞములోని చమసములకు (పాత్రలకు) వలె సంన్యాసి పాత్రలకు కూడ మట్టిచేత శుద్ధి". "సంన్యాసికి ఆనపకాయ బుర్ర గాని, కర్రతో చేసిన పాత్ర గాని, మట్టి పాత్ర గాని, వెదరు పాత్ర గాని, పాత్రలుగా ఉండవలెను అని స్వాయంభువ మనువు చెప్పినాడు."

బోధాయనుడు కూడ చెప్పినాడు —

"సంన్యాసి స్వయముగా తెచ్చుకొన్న ఆకులలో కాని, వాటంతట అవే రాలిన ఆకులలో కాని భుజించవలెను. మర్రి, రావి, కరంజము-ఈ ఆకులలో ఎప్పుడూ తినకూడదు." "ఆపత్సమయములో కూడ కంచు పాత్రలలో భోజనము చేయగూడదు. వాటిలో తినేవాడు మలమును తిన్నట్లే. బంగారము, వెండి, రాగి, మట్టి, తగరము, సీసము-ఈ పాత్రలలో కూడ భుజించకూడదు."

మూ. తథా లోకం జనం శిష్యవర్గం న గృహ్ణీయాత్, తదాహ మనుః—

"ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయకః
సిద్ధిమేకస్య సంపశ్యన్న జహాతి న హీయతే" (6.4.2) ఇతి.

వ్యా మరియు లోకమును, అనగా జనమును, అనగా శిష్యవర్గమును చేర్చుకొనగూడదు. ఆ విషయమును మనువు చెప్పినాడు.

సిద్ధిని (మోక్షమును) కోరు యతి నిత్యము, ఏ సహాయుడు లేకుండగా ఒంటరిగానే సంచరించవలెను. ఒంటరిగా ఉన్నవానికే సిద్ధి లభించు నని తెలిసికొన్నవాడు ఎవరినీ విడిచిపెట్టడు, (అనగా వారిని విడచితినే అని దుఃఖించడు). విడువబడడు (ఇతరులు కూడ అతనిని విడచితిమే అని దుఃఖించరు.)

మూ. మేధాతిథిరపి—

"ఆసనం పాత్రలోపశ్చ సంచయః శిష్యసంగ్రహః
దివాస్వాపో వృథాలాపో యతేర్బన్ధకరాణి షట్."

వ్యా. మేధాతిథి కూడ చెప్పినాడు —

"ఆసనము పాత్రలోపము, సంచయము, శిష్యసంగ్రహము, దివాస్వాపము, వృధాలాపము-ఈ ఆరూ యతికి బంధహేతువులు."

మూ. "ఏకాహాత్పరతో గ్రామే పఞ్చాహాత్పరతః పురే
వర్షాభ్యోఽన్యత్ర యత్ స్థానమాసనం తదుదాహృతమ్."

వ్యా. వర్షాకాలము తప్ప ఇతరకాలములయందు ఒక్కరోజు కంటె ఎక్కువ గ్రామములోను, ఐదు రోజులకంటె ఎక్కువ పట్టణమునందు నివసించుట "ఆసనము" అని చెప్పబడినది.

మూ. "ఉక్తాలాబ్వాదిపాత్రాణామేకస్యాపి నసంగ్రహః
భిక్షోర్భైక్షభుజశ్చాపి పాత్రలోపః స ఉచ్యతే."

వ్యా. భిక్షాన్నమును భుజించువాడైనను సంన్యాసి ఆతనికి చెప్పిన అలాబ్వాదిపాత్రలలో (ఆనపకాయ బుఱ్ఱ మొదలైనపాత్రలలో) ఏ ఒక్క దానినీ సంపాదించుకొనకుండుట "పాత్రలోపము "

మూ. "గృహీతస్య తు దణ్డాదేర్ద్వితీయస్య పరిగ్రహః
కాలాన్తరోపభోగార్థం సంచయః పరికీర్తితః"

వ్యా. ఒక దండము మొదలైనవి ఉన్న సంన్యాసి; కాలాంతరమునందు ఉపయోగపడును అను అభిప్రాయముతో రెండవ దండము మొదలైన వాటిని స్వీకరించి జాగ్రత్త చేసికొన్నచో అది సంచయము.

మూ. "శుశ్రూషాలాభపూజార్థం యశోర్థం వా పరిగ్రహః
శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయః శిష్యసంగ్రహః."

వ్యా. జ్ఞానమార్గోపదేశము చేసి ఉద్ధరించవలెనను కారుణ్యముతో

కాక శుశ్రూష, పూజ చేయించుకొనుటకు కాని, కీర్తికోసము కాని శిష్యులను చేరదీయుట శిష్యసంగ్రహము.

మూ. "విద్యా దినం ప్రకాశత్వాదవిద్యా రాత్రిరుచ్యతే
విద్యాభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే."

వ్యా. విద్య జ్ఞానము) ఒక తేజస్సు; అందుచేత అది పగలు. అవిద్య (అజ్ఞానము) రాత్రి. విద్యాభ్యాసము విషయములో (ఆత్మజ్ఞానసంపాదన విషయములో) ఏమరిపాటు "దివాస్వాపము" (పగటి నిద్ర) అని చెప్పబడుచున్నది.

మూ. "ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్షచర్యాం సురస్తుతిమ్
అనుగ్రహః పథిప్రశ్నో వృథాలాపః స ఉచ్యతే."

వ్యా. ఆధ్యాత్మికవిషయచర్చను, భిక్షాచరణమును, దేవతాస్తుత్యాదికమును విడచి (చేయక) వచ్చినవారిని అనుగ్రహించుట, "మీ ప్రయాణము బాగా సాగినదా" ఈ మొదలైన ప్రశ్నలు వేయుట వృథాలాపము (వ్యర్థసంభాషణము) అని చెప్పబడుచున్నది.

మూ. లోకం శిష్యజనరూపం న గృహ్ణీయాదిత్యేతావదేవ న భవతి, కిం తు తస్య లోకస్య అవలోకం దర్శనమపి న కుర్యాత్; తస్య బన్ధహేతుత్వాత్. న చేత్యనేన అన్యదపి స్మృతినిషిద్ధం న కుర్యాదిత్యభిప్రేతమ్, తచ్చ నిషిద్ధం మేధాతిథిర్దర్శయతి–

"స్థావరం జఙ్గమం బీజం తైజసం విషమాయుధమ్
షడేతాని న గృహ్ణీయాద్ యతిర్మూత్రపురీషవత్.
రసాయనం క్రియావాదం జ్యోతిషం క్రయవిక్రయమ్
వివిధాని చ శిల్పాని వర్జయేత్పరదారవత్."ఇతి.

వ్యా. లోకమును, అనగా శిష్యజనమును, చేరదీయకూడదు అని మాత్రమే కాదు, వారి వైపుచూచుట కూడ తగదు; ఎందుచేత ననగా అది బంధమునకు హేతు వగును. (ఉపనిషత్తులో "సర్వమ్" "అనికేతస్థితిః" అను

పదాల మధ్యనున్న) "నచ" అనుదానికి స్మృతినిషిద్ధములైన ఇతరకార్యములు చేయకూడ దని అభిప్రాయము. ఆ నిషిద్ధవిషయములను మేధాతిథి చూపు చున్నాడు "స్థావరములు, జంగమములు, విత్తనము, లోహములు, విషము, ఆయుధములు ఈ ఆరింటినీ యతి మూత్రపురీషములను వలె స్పృశించ గూడదు." (వీటిని తనవిగా సేకరించగూడ దని భావము). "(పరశువేది తయారుచేయుటకై) రసాయనమును, లౌకికవ్యవహారమును, జ్యోతిషమును, క్రయవిక్రయములను, వివిధశిల్పములను పరభార్యను వలె పరిహరించ వలెను.''

మూ. యోగినో లౌకికవైదికవ్యవహారగతాని యాని బాధకాని సన్తి తేషాం వర్జనమభిహితమ్. అథ ప్రశ్నోత్తరాభ్యామత్యన్తబాధకం ప్రదర్శ్య తద్వర్జనమాహ:-

ఉ. "అబాధకః క ఇతి చేత్; అబాధకోఽస్త్యేవ. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన దృష్టం చేత్ స బ్రహ్మహా భవేత్. యస్మాద్ భిక్షుర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్ స పౌల్కసో భవేత్. యస్మాద్ భిక్షుర్హిరణ్యం రసేన గ్రాహ్యం చేత్ స ఆత్మహా భవేత్. తస్మాద్ భిక్షుర్హిరణ్యం రసేన న దృష్టం చ న స్పృష్టం చ న గ్రాహ్యం చ" (పరమ.ఉ. 4) ఇతి.

ఆకారోఽభివ్యాప్త్యర్థః, "ఆఙీషదర్థేఽభివ్యాప్తౌ" ఇత్యభిహిత త్వాత్. అభివ్యాప్తౌ బాధకః అత్యన్తబాధకస్తస్య సద్భావం ప్రతిజ్ఞాయ హిరణ్యస్య తథావిధబాధకత్వముచ్యతే.

వ్యా లౌకికవ్యవహారములకు వైదికవ్యవహారములకు సంబంధించిన ఏ విషయములు యోగికి బాధకములో వాటిని విడువవలె నని చెప్పబడినది. ఇప్పుడు యోగికి అత్యంతబాధకమైనదానిని గూర్చి ప్రశ్నోత్తరముల ద్వారా చెప్పి దానిని విడువవలె నని చెప్పుచున్నాడు

అత్యంతబాధకము ఏది ? అని అడిగినచో అట్టిది ఉన్నది ఎందు వలన సంన్యాసి బంగారమును ఆసక్తితో చూచినచో బ్రహ్మహత్య చేసినవా డగునో; ఎందువలన సంన్యాసి బంగారమును ఆసక్తితో స్పృశించినచో మ్లేచ్ఛు డగునో; ఎందువలన సంన్యాసి బంగారమును ఆసక్తితో గ్రహించి

నచో ఆత్మహత్య చేసినవా డగునో; అందువలన సంన్యాసి బంగారమును ఆసక్తితో చూడగూడదు, స్పృశించగూడదు, గ్రహించగూడదు."

'ఆఙ్' అనుదానికి "కొంచెము; అంతటా వ్యాపించుట అని అర్థములు" అని చెప్పబడుటచే "ఆబాధకః"లోని 'ఆ' కారమునకు అభివ్యాప్తి (అంతట విస్తరించుట) అని అర్థము. అందుచే "ఆబాధకః" అనగా అంతటా వ్యాపించిన బాధకము, అనగా అత్యంతబాధకము (చాల బాధ కలిగించునది) అని అర్థము, అట్టి ఆబాధకము ఉన్నది అని ముందుగా చెప్పి హిరణ్యము (ధనము) అట్టి ఆబాధకము అని చెప్పుచున్నాడు.

మూ. రసేనాభిలాషయుక్తేనాదరేణ హిరణ్యం యది దృష్టం స్యాత్తదానీం స ద్రష్టా భిక్షుర్బ్రహ్మహా భవేత్. హిరణ్యాసక్త్యా తత్సం పాదనరక్షణయోః సర్వదా ప్రయతమానస్తద్వైయర్థ్యపరిహారాయ ప్రపఞ్చమిథ్యాత్వప్రతిపాదకాన్ వేదాన్తాన్ దూషయిత్వా తత్సత్యత్వమ వలమ్బతే. తతః శాస్త్రసిద్ధమద్వితీయం బ్రహ్మ తేన భిక్షుణా హతమేవ భవతి. తస్మాదసౌ బ్రహ్మహా భవేత్. తథా చ స్మర్యతే—

"బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాత్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః
అభూతబ్రహ్మవాదీ చ త్రయస్తే బ్రహ్మఘాతకాః" ఇతి.
"బ్రహ్మహా స తు విజ్ఞేయః సర్వధర్మబహిష్కృతః." ఇతి చ.

వ్యా. రసేన అభిలాషతో కూడిన ఆదరముతో, బంగారము చూడబడినట్లయిలే అప్పుడు చూచే సంన్యాసి బ్రహ్మఘాతకుడు అగును. బంగారమునందు ఆసక్తిచేత దానిని సంపాదించుటకు రక్షించుటకు ఎల్లప్పుడు ప్రయత్నించుచు ఆ ప్రయత్న మంతా వ్యర్థము అను భావము కలుగకుండుటకై, ప్రపంచము మిధ్య అని ప్రతిపాదించు వేదాంతములను దూషించి ప్రపంచము సత్య మను అభిప్రాయమును అవలంబించును. అప్పుడు ఆ సంన్యాసి శాస్త్రప్రతిపాదితమైన అద్వితీయబ్రహ్మను చంపి వేసినట్లే అగును. అందుచేత అతడు బ్రహ్మహత్యచేసినవా డగును. ఈ విషయము స్మృతిలో చెప్పబడినది—

"బ్రహ్మయే లేదని అనేవాడు, బ్రహ్మవేత్తను ద్వేషించేవాడు, బ్రహ్మ కానిదానిని బ్రహ్మగా ప్రతిపాదించువాడు ఈ ముగ్గురూ బ్రహ్మ ఘాతకులు." "బ్రహ్మఘాతకుడు సర్వధర్మములనుండి బహిష్కృతుడుగా గ్రహింపదగినవాడు"

మూ. అభిలాషపూర్వం హిరణ్యం స్పృష్టం చేత్ తదా తత్స్ప్రష్టా భిక్షుః పతితత్వాత్ పౌల్కసో మ్లేచ్ఛసదృశో భవేత్. పాతిత్యం చ స్మర్యతే–

"పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్
ధీపూర్వం రేతఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవ చ" ఇతి.

వ్యా అభిలాషపూర్వకముగా బంగారము స్పృశించినచో అట్లు స్పృశించిన సంన్యాసి పతితుడు గాన, పౌల్కసుడు, అనగా మ్లేచ్ఛునివంటి వాడు అగును. అతడు పతితుడని స్మృతిలో చెప్పబడినది—

"బుద్ధిపూర్వకముగా రేతస్సును విడచుట, ధనమును సంగ్రహించుట అను ఈ రెండూ ఉన్న సంన్యాసి పతితు డగును."

మూ. అభిలాషపురఃసరం హిరణ్యం, న గ్రాహ్యమ్ గృహీతం చేత్ తదా స భిక్షుః దేహేన్ద్రియాదిసాక్షిణమసఙ్గం చిదాత్మానం హతవాన్ భవేత్, అసఙ్గత్వమపోహ్య స్వాత్మనో హిరణ్యాదిద్రవ్యం ప్రతి భోక్తృత్వేన ప్రతిపన్నత్వాత్. తస్యాత్మనశ్చాన్యథాప్రతిపత్తేః సర్వపాపరూపత్వం స్మర్యతే–

"యోఽన్యథా సన్తమాత్మానమన్యథా ప్రతిపద్యతే
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా."

(మ.భా.ఆది, 98.7) ఇతి.

కిం చాత్మఘాతినః సుఖలేశేనాపి రహితా బహువిధదుఃఖేనావృతా లోకాః శ్రూయన్తే–

"అసుర్యా నామ యే లోకా అన్ధేన తమసా వృతాః
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః."

(ఈ.శ.ఉ.3.) ఇతి.

వ్యా. అభిలాషాపూర్వకముగా బంగారమును గ్రహించకూడదు. అట్లు గ్రహించినచో ఆ సంన్యాసి దేహేంద్రియాదులకు సాక్షి యైన ఆత్మను చంపినవా డగును. ఆత్మకు ఉన్న అసంగత్వమును తొలగించి (మరచి పోయి) హిరణ్యద్రవ్యమును తన ఆత్మ అనుభవించు నని అనుకొనుచు భోక్తృత్వమును ఆపాదించినాడు కదా? ఆత్మను గూర్చి విరుద్ధముగా తెలిసికొనుట సర్వపాపరూప మని స్మృతులలో చెప్పబడినది—

"ఒక విధముగా ఉన్న ఆత్మను మరొక విధముగా ఉన్నట్లు అనుకొను ఆత్మాపహారి యైన ఆ చోరుడు చేయని పాప మే మున్నది?"

ఆత్మఘాతకునకు ఏ మాత్రము సుఖము ఉండదని, బహువిధదుఃఖములతో నిండిన లోకములు వచ్చు నని శ్రుతిలో చెప్పబడినది—

"కటిక చీకటితో నిండిన అసుర్యము లనే లోకము లున్నవి. ఆత్మ ఘాతకులు మరణానంతరము ఆ లోకములకు వెళ్లెదరు"

మూ. దృష్టం చేత్యనేన చకారేణ శ్రుతం చ సముచ్చీయతే. స్పృష్టం చేత్యనేన కథితస్య సముచ్చయః. గ్రాహ్యం చేత్యనేన వ్యవహృతం చేతి సముచ్చీయతే, దర్శనస్పర్శనగ్రహణవదభిలాషపూర్వకా హిరణ్యవృత్తాన్తశ్రవణతద్గుణకథనతదీయక్రయాదివ్యవహారా అపి ప్రత్యవాయహేతవ ఇత్యర్థః. యస్మాత్ సాభిలాషహిరణ్యాదర్శనాదయో దోషకారిణ స్తస్మాద్ భిక్షుణా హిరణ్యదర్శనాదయో వర్జనీయా ఇత్యర్థః.

వ్యా. "దృష్టం చ" అన్నప్పుడు చ కారముచేత "శ్రుతం చ" (వినబడినది) కూడ సముచ్చిత మగుచున్నది. "స్పృష్టం చ" అనుదానిచేత చెప్పబడినదానికి సముచ్చయము "గ్రాహ్యం చ" అనుదానిచేత వ్యవహరించబడినది సముచ్చిత మగుచున్నది. దర్శన-స్పర్శన గ్రహణములవలెనే అభిలాషపూర్వకముగా హిరణ్యమును గూర్చి వినుట, దాని గొప్పదనమును చెప్పుట, దాని క్రయవిక్రయాదివ్యవహారము చేయుట కూడ ప్రత్యవాయమునకు హేతువులు అని అర్థము. అభిలాషపూర్వకముగా బంగారమును చూచుట మొదలైనవి దోషకరములు గాన భిక్షువు హిరణ్యదర్శనాదులను విడువవలెను అని అర్థము.

మూ. హిరణ్యవర్జనస్య ఫలమాహ—

ఉ. "సర్వే కామా మనోగతా వ్యావర్తన్తే దుఃఖే నోద్విగ్నః సుఖే నిఃస్పృహస్త్యాగో రాగే సర్వత్ర శుభాశుభయోరనభిస్నేహో న ద్వేష్టి న మోదతే చ సర్వేషామిన్ద్రియాణాం గతిరుపరమతి య ఆత్మన్యేవావతిష్ఠతే" (పరమ. ఉ. 4.) ఇతి.

పుత్రభార్యాగృహక్షేత్రాదికామానాం సర్వేషాం హిరణ్యమూలత్వాద్ధిరణ్యే పరిత్యక్తే సతి తే కామా మనోగతా మనస్యవస్థానాద్వ్యావర్తన్తే వ్యావృత్తా భవన్తి. కామనివృత్తౌ సత్యాం కర్మప్రాప్తయోః సుఖఃదుఃఖయోరుద్వేగస్పృహే న భవతః. ఏతచ్చ స్థితప్రజ్ఞప్రస్తావే ప్రపఞ్చితమ్. ఐహికయోః సుఖదుఃఖయోర్విక్షేపకత్వేన ఆముష్మికవిషయ రాగేఽపి త్యాగో భవతి. ఐహికసుఖస్పృహాయుక్తో హి తద్దృష్టాన్తేన అనుమిత ఆముష్మికే సుఖే రాగవాన్ భవతి. తస్మాదైహికే నిఃస్పృహస్యాముష్మికే రాగాభావో యుజ్యతే. ఏవం సతి సర్వత్ర లోకద్వయేఽపి యౌ శుభాశుభావనుకూలప్రతికూలవిషయౌ తయోరనభిస్నేహః. ఏతచ్చ ద్వేషరాహిత్యస్యాప్యుపలక్షణమ్. తాదృశో విద్వానశుభకారిణం కంచిదపి పురుషం న ద్వేష్టి. శుభకారిణం చ దృష్ట్వా న చ మోదం ప్రాప్నోతి. ద్వేషమోదరహితో యః పుమానాత్మన్యేవ సర్వదావతిష్ఠతే తస్య సర్వేషామిన్ద్రియాణాం గతిః ప్రవృత్తిరుపరమతి. ఇన్ద్రియోపరతౌ న కదాచిదపి నిర్వికల్పకసమాధేర్విఘ్నో భవతి. "తేషాం కా స్థితిః" ఇతి ప్రశ్నస్య సంక్షేపవిస్తరాభ్యాముత్తరం పూర్వముక్తమ్. తదేవాత్ర పునరపి హిరణ్యనిషేధప్రసఙ్గేన స్పష్టీకృతమ్.

వ్యా. బంగారము విడచివేసినందుకు ఫలమును చెప్పుచున్నాడు—

"మనస్సులో అన్ని కామములు నివర్తించును. దుఃఖములో ఉద్వేగమును(దిగులు)చెందడు. సుఖమునందు స్పృహ కలవాడు కాడు. రాగము విడచును శుభమైనను అశుభమైనను అన్నింటియందు ఆసక్తిరహితుడుగా ఉండును. ద్వేషించడు; సంతోషించడు, అన్ని ఇంద్రియముల ప్రవృత్తి ఆగిపోవును. అతడు ఆత్మయందే నిలచును"

పుత్ర భార్యా-గృహ-క్షేత్రాదులపై ఉండు కోరికలకు అన్నింటికీ మూలము బంగారమే గాన దానిని విడచివేసినచో మనస్సులో ఉన్న ఆకామము

లన్నీ మనస్సులో ఉనికినుండి వ్యావృత్తము లగును (అనగా మనస్సునుండి తప్పుకొనును).కామములు తొలగిపోగానే కర్మవలన వచ్చిన దుఃఖసుఖముల యందు ఉద్వేగము, ఆసక్తి ఉండవు. ఈ విషయము స్థితప్రజ్ఞప్రస్తావము నందు విశదీకరింపబడినది. ఐహికములైన సుఖదుఃఖములు విక్షేపకారకములు అని తెలిసికొనిన పిమ్మట పరలోకమునకు సంబంధించిన విషయముల రాగము నందు (ఆసక్తియందు) కూడ త్యాగము కలుగును ఐహికసుఖములయందు స్పృహ ఉన్నవానికి ఈ సుఖముల దృష్టాంతముచేత, ఆముష్మిక సుఖము నందు కూడ రాగము ఉండును అందుచే ఐహికసుఖములందు స్పృహ లేని వానికి ఆముష్మికసుఖములయందు కూడ స్పృహ లేకపోవుట యుక్తమే. అట్లగుటచే సర్వత్ర=రెండు లోకములలోను, అనుకూలముగాను ప్రతికూల ముగాను కనబడు ఏ శుభాశుభములు ఉన్నవో వాటియందు స్నేహము ఉండదు ఇది ద్వేషము ఉండ దని చెప్పుటకు కూడ ఉపలక్షణము. అట్టి విద్వాంసుడు (తనకు) అశుభమును చేయువానిని ఎవనిని ద్వేషించడు; శుభము చేయు వానినిచూచి ఆనందించడు. ద్వేషము కాని, ఆనందముకాని లేక ఎల్లప్పుడు స్వాత్మయందే ఉండు పురుషుని సర్వేంద్రియముల ప్రవృత్తి ఆగిపోవును. ఇంద్రియములు ఉపరమించినచో వాని నిర్వికల్పకసమాధి కెన్నడూ విఘ్నము కలుగదు. "వాళ్ళ స్థితి ఏది?" అను ప్రశ్నకు సంక్షేపముగాను సవిస్తరము గాను సమాధానమును పూర్వము చెప్పి ఆ విషయమునే ఇక్కడ మరల హిరణ్యమును నిషేధించు ప్రసంగమున స్పష్టీకరించుట జరిగినది.

మూ. అథ విద్వత్సంన్యాసముపసంహరతి—

ఉ. "యత్పూర్ణానన్దైకబోధ స్తద్ బ్రహ్మాహమస్మీతి కృతకృత్యో భవతి కృతకృత్యో భవతి" (పరమ.6.4) ఇతి.

యద్ బ్రహ్మ వేదాన్తేషు పూర్ణానన్దైకబోధః పరమాత్మేతి నిరూపితం తద్ బ్రహ్మాహమస్మీత్యేవం సర్వదానుభవన్నయం పరమ హంసః కృతకృత్యో భవతీతి. తథా చ స్మర్యతే-

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః
నైవాస్తి కించిత్కర్తవ్యమస్తిచేన్న స తత్త్వవిత్" ఇతి.

వ్యా. ఇప్పుడు విద్వత్సంన్యాసమును ఉపసంహరించుచున్నాడు—
"ఏది పూర్ణానందైకబోధస్వరూపమో అట్టి బ్రహ్మ నేనే అని తెలిసి కొని కృతకృత్యుడగును; కృతకృత్యుడగును."

వేదాంతములలో ఏ బ్రహ్మ ఒక్క పూర్ణానంద బోధ స్వరూపమైన పరమాత్మ అని నిరూపించబడినదో ఆ బ్రహ్మమే నేను అని ఎల్లప్పుడు అనుభవించుచు ఈ పరమహంస కృతకృత్యుడగును. ఇట్లే స్మృతిలో చెప్ప బడినది.

"జ్ఞానామృతముచేత తృప్తుడై కృతకృత్యుడైన యోగికి ఇంక వేరే కర్తవ్యమేదీ లేదు; ఏదైన ఉన్నచో అతడు కృతకృత్యుడే కాడు''

మూ. జీవన్ముక్తివివేకేన తమో హార్దం నివారయన్
పుమర్థమఖిలం దేయాద్ విద్యాతీర్థమహేశ్వరః.

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే విద్వత్సం
న్యాసనిరూపణం నామ పఞ్చమం ప్రకరణమ్.

వ్యా. "జీవన్ముక్తి వివేకము"చేత హృదయములోని తమస్సును నివా రించిన విద్యాతీర్థ మహేశ్వరుడు సమస్తపురుషార్థములను ఇచ్చుగాక.

శ్రీమద్విద్యారణ్యులు రచించిన జీవన్ముక్తివివేకములో
"విద్వత్సంన్యాసనిరూపణము" అను ఐదవ ప్రకరణము సమాప్తము

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన "బాలానందిని" అను
జీవన్ముక్తివివేక వ్యాఖ్యానము సమాప్తము

సంపూర్ణోఽయం శ్రీమద్విద్యారణ్యప్రణీతో జీవన్ముక్తివివేకః.
యత్కృపాలేశసంసర్గాద్వ్యాఖ్యేయం రచితా మయా
తస్యైవ జానకీజానేః పదయోరియమర్ప్యతే
దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా
కర్తాస్మద్గ్రన్థజాతస్య కరణం కేవలం వయమ్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ 8-10-1991

# అనుబంధము

''జీవన్ముక్తివివేకేన'' ఇత్యాదిశ్లోకము తరువాత ఐదు శ్లోకములు కొన్నిప్రాతప్రతులలో ఉన్నవని చెప్పుచు ఆనందాశ్రమప్రతిలో ఇచ్చినారు. ఈశ్లోకములనే అడయార్ప్రతిలో అధఃసూచికలో ఇచ్చినారు. ఇవి విద్యారణ్యుల శ్లోకములు కాకపోవచ్చును. మొదటి శ్లోకములోని నాల్గవపాదమును వెనుక రెండు మూడు సార్లు ప్రమాణముగా ఉదాహరించి ఉండుటచే అది విద్యారణ్యులవారిది కాదు అని చెప్పవచ్చును.

శ్లో. భేధాభేదౌ సపది గలితౌ పుణ్యపాపే విశీర్ణే
మాయామోహౌ క్షయమధిగతౌ నష్టసందేహవృత్తిః.
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః.

అను. జీవన్ముక్తునకు జ్ఞానోదయము కలుగుటకు పూర్వ మున్న భేదాభేదములు జ్ఞానోదయము కలిగిన వెంటనే తొలగిపోయినవి పుణ్యపాపములు నశించినవి. మాయామోహములు క్షయము పొందినవి. ఆతని సందేహములన్నీ నశించినవి శబ్దములచేత వర్ణింప శక్యము కాని, త్రిగుణశూన్యమైన తత్త్వజ్ఞానమును పొంది త్రిగుణాతీతమైన మార్గమునందు సంచరించువారికి విధి ఏమి? నిషేధ మేమి?

శ్లో. తీర్థాని తోయపూర్ణాని దేవాన్ పాషాణమృణ్మయాన్
యోగినో న ప్రపద్యన్తే ఆత్మజ్ఞానపరాయణాః.

అను. ఆత్మజ్ఞానమునందు ఆసక్తి గల యోగులు ఉదకముతో నిండిన తీర్థములను, రాళ్లతోను మట్టితోను చేసిన దేవతలను సేవించరు.

శ్లో. అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్
ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనామ్.

అను. ద్విజులకు అగ్ని దేవుడు, మునులకు దేవుడు హృదయములోనే ఉండును. అల్పబుద్ధి కలవారికి దేవుడు ప్రతిమలలో ఉండును. ఆత్మజ్ఞానము కలవారికి దేవుడు అంతటా ఉండును.

శ్లో. సర్వత్రావస్థితం శాన్తం న ప్రపద్యే జనార్దనమ్
జ్ఞానచక్షుర్విహీనత్వాదన్ధః సూర్యమివోదితమ్.

అను. నాకు జ్ఞాననేత్రము లేకపోవుటచే, గ్రుడ్డివాడు ఉదయించిన సూర్యుని చూడజాలనట్లు, అంతటా నిండి ఉన్న, శాంతుడైన మహావిష్ణువును చూడజాలకున్నాను.

— :O: —